# వెంచాశా కథలు



సేకరణ

డా॥ సి.వి.ఎస్.కె. శర్మ



సతీమణి శ్రీమతి సి.వి.మహాలక్ష్మి గారితో
రచయిత 'వెంచాశా' ( స్వర్గీయ చావలి వేంకట శాస్త్రిగారు)

# విషయ సూచిక

# అనుబంధం

# 1

# సెమిటరీ అవతల సిమెంటు మేడ

పరీక్ష రాశాను. తరువాత.

ఇంటర్వ్యూ అయిపోయింది. ఫలితాలు తెలిశాయి. ఉద్యోగం వచ్చింది. ఆనందంతో ఎగిరి గంతులు వేయాలనిపించింది. రోడ్లవెంట పరుగెత్తుదామనిపించింది. పరుగెడితే పిచ్చివాడు అని అనుకుంటారు. ఈ మహానగరంలో కార్లు బాణంలా దూసుకు పోతుంటాయి. ఏ కారు కిందన్నా పడితే ప్రమాదం. ప్రాణం పోకపోయినా ఏ కాలో చెయ్యో విరిగినా ఆ వచ్చిన కాస్త ఉద్యోగం ఊడ్చిపెట్టుకు పోతుంది. ఎవరితోనన్నా చెప్పి ఈ సంతోషాన్ని పంచుకుందామంటే ఎరిగి ఉన్న వాళ్ళు ఒక్కరూ కన్పించడంలేదు. ఏం చేయను? ఆ కొత్తచోట ఖరీదైన హోటలు కెళ్ళి తనివిదీరా తిందామనుకున్నాను కాని బోలెడు ఖర్చవుతుంది. మనస్కరించలేదు. పోనీ మంచి ఇంగ్లీషు సినిమాకు పోతే... పోస్టర్లలో అర్ధనగ్నంగా ఉన్న బొమ్మలు చాలా కన్పించాయి. వళ్ళు పులకరించినట్లయింది. మా ఊళ్ళో అయితే రూపాయిపావలా పెడ్తె హాయిగా సినిమా చూడచ్చు. మరి ఇక్కడో కనీసం దానికి రెట్టింపయినా అవుతుంది.

ఈ సినిమా చూడకపోతే ఏం మునిగింది? అనుకున్నాను. నగరంలో రోడ్లూ, వచ్చే పోయే కార్లూ, స్కూటర్‌లలో వెళ్ళే జంటల్నీ, షాపుల్లో అందంగా అమర్చిన బొమ్మల్నీ చూసుకుంటూ కనీసం రెండు మైళ్ళైనా నడచి ఉంటాను. నడుస్తూనే ఉన్నాను. కాళ్ళు పీకుతున్నై. దోవలో నా యీడువాళ్ళు అక్కడక్కడ కన్పిస్తున్నారు. ఎవరినన్నా ఆపి పలుకరించి నెమ్మదిగా స్నేహం చేసుకుని ఈ వార్త చెప్తే కొంత బరువు తగ్గుతుంది. మనసు తేలిగ్గా హాయిగా ఉంటుంది. ఎరగని వాళ్ళను పలుకరిస్తే అది నాగరికత అనిపించుకోదు. అయినా ఈ మహాపట్టణంలో ఒకరి సంగతి ఒకరికి అక్కర్లేదు. ఎందుకో ఈ సంతోషాన్ని నాలో ఇముడ్చుకోలేకపోతున్నాను. సీతకు ఈ వార్త ఎంత

త్వరగా తెలియచేస్తే అంత మంచిది. నా కన్నా ఎక్కువగా సంతోషిస్తుంది. ఇల్లంతా ఎగిరి గంతులు పెడ్తుంది. ఎగిరి ఎగిరి అలసిపోయి రొప్పుతుంటే అది నాకు ఇక్కడకు విన్పిస్తుంది. వెళ్ళిరండి. మీకు తప్పకుండా ఉద్యోగం వస్తుంది అని ఎంతో ధైర్యం చెప్పింది. అలాగే సీత కోరిక నెరవేరింది. సీతకు టెలిగ్రాం ఇస్తే ఉద్యోగం వచ్చినట్టు. అదో పల్లెటూరు. రైల్వేస్టేషను లేదు. తపాల సౌకర్యాలు అంతగాలేవు. రోడ్డుసరిగా ఉండదు. ఒక బస్సు ముక్కుతూ మూలుగుతూ వస్తుంది రోజుకొకసారి. సీతకు నేనిచ్చిన టెలిగ్రాం వెంటనే తీసుకుని వెళ్ళి ఇవ్వాలని ఆ పోస్టు బంట్రోతుకు బుద్ధిపుట్టాలి. సైకిల్ మీద ఆ పల్లెటూరు వెళ్ళాలి. అతను దోవలో అనేకచోట్ల బద్ధకించి ఆగచ్చు. తాపీగా వెళ్ళచ్చు. బీడీ కాల్చుకుంటూ ఏ చెట్టుకిందో చల్లగాలికి కూచుని కదిలే ఆకుల్ని చూస్తూ, పోతున్న మేఘాలను చూస్తూ, ఎంత ఆలస్యంచేసినా అతన్ని అడిగే వాళ్ళుండరు. అయినా టెలిగ్రాంలో చాలా విషయాలు వ్రాయాలి నేను. వీళ్ళు మాటమాటకూ ఖరీదు కడ్తారు. టోలెడు ఖర్చు. మా అమ్మకు టెలిగ్రామ్ అంటేనే విపరీతమైన భయం. ఆమెకు వణుకు వస్తుంది. ఆమె ఏమైనా అయిపోవచ్చు. కవరుకొని పెద్ద ఉత్తరం వ్రాస్తే అన్ని సమస్యలూ తీరిపోతాయి. ఒకటేమిటి రెండు. ఒకే కవర్లో రెండు. ఒకటి అమ్మకు రెండోది సీతకు. అమ్మకు రాసిన విషయాలు సీతకు మళ్ళీ రాయక్కర్లేదు. అమ్మ ఎలాగూ ఆ ఉత్తరం సీతకు చూపిస్తుంది. ఆ విషయాలు మినహాయించి సీతకు తనివిదీరా ఎన్నో సంగతులు, బయటకు ధారాళంగా చెప్పకూడనివి పైకి మాట్లాడుకోడానికి వీలు లేని విషయాలెన్నో వ్రాయచ్చు. అవన్నీ కవర్లో ఒదిగి పడి ఉంటాయి. ఎవరికంటా కనపడకుండా పోస్టాఫీసుకు వెళ్ళాను. చాలా పెద్దభవనం. అన్నీ పెద్ద పెద్ద భవనాలే ఇక్కడ. రాసుకోవడానికి అనువుగా బెంచీలు వేశారు. చాలా ఉన్నాయి. ఓ మూల బెంచీలో కూర్చుని ఉత్తరం వ్రాశాను. వ్రాస్తున్నంతసేపు భయంగానే ఉంది. నా ఉత్తరంలోకి ఎవరైనా తొంగి చూస్తున్నారేమో నని గబగబ కొన్ని ముద్దులతో ఉత్తరం ముగించి కవరు గట్టిగా అ ్టించి పోస్టులో వేశాను.

  

చేరవలసిన రోజునకు ఉద్యోగంలో చేరాను. కొత్త పెళ్ళికూతురులా ముసి ముసి నవ్వులతో అందరినీ చూసి చూడనట్టు చూస్తూ తల వంచకుండా నడుస్తూ... ఆఫీసు సైన్యంలో ఒకణ్ణైనాను. సీత దగ్గరనుండి ఎన్నాళ్ళకూ ఉత్తరం రాదు. ఎదురుచూసి

కళ్ళు కాయలు కాస్తున్నాయి. కొంపతీసి అసభ్యకరంగా వ్రాశానని కోపం వచ్చిందేమో! మొగుడు పెళ్ళాం మధ్య అసభ్యత ఏముంది? నా భయం కాని. అయినా ఆఖరు మూడు వాక్యాలేగా కొంచెం గమ్మత్తుగా వ్రాసింది. మా అమ్మకు సుస్తీగా ఉందేమో.... నాకు మనసు పరి పరి విధాలపోతున్నది. కోప్పడదామంటే చాలా దూరంలో ఉంది. ఉత్తరంలో కోప్పడితే బావుండదు. బాధ పడ్తుంది. ఈ అక్షరాలు అసలే వంకరగా ఉంటాయి. కోపంగా రాస్తే ముళ్ళముళ్ళగా ఉంటాయి. ఈ ఆడవాళ్ళకు బుద్ధిలేదు. కొంచెం దూరమైతే నిర్లక్ష్యం చేస్తారు. ఈ అవమానం భరించలేను... దుఃఖం పొర్లుకొస్తూంది... పదిహేను రోజులయింది.

హైదరాబాద్‌లో మా దూరపు బంధువు ఒక ముసలాయన ఇంట్లో మకాం. నన్ను ఆప్యాయంగా చూస్తున్నాడు. ఒకరోజు... ఎక్కడన్నా ఇల్లు చూస్తున్నావా అబ్బాయ్... అని అడిగాడు.

ఒకరోజు ఆఫీసు నుండి రాగానే నీకేదో ఉత్తరం వచ్చిందోయ్ అన్నాడు. ఆయన చేతిలోంచి ఉత్తరం తీసుకున్నాను. గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకొని హాయిగా పడుకుని నెమ్మదిగా కవరు విప్పి... చీరె మడతల్లా ఉన్న కాగితాలు తీసి... చిన్నవిగా గుండ్రంగా ఉన్న అక్షరాలు మీదమీదికి వస్తుంటె కన్నార్పకుండా చూస్తూ రెండు చేతుల్లోకి తీసుకున్నాను.

*ప్రియమైన మీకు*

*మీరు వ్రాసిన ఉత్తరం చాలా ఆలస్యంగా చేరింది. హైదరాబాదు లాంటి మహా నగరంలో మీకు ఉద్యోగం దొరకటం చాలా అదృష్టం.నా నోము ఫలించింది. అమ్మవారి కృప.అంతా కలిసి రెండువందల పది వస్తుందన్నారు. మన కంతకన్నా ఎక్కువక్కర్లేదు. మన పెళ్ళి అయిన కొద్ది రోజుల్లోనే ఉద్యోగం రావటం... నాకు చాలా ఆనందంగా ఉంది. మీరు నా మెళ్ళో మంగళసూత్రం కట్టేప్పుడు నాకు చక్కలిగింతలై ఏవిటోగా ఉంది. మీ ముక్కులోంచి వచ్చే గాలి వేడిగా నన్ను పులుముకున్నది. మీ ఉత్తరం చూడగానే నాకివన్నీ జ్ఞాపకం వచ్చినయి. సిగ్గుపడ్డాను. ఇక్కడ విపరీతంగా వానలు. మన కిటికీలోంచి వాన తుంపరలు పడుతుంటే ఏవిటో పన్నీరు జల్లినట్లుగా ఉంది. అత్తయ్య వంట్లో కులాసాగానే ఉంది. ఆ వట్లవానంలో నేనుండలేను బాబూ అంటున్నారు. త్వరగా మరో ఇల్లు తీసుకోండి. నేను ఆషాడం*

వెళ్ళగానే వస్తాను. మరో ఇరవై రోజులు దర్జాగా యాభైరూపాయలైనా సరే పెట్టి బాగా గాలీవెలుతురు వచ్చే ఇల్లు అద్దెపోను మిగతా డబ్బుతో హాయిగా ఉండచ్చును. అత్తయ్య దగ్గర వంటలు పిండివంటలూ అన్నీ నేర్చుకున్నాను. మీరు మరీ కొంటె వారై పోతున్నారు. అత్తయ్య మీరు వ్రాసిన ఉత్తరం చూస్తే ఇంకేమన్నా ఉందా... ఈ ఉత్తరం చేరినవెంటనే ఇంటికోసం గట్టి ప్రయత్నం చెయ్యండి... వాన వల్ల మన ఊరు దగ్గర ఉన్న కాలువ పొంగింది. బస్సులు సరిగా రావడం లేదు. అందుకే ఉత్తరం నిదానంగా చీమల్లే వచ్చింది. సినిమాలకి హోటళ్ళకు వెళ్ళి డబ్బు వృధా చేయకండి. మన దొడ్లో మల్లెపందిరి విపరీతంగా పూలు పూస్తున్నది. నాకింకా ఏం రాయాలో తెలియడం లేదు. మీ ఉత్తరానికి ఎదురు చూస్తుంటాను.

మీ సీత

  

రోజులు గడుస్తున్నాయి. ఆఫీసులో పాతబడ్డాను. ఇటీవలే పెళ్ళి అయిందని తెలిసి కొంతమంది నా ప్రేమ చూపిస్తున్నారు. ఒకరిద్దరు సన్నిహితులైనారు. వాళ్ళతో రెండురోజులు ఇళ్ళకోసం తిరిగాను. నా కనువైన ఇల్లు ఎక్కడా కన్పడలేదు. ఇల్లు నాకు వెంటనే దొరక్కపోయినా నాకు చాలా సంతోషంగా ఉంది. బోలెడన్ని రంగురంగుల పెద్దమేడలు చూశాను. ప్రతి మేడముందు బోలెడంత ఖాళీ స్థలం. రకరకాల పూలమొక్కలు. ఆకుపచ్చటి చేలు. ఆ పూలమొక్కలను కావలించుకుని ఆ గడ్డిలో పొర్లితే బావుండుననిపించింది. చూడటానికి కనులపండువుగా వుంది. మేడల్లో ఉంటున్న మనుష్యులు సాధారణంగా కన్పించరు. ఎటు చూసినా చిత్ర విచిత్రమైన కర్టెన్లు. కొన్ని మేడల్లో సింహంలాంటి జాతికుక్కలు – నాలుకలు బయటపెట్టి అటూ ఇటూ తిరుగుతున్నాయి. మీరనుకున్న అద్దెలో ఇల్లు దొరకడం కష్టం గురూ... అన్నాడు సన్నిహితులలో ఒకడు.

"నీకో ఉపాయం చెప్తాను" అన్నాడు మరోతను.

రాంకోఠీలో యాదయ్య అనే ఒకతను ఉన్నాడట అతను చాలా మందికి ఇళ్ళు కుదిర్చి పెట్టి సహాయం చేస్తుంటాట్ట... అతన్ని కలుసుకోమని సలహా.

అతనిల్లెక్కడో తెలియదన్నాను. అతనికి ఇల్లు లేదన్నారు. ఇల్లులేనివాడు నాకిల్లెట్లా చూపిస్తాడనుకున్నాను. కాదు కాదు అతనికిదే వృత్తి. అతను ఎక్కడ ఉంటున్నదీ చెప్పారు.

సెమిటరీ దగ్గర అన్నారు.

"అదేవిటి?" అన్నాను.

అదో రకమైన శ్మశానం అన్నారు. నేను గతుక్కుమన్నాను. శ్మశానం అంటే నా కసలే భయం. మా నాయనమ్మ పోయినప్పుడు ఆ ప్రదేశం, ఆ వాతావరణం చూశాను. తరువాత పదిరోజులు నిద్ర పట్టలేదు. ఏవో కలలు, భయం, వణుకు. కొన్నాళ్ళకు మరచిపోయినాను.

ఊరి మధ్యలో సెమిటరీ ఏమిటి? అన్నాను. ఒకటి కాదు, బోలెడున్నాయి. మేడలూ, ఇవి ఒకరినొకరు తొంగిచూస్తూ చాలాచోట్ల ఉన్నాయి అన్నారు.

పొద్దునపూట వెళ్తేనే అతను దొరుకుతాడన్నారు. ఒకరోజు గుర్తులు తెలుసుకుని బయలుదేరాను వెతుక్కుంటూ. నెమ్మదిగా ఆ ప్రాంతాలకు వెళ్లాను. నాకో అందమైన మసీదు కన్పించింది. ప్రార్థనా మందిరం. శుభ్రంగా అందంగా ఉంది. దానిముందు ఓ పెద్ద చెట్టు. చెట్టకిందనీడ. అక్కడ కొంచెం సేపు నిల్చున్నాను. మసీదు అందాన్ని చూస్తూ తరువాత ఎడంవైపుగా రెండడుగులు వేశాను. స్నేహితులు చెప్పిన సెమిటరీ కన్పించింది. విశాలమైన ఆవరణ. చుట్టూ కాంపౌండువాలు, లోపల అక్కడక్కడా చెట్లూ, చిన్న చిన్న మేడల్లాంటి అందమైన సమాధులు. నే నూహించుకున్నంత భయంకరంగా లేదు. నీడనిచ్చే ఒక వేపచెట్టుకింద అరుగు ఉన్నది. దానికి దగ్గరే నీళ్ళ పంపు.దాని దగ్గరే ఓ ముసలివ్యక్తి మొహం కడుక్కుంటున్నాడు. నేను సెమిటరీకి కొంచెం దూరంలో నిల్చుని అతనివైపే చూస్తున్నాను. మధ్య మధ్యలో సూర్యుడి వైపు చూస్తున్నాడు. నీరెండ, నా కెందుకో సెమిటరీ లోపలకు వెళ్ళడానికి మనస్కరించలేదు. మా నాయనమ్మ జ్ఞాపకం వచ్చింది. ఇంతత్వరగా లోపలకు వెళ్ళడమెందుకులే అనుకున్నాను. దేనికోసమో వెదుకుతున్నట్టుగా అక్కడే తారట్లాడుతున్నాను అతని దృష్టిని ఆకర్షించాలని.

చివరకు నన్ను అతను చూశాడు. నేను సెమిటరీకి సమీపంలో చుట్టూ ఉన్న పెద్ద పెద్ద మేడల్ని చూస్తున్నాను. నెమ్మదిగా నడుస్తూ వచ్చాడు. అతన్ని చూస్తుంటే ఎన్నాళ్ళకిందో చచ్చిపోయి సమాధిలోంచి లేవలేక లేస్తూ వస్తున్నట్టుగా ఉంది.

నాకు దగ్గరగా వచ్చాడు. నేను రెండడుగులు వెనక్కి వేసాను."ఏం బాబూ ఇల్లు కావాలా?"అన్నాడు. నేను అవునన్నట్లు తల ఊపాను.

"ఎంతలో కావాలి? పెళ్ళయిందా?" అన్నాడు. చెప్పాను.

అబ్బో అంత అద్దెలో యాడదొరుకుద్ది అన్నాడు. నేనంతకన్నా ఇచ్చుకోలే నన్నాను. నాకు సెమిటరీని చూస్తే భయం తగ్గింది. కాని వాడేదో ఇల్లు చూపించి నా దగ్గర ఎంత డబ్బు గుంజుతాడేమోనని భయంవేసింది.

నా ఉద్యోగ వివరాలు జీతం - జీవితం చెప్పాను. అతను నన్ను అర్థం చేసుకున్నట్టే కన్పించాడు. "ఓ రూపాయ్ పడేయ కూడదూ? అలా తిరిగొస్తాను" చాలా తేలిగ్గా అన్నాడు. ఇచ్చాను.

చాయ్ తాగి బయల్దేరుతాను అన్నాడు. ఇచ్చాను. మర్నాడు అదే వేళకు కలుసుకోమన్నాడు.

ఆ రోజు రాత్రంతా యాదయ్య గురించే ఆలోచిస్తున్నాను. యాదయ్య మంచివాడు గానే కనిపించాడు. తప్పక నాకు సహాయం చెయ్యగలడనే నమ్మకం ఉంది. నిద్ర పట్టలేదు. ఏవో ఆలోచనలు. ఇల్లు దొరుకుతుంది. సీతకు ఉత్తరం రాస్తాను. ఆమె బయలుదేరి వస్తుంది. రిసీవ్ చేసుకోడానికి స్టేషన్‌కు వెళ్తాను. నన్ను చూసి సీత నన్నగా నవ్వుతుంది. ఇద్దరం కలిసి ఆటోరిక్షాలో దగ్గర దగ్గరగా కూర్చుని ఇంటికి వస్తాం. మళ్ళీ కల. నాయనమ్మ. నిన్న చూసిన సెమిటరీ సమాధుల్లో సావకాశంగా నిద్రపోతున్న అభాగ్యులు. అక్కడ దెయ్యంలా కనిపిస్తున్న యాదయ్య మా నాయనమ్మ. ఎక్కడో పోయింది. ఈ సెమిటరీలో నా కెందుకు కన్పిస్తుంది అనుకున్నాను.

కొంచెంసేపు కళ్ళుమూస్తూ కొంచెం సేపు తెరుస్తూ ఆ రాత్రి గడిచింది. తెల్లవారక తప్పదు గనుక తెల్లవారింది.

యాదయ్యను వెతుక్కుంటూ అనుకున్న టైంకు వెళ్లాను.

యాదయ్య మసీదు దగ్గర కూర్చుని ఉన్నాడు. నన్ను చూడగానే లేచి నిల్చున్నాడు.

చాలా చోట్ల తిరిగాను బాబూ అంత అద్దెలో నా కెక్కడా కన్పించలేదు.

ఆ చుట్టు ప్రక్కల ప్రాంతాలలో ఒకటి రెండు మైళ్ళ వైశాల్యంలో ఎక్కడ ఇల్లు ఖాళీగా ఉన్నా యాదయ్య దృష్టిలో పడకుండా ఉండదన్నట్టుగా తెలిసింది. ఇల్లు దొరక్కపోయినా అతనితో మాట్లాడుతూ అతన్ని గురించిన వివరాలు చాలా తెలుసుకున్నాను. ఎంత ప్రశాంత జీవి అనిపించింది.

పొద్దున్నే ఒక టీవ్ సింగిల్ ఛాయ్‌తో ప్రారంభం అవుతుంది అతని ఆఫీసు పని. పన్నెండుగంటలకు భోజనం చేస్తాడు. ఎక్కడ చేస్తాడో ఏం చేస్తాడో తెలియదు. పన్నెండు మొదలు నాలుగింటి వరకూ సెమిటరీలో చెట్టునీడన అరుగుమీద పడుకుంటాడు. బోలెడంత విశ్రాంతి. చిన్న ఇళ్ళ దగ్గరనుండి పెద్ద ఇళ్ళు అంటే సుమారు నాలుగు వందల అద్దెవరకూ అన్ని వర్గాల వారికి ఇళ్ళు చూపిస్తాడు. రోజుకో రెండు రోజులకో ఒక గిరాకీ తప్పక తగుల్తుంది. ఇల్లు దొరికిన తరువాత అయిదో పదో మనిషినిబట్టి బక్షీస్ తీసుకుంటాడు. ప్రతిరోజు మసీదు శుభ్రంచేస్తాడు. మార్పుకోసం అక్కడ కొంచెంసేపు కూర్చుంటాడు. ఆ ప్రాంతాలలో నివసించే చాలామంది జీవితాలతో అతనికి పరిచయం ఉంది.

సెమిటరీలో ఏదన్నా ఉద్యోగమేమో అనుకున్నాను. అదేమీ కాదు చాలా సంవత్సరాలనుండి నా మకాం ఇక్కడే. నన్నెవరూ ఏమీ అనరు. నా కెవరూ లేరన్నాడు. ఒకప్పుడున్నవాళ్ళు ఇప్పుడు సెమిటరీలో ఉన్నారేమో మరి అతని గతం జ్ఞాపకం తెచ్చి అతన్ని బాధపెట్ట తల్చుకోలేదు. సెమిటరీలో రాత్రిపూట భయం వేయదా అన్నాను. 'నాకేటి భయం బాబూ... ఎప్పటికైనా ఇలాంటి చోటుకు చేరుకోవల్సిందేగా. సెమిటరీ లోపల ఉన్నవాళ్ళు నన్ను ఎప్పటికప్పుడు ఆహ్వానిస్తూనే ఉంటారు. మనం అనుకుంటే పోగలమా. బయటవాళ్ళు వాళ్ళంతట వాళ్ళు ఇక్కడకు రానేరారు' అన్నాడు. నాకేదో తత్త్వబోధ చేస్తున్నట్టుగా వుంది.

యాదయ్య నాకెందుకో ఆప్తుడైనట్లుగా అనిపించింది.

ఎంత చిన్న ఇల్లైనా సరే తప్పక నీవే చూసిపెట్టాలి. మా సీత తొందర పడ్తోంది... అన్నాను.

అలాగే బాబూ మరో రెండురోజుల తర్వాత కన్పించండి. రిక్షాకు ఓ రూపాయ పడేయకూడదూ? అన్నాడు. ఎంత ఠీవిగా అన్నాడు.

ఇల్లు దొరకాలేగాని రూపాయ ఏం భాగ్యం అనుకున్నాను.

  

ఈ రెండు రోజులూ ముళ్ళమీద ఉన్నట్టుగా ఉంది. మళ్ళీ యాదయ్య దర్శనం.

నన్ను చూడగానే చిరునవ్వు. పెద్ద చిరునవ్వు. ముడుతలు పడ్డ చర్మం ఆ నవ్వుకు సాగలేక సాగుతోంది.

"ఆ వీధిలో ఓ మూల పావురాయి రంగు మేడ ఉంది చూశారా?" అన్నాడు.

'చూడకేం ఆ మేడముందుగా ఎన్నో సార్లు వెళ్లాను' అన్నాను.

'పోదాం రండి. చూపిస్తాను.' అతని వెనకాలే నడుస్తున్నాను.

అది రెండంతస్తుల మేడ. దూరం నుండి చూస్తే చుట్టూ గాజు కిటికీలు భయపడుతూ... నెమ్మదిగా లోపలకు వెళ్ళాను. ఆవరణలో ఎన్నో రంగు రంగుల పూలమొక్కలు. గాజు కిటికీలకు రంగురంగుల కర్టెన్లు – మేడ చాలా ఎత్తు ప్రదేశంలో ఉంది. ఆవరణలో పెద్ద లాన్... ఆకుపచ్చ తివాచి. కిందిభాగమే చాలా ఎత్తులో ఉంది. సుమారు ముప్పై అడుగులు ఆ పూల మొక్కలు, ఆకుపచ్చ తివాసీ చూసుకుంటూ మేడ వెనకవైపు వెళ్ళాను అతనితో.

అక్కడ కిందిభాగం అనుకున్న కింది భాగం కింద మరో కొన్ని గదులున్నాయి. నా కాశ్చర్యం వేసింది. మేడముందునుండి చూస్తే రెండంతస్తులే కన్పించినయి. వెనకవైపు మూడు అంతస్తులుగా వున్నయి. ఒకగది నౌకర్లుండడానికి దాని పక్కనే బాత్‌రూమ్ అటువైపు రెండుగా పెద్ద పెద్ద గదులు తలుపులు పూర్తిగా వేసి ఉన్నయి. 'ఇవి రెండూ కారుగరాజీలు బాబూ. లోపల అంతా సిమెంటుచేసిందే. అయ్యగారికి రెండుకార్లుండేవి. ఒకటివారి అబ్బాయిగారికి మరోటి అయ్యగారికి. అబ్బాయిగారు ఈ మధ్యనే ఇంగ్లండు వెళ్ళారు. అవసరంలేదని కారు అమ్మేశారు. గరాజి ఖాళీగానే వుంది. చాలా రోజులు ఎవ్వరికీ అద్దెకివ్వలేదు. ఇచ్చే ఉద్దేశ్యం లేదు. నేను బతిమాలుకుని మిమ్మల్ని గురించి చెప్పి, ఒప్పించాను' అన్నాడు.

గరాజీ తలుపులు తీసి చూపించాడు. లోపల పరిశుభ్రంగా ఉంది. లైటు గూడా ఉంది. గోడకు ఒకపక్క రెండు మూడు గూళ్ళు ఉన్నాయి. అక్కడ కొంత సామాను పెట్టుకోవచ్చు. గరాజీ మధ్యలో కర్టెన్ కట్టుకుంటే ఒక పక్కగా వంటకు వీలుగావుంది.

దక్షిణవైపుగా తోటను తొంగిచూస్తూ చిన్న కిటికీ గూడా ఉంది. నా కంతకన్నా ఏం కావాలి ఆ తోటనూ, పూలనూ చెట్లనూ చూస్తూ కూచోవచ్చు.

మరి మీ అయ్యగారితో మాట్లాడక్కర్లేదా? అన్నాను. అంతా నేను మాట్లాడేశాను మీకు నచ్చితే మంచిరోజు చూసుకొని చేరొచ్చు అని చెప్పాడు

నాకెందుకో ఆ మేడంతా నాదేనేమో అనిపించింది. మేడపైన ఉన్నవారికీ నాకూ ఏ భేదం కన్పించలేదు. ఈ తోట ఈ పూలచెట్లు పూలు ఈ ఆకుపచ్చ తివాసి ఇవన్నీ నావే. సాయంత్రంపూట వీటినన్నిటికీ నీళ్ళు నేనే పోస్తాను. నా సరదా తీరుతుంది. ఊరికేచేస్తానంటే యజమాని మాత్రం వద్దంటాడా? తోటపనికి సాయం సీతకూడా వస్తుంది. చూసేవాళ్లకు నేను తోటమాలి పనిచేస్తుంటే బావుండదేమో. చూసేవాళ్ళతో నాకు పనిలేదు. చేసేవాణ్ణి నేను- నాకు వేరే ఉద్యోగం ఉంది. ఖాళీ సమయంలో తోటచూసుకుంటాను. యజమాని ముట్టుకోవద్దని కోప్పడ్తాడేమో ఆ సింగినాథం ఆయనకు నేను నచ్చచెప్పగలను. యాదయ్యకు అయిదు రూపాయలిచ్చాను. ఇంట్లో చేరేరోజు కన్పించమన్నాడు.

సీతకు ఉత్తరం వ్రాశాను. పావురాయి రంగుమేడ. సెమిటరీ అవతల సిమెంటు మేడ. మేడలో తోట పూలు, రకరకాల పూలు, మేడలో భాగం అద్దెకు దొరికింది. గాలీ వెల్తురూ బ్రహ్మాండం... వెంటనే రమ్మంటూ వ్రాశాను. సీత ఎప్పుడో వచ్చి వాల్తుంది.

*జయశ్రీ సంక్రాంతి ప్రత్యేక సంచిక*

## 2

# పితృదేవోభవ

ఆదివారం–

పొద్దున ఎనిమిది గంటలకు బద్ధకంగా లేచాను. అన్ని రోజుల్లాంటిది కాదు కనుక ఆదివారం ఇంకా కొంచెం సేపు పడుకోవాలనే ఉంటుంది. ఇంతసేపు పడుకోవడం లలితకు బొత్తిగా ఇష్టం ఉండదు. ఏడు గంటలయినప్పటి నుండి నా ప్రాణం తోడేస్తూనే ఉంటుంది. అలా ప్రాణం తోడుతూ ఉంటే బోలెడు హాయిగా ఉంటుంది. చిన్న పిల్లాడిలా మారాం చేయాలనిపిస్తుంది. ఇలాంటివన్నీ 'స్మాల్ ప్లెజర్స్ ఆఫ్ లైఫ్' అంటాను నేను. ఆ మాటకు లలిత నవ్వేస్తుంది.

కాఫీ సిప్ చేస్తుంటే నాకో ఐడియా వచ్చింది – ఈ వేళ ఎగ్స్ ఎందుకు తెప్పించకూడదూ అని. నా కసలు అవి అలవాటు లేదు. ఒకసారి ఓ ఫ్రెండ్ ఇంటికి వెళ్ళినప్పుడు దాని రుచి తెలిసింది. ఎగ్ అంటే మా సీనిగాడికీ ఇష్టమే. బాయిల్డ్ ఎగ్‌ని అమాంతం ఒకటి లాగేస్తాడు లొట్టలు వేస్తూ. విజయకూడా వాడితోపాటు కంపెనీ కోసం, పాడువాసన అంటూనే తినేస్తుంది. లలిత మాత్రం "రామ, రామ! ఈ కోడిగుడ్లేమిటండీ! ఇల్లంతా నానా రోతా చేస్తున్నా"రంటుంది. శ్రీనివాస్‌కు పదేళ్లు. తరువాతది విజయ. రెండేళ్ళ చిన్నది.

"త్వరగా కాఫీ ముగిద్దురూ... అలా మింగేస్తున్నట్టు చూడడం ఎందుకూ నన్ను?" అన్నది లలిత.

"ఓ నాలుగు ఎగ్స్ తెప్పించుదూ... నీకు పుణ్యం ఉంటుంది... ఇవాళ ఆమ్లెట్ తినాలని ఉంది" అన్నాను.

గుండెలు బాదుకునేంత పని చేసింది లలిత.

"ఇదిగో, ఇలారండి..." అంటూ రహస్యం చెపుతున్నట్టుగా–

"మామగారు పూజలో ఉన్నారు. ఈ గుడ్ల సంభాషణ వింటే ఇంకేమన్నా ఉందా? వంట అవుతూంది. మామూలుగా పదింటికే వడ్డించేస్తాను. గుడ్డూ గిడ్డూ అని గోల చేయకండి" అన్నది సన్నగా.

"ప్రతి రోజూ పది గంటలకు చేసే భోజనమేగా! ఇవ్వాళ ఆలస్యంగా చేస్తే కొంత మార్పు, కాస్త థ్రిల్!"

"గుడ్డు తింటే థ్రిల్ వస్తుందటండీ!"

"థ్రిల్‌కు నిర్వచనం ఏముంది చెప్పు? మనం ఏదనుకుంటే అదే థ్రిల్! మనసుకు ఎప్పుడు, ఏది హాయిగా ఉంటుందో అదే థ్రిల్. యంత్రాల్లా జీవితం గడుపుతున్న మనకు ఏ కొద్ది మార్పయినా థ్రిల్లే!"

నన్ను ఇట్టే అర్థం చేసుకుంటుంది లలిత. బంట్రోతును పిలిచి గుడ్లు తెమ్మని తరిమింది.

"మామగారు పూజలోంచి లేచే లోపల మీరు ముగించేయాలి ఈ కోడిగుడ్డు భాగోతం" అంటూ వంట ఇంట్లోకి వెళ్లిపోయింది.

మా నాన్న పూజామందిరంలోంచి మంత్రాలు వినపడుతున్నాయి. విజయ, శ్రీనివాస్ ఆడుకుంటున్నారు.

శ్రీనివాస్‌కు తాతయ్య అంటే మహా ఎగతాళి. విజయకూడా వాడితో చేరి ఆయన్ను ఆట పట్టిస్తుంది.

నాన్న రిటైరయి నాలుగేళ్లయింది. అమ్మ అంతకుముందే చచ్చిపోయింది. ఆయన గవర్నమెంటులో మామూలు ఉద్యోగమే చేసి, పెన్షన్ తీసుకుంటున్నాడు. పెన్షన్ సుమారు రెండు వందలు వస్తుంది.

"నేను కష్టపడి నిన్నింత వాణ్ణి చేశారా. నీవు ఇంత పెద్ద ఆఫీసరయితే ఎంత సంతోషమో తెలుసా నాకు!" అంటాడు అప్పుడప్పుడు. ఏ ఊళ్లో పనిచేసినా పెద్ద ఇల్లు ఇస్తారు ఆఫీసువాళ్లు. ఇల్లు పెద్దదవడంచేత నాన్నకు ప్రత్యేకంగా ఓ గది ఏర్పాటు చేస్తాను. ఆ గదిలోకి ఎవర్నీ రానివ్వడు. రోజులో చాలా భాగం తలుపులు వేసే ఉంటాయి. పిల్లలు కూడా అక్కడకు వెళ్లడానికి భయపడతారు. ఒకసారి వెళితే నాన్న

వాళ్లని కసిరేశాడు. అప్పటినుండి తలుపు సందుల్లోంచి చూడ్డం తప్ప ఎప్పుడూ లోపలకు వెళ్లలేదు వాళ్లు. ఆయన కాలక్షేపం ఏదో ఆయన చేస్తూంటాడు. నేనూ అంతగా పట్టించుకోను. అంటీ అంటనట్టు ఉంటాను.

శ్రీనివాస్, విజయ కాన్వెంట్‌లో చదువుతున్నారు. వాళ్ల పాఠాలు, వాళ్ల చదువులు, ఆటలు వాళ్లదో జీవితం. నాకు సరే ఉండనే ఉంది. ఆఫీసు దయ్యం నన్ను పట్టుకుని వదలదు. లలితకు ఇంటిపనీ, వంటపనీ, అప్పుడప్పుడు చదువు. ఆ ఇంట్లో ఎవరి జీవితాలు వాళ్లవి. ఎవరి పద్ధతులు వాళ్లవి. అలా అని ఆ ఇంట్లో ప్రేమకు, ఆప్యాయతకు చోటు లేదని నే ననను. మమ్మల్నందర్నీ ఒక తాటిమీద నడిపిస్తూ ఉంటుంది లలిత. పిల్లల్ని వదిలేస్తే మా ముగ్గురి అభిరుచులూ, అభిప్రాయాలూ వేరు. మనస్తత్వాలూ వేరే.

బంట్రోతు గుడ్లు తెచ్చేడు. శ్రీనివాస్ గెంతుకుంటూ వచ్చేడు – "అబ్బ! ఎంత బావున్నాయెూ!" అనుకుంటూ. ఆ గుడ్డును ముట్టుకుంటే వాడికి చక్కిలిగింత. భరతనాట్యం చేస్తాడు. నాట్యం చేసినట్టే చేసి వాళ్ల తాతయ్య గదివైపు పరుగెత్తేడు. ఆ గది తలుపులు ఇంకా వేసే ఉన్నాయి. పెద్దగా ఏవో మంత్రాలు వినపడుతున్నాయి. క్షణంలో తిరిగి వచ్చేడు. వస్తూనే "తాతయ్య 'సెల్ఫిష్ ఫెలో', నాన్నా" అంటూ నెమ్మదిగా నా దగ్గరకు వచ్చేడు.

"అలాంటి మాటలు అనవచ్చునా తాతగారిని?" అని నెమ్మదిగా మందలించింది లలిత. ఈ మాటలూ, మందలింపులూ మా నాన్నకు వినపడకుండా జరుగుతాయి. అదీకాక ఆయన గదికొంచెం దూరం. రెండోది, ఆయన పెద్దగా చదువుతున్న మంత్రాలు.

"మరేమో తాతయ్యే... చాకలెట్లు, బిస్కట్లు, పకోడీలు ముందేసుకుని మంచం మీద కూచుని తింటున్నాడు" అన్నాడు శ్రీనివాస్.

లలిత నా వైపు, నేను లలితవైపు చూసుకున్నాం. మే మేమీ కామెంట్ చేయలేదు. మా నాన్న సంగతి నాకు తెలుసు. నాకు తెలుసునని లలితకు తెలుసు. ఇందులో ఆశ్చర్యపడవలసిందేం లేదు.

"తలుపు సందులోంచి అలా చూడకూడదు. నీవు మేనర్స్ నేర్చుకోవాలి" అన్నాను వాడితో.

"సారీ, నాన్నా!" అన్నాడు వాడు.

ఏదైనా తప్పు చేస్తే సారీ ఠక్కున చెప్పేస్తాడు శ్రీనివాస్. ఈ విషయంలో లలితకు చాలా పట్టింపు. సారీ చెప్పందే వదలదు. ఒకసారి చేసిన తప్పు రెండోసారి చేయకుండా చూస్తుంది లలిత డిసిప్లిన్ కోసం.

భోజనాల వేళ అయింది.

నాన్నకు టేబిల్ మీల్స్ ఇష్టం ఉండదు. వంట ఇంట్లో పీట వేసుకుని ఆయన పద్ధతిలో ఆయన భోజనం చేస్తాడు.

శ్రీనివాస్, విజయ టేబిల్ దగ్గర వాళ్ల వాళ్ల స్థానాల్లో కూర్చున్నారు.

నేనూ కూర్చున్నాను.

లలిత వడ్డిస్తోంది.

కాకరకాయ కూర చూసేటప్పటికి, "ఈ కూర నాకు వద్దు" అని ముందుకు తోశాడు శ్రీనివాస్. విజయా ఆ పనే చేసింది. నా కా కూర అసలే ఇష్టం ఉండదు.

"ఇదేమిటి. లలితా, ఈ కాకరకాయ చెయ్యొద్దని నీ కెన్నిసార్లు చెప్పాను?" అన్నాను. నాన్న మా వైపు చూస్తున్నాడు. ఆ కూరతో ఆయన ఎంతో తృప్తిగా భోజనం చేస్తున్నాడు.

"అన్ని కూరగాయలూ మంచివే. అన్నిట్లోనూ శరీరానికి పనికొచ్చే విటమిన్స్ ఉంటాయి. కూరలు తింటే మంచిది" అంటున్నది లలిత శ్రీనివాస్‌ను, విజయను ఉద్దేశించి.

"ఈ కాకరకాయ వేపుడు మీ అమ్మ ఎంత బాగా చేసేదో తెలుసా?" అంటున్నాడు నాన్న నన్ను ఉద్దేశించి.

"మామగారే నిన్న సాయంత్రం బజారునుండి కూరగాయలు తెచ్చారు" అన్నది లలిత.

"నీ కెందుకు నాన్నా అంత శ్రమ! బజారు కెళ్లడానికి బంట్రోతు ఉన్నాడుగా?" అన్నాను.

"మన పనులు మనం చేసుకుంటే తప్పేముందిరా! మనకు కావలసినవి ఏరి మంచి కూరలు మనం తెచ్చుకుంటే బాపుంటుంది కాని, ఆ బంట్రోతుకు ఈ పని అప్పగిస్తే పుచ్చులూ, ముదురు కాయలూ తెస్తాడు" అన్నాడు నాన్న.

కాకరకాయ అంటే నాన్నకు మహా ఇష్టం. నాకు చటుక్కున జ్ఞాపకం వచ్చింది. ఆయన కాశీ వెళ్లినప్పుడు తనకు ఇష్టంలేని కూర గోరుచిక్కుడు కాయ కాశీలో వదిలేసి చక్కా వచ్చాడు. ఆ విషయం మా అమ్మ బతికి ఉన్నప్పుడు నాతో చెప్పింది.

మజ్జిగా అన్నం తింటుంటే చల్లని వేళ అమ్మ జ్ఞాపకానికి వచ్చింది. ఆమె బతికి ఉన్నన్నాళ్లూ నాన్న ఆమెను శారీరకంగానూ, మానసికంగానూ హింసించాడు. "ఈ హింస కంటే చావే నయంరా, అబ్బాయీ...!" అని ఆమె నాతో ఓ సారి అన్నది. ఆమె కోరుకున్నట్లే ఆ మృత్యుదేవత ఏదో జబ్బురూపంతో వచ్చి తన వెంట తీసుకు వెళ్ళింది. అమ్మ చచ్చిపోయిందని నాన్నకు అమ్మమీద కోపం ఇంకా ఎక్కువైంది. చచ్చిపోయింది కనక ఏం చేయలేక కసికొద్దీ తగలేశాడు శవాన్ని. మా నాన్న సంగతి నాకు తెలుసు. లలిత కేం తెలుసు, పాపం!

  

"పోతన సినిమా వచ్చిందంట. నేను రెండో ఆటకు సినిమాకు వెళతాన్రా, అబ్బాయీ!" అన్నాడు నాన్న.

"అలాగే, నాన్నా" అన్నాను ముభావంగా.

ఆయన గదికి తాళం వేసుకుని సినిమాకు వెళ్లాడు.

విజయ, శ్రీనివాస్ పడుకున్నారు.

లలిత కార్యక్రమం కూడా పూర్తి అయినట్లుంది. వంట ఇంట్లోంచి బయట పడింది. లలితకు దేవుడు, దైవం, భక్తి, పూజ, మడి – ఇలాంటి వేవో ఉన్నాయి. పొద్దున ఒక అరగంటయినా వంట ఇంట్లో దేవుడి దగ్గర మడితో కూచుని ఏదో చేస్తుంది. బయటకు వినిపించదు. నాన్నలాగా తలుపులు వేసుకోదు. ఆమెకూ కొన్ని నియమాలు ఉన్నాయి. భోజనం చేస్తున్నప్పుడు మాట్లాడదు. వేదాలూ, ఉపనిషత్తులూ వల్లెవేయకపోయినా వాటిలోని సారానికి సంబంధించిన పుస్తకాలు చదివింది; చదువుతూనే ఉంది. వివేకానంద, రామకృష్ణ పరమహంస– ఇంకా ఇలాంటి పుస్తకాలు

నెమరువేస్తూ ఉంటుంది. ప్రతిరోజూ చదివే పుస్తకాల్లో గీత ఒకటి. రోజుకు ఒక అధ్యాయమన్నా పారాయణం చేయందే కార్యక్రమం పూర్తవదు. ఇక భారతం, రామాయణం, భాగవతం – ఇదంతా కొట్టినపిండి. ఆమె పి.యు.సి. వరకే చదువుకుంది. కాని ఈ మధ్య ప్రైవేటుగా బి.ఏ.కు కూర్చుందామని తాపత్రయ పడుతూంది.

నేను 'వోడ్‌హౌస్' పుస్తకం తీసుకుని ఈజీ ఛైర్‌లో నెమ్మదిగా శరీరాన్ని చేరవేశాను, సిగరెట్టు ముట్టించి.

"ఏమండీ... ఈ మధ్య మామగారితో మరీ ముభావంగా ఉంటున్నారు. ఆయన మనసు నొచ్చుకుంటుందేమో?" అన్నది లలిత. ఇది నిజమే. నా కాయనతో మాట్లాడ బుద్ధి కావడం లేదు.

"ఆయన సంగతి నీకింకా బాగా తెలియదు లలితా" అన్నాను.

"తెలిసేందుకు, తెలియక పోయేందుకు ఏముందండీ? పెద్దవారు ఆయన. ప్రాణాలన్నీ మీ మీదే పెట్టుకున్నారు. ఒక మూల అత్తగారు పోయారని మానసికంగా బాధ. మరోవైపు మీరు కూడా చిన్నచూపు చూస్తున్నారని వేదన..."

"మా అమ్మ చచ్చిపోయిందని ఆయన కేం దుఃఖం లేదు".

"అంత మాట అనకండి. ఆ గదిలో అత్తగారి ఫోటో పెట్టుకుని, నిత్యమూ పూజలాంటిదేదో చేస్తున్నారు. రోజుకో పువ్వు ఆ ఫోటోమీద ఉంచుతారు..."

"నీవు వట్టి అమాయకురాలివి లలితా... ఎవరైనా చచ్చిపోయిన భార్యకు పూజలు చేస్తారా? బతికి ఉన్నన్నాళ్లూ హింసించాడు. ఇప్పుడేమో తన భార్య ఉత్తమ ఇల్లాలని అందరితో చెప్పుకుంటాడు. ఎవరైనా కనిపిస్తే వదలడు. మొన్నొకసారి ఏమైందో తెలుసా? ఈ ఊళ్లో కాలేజీలో ఏవో సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతుంటే ఒక నాటి సభకు నేను అధ్యక్షత వహించవలసి వచ్చింది. నా ఉపన్యాసంలో నాలుగు మంచి ముక్కలు విద్యార్థులకు చెప్పాను. అది వాళ్లందరికీ నచ్చి సంతోషించారు. ఆ మీటింగుకు నాన్నకూడా వచ్చాడు. ముందువరుసలో కూర్చున్నాడు. మీటింగ్ అయిపోయే సమయంలో నాన్న లేచాడు – నన్ను రెండు ముక్కలు చెప్పనివ్వండి అని. నా మీద ఉన్న గౌరవంచేత ప్రిన్సిపల్‌గారు సరే అన్నారు. ఉపన్యాసం మొదలెట్టి

ఏవేవో చెపుతున్నాడు. చెపుతూ, చెపుతూ గీతలోకి వెళ్లాడు – తనేదో గీతమీద అథారిటీ అయినట్టు. చాదస్తంగా ఏదో చెప్పుకుపోతుంటే పిల్లలంతా చప్పట్లు కొట్టారు. చివరకు దిగు, దిగు అనే వరకూ వచ్చింది. నాకు చాలా చిన్నతనమైంది. మీటింగ్‌లో కూడా తన భార్య సంగతి ఒకటి రెండు సార్లు ప్రస్తావించాడు. ఈయనకు సమయాసమయాలు బొత్తిగా తెలియవు. పైగా, ఎప్పుడైనా ప్రత్యేకమైన సభ ఏర్పాటు చేయించవలసిందని, ఆ సభలో తను గీతమీద ఉపన్యాసం ఇస్తానని ప్రిన్సిపల్‌గారిని అడుగుతున్నాడు. గీతమీద ఓ వెయ్యి పేజీల గ్రంథం వ్రాస్తున్నానని అందరితో డబ్బా వాయించు కుంటున్నాడు–"

"గీతమీద గ్రంథం వ్రాస్తున్నారా? ఇది నాకు తెలియదే! మీ నాన్నగారు పుణ్యాత్ములు. మీరిలా ఆయన్ను చిన్నచూపు చూడటం నా కేం నచ్చలే..."

"అయ్యో! లలితా! నీ వింకా పురాణ యుగంలో ఉన్నావు! ఇదంతా మోసం. నీకు తెలియదు" అని పగలబడి నవ్వేను.

నా నవ్వులోని అర్థం లలిత గ్రహించుకున్నట్టు లేదు. విడమరిచి చెప్పడం నా కిష్టం లేదు. నిదానంగా లలితే గ్రహించుకుంటుందని నా నమ్మకం.

ఊళ్లో సినిమాలకు, నాటకాలకు ప్రతిదానికీ సిద్ధం. పైగా ఫలానా ఆఫీసరు నాన్నగారిని అని చెప్పుకుని ముందు వరుసలో కూర్చుంటాడు. సభల్లోనూ, నాటకాల్లోనూ, ప్రతిదాంట్లోనూ నన్ను ఇరికిస్తాడు– నా పేరు చెప్పుకుంటూ.

ఏ ఊరు ట్రాన్స్‌ఫర్ అయినా, ముందు ఊళ్లోకి వెళ్లి, ఊరంతా సర్వేచేసి వచ్చి, అందరితోనూ చెప్పుకుంటాడు "మా పిల్లవాడు బంగారు తండ్రి" అనీ, "నా భార్య ఉత్తమ ఇల్లాలు"అనీ. నలుగురినీ మంచి చేసుకుంటాడు. కొన్నాళ్లు పోతే కాని ఈయన మంచితనం బయటపడదు.

ఈ విషయాలన్నీ లలితతో చెపితే నేనే చులకనై పోతాను.

నాన్నని లలిత ఎదుట ద్వేషించలేను. నాకు మాత్రం ఆయనంటే గౌరవం లేకపోగా ద్వేషం ఎక్కువవుతున్నది.

"ఏమండీ... తండ్రి దైవసమానుడు. అందుకనే పితృదేవోభవ అన్నారు. మీరు మామగారితో సరిగా మాట్లాడ్డం లేదు. ఎవరో పరాయివ్యక్తిని చూసినట్టు చూస్తున్నారు.

నా మాట విని మీరు మీ పద్ధతి మార్చుకోండి" అంటూ నా దగ్గిరగా వచ్చింది లలిత. లలిత శరీరం అసలే సుకుమారం. దానికితోడు సన్నజాజుల మెత్తటి పరిమళం. నా కేమిటో పన్నీరుజల్లులా ఉంది.

మా నాన్న రెండో ఆట సినిమా కెళ్లాడు. సినిమాకే వెళ్లాడో? ఏమో?

మళ్లీ మా అమ్మ జ్ఞాపకాలు...

నాన్న ఓ రోజు అన్నాడు అమ్మతో, "వచ్చే జన్మలో కూడా నీవే నా భార్యగా ఉండాలే" అని. అది హాస్యమో, వేళాకోళమో తెలియలేదు.

"ఈ జన్మకు ఇక చాలు లెండి. వచ్చే జన్మలో కూడా ఎందుకు?" అన్నది అమ్మ ముక్తసరిగా.

ఆ మాటలు ఇంకా నాకు వినపడుతూనే ఉన్నాయి.

అమ్మమీద చేయి చేసుకున్నప్పుడు ఎన్ని సందర్భాలలోనో నా కళ్లు చెమ్మగిలినాయి. మహా కసిగా ఉండేది. నేను మరీ చిన్నవాణ్ణి. కసి, కోపం దిగమింగుకుని, భయపడుతూ మూల నక్కేవాణ్ణి. అవన్నీ లలిత కేం తెలుసు? పాపం, పితృదేవోభవ అని నాకేదో చెపుతున్నది.

"మామగారికి అరవై ఏళ్లు నిండబోతున్నాయి. అత్తగారుంటే షష్టిపూర్తి ఎంత వైభవంగా జరిగేదో కదా!" అంటూ జాలి ఒలకబోసింది లలిత.

నేను దగ్గరగా జరిగేను.

లలిత మరీ దగ్గరగా జరిగింది.

"నాన్న మంచివాడే గాని – " అంటుండగా నా నోరు నొక్కేసింది లలిత.

"హతోస్మి" అన్నాను.

లలిత పెద్దగా నవ్వేసింది.

అలా నవ్వుతుంటే నా కెంతో బావుంటుంది. ఆ నవ్వులో అమాయకత్వం, ఆప్యాయత, ఓ విధమైన 'బ్లిస్' ఉంది. గాలిలో ఎక్కడికో తేలిపోతున్నట్లుంటుంది. అదో హాయి.

"మంచీ చెడూ కలిస్తేనే గదా మనిషి? చిన్నప్పటి నుండి మీ రెందుకో ఆయనంటే ద్వేషం పెంచుకున్నారు. మీ కాయన విషయం ఇప్పటికీ ప్రతిదీ చేదుగానే కనిపిస్తుంది. నేను మీలా సైకాలజీ చదువుకోలేదనుకోండి" అన్నది లలిత.

'అబ్బ! దెబ్బకొట్టావే!' అనుకున్నాను.

తమాయించుకుని, "అబ్బే! అదేం లేదు. ఆయనంటే నా కెందుకూ ద్వేషం?" అన్నాను.

"మీరు అన్నా అనకపోయినా మీ మనసులో అలాంటి భావమేదో ఉంది. అది మిమ్మల్ని వెంటాడుతున్నది. ఆ ద్వేషపు నీడలోంచి తప్పించుకోలేక పోతున్నారు. అది ఓ రకంగా మన లోపమేనని ఎందుకనుకోకూడదు?" అన్నది.

మళ్లీ దెబ్బమీద దెబ్బ.

"నీడా లేదు, గీడా లేదు. అంతా హుళక్కి" అన్నాను నవ్వుతూ.

నవ్వేనే కాని, ఆ నవ్వులో నవ్వు లేదు. మరేమిటి? అనుమానమా, ద్వేషమా, క్రోధమా? ఏమిటో నాకే తెలియడం లేదు. లలితతో ఏం చెప్పను?

లలిత ఒక్కోరోజు చిన్నపట్టుబట్ట చుట్టుకుని మడితో కూర్చుంటుంది. మడి చీర ఆరకపోతే, ఆ చిన్నపట్టువంచె ఒం కంతా సరిపోదు. లలిత నిండు మనిషి కనక వీపూ, పిక్కల పైభాగం కనిపిస్తూ ఉంటుంది.

ఒక రోజు అలా పూజలో కూర్చున్నప్పుడు-

నాన్న వంట ఇంట్లోకి వెళ్లి, ఒక అడుగు లోపల వేసి, మళ్లీ ఒక అడుగు వెనక్కు వేసి, "అమ్మాయీ, లలితా! రెండు ఊదొత్తులుంటే ఇవ్వమ్మా!" అన్నాడు.

ఇలాంటి సంఘటనలు ఒకటి రెండు నా కంట పడ్డాయి. నాకు ఒళ్లు మండిపోయింది. ఈయన నిజంగా ఊదొత్తుల కోసమే వెళ్లాడా లోపలికి? ఈయన కళ్లు మంచివి కావు. లలితను తినేట్టు చూస్తాడు అప్పుడప్పుడు.

లలిత బాత్‌రూంలో స్నానం చేస్తున్నప్పుడు ఒకటి రెండు సార్లు .... ఆ వైపు తచ్చాడుతుండటం నేనోసారి గమనించాను. ఆ బాత్‌రూం తలుపులకు చీమ దూరే సందున్నా....... అబ్బ, ఏం మనిషి, ఈ నాన్న! అని కోపం, కసీ ఎక్కువైనాయి. ఓసారి నాన్నను అడుగుదామని నోటిదాక వచ్చింది. ఈ విషయం లలితకు ...... నాన్న మనసు కష్టపెట్టుకుని, ......... రభస అవుతుందని మెదలకుండా ఊరుకున్నాను. నాన్నకూడా ఓ మనిషేనా!........ ఏళ్లు వచ్చినాయి - ఇదేం బుద్ధులు ....

అయినా నేను ఊరికే అనుమాన పడుతున్నానేమో? నా అనుమానంలో కొంత నిజం లేకపోలేదు. ఆయన స్వభావం నాకు తెలుసు. లలితకు విడమరిచి హరికథలా చెప్పడం ఎలా?

లలిత తన పరీక్ష, పుస్తకాల ప్రసక్తి తెచ్చింది. పరీక్షలు దగ్గర పడుతున్నాయి.

"కొన్ని సబ్జక్టులయినా మీరు చెప్పందే నా చదువు పూర్తవదు" అన్నది లలిత.

"నాకు తీరిక ఎక్కడిది లలితా? చూస్తూనే ఉన్నావుగా, ఆఫీస్ పని బాధ్యతలు, కొంచెంకూడా విశ్రాంతి లేదే? కాస్త విశ్రాంతి దొరికితే 'హేడ్‌హౌస్' నవలలు వదలబుద్ధి అవదు. నీవే చదువుకుందూ, పెద్ద బ్రహ్మాండం ఏం లేదు" అన్నాను.

"పోనీ, మామగారు ఖాళీగానే ఉంటారుగా? ఆయనకు వీలుపడుతుందేమో అడగనా?" అన్నది.

కొరడాతో కొట్టినట్లయింది. నా కళ్లు బిగుసుకున్నాయి... నా కళ్లలో నెత్తురు చిమ్మింది...

"ఆయనకు మాత్రం తీరికెక్కడిది? ఆయన పూజలు, ఆయన వ్రాతలు, బజారుపనులు, ఊళ్లో పెత్తనాలు- వీటితోనే సరిపోతుంది. అయినా ఆయన బి.ఏ. వాళ్లకు చదువేం చెప్పగలడు?" అని నవ్వేశాను.

"మీ రన్నిటికీ నవ్వుతారు. నేను పరీక్షకు సీరియస్‌గానే చదువుతున్నాను తప్పక పాసవాలని" అని మారాం చేసింది లలిత.

లలిత సీరియస్‌గా ఉన్నప్పుడు నేను నవ్వడం, నేను సీరియస్‌గా ఉన్నప్పుడు లలిత నవ్వడం మా ఇద్దరికీ పరిపాటయిపోయింది.

మళ్లీ సంభాషణలో నాన్న సంగతి...

"ఆయన వచ్చినప్పుడు, బయటకు వెళ్లినప్పుడు రెండు మాటలు మాట్లాడండి. ఆయనకు ఎంత తృప్తిగా ఉంటుందో" అన్నది.

"మా ఇద్దరి మధ్యా మాటలేముంటాయి? నా కేం మాట్లాడాలో తోచదు."

"ఆయన రిటైరయినారనీ, ఆయనకు భార్య లేదనీ మీరు చాలా చులకనగా చూస్తున్నారు."

"అబ్బే, అదేం లేదు! కాని, నా కంటికి ఓ క్రూరుడుగా కనిపిస్తాడు. ఎందుకో ఆయనంటే నాకు ఎలర్జీ!" నెమ్మది నెమ్మదిగా నాలోని ద్వేషం బయటకు వస్తూంది.

"మీకు మొదటినుండి జీవితం వడ్డించిన విస్తరయింది. మామగారు ఏ లోటూలేకుండా కష్టపడి చదువు చెప్పించారు. మీకు ఎలాంటి ఇబ్బందీ కలగలేదు. చదువు పూర్తవగానే వెతుక్కోకుండా మంచి ఉద్యోగం వచ్చింది. ఆ తరవాత నన్ను పెళ్లాడారు. మీ నాన్నగారి విషయం ఆలోచించండి. ఆయన్ను గురించిన వివరాలు నాకు ఎక్కువ తెలియవనుకోండి. ఆయన జీవితంలో విస్తరాకులు దగ్గరినుంచి వెతుక్కోవలసి వచ్చింది. చాలీచాలని జీతం... పెద్ద సంసారం. ఏవో చిక్కులు. మీరే అన్నారు ఓసారి ఆయన జీవితంతో ఎప్పుడూ యుద్ధం చేస్తుండేవారని. ఆయనకూ, మీకూ తేడా లేదూ? ఫ్రస్ట్రేషన్ మనిషిని ఎలా కుంగతీస్తుందో నా కన్న మీకే ఎక్కువ తెలుసు. సైకో ఎనాలిసిస్ నాకు తెలియదనుకోండి. మీరనుకున్నట్లు ఆయన నిజంగా క్రూరస్వభావులే అయితే దానికి కారణాలేవో ఉంటాయి. అవి మనసుకు సంబంధించినవి. మీ కోసారి ప్రమోషన్ ఆర్నెల్లు ఆలస్యంగా వచ్చిందని ఎంత చికాకుపడ్డారు! కొన్నాళ్లు మీ స్వభావమే పూర్తిగా మారిపోయింది. నన్ను కూడా కసిరేసిన రోజులు లేకపోలేదు. ఆ తరువాత మళ్లీ మామూలు మనిషి అయినారు" అంటూ చెప్పుకుపోతున్నది.

ఈ మాటలు లలితే చెపుతున్నదా... ఫ్రాయిడ్, జంగ్ చెపుతున్నారా? అనిపించింది.

"ఏదోలెండి, పిచ్చిదాన్ని ఏదో వాగుతున్నానని కోప్పడకండేం? నాకు శాస్త్రాలూ, సైకాలజీ తెలియవు. జీవితంలో ఏ రకంగానైనా అసంతృప్తి ఉంటే మాత్రం - అది పిశాచంలా పట్టుకుని మనిషిని చెండుకు తింటుంది. ఇది నాకు తోచిన అభిప్రాయం" అన్నది చిటికె వేసి ఆవలిస్తూ.

"నిద్ర వస్తూందా, లలితా?" అన్నాను.

నాన్నమీద చర్చ కాదు కాని ఆ రోజు పన్నెండు గంటలయింది.

"మధ్య నా కెందుకు లెండి! మామగార్ని వెనకేసుకొస్తున్నానని మీరనుకోవడం... మీకు నేను చెప్పనేర్చిన దాన్ని కాదు. మనిషిని మనిషి కాకపోతే మరెవరు క్షమిస్తారు?

మనిషిలో మంచీ చెడూ విడగొట్టి, చెడునే చూడకుండా మనిషిని మనిషిగా చూస్తే మంచిదని నా అభిప్రాయం. మన ఆలోచనల్లో సమగ్రతకు స్థానం ఇవ్వాలి" అన్నది.

నేను ఆలోచిస్తున్నాను.

లలిత నెమ్మదిగా నిద్రకు ఉపక్రమించింది.

లలిత బాగా పెరిగింది నా దృష్టిలో.

నాకు నిద్ర పట్టడం లేదు. నాన్నను గురించే ఆలోచిస్తున్నాను. నే నెవరిని? అన్న ప్రశ్న ఎదురైంది. నాలో అహం 'నేనే' అన్నది. నువ్వా? అన్నాను. 'నోరు ముయ్' అన్నది.

ఆలోచిస్తున్నాను. నాన్నను గురించే ఆలోచిస్తున్నాను. ద్వేషం, క్రోధం, కసి పెనుగులాడుతున్నాయి...

ఒంటి గంట అయింది.

తలుపు కొట్టారెవరో.

ఇంకెవరూ? నాన్న. అందరిలాంటి మామూలు మనిషి.

మామూలు నాన్న సినిమానుండి తిరిగి వచ్చినట్టుంది.

రాగానే నాన్నకు మంచినీళ్లిచ్చాను.

"సినిమా బాగుందా, నాన్నా?" అన్నాను.

"బ్రహ్మాండంగా ఉందిరా" అన్నాడు.

కాసేపు నిశ్శబ్దం.

"అబ్బాయీ, ఇంకా నీవు నిద్రపోయినట్టు లేదే? లైటు వెలుగుతూంది".

"ఏదో పుస్తకం చదువుతున్నాను".

"ఏం పుస్తకాల్రా... ఇంత పొద్దు పోయేదాకానా... నీకు మహా నవలల పిచ్చిరా" అంటూ తన గదిలోకి వెళ్లాడు.

నేను లలిత పక్కన చేరేను.

# 3

# ముసుగు

నెలాఖరు– ఆదివారము – మరో రెండు రోజులు పోతేనేగాని జీతం రాదు. హోటలు భోజనానికి ఒక్క టికెట్టు మాత్రమే మిగిలింది. ఆ మధ్య స్నేహితులు రావడాన– గొప్పకోసము కాకపోయినా సామాన్యంగా వుండే స్నేహ ధర్మాన్ని నెరవేర్చుకున్నందుకు కొన్ని టిక్కెట్లు ఖర్చు అయిపోయాయి. ఈ రెండు రోజుల భాగ్యానికి అప్పు చేయడం (ఎంత కొంచమయినా) ఇష్టము లేదు.

నేనుంటున్న గదిని చూసి చాలామంది సన్నిహితులు నన్ను అభినందిస్తూ ఉంటారు. పోష్ "లొకాలిటీ"లో ఈ మహానగరములో నా అదృష్టము కొద్ది చిన్న గది దొరికింది. దానికే నలభై రూపాయలు. నా మంచితనంవల్ల ఆ గది దొరికిందని అంటూ ఉంటారు. తాజమహల్ హోటల్లో భోజనం. ఆఫీసుకు వెళ్ళటానికి కష్టార్జితములో మిగుల్చుకొని కొనుక్కున్న వాహనము ఉంది. అది నా హెర్క్యులెస్ సైకిలు నమ్మినబంటు. ఈ వాహనం కోసము ఒక్కొక్కప్పుడు ఒకపూటే భోజనము చేసి డబ్బు మిగిల్చుకోవాల్సి వచ్చింది. నా కొచ్చే జీతము చాలా జాగ్రత్తగా బడ్జెట్టు తయారు చేసి దాని ప్రకారము ఖర్చు చేస్తే టొటాటొటీగా సరిపోతుంది. జీతము వచ్చిన రోజున అంచనాప్రకారం కనీసము పది పదిహేను రూపాయలన్నా ఆ నెలలో మిగులుతుందని అనిపిస్తుంది. ఆ డబ్బు ఎలా ఖర్చు అవుతుందో తెలియదు. అప్పుచేయడము మొదలు పెడితే దానికి అంతు ఉండదు. పెరిగి పెరిగి ఆకాశాన్ని అంటుతుంది. నా తాహతునుమించి అప్పు చేయడము ఇష్టము లేదు. మనదేశము తిండిగింజలకు కూడా అప్పుచేసి పప్పు కూడు తినడం చూస్తూ ఉంటే నా కడుపు తరుక్కుపోతోంది. అప్పుల్లో గొంతువరకు మునిగివున్నాము. నిండా మునిగిన వానికి

చలిబాధ తెలియదు. నేను నీళ్ళలోకే అడుగు పెట్టడానికి సందేహిస్తాను. చలి అసలు భరించలేను.

నేను ఉంటూన్న వీథిలో ఇరువైపుల పెద్ద భవంతులు. భవంతుల్లో కార్లు పెట్టుకోడానికి నాజూకుగా తయారయిన గారేజీలు. నా "రూం" గ్యారేజీలో సగము ఉంటుంది. చిన్న ఊళ్ళో ఉండే "ముటు" గదికన్నా కొంచెము చిన్నది. ఆ భవంతుల్లో కార్లలో వెళ్ళే ఆఫీసర్లూ, కాలేజీలకు వెళ్ళే అమ్మాయిలూ (అందమైన) కాన్వెంట్లుకు వెళ్ళే పిల్లలూ... వాళ్ళను సంరక్షిస్తున్న ఆయాలూ... నౌకర్లూ, ఎప్పుడూ అందరూ హడావిడిగానే ఉంటారు.

పల్లెటూళ్ళలో అయితే పక్కనున్న వాళ్ళెవరో తెలుస్తుంది. అప్పుడపుడు వచ్చి మంచీ చెడ్డా కనుక్కొంటూ ఉంటారు. ఈ మహానగరములో పక్కనున్న వాళ్ళు ఎవరెవరో ఎవరేం చేస్తుంటారో తెలియదు. మా వీథిలో చివరి భవంతి మరీ హడావుడిగా ఉన్నట్లు కన్పడతారు.

ఆదివారం ఉదయం పేపరు చూస్తూ కూర్చున్నాను. పేపరుకు ప్రతినెలా కొంత డబ్బు ఖర్చయినా – పేపరుకొనకుండా ఆ డబ్బు అదాచేయడము నా కిష్టము లేదు. పేపర్లో చాలా సంగతులు ఉంటాయి. మంచి మంచి విషయాలున్న పేపర్లు అలాగే ఉంచేస్తాను. నా రూంకు రాగానే ఎవరికయినా ఎదురుగా పేపర్ల కట్టలే స్వాగతం చెప్తాయి.

పేపరు చదువుతుంటే నాకో ఆలోచన మెరుపల్లే మెరిసింది! పాత పేపర్ల కట్టలన్నీ అమ్మితే కొంత డబ్బు వస్తుంది. ఈ రెండు రోజులూ గడిపేయవచ్చు అనుకొన్నాను – కాని మరోక్షణంలో ఎంత పతనానికి దిగజారేను అనిపించింది– ఏదైనా అవి అమ్మడానికే నిశ్చయించుకొన్నాను.

పేపరు కాగితాల్... అని అరుస్తూ అప్పుడప్పుడు ఈ వీథిలో ఒకడు సైకిల్ మీద వెళ్ళుతుంటాడు. వాడు వస్తే బావుండుననిపించింది. వాడివృత్తి అదే అయినప్పుడు తప్పకుండా వస్తాడు. ఈ రోజు ఆదివారము కనుక సందేహము లేదు. వాడికేక కోసము నిరీక్షిస్తూ కూర్చున్నాను. మన అవసరం ఉన్నప్పుడే ఆలస్యం జరుగుతుంది. నాకు వేరే పనేంలేదు. ఎంత సేపయినా కూర్చుంటాను. పేపర్లో ఓ కొత్త వ్యాసం

చదువుతున్నాను. మునలితనం రాకుండా ఉండేందుకు శాస్త్రజ్ఞులు కనిపెట్టిన కొన్ని మార్గాలు. మునలితనాన్ని ఒకవేళ జయించినా మృత్యువును జయించలేరు. మునలితనం వస్తే శాస్త్రజ్ఞులకు నష్టమేమిటో. పుట్టినవాడు గిట్టక మానడు. బాల్యం, యౌవనం, కౌమారం, వానప్రస్థం.. ఈ నాలుగూ ఎవ్వరికి తప్పవు. ప్రకృతికి విరుద్ధంగా పోవడం దేశానికి అరిష్టం. మునలితనం రాకుండా ఉంటే ఎవరూ రిటైర్ అవరు. ఎవ్వరికీ ప్రమోషన్‌లకి అవకాశం ఉండదు. అన్నాళ్ళు బతికితే బతుకుమీదే రోత పుడుతుంది. అన్నాళ్ళు బతికి ఎవరిని ఉద్ధరించడానికి కోడి నరాలలోని మందు ఇంజెక్షన్‌లుగా వాడితే శరీరములో కొత్తరకమైన తేజస్సు వస్తుందట. ఇదో కొత్త థియరీ! శాస్త్రజ్ఞులకు పనీపాటా లేక ఇట్లాంటివి కనిపెడుతూ ఉంటారు. ఎన్నాళ్ళకీ మునలితనము రాకపోతే.. (మగవాళ్ళకు) ఈ ఆడవాళ్ళుపడే అవస్థ అంతా ఇంతా కాదు. మునలితనంలోని మాధుర్యాన్ని అనుభవించలేరు. యౌవనములో ఆనందము ఉన్నదని అనుకున్నా - ఏదైనా తీపి ఎక్కువగా ఉంటే దాని రుచి తెలియదు. చేదుగా కూడా ఉంటుంది.

మునలితనాన్ని గురించి నేను చర్చించుకునే సమయంలో పేపరువాడి కేక విన్పించింది. వాడికేక తమాషాగా వుంటుంది. కాగితాల్ అన్నది స్పష్టంగా వినపడదు గుమ్మంలో నిల్చుని కేక వేశాను.

వాడి సైకిలు వెనకాల పెద్ద గోనె సంచీవుంది. కొన్ని డబ్బాలు సీసాలు కూడా వున్నాయి. దాంట్లో కొన్ని పేపర్లకట్టలు, కొబ్బరి నూనె సీసా తప్ప నా రూంలో ఏం సీసాలు లేవు. పేపర్లన్నీ తూకం వేశాడు. మూడు కిలోల పైనే వున్నాయి. వాడి దగ్గర బేరము ఆడకుండా డబ్బు తీసుకున్నాను. గోనె సంచి చాలా బరువుగానే వుంది. దాని నిండా సీసాలే అన్నాడు వాడు. ఆ సీసాలు చూద్దామనిపించింది. ఏదైనా అందమైన సీసావుంటే కొందామని. నా కోరికమన్నించి గోనెసంచీ విప్పేడు. నాకళ్ళు చెదిరినై. రకరకాల సీసాలు. వాటిమీద లేబిల్సుకూడా ఉన్నాయి. బీర్ సీసాలు, విస్కీ సీసాలు, ఇంకా ఎన్నో వాటిలో కొన్ని ఫారిన్ సీసాలట. ఎంతో నాజూకుగా వున్నాయి. ఇన్ని సీసాలూ ఒకరింట్లోనే కొన్నాడు. ఈ వీథిలోనే చివరి భవంతిలో. ఆ భవంతిలోనే హడావుడిగా ఉంటుంది. వచ్చే వాళ్ళూ, పోయేవాళ్ళూ... ఇంకా డబ్బాలు కూడా ఉన్నాయి. ఫినైల్ డబ్బాలూ- డాల్డా డబ్బాలూ... సీసాలు ప్రతిరోజూ వచ్చి కొనుక్కు పోతానని చెప్పేడు.

ఇన్ని సీసాలు తాగేవాళ్ళు ఆ భవంతిలోనివాళ్ళు ఎంత ధనవంతులో కదా అనుకున్నాను. ధనవంతులంటే నాకేం కోపము లేదు ఎవరి అదృష్టం వాళ్ళది. వాళ్ళను గురించి నాకేం జెలసీ లేదు. ప్రతిరోజూ ఈ సీసాలమీద యెంత డబ్బు తగలేస్తున్నారో అని నా బాధ. వాళ్ళ అదాయము కొన్ని వేలల్లో ఉండి ఉండాలి. అలాంటివాళ్ళే అంత ఖర్చు భరించగలరు.

ఆ భవంతిని గురించిన వివరాలు తెలుసుకోవలెనని కుతూహలము కలిగింది. మళ్ళీ అనవసరపు జోక్యము నా కెందుకనిపించింది. కాని కుతూహలమే నన్ను జయించింది. సాయంత్రము ఎక్కడికీ వెళ్ళకుండా గుమ్మములో కూర్చున్నాను జపం చేస్తున్నట్టుగా. చీకటిపడుతూ పడుతూ ఉంది. రెండు కార్లువచ్చి భవంతిముందు ఆగినవి... కార్లలోంచి అందమైన ఆడవాళ్లు – మామూలుగా ఉన్న మొగవాళ్ళు... పకపకల్తో దిగి లోపలికి వెళ్ళేరు. కార్లు వెళ్ళిపోయి మరలవచ్చినవి. మరల వెళ్ళి మరలవచ్చినవి. ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. ఏదో నవల చదువుతూ కూర్చున్నాను. రాత్రి పన్నెండు దాటింది. వీధి అంతా నిశ్శబ్దంగా వుంది. మరల కారు చప్పుడయింది. భవంతిలోని కుక్క అరుపుకూడా వినిపించింది. ఒకరోజు సాయంత్రము భవంతిముందు గేటు మీద బోర్డు చూశాను. "కుక్కలున్నవి జాగ్రత్త" అని వున్నది.

మళ్లీ ఆదివారమునాడు సీసాల వాడు కనిపించాడు. సీసాల వాడిని అడిగితే వివరాలు తెలుస్తాయి. వాణ్ణి అడుగడానికి నాకు చిన్నతనమనిపించింది. వాడికి సీసాల బేరము తప్ప మరోటి తెలియదు.

ఆ రోజు సాయంత్రము కారులో దిగుతున్న అమ్మాయిని ఓ రోజు బస్స్టాండు దగ్గర చూసేను. సైకిలు దిగి ధైర్యము చేసి మాట్లాడుదామనుకున్నాను. ధైర్యము చాల్లేదు. వాడిపోయిన మొఖము అది చూసి ఏదైనా ఆఫీసులో ఉద్యోగము చేస్తున్నదేమో ననుకున్నాను.

ఒకరోజున ఏదో పండుగ శలవరోజు. పోస్టు బంట్రోతులూ, టెలిఫోను బంట్రోతులూ, పోలీసు కానిస్టేబుల్సూ, మున్సిపల్ జవాన్లూ... ఇంకా చాలామంది ఆ భవంతికి వచ్చి పోతున్నారు, బహుశా పండుగ ఈనాముకై ఉంటుంది. వచ్చిన వాళ్లందరూ సంతోషంగానే వెళ్లిపోతున్నారు. నేనుకూడా ఏ బంట్రోతు వేషమో వేసుకుని వెళితే బావుండుననిపించింది, వాళ్ల ఉత్సాహం చూస్తుంటే.

ఒకరోజు నా స్నేహితునితో మార్కెట్టు వెళ్లేను. అక్కడ ఆ భవంతిలో ఉంటున్న ఒక ముసలామె కనిపించినది. చాలా కూరలూ కోడిగుడ్లూ... కోళ్లూ.. కొంటున్నది. అవన్నీ మోసుకురావడానికి ఒక బలాఢ్యుడు కూలికోసం వేచి ఉన్నాడు. ఆమె కూరగాయల బేరము పెద్ద ఎత్తున చేస్తోంది. ఆమె వెళ్లిపోయిన తర్వాత ఆ కూరల వాళ్లి అడిగేను. కుతూహలంగా సామాన్య కుటుంబానికి అన్ని కూరలు ఎవడూ కొనరు. ఏదో హోటలయితే తప్ప... ఏదో హోటలు లాంటిదేనండీ అని వాడు అన్నాడు. హోటలయితే నేను చేరుదునే అనుకున్నాను.

వివరాలు ఒకటి తర్వాత ఒకటి తెలిసినప్పటినుండి నాలో కుతూహలము ఎక్కువయింది. ఎలాగైనా ఒకసారి ఆ భవంతిలోకి వెళితే బావుండుననిపించింది. న్యూ ఇయర్ దేన ధైర్యము చేశాను. నన్ను నేను పరిచయము చేసుకుని స్వయంగా ఆ ఇంటి యజమానికి శుభాకాంక్షలు అందజేద్దామనుకున్నాను. ఇందులో తప్పులేదు. ఎవ్వరూ అపార్థం చేసుకోరు. నాకున్న దుస్తులలో మంచివి పరిశుభ్రమైనవీ వేసుకుని, ధర ఎక్కువయినా ఒక "యాపిల్" పండుకొని బయలుదేరాను.

ఆ బోర్డు చూసి కొంచెం భయపడి... వెళ్దామా వద్దా అని తటపటాయిస్తున్నాను. ఇంతలో అందంగా నాజూకుగా ఉన్న అమ్మాయి.. ప్లీజ్ కమీన్... అన్నది. 'విష్' చేస్తూ లోపల ప్రవేశించాను. నేను కార్లో రాలేదని నన్ను ఎగాదిగా చూసినట్లుగా ఉంది. డ్రాయింగు రూంలో కూర్చున్నాను. ఫర్నిచర్ అధునాతనంగా ఉంది. గోడలకు అందమైన ఫోటోలు. మరో ఇద్దరు అమ్మాయిలు కనిపించారు. కళ్లు జిగేల్ మనేట్టున్నారు. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. అందరూ చాలా ఆప్యాయంగా చిరునవ్వులతో ఆదరించారు. చాలా రుచికరమైన కాఫీ అందుకున్నాను.

నా వివరాలు ఎక్కువ చెప్పలేదు. నా డ్రస్సునుబట్టి ఏదో ఆఫీసరుననే అనుకుని ఉంటారు. హోటలులో భోజనం చేస్తున్నానని మాత్రం తెలియజేశాను. హోటలుని విమర్శించుతూ... "మీరు ఇక్కడే ఎందుకు ఉండకూడదూ పేయింగు గెస్టు"గా అన్నది నవ్వుతూ ఆ అందమయిన అమ్మాయి. "తప్పకుండాను... సంతోషంగా..." అని అందామనుకున్నాను. మాట జారే ముందు 'నెలవారి బిల్లు ఎంతో తెలుసుకుంటే బావుంటుంది' అతి నాగరిక విధానములో వాళ్లని హెచ్చరించాను.

నేను వయసులో ఉండి ఆకర్షణీయంగానే ఉన్నట్టు వాళ్లకళ్లలో ఒక విధమైన తృప్తి కన్పించింది. సుమారు నాలుగువందల వరకూ అవుతుందని మాటల సందర్భంలో చెప్పారు. నాకది "షాక్"లా తగిలినా తమాయించుకుని "కాఫీ ఈజ్ ఎక్సలెంటు" అన్నాను. నాజూకుగా "థ్యాంక్యూ" అన్నారు వాళ్లు. ఇంతలో వాకిట్లో కారు ఆగిన చప్పుడయింది. క్షమించాలి నేను శలవు తీసుకుంటాను. మళ్లీ కలుస్తానని బయటపడ్డాను, "బోర్డు" వంక మరోసారి చూస్తూ!!!

నేనూ, నా తాజమహలూ మిగిలేం.

# 4

# భూతం

"వన్ డౌన్"

"వన్ డౌన్ యీజ్ నో డౌన్"

"అసలు త్రీ నోస్‌కు ఎందుకు వెళ్ళేరు... మీ దగ్గర ట్రిక్ వేల్యూ లేందీ– ఇప్పుడు గేం ఛాన్స్ వృధాగా పోయింది.... ఫోర్ కలర్స్‌లో చెక్ వుండద్దుటండీ..."

"ఒక కలర్ మీరు ఇండికేట్ చేశారు గదా ఓపెనింగ్‌లో... మీ బిడ్డింగ్‌వల్ల మిస్‌లీడ్ అయాను".

"అయితే నా బిడ్డింగ్ తప్పంటారా?"

"అనను కాని".

"కానీ, ఏవిటి గీని... మీది రాంగ్ ప్లే".

శివరామయ్యగారు కొంచెం గట్టిగానే అన్నారు.

మా వాగ్వివాదం చిన్న యుద్ధరంగంగా మారేట్లుందని తగ్గేను, శివరామయ్య గారిమీద ఉన్న గౌరవంకొద్దీ. అదీగాక కొద్దికాలం క్రితమే ఆయనతో పరిచయం. ఆ పరిచయం స్నేహంగా మారుతున్న రోజులు. నేను తగ్గటానికి మరోకారణం గూడా ఉంది. అది ఆయన మొదటి ప్రపంచయుద్ధానికి పది సంవత్సరాలముందు పుట్టటం. మా ప్రత్యర్థులు ఇంచుమించు ఆ వయసులో వాళ్ళే. కాని ఆయనకన్నా చిన్నవాళ్ళే. ఒకాయన రఘుపతి. మరో ఆయన పరంధామయ్య. నేను తప్పుగా ఆడేనని వాళ్ళూ నన్నూ మందలించారు.

వాళ్ళు ముగ్గురు.

నేను ఒక్కణ్ణి.

నేను తగ్గటంల్లో ఆశ్చర్యం లేదు. నా వయసు అటూ ఇటూ కాని వయసు. జుట్టు మూడువంతు ముగ్గుబుట్టగా మారింది. చిన్నవాళ్ళ గ్రూపులో చేరడానికి మనస్కరించదు. మరీ పెద్దవాళ్ళలో చేరితే ఇదీ వరస.

నేను ఆటలో చేతకాని వాణ్ణేమీకాదు. పది సంవత్సరాలకు పైగా అనుభవం ఉంది. ఆంధ్రదేశంలో తెనాలి "బ్రిడ్జి" ఆటకు చాలా ప్రసిద్ధి. అక్కడ హేమా హేమీలుండే వారు. నా ఆటకు పునాది అక్కడే. అలాంటివాళ్ళి చూస్తూ చూస్తూ ఆటలో అంత బ్లండర్ చేస్తానా? సమగ్రంగా పరిశీలిస్తే శివరామయ్యగారిదే తప్పు. బ్రిడ్జి ఆటలో ఫండమెంటల్స్ తెలిసినట్టు కనబడదు. వాళ్ళు ముగ్గురూ తామేదో గొప్ప ఆటగాళ్ళమని అనుకుంటూ ఉంటారు.

నాకు రైలు ప్రయాణాలన్నా, ఊళ్ళు తిరగడం అన్నా సరదా. ఏ ఊరు ట్రాన్స్‌ఫర్ చేస్తే ఆ ఊరు సంతోషంగా వెళ్ళడం అలవాటయిపోయింది. అన్ని ఊళ్ళు తిరగడంవల్ల ఎన్నిరకాల వ్యక్తులతోటో పరిచయం. ఒక్కొక్కప్పుడు స్నేహం కలగడం సంభవిస్తుంది. కొందరు తమాషా వ్యక్తులుంటారు. కొందరు గమ్మత్తు మనుషులు, నేను మితభాషి నవడంవల్ల స్నేహితులు, ఆప్తులు మాత్రం చాలా కొద్దిమంది ఉంటారు. ఏ ఊరు వెళ్ళినా చిన్నదో పెద్దదో "క్లబ్" అంటూ ఒకటి ఉంటుంది. సాయంత్రంపూట కాలక్షేపానికి కొంచెం సేపు టెన్నిస్, కొంచెంసేపు "బ్రిడ్జి" ఆడడం పరిపాటి. అక్కడే పరిచయాలూ స్నేహాలూ లభిస్తాయి... కొంతమంది దగ్గరకు వస్తారు. కొంతమంది మరీ దూరంగా ఉంటారు. ఎవరో వాళ్ళను వెలివేసినట్టుగా...

ఈ ఊరు వచ్చిన కొత్తలో "క్లబ్"లో చేరినప్పుడు అలా వెలివేసినట్టుగా ఉన్న వాళ్ళను చూశాను. వాళ్ళ టేబిల్ జన సమూహానికి చాలా దూరంగా ఉంటుంది. నలుగురుండవలసిన టేబిల్‌ను ముగ్గురే ఆక్రమించుకున్నారు. ఎప్పుడు చూసినా ఆ ముగ్గురే ఒక డమ్మీ సహాయంతో వాళ్ళు బ్రిడ్జి ఆడుతుండేవాళ్ళు. కొంచెంసేపు టెన్నిస్ కూడా ఆడేవాళ్ళు. వాళ్ళ టెన్నిస్ చూస్తే నాకు నవ్వు వచ్చేది. వధూవరులు పూలచెండు విసురుకున్నట్టుగా ఉండేది. వాళ్ళ ఆటలో మరొకరు చేరినట్టు కన్పించదు. శివరామయ్య గారూ రఘుపతి ఒకసారి ఆడేవారు. రఘుపతీ వరంధామయ్య ఒకసారి ఆడేవారు.

టెన్నిస్ ఆట ఏమాత్రం తెలిసిన వాళ్ళు కూడా, వాళ్ళు ఆడే ఆటని చూసి చూస్తూ చూస్తూ టెన్నిస్ అని అనలేరు.

ఒకరోజున మరో కోర్టులో నేను టెన్నిస్ ఆడి, బాగా అలసిపోయి లాన్‌లో కుర్చీలో కూర్చుని సిగరెట్టు తాగుతూ వాళ్ళను గమనిస్తున్నాను, వాళ్ళు ఆట అయిన తరువాత బ్రిడ్జికి ఉపక్రమించారు. వాళ్లు ముగ్గురే... ఆట ప్రారంభం అయింది... నా కెందుకో అక్కడకు వెళ్ళాలనిపించింది. అటే చూస్తూ లేచివెళ్ళే ప్రయత్నంలో ఉన్నాను. ఇంతలో నా పక్కన ఉన్న డాక్టర్ శర్మ... "అక్కడికెందుకెళ్తారు స్వామీ... అది భూతాల టేబిల్... వాళ్లవి కబంధ హస్తాలు. ఆ వలలో చిక్కుకున్నారంటే మళ్లీ బయటకు రాలేరు. వాళ్లో పెద్దబోర్" అన్నాడు.

"ఫరవాలేదులెండి... సరదాగా ఉంటుంది. వెళ్ళిచూస్తాను" అని బయలుదేరాను.

అలా బయలుదేరి వాళ్ళ వలలో చిక్కుకున్నాను. క్లబ్‌లో అనేక గ్రూపులు, గ్రూపుల్లో గ్రూపులు. ఎక్కడ చూసినా సందడిగా ఉంది. లాన్‌లో ఓ అరడజను మంది కూచుని సిగరెట్లు కాలుస్తూ గాసిప్ కొడ్తున్నారు. నవ్వులు... కేకలు, రాజకీయాల్లాంటి వేవో వినిపిస్తున్నాయి. మరో మూల రమ్మీ టేబిల్స్. అందరూ చాలా సీరియస్‌గా ఉన్నారు. సిగరెట్టు పొగమాత్రం దట్టంగా కప్పేసింది. జీవితంలో ఏదో అమూల్యమైనవి పోగొట్టుకున్నవాళ్ళ మాదిరి కొందరి బిక్కమొహాలు తొంగిచూస్తున్నాయి.

బిలియర్డ్స్ రూం సందడిగా ఉంది. అక్కడ మరీ పెద్దగా నవ్వులూ కేకలూ. అక్కడా గదంతా సిగరెట్టు పొగ ఆవరించింది. ఏ క్షణాన్నైనా వర్షించే కారుమేఘంలా, అక్కడివాళ్ళంతా చాలామంది కుర్రకారే... అప్పుడప్పుడు పెద్దగా మాటలు వినపడుతున్నై. టేబిల్ టెన్నిస్ రూంలో బంతి బల్లమీద భరతనాట్యం చేస్తున్నది. మృదంగం వాయిస్తున్నట్టుగా ఉంది. "గుడ్ షాట్" అని మధ్య మధ్య నవ్వులు. ఆడే వాళ్ళ శరీరాలు మెలికలు తిరుగుతున్నై...

వరండాలో ఓ మూల ఇద్దరు వ్యక్తులు ప్రపంచంతో తమకేమీ సంబంధం లేనట్టుగా చదరంగంలో మునిగి ఉన్నారు. మేం ధన్యులం అనుకుంటున్నట్టుగా ఉన్నాయి వాళ్ళ ముఖ కవళికలు.

మరికొంచెం దూరంలో శివరామయ్యగారి టేబిల్... మాటలు వినిపిస్తున్నాయి..

"ఆ రోజులే వేరు.. అయిదు రూపాయలు పారేస్తే బంగారు తీగెలు, బియ్యం బస్తా ఇంటికొచ్చిపడేది... అది స్వర్ణయుగం" అంటున్నారు శివరామయ్యగారు.

"బియ్యం అంటారేవిటి గుజం మూడణాలకు ఒకటోరకం మల్లు తాన్లకు తాన్లు. కోటేశం కొట్టుకు కబురు చేస్తే మూటకట్టి ఇంటికి పంపించేవాడు" రఘుపతి.

"అప్పటి నిజాయితీ ఏదండీ ఇప్పుడు" అంటున్నాడు పరంధామయ్య.

"అందుకేగా ఎవ్వరికీ ఓటు వెయ్యకుండా, నా వోటు నా దగ్గరే ఉంచుకుని వీళ్ళ రోగం కుదిరించాను" శివరామయ్య.

"అంత విలువైన ఓటు వీళ్ళకు వేసి వృథా చెయ్యడమా – వీళ్ళకు అర్హత ఉండద్దూ" రఘుపతి.

సంభాషణ మంచి పట్టులో ఉంది. నే వెళ్ళేటప్పటికి ఎవరికో తిట్లు, శాపనార్థాలు తగులుతున్నయి.

"మీ రివ్వాళ టెన్నిస్ బ్రహ్మాండంగా ఆదేరు" అంటున్నాడు పరంధామయ్య శివరామయ్యగారి నుద్దేశించి.

టెన్నిస్‌లో యోధానుయోధులైన టిల్డన్ గురించి, ఫ్రెడ పెర్రీని గురించి సంభాషణ మొదలయింది...

శివరామయ్యగారంటున్నారు... "ఈ కృష్ణన్, ముఖర్జీ, ప్రేమ్‌జిత్... వీళ్ళు కూడా ఒక ఆటగాళ్ళేనా..." అని.

"నా మొహం... చెప్పక చెప్పక వీళ్ళను గురించే చెప్పారూ... అయ్యో రామా... వాళ్ళ ఆట చూస్తుంటే నాకే సిగ్గుగా ఉంది.." అంటున్నాడు పరంధామయ్య.

"ఆ రోజుల్లో నేను సింగిల్స్ ఆడుతుంటే అసలు బంతి కన్పించేదిటండీ... యుద్ధరంగంలో అభిమన్యుడికి మల్లే చెండుకు తినేవాణ్ణి" శివరామయ్యగారి కామెంట్...

"బాగా చెప్పారు... ఇప్పటికి మాత్రం మీరేమైన తక్కువా... అని వంత "పలికాడు పరంధామయ్య...

డాక్టర్ శర్మ చెప్పినమాటలు నెమరు వేసుకుంటూ నెమ్మదిగా ఖాళీగా ఉన్న కుర్చీలో ఏదో తప్పు చేసినవాడిలా వాళ్ళ ముఖాల వంక చూస్తూ... కూర్చున్నాను. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. నేను కాలుస్తున్న సిగరెట్‌వైపు చూస్తున్నారు శివరామయ్యగారు. ఆ చూపులో కొంచెం కోపం కన్పిస్తున్నట్టుగా ఉంది...

"మా శివరామయ్యగారికి సిగరెట్టు పొగ పడదులెండి... ఎలర్జీ..." అన్నాడు రఘుపతి... చూస్తూ చూస్తూ కాలుస్తున్న సిగరెట్టును పారేయలేక... మూడువంతులు అయిన తరువాత పారేశాను...

"తమకు బ్రిడ్జిలో ఏమన్నా ప్రవేశముందా?" అన్నారు శివరామయ్యగారు.

"అంత ఎక్స్‌పర్టును కాననుకోండి... నాలుగో చేతికి పనికొస్తాను" అని వినయంగా చెప్పుకున్నాను.

"భేష్.. చేయి కలపండి" అన్నారు శివరామయ్యగారు... అలా పరిచయమైంది వాళ్ళతో... నిజంగానే వలలో చిక్కుకున్నాను. నన్ను వాళ్ళు వదలరు. నేను వాళ్ళను వదలను... శివరామయ్యగారంటే ఎందుకో ఆకర్షణ... పాతకాలం మనిషైనా అయిడలిస్ట్‌గా కన్పిస్తారు. జీవితంలో ఆయన అనుభవాలు కోకొల్లలు... ఒక్కొక్కప్పుడు ఆయన మాటలకు నవ్వు వస్తుంది. తను పెద్ద విట్టు వేశానని ఆయన అనుకుంటారు. ఇది కూడా ఓ విట్టేనా అని నాకు నవ్వు వస్తుంది. ఆ నవ్వుకు ఆయన మురిసిపోతారు.

"ఈ ఆల్కహాలికులను చూస్తే నాకు వళ్ళుమంట" అన్నారు శివరామయ్యగారు. ఓసారి... విరగబడి నవ్వేను. అందరూ నవ్వేరు.

  

రెవిన్యూ ఇలాకాలో ఇక్ష్వాకులకాలంలో చేరి కలెక్టరుగా, రిటైరయినారు శివరామయ్యగారు. స్వరాజ్యం వచ్చిన కొంతకాలానికి రిటైరయేముందు ఐ.ఏ.ఎస్. ఇచ్చారు. ఆయన ఇంటిముందు శివరామయ్య ఐ.ఏ.ఎస్. అనే బోర్డు ఉంటుంది. "మనకెందుకండీ స్వరాజ్యం. చాలా అనవసరం... డిసిప్లిన్ ఏదీ...?" అనే అర్థం స్ఫురించేట్టుగా మాట్లాడుతారు. "మనుషులంటే వాళ్ళేమనుషులు" అని దొరల సంగతి చెప్తూ ఉంటారు. రాబ్, మేర్గవాల్డ్, డఫ్, బీన్, కాటన్... ఇలాంటి కలెక్టర్ల పేర్లు

ఎప్పుడూ చెప్తూనే ఉంటారు. "ఏనాడో పుణ్యం చేసుకోబట్టి వాళ్ళదగ్గర పనిచేసే అదృష్టం కలిగింది" అన్నారొకసారి. "అబ్బ! ఎంత అదృష్టం" అనుకున్నాను.

"వానపాము కూడా పామేటండీ" అన్నారు. "ఇప్పటి కలెక్టర్లు బొద్దాడవి అర్భకులు, అయ్యోరాత."

ఇప్పటి ప్రభుత్వోద్యోగులు, మంత్రులు, ప్రభుత్వం, ఇంకా ఇలాంటివన్నీ ఆయన దృష్టిలో దిగదుడుపే.

"ఈ ప్రాజెక్టులేవిటి? ఈ పరిశ్రమలేవిటి... నా బొంద" అంటారు.

ఇతర దేశాల వస్తువులంటే మహామోజు. వాటి నాణ్యం వీటికెక్కడ ఉందండి? అంటారు.

ఉద్యోగులను గురించి విసుర్లు ఇంక చెప్పక్కర్లేదు. "లంచగొండితనం ప్రబలి పోయింది. అంతాలఫంగ్‌లు. మనదేశం బాగుపడదు. మన ఖర్మ" అంటారు.

"ఆ రోజుల్లో లంచగొండితనం లేదా" అని అడుగుదామనుకున్నాను. ఆయన్ను ఎదిరిద్దామంటే చచ్చేభయం.

ఎప్పుడు చెప్పినా మేడిన్ ఇంగ్లండ్ వస్తువులను గురించే చెప్తారు. "వాటికి చలనం ఎక్కడిదండీ" అంటారు. శివరామయ్యగారు బ్లేడ్ వాడరు. ఎప్పుడో నలభై ఏళ్ళ నాడు కొన్న మేడిన్ జర్మనీ మంగలి కత్తి ఉంది ఆయన దగ్గర. మంగలంటు పడకుండా స్వయంగా దాన్ని ఉపయోగిస్తారు. ఇంకా ఇలాంటి వస్తువులు బోలెడున్నాయి. అందులో కొన్ని బ్లాక్ బర్డ్ కలం, తళతళా మెరుస్తున్న క్రిమెంట్స్ గుండీలు మొదలైనవి.

'ఇంగ్లీషు పాప్లయిన్ ఎంతబాగుండేదనుకున్నారు. మనం చింపితే చినగాల్సిందేగాని, ఒక పట్టాన చినిగేదా. చాకలికి వేసే కొద్దీ మెరుగు ఎక్కువయ్యేది' అంటారు.

శివరామయ్యగారు ఓల్డ్ మెట్రిక్.

"అబ్బో! ఆ స్టాండర్డు వేరు. ఆ ఇంగ్లీషు వేరు. నేను డ్రాఫ్టు పుటప్ చేస్తే దొరలు గుమ్మయిపోయి అమాంతం కావలించుకునేంత పనిచేసేవారు. శివ్ రామ్యా యు ఆర్ ఎ స్మార్ట్ ఫెలో. అంటే ఎంత ఎంకరేజింగ్‌గా ఉండేది, ఒక రూపాయి

స్పెషల్ ఇంక్రిమెంటు ఇస్తూ, నా బుజం తట్టే కాటన్ దొర. నా వళ్లు పులకరించింది కాదుటండీ. ఆ రోజుల్లో రూపాయి ఇప్పటి వంద రూపాయలకు సమానం' అన్నారు.

నేను కళ్ళు పెద్దవి చేశాను.

శివరామయ్యగారు ఇంటరెస్టింగ్ మనిషే అనుకున్నాను.

ఆయనకు వర్తమానంతో పనిలేదు. భవిష్యత్తసలే లేదు. వర్తమానం ఆయన దృష్టిలో పల్లకాదు. "మనకు భవిష్యత్తేమిటి నా బొంద" అంటారు.

శివరామయ్యగారిలో కొంత రసికత్వం గూడా లేకపోలేదు. తన పెళ్ళినాటి సంగతులు చెప్తుంటాడు. ఆయన పెళ్ళానికి అప్పుడు తొమ్మిదేళ్ళట.

'ఆ రోజుల్లో భోగం మేళాలు మహా ఎంజాయబుల్‌గా ఉండేవి లెండి' అని పెద్దగా నవ్వేరు ఒకసారి.

ఆయన నవ్వితే మేమంతా తప్పక నవ్వితీరాలి. లేకపోతే చాలా ప్రమాదం.

మొత్తానికి ఆయన నా దృష్టిలో ఒక రకమైన ఆదర్శమూర్తిగా కన్పించారు.

"మీకు అరవైఏళ్ళు దాటినా, అంత వయసున్నట్టు కన్పించరు" అన్నానోసారి.

"ఈ కాలం తిండిలో బలమేదీ? వరి చెత్తేగా... నేను చూడండి నాకు డెబ్బై ఏళ్లంటే ఎవరన్నా నమ్ముతారా" అన్నారు జవాబుగా, చిన్న పొగడ్త చాలు మనిషికి బ్రహ్మానందం.

కొన్నాళ్ళ పరిచయంతో నాకు మొత్తింది. ఈ వలలోంచి తప్పించుకునే ప్రయత్నంలో ఉన్నాను, క్లబ్‌లో వాళ్ళు నన్ను కూడా వెలివేసినట్టే ఉన్నారనిపించింది.

  

కొన్నాళ్లకు ఆ ఊరునుండి బదిలీ అవడంతో వాళ్ల వలలోంచి బయటపడ్డాను. అమ్మయ్య అనుకున్నాను. కాని అప్పుడప్పుడు శివరామయ్యగారు జ్ఞాపకం వస్తూ ఉంటారు. భూతకాలం తప్ప వర్తమానం భవిష్యత్తులకు విలువ ఇవ్వని శివరామయ్యగారు నా కెందుకో ఓ వింత వ్యక్తిగా కన్పిస్తారు. ఆయనవల్ల ప్రయోజనం ఉంటే కూడా ఎవరికీ ఉపయోగపడని మనిషి. ఏళ్లు వచ్చి వయసు ఉడిగిన చెట్టు కూడా అంతో ఇంతో ఇతరులకు ఉపయోగపడుతుంది.

బదిలీ అయి వెళ్లిన ఊళ్లో మళ్లీ కొత్త పరిచయాలు కొత్త వ్యక్తులు-

అక్కడ క్లబ్‌లో మొదటిరోజే కలిగిన పరిచయం నాకెంతో ఆనందాన్నిచ్చింది. మనిషి నడివయస్సులోవాడు అజానుబాహువు. ఆరడుగులు పొడవైన మనిషి, నిండైన విగ్రహం. నడుస్తున్నా మాట్లాడుతున్నా చాలా హుందాగా ఉంటుంది. ఆయన కళ్ళల్లో బోలెడంత ఆకర్షణ ఉంది. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తుంటాడు. అతను బోడిగుండు చేయించుకుని కాషాయ వస్త్రాలు ధరిస్తే స్వామి శివానందలా ఉంటాడు. అంత వర్చస్సు ఎక్కడిదో! డార్క్ కలర్ టెర్లిన్ సూట్‌లో నాసర్‌ని జ్ఞప్తికి తెస్తాడు. పొందూరు ఖద్దరు దోవతి (దానికి ఎర్రరంగు రుద్రాక్ష అంచు జరీ). మోకాళ్ళవరకు లాల్చీ వేసుకుంటే కళకళలాడుతూ కాంగ్రెస్ ప్రెసిడెంటునే మరిపిస్తాడు. షెర్వాణీ వేసి నెత్తిని లాగుతొడిగితే ప్రిన్స్‌లా ఉంటాడు. వెనక నెహ్రూని గురించి దుస్తుల విషయంలో చాలా ఎక్కువగా చెప్పుకునేవారు. ఏ రకం దుస్తులు వేసినా గొప్ప పర్సనాలిటీ కన్పిస్తుందని, నా కెందుకో ఆ మాటలు స్ఫురణకు వచ్చినయి.

'నా పేరు సురేశ్. మీరు ఈ ఊరికి కొత్తగా ట్రాన్స్‌ఫరయి వచ్చినట్టుందే' అని నవ్వుతూ పలుకరించాడు పక్కన కూచున్నప్పుడు. ఆ చిరునవ్వులో బోలెడు ఆప్యాయత కన్పించింది. ఆ చిరునవ్వుకు కింది పెదవులు పై పెదవులు విడిపోకుండా కొంచెం పక్కకు సాగినై నాజూగ్గా. ఆ సుస్మితమైన పెదవుల కదలికకే - నా మీద పన్నీరు చల్లినట్లుగా హాయిగా ఉంది. చిరునవ్వు చాలా మందిలో చూశానుగాని ఈ చిరునవ్వులో నాకేదో ప్రత్యేకత కన్పించింది. నరాలన్నీ బిగబట్టి పెదిమలు సాగదీసినట్టుగా ఉంటుంది. కొంతమందిలో నవ్వినప్పుడు కళ్ళు ఎటోచూస్తయి. ఎందుకొచ్చిన ఖర్మరా అన్నట్టుగా ఉంటుంది. తెచ్చిపెట్టుకున్న 'హా! కోరి నోస్'లా ఉంటుంది. అది వేరు ఇది వేరు.

నవలలు చదవడంలో ఇంటరెస్ట్ ఉండడంవల్ల మేం ఇద్దరం మరీ దగ్గరకు వచ్చేం.

సురేశ్ చాలా పుస్తకాలు చదివినట్టు కన్పిస్తాడు.

సాయంత్రంపూట లాన్‌లో కూర్చున్నప్పుడు మంచి మంచి కథలు చెప్తాడు తను చదివిన నవలల్లోవి.

నేనూ చెప్తాను.

మా పరిచయం పుస్తకాలు ఎక్స్ఛేంజ్ చేసుకునే వరకూ వచ్చింది. ఒకరోజు లవ్‌ను గురించి చర్చవచ్చింది-ఒక నవలకు సంబంధించినది. ఎనలైజ్‌చేసి చక్కగా చెప్పన్నాడు.

"సెవన్ ఫేసెస్ ఆఫ్ లవ్ చదివారా?" అన్నాను. నే చదివిన ఆ పుస్తకాన్ని గురించి క్లుప్తంగా చెప్పాను. సురేశ్ ఎగిరి గంతేశాడు. "అది నాకివ్వండి. తప్పక చదువుతాను" అన్నాడు.

"ఈ మధ్య 'వ్యాలీ ఆఫ్ ది డాల్స్' అని ఒకటి చదివాను బ్రహ్మాండంగా ఉంది. సిక్స్ మిలియన్ కాపీస్ పోయాయట ఇప్పటికి. 'ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్' వాళ్ళు పిక్చరుగూడా తీస్తున్నారు... రేపు తెస్తాను. ఆ పుస్తకం మీరు చదవండి..." అన్నాడు సురేశ్...

నా ఆనందానికి మేరలేదు.

ఈ పుస్తకాల స్నేహంలో విచిత్రమైన అనుభూతి ఉంది.

పరిచయం స్నేహంగామారి, స్నేహంలో చనువుగూడా ఏర్పడ్డది. ఒక రోజున అన్నాడు – "పుస్తకాలద్వారా ఏర్పడ్డ స్నేహితులు నాకు చాలా కొద్దిమంది. ఆ మాట కొస్తే అసలు లేరనే చెప్పచ్చు. మిమ్మల్ని చూస్తే నాకు ప్రాణం లేచివచ్చింది" అనీ.

సామాన్యంగా సురేశ్ మితభాషిలా కన్పిస్తాడు. పుస్తకాల విషయంవస్తే మాత్రం అతనిదే పై చెయ్యి. క్లబ్‌లో పుస్తకాల గొడవ ఎవ్వరికీ అక్కర్లేదు.

"మా ఇంటికి రాగూడదటండీ? ఓ రోజు సాయంత్రం... కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేద్దాం" అన్నాడు ఓ రోజు.

"అంతకంటేనా? వస్తా" నన్నాను.

ఎడ్రస్ రాసిచ్చి గుర్తులు చెప్పేడు.

అనుకున్న ముహూర్తానికే వెళ్లాను.

నన్ను చూస్తూనే... "రండి, రండి... మీ కోసమే ఎదురుచూస్తున్నాను. ఇల్లు సులభంగా కనుక్కోగలిగేరా?" అంటూ లోపలికి తీసికెళ్ళాడు. మళ్ళీ అదే చిరునవ్వు

నాకు పెయింటింగ్ రాదుగాని... వస్తే అతని ప్రొఫైల్... ఆ చిరునవ్వు... రంగుల్లో కలిపితే ఎంత అందంగా ఉంటుందో! మోనాలిసాస్మైల్‌లా - సురేశ్‌స్మైల్ - అని పేరు పెట్టచ్చు...

సురేశ్ అప్పుడే స్నానం చేసి పొందూరు ఖద్దరు పంచె, లాల్చీ వేసుకుని, నుదుటి మీద పడుతున్న ఉంగరాలజుట్టు పైకి తోసుకుంటూ, శోభనపు పెళ్ళికొడుకల్లే కళకళలాడుతున్న ముఖకవళికలతో, "రండి ఇలా కూర్చుందాం..." అంటూ సోఫా చూపించాడు. అదివరకు నేను గమనించలేదు గాని అతని మెళ్ళో చాలా సన్నని ఒంటిపేట బంగారు గొలుసు - లాల్చీకి పై రెండు బొత్తాములు పెట్టుకోకుండా వదిలేయడంతో తళతళా మెరుస్తోంది. అసలే శరీరం బంగారు ఛాయ. ఆ ట్యూబ్‌లైటు ముందు పున్నమ చంద్రుడి లా వెలిగిపోతున్నాడు.

అది అతని స్టడీ రూంలా ఉంది. నలువైపులా అద్దాల బీరువాలు. వాటిల్లోంచి పుస్తకాలు తొంగిచూస్తున్నయి. మాట పలుకులేకుండా గోడలకు పటాలు, క్యాలండర్లు ఇలాంటివేమీ లేవు. ఓ పెర్షియన్ కార్పెట్. రెండు సోఫాలు, ఒక ఈజీఛైర్, దాని పక్కనే సుమారు నాలుగైదు అడుగుల ఎత్తున నిల్చుని ఉన్న రీడింగ్ ల్యాంప్, ఆ రీడింగ్ ల్యాంప్ చాలా ఆకర్షణీయంగా ఆర్టిస్టిక్‌గా ఉంది. నాగుపాము పడగ ఎత్తి నిల్చున్నట్టుగా - మత్స్య కన్నె వయ్యారంగా నిల్చుని, ఈజీ ఛైర్‌లో పడుకుని చదువుకుంటున్న వాళ్ళముఖంలోకి తొంగిచూస్తూ ముద్దుపెట్టుకున్నట్టుగా... ఆ భంగిమలో ఉంది. సురేశ్‌కి మంచి ఈస్తటిక్ సెన్స్ ఉన్నట్టుంది, సోఫాలకు మధ్య చిన్న చిన్న టీపాయిస్ ఉన్నాయి. ఒక మూల టెలిఫోన్ ఉంది. మేడమీద మారుమూల గది. నిశ్శబ్ద ప్రశాంత వాతావరణం. ఆ గదిలో కూచుంటేనే హాయిగా ఉంది.

"ఈ రోజు చాలా శుభదినం..."

"అదేవిటి అలా అంటున్నారు".

"మీరు మా యింటికి రావడమే... సాధారణంగా ఇంటికెవరినీ పిలవను. ఎవరూ రారు... మీలో గొప్ప ఆకర్షణేదో ఉంది".

ఇలా ప్రారంభం అయింది మా సంభాషణ.

'ప్రతి మనిషిలోనూ మాగ్నెటిక్ వేవ్స్ ఉంటయి. మనిద్దరిలో ఆ వేవ్స్ ఉన్నట్టుండి కలుసుకున్నాయి... పూర్వజన్మలో మనిద్దరం చాలా దగ్గర వాళ్ళమై ఉండాలి' అన్నాడు సురేశ్...

ఇంతలో నౌకరు కుర్రాడు ట్రేలో పకోడీలు, చిప్స్, కాష్యునట్స్, మిక్చెర్ తీసుకొచ్చి సెంటర్ టేబుల్‌లో ఉంచాడు. మెట్లమీంచి నౌకరు కుర్రాడు గబగబా కిందికి దిగివెళ్తున్న చప్పుడు. మరో అయిదు నిమిషాల్లో మళ్లీ ప్రత్యక్షం అయ్యాడు. ఈసారి అతనిచేతిలో ఓ సీసా, రెండు గ్లాసులు అయిస్ ఫ్లాస్కో ఉన్నయి. అవి బల్లమీద ఉంచి మళ్లీ వెళ్ళాడు. అతను మెట్లు దిగి వెళ్తుంటే మ్యూజికల్‌గా, మృదంగం వాయించినట్టుంది.

"మీకేం అభ్యంతరం లేదనుకుంటాను" అంటూ ఓపెనర్‌తో సీసా కార్క్ తీసి రెండు గ్లాసుల్లోను పోశాడు సురేశ్...

"అంతగా అలవాటు లేదనుకోండి. కాని కంపెనీకోసం తప్పక గ్లాసులు కలుపుతాను" అంటూ సోడాలు రెండు తీసుకుని ఓపెన్ చేసి ఆ గ్లాసుల్లో పోశాను. సురేశ్ అయిస్ క్యూబ్స్ తీసుకుని రెండు గ్లాసుల్లోను రెండు వేశాడు. ఇద్దరు స్నేహితులు దగ్గర దగ్గరగా భోజనానికి కూచుని ఒకరికొకరు వడ్డించుకున్నట్టుగా ఉంది. ఒకరు కూర వేయడం, ఒకరు నెయ్యి వెయ్యడం, ఒకరు పప్పు వెయ్యడం – ఇలా రెండు చేతులూ కలిస్తే భోజన పదార్థాలన్నీ ప్లేట్లలో సిద్ధం, భోజనం రెడీ – అలాగే గ్లాసుల్లో పదార్థం రెడీ–

"త్రీ చియర్స్" అని సురేశ్ గ్లాసు ఎత్తేడు.

మా ఇద్దరి గ్లాసులూ కలిసినై.

ఇద్దరమూ ఒక్కసారి సిప్ చేసి బల్లమీద ఉంచాం గ్లాసులు. గ్లాసుల్లో ద్రావకం మట్టం చాలా కొద్దిగా తగ్గింది.

"పకోడీలు తీసుకోండి" అంటూ ఆ ప్లేటును నా కందించాడు సురేశ్.

"ఇంత ట్యూబ్‌లైట్ ఎందుకూ? మనం మాట్లాడుకుంటుంటే ఈ లైటు మన వైపు భయంకరంగా చూస్తున్నట్లుంటుంది" అంటూ ఆ లైట్ ఆఫ్‌చేసి మరో డిమ్‌లైట్ వేశాడు సురేశ్. ఆ లైటు వెలుతురు ఆకుపచ్చ రంగులో హాయిగా వేపచెట్టు నీడలా ఉంది.

"మీకు గుత్తివంకాయ కూర ఇష్టమే కదూ? మన భోజనంలో ఇవాళ అదే స్పెషల్ డిష్ - మా వాడు అది తయారు చేయడంలో గట్టివాడులెండి" అన్నాడు సురేశ్.

సెకండ్ రౌండ్ అయ్యేటప్పటికి సంభాషణ జీవితం మీదికీ, సాహిత్యం మీదికీ మళ్ళింది.

"అసలు జీవితంలో ఏం సాధించాలని ప్రతివాడూ తాపత్రయ పడుతుంటాడు" అన్నాడు సురేశ్.

"ఆ మాటకొస్తే ఈ తాపత్రయం ఎవ్వరిలో కనపడదు. భూమ్మీద పుట్టాం గనుక బతికుండడం ఓ విధిగా యంత్రంలా జీవితం సాగించడం తప్ప" అన్నాను.

"గార్డెనర్? ది ఇండివిద్యుయల్ అండ్ టుడేస్ వరల్డ్" చదివారా?

"లేదు"

"పోనీ రస్సెల్?, ఎడ్యుకేషన్ అండ్ గుడ్ వరల్డ్‌లో సొసైటీలో ఇండివిద్యుయల్ కున్న పాత్రను గురించి బాగా రాశాడు."

"అవునవు" నన్నాను. ఆ పుస్తకం చాలా రోజులక్రితం చదివాను. నాకు చాలా నచ్చింది" అన్నాను.

ఈ చిప్స్ తీసుకుందాం అని ఆ ప్లేటు ముందుకు జరిపేడు. నా సిగరెట్టు వెలిగించి తన సిగరెట్టు వెలిగించుకున్నాడు.

"ఒక దేశం భవిష్యత్తును, ఆ మాటకొస్తే ప్రపంచం భవిష్యత్తును, రూపు రేఖలను, మానవ కళ్యాణంకోసం మలచే శక్తి, ఒక్కవ్యక్తిలో ఉండే అవకాశాలున్నయి. కాదంటే అతని వ్యక్తిత్వం మీద ఆధారపడి ఉంటుంది - ఒక ఇండివిద్యుయల్ సమర్థత ఎంతైనా చేయగలదు".

ఈ మాటలు నాకు చాలా నచ్చినయి.

"వ్యక్తి మానసికంగా పెరిగినప్పుడే అది సంభవిస్తుంది. పెరగడానికి తగిన వాతావరణం సృష్టించుకోవాలి" అన్నాను.

ఆ తర్వాత మేరేటి, మోరల్స్ మీదికి వెళ్ళింది సంభాషణ.

మూడో రౌండ్ నడుస్తున్నది. గ్లాసుల్లో ద్రావకం పాదరసంలా కదుల్తున్నది.

నా కంతగా అలవాటు లేకపోవడం మూలాన మూడో రౌండుకే – ఏ లోకానికో వెళ్ళినట్టుగా ఉంది.

సురేశ్ కళ్ళు జ్యోతులల్లే ఎర్రపడుతున్నా తాపీగానే మాట్లాడుతున్నాడు. మనిషి మొత్తానికి టాప్‌లోనే ఉన్నాడు.

హక్స్‌లీ "జీనియస్ అండ్ ది గాడెస్" ప్రొఫెసర్ కథ ప్రారంభించాడు. అది నేనూ చదివేనుగాని సురేశ్ చెప్పే విధానంలో ఓ ప్రత్యేకత ఉంది. అతను చెప్తుంటే నవల మళ్ళీ చదివినట్టే ఉంది. చదివినప్పుడు నాకు తట్టని కొన్ని యాంగిల్స్ నుండి చెప్తున్నాడు. కథ మంచి పట్టులో ఉంది. ప్రొఫెసర్ భార్య, ప్రొఫెసర్ దగ్గర పని నేర్చుకుంటున్న అసిస్టెంట్, వాళ్ళిద్దరిమధ్య ప్రణయం. ఆమె అతని పక్కలో దూరడం, చాల గమ్మత్తుగా వర్ణిస్తున్నాడు.

ఆ వాతావరణంలో అలాంటి ఘట్టాలే ఇంటరెస్టింగ్‌గా ఉంటయి. ఏ లోకంలోనో ఉన్న నాకు భలేహాయిగా ఉంది...

క్షణంలో సగం.

నే కూర్చున్న సోఫా తమాషాగా కదిలినట్టు – అటూ ఇటూ ఒరిగినట్టుగా ఉంది. కిటికీలు టపటప కొట్టుకుంటున్నయి... ఇదేం భూతాలకొంప కాదు కదా అనుకున్నాను.

సురేశ్ సోడాకోసం కుర్చీలోంచి లేచి తూలి పడబోయినాడు. మేడంతా అదిరి దడదడమన్నది.

లైటు ఆరిపోయింది.

గాఢాంధకారం...

నేనెందుకో వణుకుతున్నాను...

"ఇది భూకంపమండోయ్..." అన్నాడు సురేశ్...

సిగరెట్టు వెలుగులో సురేశ్ ముఖం లీలగా కన్పిస్తున్నది...

బాల్కనీ దాకా వెళ్ళి బయట చూశాం. చిక్కని చీకటి – పులుముకున్నది, చాలా మంది జనం నక్షత్రాల వెలుగులో రోడ్ల మీద అటూ ఇటూ పరుగెత్తుతున్నారు.

ఇది భూకంపమేనని అప్పటికి గాని నిర్ధారణకు రాలేదు. నా కెందుకో ఆ సమయంలో శివరామయ్యగారు జ్ఞాపకానికి వచ్చేరు... 'ఇదేం భూకంపం అండీ చచ్చు భూకంపం... అబ్బే... మా రోజుల్లో...' అనేవాడు.

"ట్రిమర్ తగ్గిపోయింది లెండి. రండి రండి కూర్చుందాం" అన్నాడు సురేశ్.

తడుముకుంటూ లోపలికి వెళ్ళి ఎవరి స్థానాల్లో వాళ్ళు కూర్చున్నాం.

బల్లమీద సిగరెట్ల ప్యాకెట్ కోసం వేళ్ళు జాపితే గ్లాసు తగిలి వొలికిపోయింది. సురేశ్ అగ్గిపుల్ల వెలిగించి ఆ వెలుతుర్లో ఫోన్ దగ్గిరకు వెళ్ళి పి.టి.ఐ.కి ఫోన్ చేస్తున్నాడు.

మళ్ళీ వచ్చి కూర్చున్నాడు.

"మేడ దడదడ లాడడం – నేను సోఫాలోంచి గమ్మత్తుగా కదలడం గమనించాను. కాని ఇది భూకంపమని అనుకోనేలేదు. వెంటనే మనంకూడా కిందికి వెళ్ళిపోవలసింది" అన్నాను.

"వెళ్లేలోపల మేడకూలితే" అని నవ్వేడు సురేశ్.

"మళ్ళీ ఈసారివస్తే – మనిద్దరి శవాలు ఈ డెబ్రిస్‌లోంచి బయటకు లాగడానికి వాళ్ళ దుంపతెగుతుంది" అన్నాను.

"అసలు చావంటే భయంకన్నా, చచ్చిపోయిన తరువాత పెళ్ళాం బిడ్డలూ ఏమవుతారోనన్న భయం జాస్తి మనిషికి. వెలుగుతున్న దీపం ఆరిపోతే – దీపానికేం భయం? ఆరిపోవడంవల్ల ఇతరులకు చీకటవుతుందని ఆందోళన – అందుకే ఆరిపోయే ముందు రెపరెప కొట్టుకుని గిజగిజ తన్నుకుంటుంది" అన్నాడు సురేశ్ తాపీగా–

"ఉన్నట్టుండి చచ్చిపోతే – చచ్చినవాడి మీద సానుభూతి తాత్కాలికంగా ఉన్నా పెళ్ళాం పిల్లల్ని నడిసముద్రంలో ముంచి వెళ్ళాడని తిట్టిపోస్తారు" అన్నాను.

మా సంభాషణ ప్రణయ ఘట్టంలోంచి మృత్యుఘట్టంలోకి దూకింది.

"కొంతమంది సంతోషంగా హాయిగా నవ్వుతూ కన్నుమూస్తారు. ఆ చావు చాలా గ్రేస్‌ఫుల్‌గా ఉంటుంది. అయినా నాకెవ్వరూ లేరులెండి. ఏకాకిని, నే చచ్చిపోతే

"అయ్యో పాపం అనేవాళ్ళు బహుకొద్దిమంది ఉంటారు మీలాంటి మంచి స్నేహితులెవరో" అన్నాడు సురేశ్.

"మీరలాంటి మాటలనకండి. నాకు చాలా బాధగా ఉంటుంది. ఎప్పుడో వచ్చే చావును గురించి ఊహించుకుని ఇలా సినికల్‌గా అనుకోడం ఎందుకు? ఏదన్నా ఇంటరెస్టింగ్ కథ చెప్పరూ" అన్నాను.

అప్పటికే మా ఇద్దరి గ్లాసులూ ఖాళీ, అగ్గిపుల్ల వెలిగించి సీసా నందుకున్నాడు. గ్లాసుల్లో పోస్తుంటే అగ్గిపుల్ల ఆరిపోయింది. దాని బతుకెంత? క్షణం. నేను మరో అగ్గిపుల్ల వెలిగించాను. సోడాలు, ఐస్, అన్ని పదార్థాలు తయారయినై.

సిప్ చేసి గ్లాసు బల్లమీద ఉంచి "ఇప్పుడు వినండి" అన్నాడు సురేశ్.

గదిలో చీకటి. బయట చీకటి.

మా ఇద్దరి సిగరెట్ల వెలుగులో గదిలోని వస్తువులు, సురేశ్ మెళ్లోని సన్నని గొలుసు, అతడు వేసుకున్న తెల్లని లాల్చీ. అతని కళ్ళల్లోని నల్లపాప లీలగా కన్పిస్తున్నాయి.

"పూర్వం రాజులూ యువరాజులూ, జమీందారులూ ఊళ్ళు ఏలుతున్న రోజుల్లో మంగమ్మ అని ఒకావిడ ఉండేది. చాలా అందమైంది. కాకినాడ దగ్గర ఏదో చిన్న ఊరు. ఆమెకు పదహారోఏట ఒక యువరాజావారు కన్నె చెరవిడిపించారు. మంగమ్మ దేవదాసి. వంశపారంపర్యా వస్తున్న వృత్తి గనుక ఇదెవరూ తప్పుగా అనుకునే వారు కారు. ఆమె బంగారు బొమ్మ. చిదిమి దీపం పెట్టచ్చు... బోలెడంత నిజాయితీగల మనిషి.. సంగీతం పాడేది. జావళీలు ఆమె స్పెషాలిటీ–

"తరువాత కొన్నాళ్ళకు యువరాజావారు కన్ను మూశారు. మంగమ్మ చాలా దుఃఖించింది.

"ఆ తరువాత ఎవరో ఆమెను దగ్గర తీశారు... ఆ రోజుల్లో అలా దగ్గర తీయడాన్ని ఉంచుకోవడం అనేవారట...

"ఆయన అప్పటి ప్రభుత్వంలో చిన్న ఉద్యోగి. ఏం ఉద్యోగమో తెలియదుగాని మొత్తానికి రెండుచేతులా గడించేవాడట. "లంచాలు తిని ఇలా సంపాయిస్తున్నారు. ఇది తగనిపని" అని మంగమ్మ మందలించేదట అప్పుడప్పుడు.

"మంగా! నీకు తెలియదు ఊరుకో" అంటూ ఆవిణ్ణి ఎత్తుకునేవాడు.

"ముద్దుపెట్టుకోపోతే – "అబ్బా. కంపు ఈ తాగుడు మానేద్దురూ" అనేదట.

"దాంట్లో మజా నీకేం తెలుసులే" అంటూ ఆమె నిమ్నోన్నతాలు సుకుమారంగా పరిశీలించేవాడట.

"ఏమైనా మంగమ్మ అతన్ని నమ్ముకుంది. ఆ తరువాత కొన్నాళ్లకు మంగమ్మ తల్లి కాబోతున్న సూచనలు కన్పించినయి. ట్రాన్స్‌ఫర్ అయిందని ఆ ఊరునుంచి ఉడాయించాడు. పత్తాలేడు మంగమ్మ వంటరిదయిపోయింది. సూరయ్యపుట్టాడు. మంగమ్మకు సూర్యుడు ప్రత్యక్షదైవమనే ఏదో పిచ్చి నమ్మకం ఉంది. సూరయ్య పెరిగి పెద్దవాడవుతున్నాడు. ఆ పరిస్థితుల్లో మంగమ్మ బజార్న పట్టంలో ఆశ్చర్యం లేదు... విటుల రాకపోకలు ఎక్కువైనై... వయసు పొంకం బిగువు ఎన్నాళ్ళుంటుంది? అది నడలిన తరువాత మంగమ్మ వంటరిదయింది. ఆమె వయసు ఏమంత ఎక్కువ కాకపోయినా వృద్ధాప్యం భూతంలా ఆమె మీద విరుచుకుపడ్డది. ఆ దెబ్బకు తట్టుకుని లేచి నీరసంగా నిలబడగలిగింది. కసిగా నిల్చున్నది. పగబట్టిన కోడెత్రాచై నిల్చున్నది".

"కాశీ మజిలీలో కథలా చెప్తున్నాడు సురేశ్...

గ్లాసులు ఖాళీ...

మళ్ళీ అగ్గిపుల్లల వెలుతురు.

సీసాలోని పదార్థం గ్లాసులో పరిగింది.

సోడాలు... ఐస్...

సురేశ్ కళ్ళు రక్తపు బంతులల్లే ఉన్నయి... మనిషి జోరుగా మాట్లాడుతున్నాడు గాని నాలిక మడతబడి మాటలు తడబడుతున్నై...

"సూరయ్యకు యుక్తవయసు రావడం మానదు గదా... రోజులు గడుస్తున్నాయి కాబట్టి... మంగమ్మ మకాం పట్నవాసం మార్చింది. అది మహాపట్నం... సూరయ్య బాగా తయారవుతున్నాడు. అలా తయారు చేసింది మంగమ్మ. ప్రతిరోజూ గుప్పెడు బాదంపప్పు తినేవాడు. కండలు పెంచాడు. వయసు చిన్నదయినా రాక్షసుడిలా తయారైనాడు. మంగమ్మ శరీరఛాయ, అందం పుణికిపుచ్చుకున్నాడు సూరయ్య.

మంగమ్మ పట్నం అంతా ఒకటి రెండుసార్లు సర్వేచేసింది. వయసులో ఉండి పెళ్ళికాని అందమైన ఆడపిల్లలు చాలా మంది కన్పించారు. కొంతమంది ఉద్యోగాలు చేసేవాళ్ళు... చదువుకునేవాళ్ళు... కొంతమంది భర్తలుపోయినవాళ్లు... అనేక రకాలు.

మంగమ్మ ఈ కళలో ఆరితేరిన ఘటం. ఎవరినైనా ఇట్టే ఆకట్టుకుంటుంది.

మంగమ్మ రోడ్డుమీద వెళ్తుంటే ఎవరూ ఆమెని అనుమానించరు. ఒక్కొక్కప్పుడు పెద్దపెద్ద ఆఫీసుల్లోకి నేరుగా వెళుతుంది. ఆడపిల్లలతో మాట్లాడుతుంటే వాళ్ళ బంధువులేమోనని పక్కవాళ్ళుగూడా అనుకునేట్టుగా ఉంటుంది. ఇందులో తప్పేముంది? వాళ్ళకు మాత్రం మగవాసన తగలకపోతే ఎట్లా పాపం అని వాళ్ళమీద జాలిపడేది.

వారంలో ఏడురోజులూ రోజుకు ఒకరు వస్తుండేవారు మంగమ్మ ఇంటికి. వాళ్ళందరికీ సూరయ్య తృప్తిగా జవాబు చెప్పి పంపేవాడు. మంగమ్మ తలపెట్టిన ఎక్స్పరిమెంట్ సక్సెస్ అయింది. వచ్చినవాళ్ళెవరికీ సూరయ్య మంగమ్మ కొడుకని తెలియనిచ్చేది కాదు. పాపం వాళ్ళేదో కష్టాల్లో ఉన్నారు. వాళ్ళకు సహాయ పడుతున్నట్టుగా నటించేది. మంగమ్మ చూస్తే చాలా హైక్లాస్ మనిషిలా ఉండేది. దానికి తగినట్లుగానే పారితోషికం ముట్టేది.

సూరయ్య ఆరోగ్యవంతుడూ రసికుడూ అవడంవల్ల రేటు పెరిగింది. కస్టమర్స్ పెరిగారు. ఊళ్ళో మంగమ్మ పరపతి పెరిగింది... మంగమ్మని, అత్తయ్య అని, పిన్ని అని, అమ్మమ్మ అని, అనేక రకాలుగా పిల్చేవారు. ఆ రోజుల్లోనే ఎక్కడో టీచరుగా చేస్తున్న గంగాభాగీరథి ఒకామె. ప్రౌఢ, సకేశి సూరయ్యకు చదువుగూడా నూరిపోసేది... అన్నివిధాలా సూరయ్య జీవితం బాగానే వుంది. మందులు, ఇంజక్షన్సూ, టానిక్ లూ తీసుకుని ఆరోగ్యాన్ని కాపాడుకుంటూనే ఉన్నాడు. శని ఆదివారాల్లో ఒకరోజు పాపం... అయిదారుగురికి సమాధానం చెప్పవలసి వచ్చినప్పుడు ఉక్కిరి బిక్కిరి అయినాడు..."

సూరయ్యను చూస్తే నాకు జాలేసింది... ఎంత చెడ్డా మామూలు మనిషేగా? రాక్షసుడు కాదుగా...

ఇంకా లైట్లు రాలేదు?

పళ్ళీ మేడ దడదడ లాడినట్లయింది. గబగబ చెప్తున్నాడు సురేశ్...

"ముగించేస్తాను, ఈ గ్లాసు పుచ్చుకోండి" అన్నాడు.

గ్లాసులు పుచ్చుకుంటూనే ఉన్నాం.

అగ్గిపుల్లలు వెలుగుతునే ఉన్నయి...

"టూకీగా చెప్పాలి... మళ్ళీ భూకంపం వచ్చేలోగా..." అంటూ మొదలెట్టాడు.

"మంగమ్మ నెవరోపిల్చారు. ఉన్నట్టుండి ఒకరోజు హాయిగా, ప్రశాంతంగా నవ్వుతూ కన్నుమూసింది. ప్రాణం పోకడ, వానరాకడ తెలియదంటారు. కాని ఆమెకు తెలుసు... సూరయ్యను దగ్గరకు పిలిచింది – "నీవు నాకు తల్లివి... తండ్రి ఎవరో ఇంత వరకూ చెప్పలేదు. ఇప్పుడైనా చెప్పమ్మా – ఎక్కడున్నానరే వెతికి అయన్ని కలుసుకుంటాను" అన్నాడు.

ఆయన పేరు నీకనవసరం... ఆయన ఉనికి నాకే తెలియదు. ఈపాటికి ఆయన కూడా చచ్చిపోయే ఉండవచ్చు... నీ జీవితం ఎప్పుడూ ఇలాగే ఉండగూడదు. నీవో మనిషిగా బతకాలి. గతం అంతా ఒక కల అనుకో... అంటూ నన్నటి ఒంటిపేట గొలుసు సూరయ్య మెళ్లోవేసింది. ఇదే నీకు శ్రీరామరక్ష. నాకు వారిచ్చిన కానుక ఇది. కాటన్ అనే దొరగారెవరో ఆయనకు బహూకరించారట ఇది. అందుచేత ఇది చాలా విలువైనది..." అని అన్నది.

మంగమ్మ చచ్చిపోయింది. సూరయ్య మకాం మార్చాడు. గత జీవితం వలలోంచి బయటపడి మనిషై బతుకుతున్నాడు... కథ కంచికి... అన్నాడు సురేశ్... లాల్చీ గుండీలు పెట్టుకుంటూ.

ఇంకా లైట్లు రాలేదు.

సీసాఖాళీ అయింది.

సురేశ్ కళ్ళు నెత్తురు కక్కుతున్నై... తూలుతున్నాడు.

"లెటస్ డ్రైవ్ ది డేవిల్ అవుట్" అంటూ అగ్గిపుల్ల వెలిగించి సీసాలో పడేశాడు. మంట భగ్గునవచ్చి "టప్" మని ఆరిపోయింది.

శివరామయ్యగారు కాదు గాదు జ్ఞాపకం వచ్చాడు. స్కౌండ్రెల్... ఖిలీఫెలో వాడో పెద్దడేవిల్... భూతంగాడు అనుకున్నాను.

ఇద్దరం మళ్ళీ సిగరెట్లు ముట్టించాం.

"ఇవ్వాళ వండర్‌ఫుల్‌గా గడచిపోయింది... నా జీవితంలో మరవురాని దినం – మంచి అనుభూతి... మీరు చెప్పిన మంగమ్మకథ... పాపం ఆవిడ ధన్యురాలు– ఈ మధ్యలో వచ్చిన భూకంపం.... గ్లాసులు... సీసాలు... పకోడీలు... రియల్లీ వండర్‌ఫుల్..." అంటూ సురేశ్‌ను కావలించుకున్నాను.

ఇంతలో లైట్లు వచ్చినయి...

"భోజనానికి లేద్దాం, పదండి" అంటూ డైనింగ్ రూంవైపు దారితీశాడు. సురేశ్ వెనకాలే నేనూ...

*'జ్యోతి' దీపావళి ప్రత్యేక సంచిక*

# 5

# స్టోన్ హౌస్

భాగ్యనగరంలో ఖరీదైన కాలనీలు చాలా ఉన్నాయి. అలాంటి ఒక కాలనీ చిన్న చిన్న కొండలమీద ఉంది. ఆ ప్రదేశం అంతా ఎత్తుపల్లాలు. ఎక్కడ చూసినా పెద్ద పెద్ద చెట్లు. చెట్ల చాటున, గుట్టలమీద, చిన్న చిన్న కొండలమీద అందమైన ఇళ్ళు. భూమి చదునుగా ఉన్న చోట ఇళ్ల ఒక క్రమంలో వరుసగా ఉంటయి. ఎత్తు ప్రదేశాలలో ఇళ్ళు అక్కడక్కడా విసిరేసినట్లుగా ఉంటయి. మరీ లోయలు అనబడే ప్రదేశాల్లో ఇళ్ల కట్టరు. పల్లంగా ఉన్నచోట వర్షానికి నీళ్ల నిలిచి చిన్న చిన్న తటాకాలుగా ఏర్పడతాయి. ఒకవైపు లోయలో శ్మశానం ఉంది. ఆ శ్మశానం ఏనాటిదో? ఈ కాలనీ పుట్టకముందునుండి ఉన్నది. ఇప్పుడు బాగా ఏపుగా పెరిగి చీమదూరని సందులేకుండా సమాధులతో నిండిపోయింది. అక్కడ ఊడదిగిన పెద్దమర్రి చెట్టు, పెద్ద వేపచెట్టు ఇంకా అనేక రకాలయిన చెట్లతో చల్లగా ప్రశాంతంగా ఉంది. ఆ చల్లని ప్రదేశంలో ఎంతో మంది సుఖంగా, అందంగా ఆకర్షణీయంగా ఉండే సమాధుల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఈ ప్రదేశం ఒక తటాకానికి ఆనుకుని ఉంది. తటాకానికి అవలి ఒడ్డు అంతా రాళ్ళూ గుట్టలూ, చిన్న చిన్న కొండలు. అలాంటి ఒక చిన్న కొండమీద పెద్ద ఇల్లు. రెండంతస్తుల మేడ. కింది భాగానికి గ్రే కలర్. పై భాగానికి క్రీమ్ కలర్. ఆ మేడ చుట్టూ అద్దాల కిటికీలు. కిటికీలకు ఉదారంగు కర్టెన్స్. ఆ మేడచుట్టూ విపరీతమైన చెట్లు. ఎక్కడో దూరాన్నించి చూస్తే ఇంటి పై భాగం మాత్రమే కన్పిస్తుంది. రాత్రిపూట ఈ కాలనీ చూస్తే ఎత్తు పల్లాలలోని ఇళ్ళల్లోని లైట్లన్నీ తమాషాగా మణిదీపాల మాలల్లా కన్పిస్తాయి. ఆ కాలనీలో ఎప్పుడూ భయంకరమైన నిశ్శబ్దం తాండవిస్తూ ఉంటుంది. కాలనీలోని రోడ్లమీద వెళ్తున్న కార్ల శబ్దం మాత్రం వికారంగా ఉంటుంది.

ఆ చిన్న కొండమీదున్న మేడపేరు స్టోన్ హౌస్!

ఆ రోజు ఆదివారం. ఉదయం తొమ్మిదిగంటలు దాటింది. ఒక్క లలిత తప్ప ఆ ఇంట్లో ఇంకా ఎవ్వరు నిద్రలేవలేదు. లలిత ఆ ఇంటి ఇల్లాలు. నలభయ్యోపడిలో ఉన్న మనిషి. ఆమె సూర్యోదయం కాకమునుపే నిద్రలేచి తన కార్యక్రమం సుమారు రెండుగంటలలో ముగించుకుంటుంది. ఆమెకు చిన్నప్పటినుండీ అధ్యాత్మిక చింతన జాస్తి. లలితా సహస్ర నామం, భగవద్గీత, ఇంకా కొన్ని దేవతలను గురించిన స్తోత్రాలు మొదలైనవి చదువుకోవడం అలవాటు. ఆమె ఇన్ని చేస్తున్నా కూడా, ఆమె ముఖకవళికలు చూస్తే మనశ్శాంతి లేక ఏదో బాధపడుతున్నట్టుగా కన్పిస్తుంది. ఐహిక సుఖాలకు మాత్రం ఏ లోటు లేదు ఆమెకు. భర్త ప్రముఖ వ్యాపారవేత్త. రెండుచేతులా ఆర్జిస్తున్నాడు. లలిత ఒక కిటికీ దగ్గర నిల్చుని ఉదయం సాయంత్రం కొంతసేపు గడుపుతుంది. ఎందుకో ఏమో తెలియదు గాని ఒంటరితనం ఆమెను దెయ్యంలా వెంబడిస్తున్నట్టుంటుంది.

ఆ ఇంట్లో రెండు బెడ్‌రూమ్స్, ఒక గెస్ట్ రూమ్, పెద్ద డ్రాయింగ్ రూమ్. ఇంకా పెద్ద పెద్ద ఇళ్ళకు ఉండవలసిన లక్షణాలున్నాయి. ఒక్కొక్కప్పుడు ఆ ఇల్లు ఒక ఫిల్మ్ స్టూడియోలా ఉందేమో అనిపిస్తుంది. ఫాల్స్ అర్చెస్, నిలువెత్తు ప్లాస్టిక్ పూలూ, ప్లాస్టింగ్ పక్షులు, ఒక ఆర్టిఫిషియల్ ఫౌంటేన్, ఖరీదైన కార్పెట్స్, పెర్షియన్ రగ్, వాటిమీద రంగురంగుల బొమ్మలు, బొమ్మల్లో ఈజిప్ట్ సంస్కృతిని తెలియచేసే పిరమిడ్స్, పడుకుని ఉన్న సింహాలు ఇంకా ఎన్నో. ఇవి కాక పులి చర్మాలు, కొన్ని తలకాయతో సహా గోడలకు తగిలించి ఉన్నాయి. డ్రాయింగ్ రూమ్‌లో నాలుగు మూలలా నాలుగు నగ్న శిల్పాలు. ఆ శిల్పాలకు అక్కడక్కడ చిన్నచిన్న బల్బులు. రాత్రిపూట అవి వెలుగుతూ ఆరుతూ ఉంటయి. సోఫాలవిషయం చెప్పనక్కరలేదు. ఆధునిక నాగరికత అంతా ఉట్టిపడేట్టుగా ఉన్నయి. 'గోల్డ్ బ్రాకేడ్'తో వాటికి దుస్తులు వేశారు. మాస్టర్ బెడ్‌రూమ్‌లో 'రివాల్వింగ్' వార్డరోబ్, సర్క్యులర్‌బెడ్. ఆకర్షణీయంగా ఉండే అనేక రకాల ...గావ ఫోటోలు గోడకు, బెడ్‌రూమ్‌కూ డ్రాయింగ్ రూమ్‌కూ మధ్యన పెద్ద రోస్ వుడ్ అల్మైరా - దానికి గాజుతలుపులు. ఆ తలుపుల్లోంచి రంగురంగుల సీసాల్లో ఫారిన్ సరుకు - విస్కీ, జిన్, బ్రాందీ వైన్ మొదలైనవి. ఆ మేడను ఈ రకంగా వర్ణించుకుపోతే ఎంతైనా చెప్పొచ్చు. ఆ ఇంట్లో లక్ష్మి తాండవిస్తోందని చెప్తే చాలు.

మాస్టర్ బెడ్‌రూమ్‌లో ఇంకా, ఇంటి యజమాని మగత నిద్రలో అటూ ఇటూ పొర్లుతున్నాడు. కాళీ గ్లాసులూ, కాళీ సీసాలూ. తినీ తినక వదిలేసిన తినుబండారాలూ, కాళీ సిగరెట్టు పెట్టెలూ, నెలలు నిండిన గర్భిణీస్త్రీలా ఉన్న యాస్‌ట్రే, ఏవో పత్రికలూ, మొదలైనవి ఒక టేబిల్ మీద నిల్చొని తొంగిచూస్తున్నాయి. ఇంకో బెడ్ రూమ్‌లో యజమాని పుత్రరత్నం పడుకుని ఉన్నాడు. అక్కడి సామగ్రి వాతావరణం ఇంచుమించు మాస్టర్ బెడ్‌రూమ్‌లోలాగే ఉంది. అదనంగా ఒక రికార్డ్ ప్లేయర్ నోరు తెరుచుకు చూస్తున్నది. టేబిల్‌మీద రికార్డ్సన్నీ చిందర వందరగా పడివున్నాయి. అతను పడుకుని ఉన్నాడు. ముఖం కన్పించటంలేదు. జుట్టంతా కప్పేసింది. చెంపలకు గూడ జుట్టు. ఫ్రెంచ్ గడ్డం, పులిచారల నైట్ పైజామాసూట్‌లో ఉన్నాడు. బెడ్ నుంచి చేయి కిందికి వేళ్ళాడుతోంది. వేళ్ళకు రాళ్ళ ఉంగరాలు చేతికి భూతంలా ఉన్న పెద్దసైజ్ రిస్ట్‌వాచి, ఎదురుగా బుక్ షెల్ఫ్‌లో టోలెడంత సాహిత్యం. కొన్ని ఫారిన్ సెక్స్ పత్రికలు – వయసు ఇరవై సంవత్సరాలు.

గెస్ట్‌రూమ్ అనబడే మరో బెడ్‌రూంలో యజమాని కుమార్తె పడుకుని ఉంది. ఆమె మగవాని డ్రెస్‌లో ఉంది. డ్రెస్ చాలా వల్చగా ఉంది. వయసు పద్దెనిమిది. యవ్వనాన్ని కప్పుకొని పడుకున్నది. ఎదురుగా టేబిల్‌మీద 'బోయ్‌ఫ్రెండ్ ఫోటో పత్రికలూ చిల్లర పుస్తకాలు.

యజమాని నిద్రలేస్తేగాని నౌకర్లు ఎవరూ గదిలోకి వచ్చి శుభ్రం చేయడానికి వీలులేదు.

లలిత కిటికీ దగ్గర నిల్చుని చూస్తున్నది. బయట ప్రపంచాన్ని కుడిచేత్తో కర్టెన్ పక్కకు తొలగించి అద్దాల్లోంచి చూస్తున్నది. కిందుగా లోయలో ఊడల మర్రిచెట్టు భూమినంతా ఆక్రమించుకున్నట్టుగా ఉంది. ఆ మర్రిచెట్టు చుట్టూ బాగా వ్యాపించిన సమాధులపట్టణం, దానికి ఆనుకునే చిన్న చెరువులాంటి కోనేరు, కోనేరుచుట్టూ రాళ్ళగుట్టలు, ఒడ్డున ఎవరో ఆడవాళ్ళు బట్టలు ఉతుక్కుంటున్నారు. ఒక రాళ్ళగుట్ట దగ్గర నీటికి సమీపంలో ఒక కుర్రవాడిచేతిలో ఏదో సరంజామాతో అప్పుడే అక్కడకు వచ్చి కూర్చుంటున్నాడు. ఆ కుర్రవాడికి పది పన్నెండేళ్ళ వయసుండవచ్చు. మాసిపోయిన కాకీనిక్కరు, ఏదో గీరల చొక్కా ఉంది. తైల సంస్కారం లేని జుత్తు. రాగానే లాగూ చొక్కా విప్పేసి ఒక గోచీ పెట్టుకున్నాడు. చూడటానికి

వామనమూర్తిల్లే ఉన్నాడు. ముద్దులు మూటకడుతూ ముచ్చటగా ఉన్నాడు. దూరాన్నించే ఆ కుర్రవానిలో ఓ విధమైన ప్రశాంతత, నిర్మలత్వం కన్పించినయి లలితకు. ఒక్క చిరునవ్వు చాలు. కోటి జ్యోతులు వెలిగించడానికి. కిటికీ దగ్గర నిల్చున్నప్పుడు లలిత ఒక్కొక్కసారి రోడ్డువైపు చూస్తుంది. ఎవరైనా అప్తులూ, ఆత్మీయులు తన ఇంటికి వస్తున్నారేమోనని. మంచి మనసుకోసం మంచి మనిషికోసం ప్రతివారికీ తపన ఉంటుంది. కొందరికిది లేకపోతే వంటరితనంలో లోపల గుబులు గుబులుగా ఉంటుంది. తన చిన్ననాటి స్నేహితురాళ్లుగానీ, తనకు మంత్రోపదేశం చేసి, ఎప్పుడూ చిరునవ్వులు ఒలకపోస్తూ, చల్లని వెన్నెలను కుమ్మరిస్తూ ఆశీర్వదించే మామగారుగానీ, కన్పిస్తారేమోనని ఎదురు చూస్తూ ఉంటుంది. అలా ఎదురు చూడడంలో ఎంతో తృప్తి. ఎంతో హాయి. మామగారికి దాదాపు ఎనభై ఏళ్ళ వయసుంటుంది. ఆయన స్వంత ఊరులోనే ఉంటాడు. అది చాలా చిన్న గ్రామం. అత్తగారు వెళ్ళిపోయి చాలా రోజులయింది. ఇప్పటికీ ఆయన స్వయంగా వంట చేసుకుని పూజలూ మొదలైనవి పూర్తిచేసుకుని ఒంటిగంటకుగాని భోజనం చేయడు. ఆయన శ్రీ విద్యోపాసకుడు. ఆ 'అమ్మ' పిలిస్తే పలుకుతూ ఉంటుంది. అమ్మ దగ్గర పసివానివలె ముద్దులు గుడుస్తాడు. ఒక్కొక్కప్పుడు కన్నీరు మున్నీరుగా ఏడుస్తాడు. ఒకప్పుడు 'అమ్మను చూసి పెద్దగా నవ్వుతాడు. ఆయన ఇంట్లో పెద్ద నాగుపాము ఎప్పుడూ సంచరిస్తూ ఉంటుంది. ఆయన పూజ అయిన తరువాత పాముకు కూడా నైవేద్యం అవుపాలు. నలుపు, తెలుపు రంగుగల ఆవు ఎన్నాళ్ళనుండో ఆయన దగ్గర ఉన్నది. ఆయన దృష్టిలో అది కామధేనువు.

లలిత మనసులో ఎప్పుడూ, మామగారు, ఆ గ్రామం... ఆ ఇల్లు, ఆ ఇంటి వాతావరణం. కళ్ళల్లో మెదులుతుంటుంది. మానవలోకం అంతా ఒక శరీరమైతే ఆ శరీరమే మామగారు. ఆయన కరుణామయుడు. ఆయనొక బోధివృక్షం. ఆయన మానవత్వానికి మచ్చుతునక. మళ్ళీ ఆయన మామూలు మనిషి. ఆ మనిషికి దూరంగా ఉన్నాననే బాధతో కొట్టుకుపోతుంది లలిత. లలిత ఐశ్వర్యానికేం లోటులేదు. మనిషికే కరువయింది. ఇంట్లోని వ్యక్తులకు ఒకళ్ళ కొకళ్ళకు సంబంధం లేదు.

ఆలోచిస్తూ ఆ కుర్రవానివైపు చూస్తూనే ఉంది లలిత, రాళ్ళగుట్ట దగ్గర సీటి ఒడ్డున ఉన్నాడు. ఆ రాళ్ళగుట్టలో పెద్ద బండలు రెండు ఒకదానిపై ఒకటి ఒరిగి

ఉన్నాయి. రాత్రంతా విశ్రాంతిగా ఆ చీకటి శయ్యమీద, నక్షత్రాల వెలుగులో, ఒకదానిఒళ్ళు ఒకదానికి తగులుతూ అమాయకంగా, పసిపిల్లల బోసినవ్వులతో, ఒళ్ళు మైమరచి పడుకుని ఉన్నాయి ఆ రాళ్ళు. వాటికింకా మెలుకువ రాలేదు, లోయలో ఎత్తుగా పెరిగిన పచ్చిక ఎండకు మెరుస్తోంది. లలిత ఇంట్లోకి వెళ్ళి 'బైనాకులర్స్' తెచ్చింది. దాని సహాయంతో చూస్తే అన్నీ దగ్గరగా కనపడతాయి. దీన్ని ఇంటి యజమాని 'హార్స్‌రేసెస్ లోనూ, క్రికెట్ మేచెస్‌లోనూ, పెద్ద పెద్ద క్లబ్‌లలో 'కేబరే' డ్యాన్సు చూడటానికి వాడతారు.

ఆ పిల్లవాడు తను తీసేసిన లాగూ చొక్కా నీళ్ళల్లో తడిపి, అక్కడున్న రాళ్ళమీద నిల్చుని నీళ్ళల్లోకి దూకి ఈదుకుంటూ కొంచెం దూరం వెళ్ళాడు. మళ్ళీ వెనక్కి వచ్చాడు. మోకాలి వరకూ నీళ్ళల్లో నిల్చున్నాడు. ఒళ్ళంతా రుద్దుకుంటున్నాడు. మళ్ళీ రాతి మీదికి ఎక్కి నీళ్ళల్లోకి దూకేడు. ఇలా మూడునాలుగు సార్లు దూకి, నీళ్ళల్లో ఈతకొట్టి, స్నానం ముగించుకుని ఒడ్డుకు వచ్చేడు. ఆరేసిన కాకినిక్కరూ, చొక్కా అతని కోసమే ఎదురుచూస్తున్నాయి. ఒడ్డున చిన్నరాయిమీద కూచుని తను తెచ్చుకున్న సరంజామా లోంచి ఒక పొట్లం తీశాడు. ఆ పొట్లంలో వేరుశనక్కాయలు. ఒక్కొక్కటీ రాతిమీద చిటుక్కున కొట్టి పప్పుతీసి తింటున్నాడు. ఆ పొట్లం అయిపోయింది. తరువాత తను తెచ్చిన పొడుగాటి వెదురుబద్ద తీశాడు. వెదురుబద్దకు చాలా పొడవైన నైలాన్ దారం. దారం చివర చిన్న బెండు ముక్క ఒక సన్నని ఇనుపకొక్కెం. చిన్న గుడ్డ సంచిలోంచి సన్నని వానపాములు- వాటిలో ఒకటితీసి కొక్కేనికి తగిలించి, ఎత్తైన బండమీదకు వెళ్ళి కూర్చుని ఆ దారాన్ని నీటిలోకి విసిరాడు. చేతిలో వెదురుబద్ద అటూ ఇటూ కదిలిస్తున్నాడు. ఒక్కొక్కసారి పైకి తీస్తున్నాడు. చేపపడినట్టులేదు. మళ్ళీ నీళ్ళలోకి వేస్తున్నాడు. వానపాములు ఒక్కొక్కటే తగ్గిపోతున్నాయి. ఒకసారి చేప పడినట్లే పడి పైకివచ్చి మళ్ళీ నీళ్ళల్లోకి వెళ్ళిపోయింది. చాలాసేపు నీళ్ళల్లోకి దారాన్ని వదులుతూనే ఉన్నాడు. ఒక్కొక్కప్పుడు అతనిలో అతను నవ్వుకుంటున్నాడు. ముత్యాల్లాంటి తెల్లని పలువరస.

బైనాకులర్స్‌లోంచి చూస్తున్న లలిత నౌకరును కేకవేసి పిలిచింది 'రామయ్యా ఆ చేపలు పట్టే కుర్రాణ్ణి మనింటికి పిలుచుకురా' అని పురమాయించింది.

నౌకరు గబగబా కాంపౌండు దాటి రాళ్ళనుదాటుకుంటూ లోయలోకి వెళ్ళి ఆ కుర్రాణ్ణి కలుసుకున్నాడు. నిన్ను అమ్మగారు రమ్మంటున్నారన్నాడు- అతను

వినిపించుకోలేదు. ఏదో తపస్సు చేసుకుంటున్నట్లుగా ఉన్నాడు. మధ్య మధ్యలో పడుద్ది పడుద్ది అంటున్నాడు. అతను నౌకరువైపే చూసినట్లులేదు. ఆరేసిన లాగు చొక్కా తీసుకుని వేసుకున్నాడు.మళ్ళీదారం నీళ్ళల్లోకి వదిలాడు. నౌకరు 'అమ్మగారు అన్నం పెడతారంట నిన్ను పిలుస్తున్నారు' అన్నాడు. అన్నమేవిటి? అమ్మగారేవిటి... పో పో అన్నట్టుగా చూశాడు నౌకరు వైపు. ఇంటికెళ్లాల... "మా అన్న ఈ పాటికి అన్నం వండి నా కోసం చూస్తుంటడు... అన్నాడు. నౌకరు బతిమిలాడుతున్నాడు. చేప పడాల... చేప పడాల... అప్పుడు లెగాలి..."అన్నాడు ఆ కుర్రవాడు.

రెండు చేపలు పడ్డ తరువాత – పడకుండ ఏడబోద్ది అని నవ్వుగా నవ్వుకుని లేచాడు. నౌకరు రమ్మని అడుగుతున్నాడు. నేను చాలా దూరం పోవాలె. నేను రాను అంటున్నాడతను. అమ్మగారిని ఓసారి చూసి వెళ్ళిపోదువులే రా. వెళ్ళేటప్పుడు నేను సైకిలుమీద జంక్షన్ వరకూ దిగబెడతానన్నాడు నౌకరు.

నౌకరు, ఆ కుర్రవాడు ఇంటివైపే వస్తున్నారు. లలిత చూస్తోంది. క్రితం రాత్రి అన్నం, ఇతర పదార్థాలూ బోలెడన్ని మిగిలిపోయినయి. వాటితో అతనికి కడుపునిండా భోజనం పెట్టచ్చు. అతను తిని సంతోషంగా వెళతాడు... అని అనుకుంటూ తృప్తిగా నవ్వుకుంటున్నది లలిత.

బెదురు బెదురుగా మెట్లన్నీ ఎక్కి ఇంట్లోకి వస్తున్నాడు అటూ ఇటూ చూస్తూ... డ్రాయింగ్‌రూమ్ గుమ్మం ముందు నిల్చుని లోపలికోసారి తొంగిచూశాడు. ఎదురుగా పులి భయంకరంగా చూస్తున్నది. లాగుజేబులో చేయిపెట్టి చూస్తున్నాడు. చేతికి మెత్తగా చేపలు తగిలినై...

'బాబూ అన్నం పెడతాను తింటావా...' అని మృదువుగా అడిగింది లలిత. చేపలూ చేపలూ ఎందుకు పడలేదు. తొందరగా అని కళ్ళతో అడుగుతున్నట్టుగా మౌనంగా సమాధానం ఇచ్చాడు. పని దొరుకుద్దా... అన్నాడు నెమ్మదిగా. అది ఎవరికీ విన్పించినట్టు లేదు. మరో సారి బెదురు బెదురుగా లోపలికి చూశాడు. గోడలకు కరుచుకుని ఉన్న పులులు గుడ్లురిమి చూశాయి. అంతా అయోమయంగా ఉంది. ఒక్క క్షణం నిల్చున్నాడు. లలిత ఇంట్లోకి వెళ్ళింది అన్నం తేవడానికి. అటువైపు వెళ్ళి ఇంకా వండుకుని ఉన్న అయ్యగార్ని చూశాడు. నౌకరు తన పని చూసుకోడానికి

లోపలికి వెళ్ళాడు. పులులు వెంటపడుతున్నట్టుగా ఉంది ఆ కుర్రవానికి... డ్రాయింగ్ రూమ్‌లో పులులు ఇంకా చూస్తూనే ఉన్నయి అతనివైపు. అటూ ఇటూ చూసి ఒక్కసారి పరుగు లంకించుకున్నాడు, బెదిరిన లేడిలా గెంతులు వేస్తూ. జేబులోని చేపలను గట్టిగా పట్టుకున్నాడు.

లలిత వచ్చి చూసింది... 'బైనాకులర్స్'తో చూసింది. ఆమె కన్నీటి పొరలతో ఆమెకేమీ కన్పించలేదు... చూపు మేర దూరంలో కూడా కన్పించకుండా వెళ్ళిపోయినాడా కుర్రవాడు!

*గోల్కొండ సంక్రాంతి ప్రత్యేక సంచిక*

# 6

# షిఫాన్ సుందరి

అబ్బ! ఏం అందం... ఏం వయ్యారం... ఏం వంపులు... ఏం సొంపులు.. అంత లావూ కాదు, అంత సన్నం కాదూ. విగ్రహానికి తగ్గ పొడుగు... ఆ కళ్ళలో - ఆ చిరుహాసంలో సొగసు ఉట్టిపడుతూ ఉంది. ఆ చేతివేళ్ళు ఎంతో నాజూకుగా ఉన్నాయి. మిసమిసలాడే ఆ శరీరం చీరె నెమ్మదిగా విప్పుతున్నాడు. ఒక్కొక్కసారి. చేతిలో మరోచీరె ఉన్నది, చీర పూర్తిగా ఊడిపోతే బావుండదని తనచేతిలోని చీరె అడ్డంపెట్టి ఆ చీరె పూర్తిగా విప్పివేశాడు. లోపల తెల్లగా మెరుస్తున్న లంగా, చీరె విప్పుతుంటే ఆమె చెయ్యి అడ్డం పెట్టినట్టుగా ఉంది. భరతనాట్య భంగిమలో ఆ చేతులున్నాయి. విప్పినచీరె కుప్పగా అవతల పడేశాడు. మరో అతను వచ్చి దాన్ని మడత పెడుతున్నాడు. చీరె బొడ్డుకిందకు కట్టేడు. ఒక్కసారి చూశాడు. ఏవిటో తృప్తిగా లేదు. బొడ్డు కిందిభాగం నుండి ఇంకొంచెం కిందికి లాగాడు. కుచ్చెళ్ళు నాజూకుగా అమర్చాడు. ఒక్కసారి హాయిగా చూశాడు. తనను కున్నట్లుగానే కుదిరింది. చీరెకు మ్యాచ్ అయ్యే జాకెట్టు తీసుకున్నాడు. అంతకుముందు తొడిగి ఉన్న జాకెట్టు నెమ్మదిగా విప్పుతున్నాడు. లోపల తెల్లటి బ్రా అవయవ సౌందర్యాన్ని ఉట్టిపడేట్టు చేస్తున్నది. తన నాజూకు చేతుల్తో వీపుమీద ఒకచేయి వేసి క్లిప్పులను సరిచేసి, ముదతలున్నవైపు సర్ది, పమిట తీసి తన మీద వేసుకుని జాకెట్టు తొడిగేడు. అది పూర్తయిన తరువాత పమిట మళ్ళీ సర్దేసి ఒక్కసారి ఆమెను తడిమి చూశాడు. రెండడుగులు వెనక్కు వెళ్ళి మరొక్కసారి చూశాడు. అతని కళ్ళల్లో బోలెడంత తృప్తి ఉంది. బాగా కుదిరింది అనుకున్నాడు. ఆమె అతన్ని చూసి సన్నగా నవ్వినవ్వనట్లుగా ఉంది.

యాదగిరికి ఈ చీరలు విప్పటం కట్టడం కొత్తేంకాదు. నవీన్ సిల్క్‌ప్యాలస్‌లో పదేళ్ళ బట్టీ చేస్తున్న ఉద్యోగమే అది. షాపు తెరిచే సమయానికి ముందు షో కేస్‌లో

ఉన్న ఆ విగ్రహాలకు కొత్త కొత్త చీరెలు కడుతూనే ఉన్నాడు విప్పుతూనే ఉన్నాడు. అతని రోజువారీ కార్యక్రమంలో ఒక భాగం షోకేస్‌లో ఎడమ వైపు మూడు కుడివైపు మూడు అందమైన విగ్రహాలున్నాయి. అవి ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేసినవే అయినా వాటిలో జీవకళ ఉట్టిపడుతూ ఉంటుంది. పండుగలు వచ్చినప్పుడు పనితాకిడి ఎక్కువ అతనికి. షిఫాన్ చీరెలు, వెంకటగిరి, ధర్మవరం, బెంగుళూరు, పోచంపల్లి, గద్వాల్, మొదలగు రకాల ఎన్నో ఖరీదైన చీరెలు, లేటెస్ట్ డిజైన్, ఫ్యాషన్స్‌గలవి కట్టి విప్పుతూండడం అలవాటయిపోయింది. చీరెల సౌందర్యం, చీరెల్లోని మనుష్యుల సౌందర్యం బాగా ఆకళింపు చేసుకున్న వ్యక్తి యాదగిరి.

తనది ఎదుగూ బొదుగూ లేని "సేల్స్‌మన్" జీవితమే అయినా – రోజు రోజుకూ పెరుగుతున్న ఫ్యాషన్స్‌తో మారుతున్న అందాల విలువలతో – రకరకాలుగా వస్తున్న విలువలతో యాదగిరి కూడా మానసికంగా ఎదిగినట్టే కన్పిస్తాడు, అందర్నీ ఆహ్వానించే ఆ చిరునవ్వే దానికి సాక్ష్యం. దాదాపు దక్షిణాది భాషలన్నీ అనర్గళంగా మాట్లాడగలడు. తన దగ్గరకు వచ్చే కస్టమర్స్ అందరూ ఎక్కువ భాగం ఆడవాళ్ళే అవడంచేత – వాళ్ళ మనసు నొప్పించకుండా, వాళ్ళను మెప్పిస్తూ మాట్లాడ్డం – అందులో నేర్పరితనం – విసుగులేకుండా ఎన్ని చీరెలైనా వచ్చినవారికి చూపించడం... తను సన్నగా ముసిముసి నవ్వులు నవ్వుతూ అవతల వాళ్ళను నవ్వించడం – అదో కళగా అలవర్చుకున్నాడు యాదగిరి. ఎన్నో సంక్రాంతులు, దీపావళులు, ఉగాదులు చూశాడు. ప్రతి పండక్కీ కొండంత మనిషిగా కన్పిస్తాడు. కొంచెం పెద్దవాళ్ళని మాతాజీ అంటాడు. వయసులో ఉన్నవాళ్ళను – చనువునుబట్టి బెహెన్‌జీ అంటాడు. ఒక్కొక్కప్పుడు కొంటె పిల్లలు కూడా ఆ షాపుకు రావడం కద్దు... ఇద్దరు ముగ్గురు కలిసి వస్తారు. ఏదో చిన్నగా మాట్లాడి వాళ్ళను నవ్విస్తాడు ఆ నవ్వుల్లో తన నవ్వుకూడా వినిపించకుండా నవ్వుతాడు. ఏ మోడల్ చీరె కావాలంటే ఆ చీరె క్షణంలో చీరెల దొంతర్లోంచి తీసి ముందుంచి పరచి చూపిస్తాడు.

"ఈ చీరె మీకు బావుంటుంది. తీసుకువెళ్ళండి కట్టుకు చూడండి. మీకు నచ్చకపోతే తిప్పి పంపించండి మరోటి ఇస్తాను" అంటాడు ధారాళంగా. అట్లా మాట్లాడుతూ ఏదో విధంగా ఒప్పిస్తాడు. ధరదేముంది మీకు చీరెనచ్చితే చెప్పండి అంటాడు. అప్పుడప్పుడు సినిమాలు చూస్తాడు. ఊర్వశీ చీరెలు, ఆరాధన చీరెలు,

ప్రేమనగర్ చీరెలు అంటూ ఏవేవో పేర్లు చెప్తాడు. చీరెలుకొన్న తరువాత అవి అందంగా ప్యాక్ చేయించి... కారులో వచ్చిన వాళ్ళను కారుదాకా సాగనంపి వస్తాడు. మరీ ఖరీదైన చీరెలు కొనేవాళ్ళకు కోకోకోలా ఇప్పిస్తాడు. కూడా ఎవరైనా మగవాళ్ళు వస్తే వాళ్ళకు సిగరెట్లు ఆఫర్ చేసి తనే వాళ్ళకు సిగరెట్లు వెలిగిస్తాడు. మరీ అందమైన అమ్మాయిలయితే వాళ్ళకు బాధ కలిగించకుండా పొగుడుతాడు. ఒక్కొక్కప్పుడు చెడుకోరికలు కూడా వస్తుంటాయి. ఆకర్షణీయంగా అందంగా కన్పడ్డ అమ్మాయికి... తనే చీరెవిప్పి తనకు నచ్చిన చీరె కడితే బావుండుననిపిస్తుంది ఒక్కొక్కప్పుడు. అది సాధ్యపడే పనికాదని అతనికి తెలుసు... అయినా అయిడియా వస్తుంటుంది అప్పుడప్పుడు. తను వచ్చిన పదేళ్ళలోనూ ఆ షాపు ఎంతగానో ఎదిగింది. లక్షలమీద వ్యాపారం జరుగుతోంది. బోలెడు లాభాలు వస్తున్నాయి. ఆ షాపు యజమాని లక్ష్మీపూజ చేస్తూనే ఉన్నాడు. యజమాని పొట్ట, శరీరం కూడా అసహ్యం వేసేంతగా పెరిగింది. కూచుంటే లేవలేడు, లేస్తే హాయిగా కూర్చోలేడు. జరదాకిళ్ళీ నములుతూ లెక్కల పుస్తకాల్లో తలదూర్చి ఉంటాడు. గల్లాపెట్టెలో నోట్ల వర్షం కురుస్తూనే ఉంటుంది. యాదగిరి శక్తి సామర్థ్యాలవల్ల ఆ వర్షం జడివానగా మారి యజమానిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది.

ప్రతి దీపావళికి లక్ష్మీపూజ చేసి, యజమాని జమాఖర్చుల లెక్కలు చూసుకున్న తరువాత యాదగిరికీ, అతని అసిస్టెంట్లకూ కొద్దిగా పండుగ బహుమతి ఇవ్వటం రివాజు. ఇచ్చేది చాలా కొద్ది మొత్తమే అయినా యాదగిరి ఎంతో తృప్తిగా తీసుకుని భార్యకు అందచేసేవాడు. ఆమె ఒక సాదాచీరె కొనుక్కునేది. దాంతో పండుగ వెళ్ళిపోయేది—

ఆ సంవత్సరం దీపావళి వ్యాపారం ముమ్మరంగా సాగుతోంది. చాలా ఖరీదైన చీరెలు కట్టేరు ఆ సుందరీమణులకు. ఆ చీరెలు, ఆ అందం చూసేటప్పటికీ ఓ రోజు యాదగిరికి నోరూరింది.

నా భార్య ఈ చీరెకట్టుకుంటే ఎంత బావుంటుందో అనుకున్నాడు. అది ఖరీదైన షిఫాన్ చీరె—

అందంగా లేనివాళ్ళకు కూడా అందాన్నిచ్చే చీరె అది. ఇంటిదగ్గర భార్య నుస్తీగా ఉంది. మంచానికి అంటుకుపోయి ఉన్నది. పసిపిల్లవాడు ఆ ఎముకల

పొగును పీక్కుతింటున్నాడు పాలకోసం. తన ఇల్లు ఎక్కడో చార్మినార్ దగ్గర. సమీపంలో ఉన్న దవాఖానాకు తీసుకెళ్ళి మందిప్పించాడు. మందులకుకూడా తిరగబడే స్థితిలో ఉంది ఆమె.

యాదగిరి చిరునవ్వుతోనే చీరెలమ్ముతున్నాడు. కొత్త సరుకువచ్చిన కొద్ది క్షణాల్లోనే ఎగరకొట్టుకుపోతున్నారు.

యజమానిని పొద్దుట్నుంచే ఏదో అడగాలని ప్రయత్నిస్తూనే ఉన్నాడు. నోటమాట రావడం లేదు. అడిగి లేదనిపించుకోవడం ఇష్టం లేదు. అడక్కపోతే జరిగేటట్టులేదు. పెద్ద డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి మంచి మందులిప్పించి ఆమె వ్యాధి త్వరగా నయం చేసి – ఆమెకో మంచి చీరకొని అది తనే కట్టాలని కోరిక. ఆ కోరిక కలిగినప్పుడల్లా అతడి మనస్సు పరవళ్ళు తొక్కేది. ధైర్యం చేసి అడగనే అడిగేడు రాత్రి షాపు మూసే సమయంలో...

అబ్బో అంత డబ్బే... అని ముఖం చిట్లించుకున్నాడు.

యజమాని చూపులు యాదగిరికి సూదుల్తో పొడిచినట్లుగా బాధ కలిగింది. ఆ బాధలోనే చిరునవ్వుతో సవినయంగా తన అభిమానాన్నంతా చంపుకుని మళ్ళీ హెచ్చరించాడు. "చాలా అవసరం ఈ సమయంలో మీరు కాకపోతే ఎవరు ఆదుకుంటారు?" అన్నాడు.

తను మామూలుగా ఇచ్చే పండుగ ఈనామ్ కాకుండా రెండు వందలకు ఒప్పుకున్నాడు యజమాని. దానికి కొన్ని షరతులు పెట్టేడు. వడ్డీతో కలిపి నెలనెలా జీతంలో తీర్చేట్టుగా. ఆరు మాసాల గడువు. యాదగిరి ఎగిరి గంతేసి సరేనన్నాడు.

  

డబ్బు చేతికొచ్చింది. క్షణంలో పిచ్చెత్తినట్లయింది. ఎన్నో ఆలోచనలు, ఎన్నో ఖర్చులు అనుకోనివి కొన్ని, అనుకున్నవి కొన్ని ఎదురు చూస్తున్నాయి. అన్నిటికన్నా ముఖ్యం భార్య ఆరోగ్యం. మంచానికి అంటుకుపోయి ఉంది. కొద్దిగా తీర్చవలసిన అప్పులున్నయి బయట. తన సైకిలు తనకన్నా ముసలిదైపోతున్నది. రెండు చక్రాలకు రెండు టైర్లు కొనాలి. లైటు పెట్టించాలి. వెనకాల క్యారియర్ పెట్టించాలి. కూర్చుండే సీటు సాంతం చిరుగుపట్టింది. చార్మినార్ నుండి అబిడ్స్‌కు సైకిలు తొక్కుతుంటె

చాలా బాధగా ఉంది. సైకిలు సరిగా లేకపోవడం చేత అన్ని రిపేర్లు చేయించి రంగు వేయిస్తే కొత్త సైకిలల్లే ఉంటుంది. రాజాలాగా సైకిలు తొక్కచ్చు. పిల్లలకు బట్టలు కొనాలి. తనూ కొనుక్కోవాలి. ఈసారి భార్యకు ఖరీదైన చీర కొనాలి. ఇంటి అద్దె మూణ్ణెల్లు బకాయి పడ్డది. ఇన్ని ఖర్చుల్లో ఏది ముందు ఏది తర్వాత?బళ్ళోకి వెళ్ళే పిల్లవాడికి మంచి కలం కొనాలి.

క్రితం రోజు సాయంత్రం మరీ అందమైన అమ్మాయికి ఖరీదైన షిఫాన్‌చీరె షాపులో అమ్మేడు. ఆ అమ్మాయి అందానికి రెండు కళ్ళు సరిపోవు అనుకున్నాడు. చీరెలు చూపించే నెపంతో ఆ అమ్మాయిని చాలాసేపు ఉంచేశాడు. కనీసం ఓ పాతిక చీరెలన్నా చూపించి ఉంటాడు. చివరికో షిఫాన్‌చీరె సెలక్ట్ చేసింది. ప్యాక్ చేసిస్తే నవ్వుకుంటూ తీసుకుని పర్సులోంచి డబ్బుతీసి ఇచ్చింది. ఆ డబ్బును యజమానికి అందజేసి – ఆ అందం తన స్వంతమైతే బావుండుననుకున్నాడు.

నా పిచ్చిగానీ నా కెందుకంత అందం అనుకున్నాడు. ప్రతి ప్రశ్నకూ తనే సమాధానం చెప్పుకున్నాడు.

సైకిలుమీద వెళ్తున్నంతసేపు ఇవే ఆలోచనలు.

యజమాని ఖరీదైన విస్కీ తాగుతాడు. స్కాచ్ విస్కీ చాలా బావుంటుందట. స్నేహితుల్తో ఎప్పుడూ పెద్ద పెద్ద "బార్స్"కు వెళ్తాడు. నేనూ ఒక్కసారి తాగిచూస్తే బావుండు ఎలా ఉంటుందో? తాగితే స్వర్గానికి వెళ్ళినట్టే ఉంటుందట. ఎవరో చెప్పగా విన్నాడు. దారిలో అందమైన రామకృష్ణా థియేటర్. గొప్ప ఇంగ్లీషు పిక్చర్ నడుస్తోంది. గోడలకతికించిన బొమ్మలు అందంగా ఉన్నాయి. థియేటర్ దగ్గర రిక్షాలూ, సైకిళ్ళూ, స్కూటర్లూ, కార్లూ బోలెడున్నాయి. జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. గుంపులో జొరపడి టిక్కెట్టు కొనుక్కుని సినిమాకు వెళ్దామనుకున్నాడు. మంచాన అంటుకుని ఉన్న పెళ్ళాం కళ్ళల్లో మెదిలింది. ఇంటికి త్వరగా వెళ్ళాలి. తనకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. మూతలు పడుతున్న కళ్ళతో, పసివాడు పాలురాక ఏడుస్తూ ఉంటాడు. దారిలో మంచి పాలడబ్బా కొనాలి.

సైకిలు పోతూనే ఉంది. దూసుకుపోయే కార్లనూ, స్కూటర్లనూ తప్పించుకుని ఒరిగి పక్కగా తొక్కుతున్నాడు. జేబులో నోట్లు బరువుగా ఉన్నాయి.

ఆ రోజు బాగా అలసినట్లు కన్పిస్తున్నాడు యాదగిరి.

జీవితాన్ని తొక్కలేక తొక్కుతున్నాడు– అది బాగా నలిగిన సైకిల్, చలిరోజులు వస్తున్నాయి.

దోవలో రోడ్డంతా దేదీప్యమానంగా ట్యూబ్‌లైట్లతో వెలిగిపోతోంది. బాధపడుతూ రోడ్డుమీద పోయేవాళ్ళతో మీ ఖర్మ అంటూ.

ఎదురుగా పెద్ద పెద్ద బోర్డులమీద ఎడ్వర్‌టైజ్‌మెంట్లు.

అది మనిషంత బొమ్మ, అందమైన అమ్మాయి అదమరచి నీలిరంగు మెత్తని పులెన్ రగ్‌లో నిద్రపోతోంది. కొంపదీసి షిఫాన్ సుందరి కాదు కదా... ఆ మెత్తని రగ్గ సౌఖ్యం – వెచ్చని చలి సౌఖ్యం తనకూ – తన భార్యకూ ఉండ కూడదూ!

కనపడే ఖర్చుల్లో రగ్గుకూడా చేరబడింది. మంచిదీ తనకు కావలసిందీ అయితే అరవయి రూపాయలుంటుంది. తనకున్న డబ్బులో ఎన్నని కొనగలడు? ఎన్ని కొనాలి!

సైకిల్ బరువుగా తొక్కుతున్నాడు. వెనకాల షిఫాన్ సుందరి కూర్చుని ఉంది. తనను రెండు చేతుల్తోనూ కావలించుకుని మరీ కూర్చుంది. రోడ్డు కొంచెంసేపు పల్లం – కొంచెం సేపు మరీ ఎత్తు – కొంత సుఖంగానే ఉన్నట్టుగానే ఉంది అనుకున్నాడు. తన పెళ్ళాం ఎప్పుడూ రోగంతో మూలుగుతూ ఎందుకుండాలి! అన్న ప్రశ్న ట్రాఫిక్ సిగ్నల్ ఎర్రలైటులా ఎదురయింది. ఎర్రలైటు కనపడగానే ఆగిపోయేడు. అలసి రొప్పుతున్నాడు – ఆగి ఆయాసపడుతున్నాడు.

పక్కనున్న కిళ్లీబడ్డీకి వెళ్ళి ఖరీదైన సిగరెట్టు ప్యాకెట్ కొన్నాడు. ఒకసోడా తాగేడు. త్రేణుపు వచ్చింది. శరీరం తేలికపడినట్లయింది.

సుఖం కావాలి... సుఖం... సుఖం అని జేబులోని డబ్బు అరుస్తోంది. మరో నాలుగు అడుగులు వేస్తే సారా దుకాణం, అక్కడ ముంతలు, సీసాలు... జనం.. అరుపులు... నవ్వులు... అది పక్కసందులో ఉంది. సైకిల్ తనెలా చేస్తే అలా వింటుంది. తనకు బానిస. నీ ఇష్టం బాబూ నేనేం చెప్పగలను అని అట్టే దారితీసింది–

ముంతలక్కర్లేదు. మామూలు సీసాలక్కర్లేదు ఓ మోస్తరు ఖరీదైన సీసా పుచ్చుకున్నాడు. ఆ సుఖాన్ని మనసారా గొంతులో పోస్తున్నాడు. అబ్బ! ఎంత హాయి...

మరో సీసా.. అబ్బ ఏం ఆనందం. మరోసీసా ఖాళీసీసా నిర్లక్ష్యంగా అవతల పారేశాడు. వక్కి నాటునరుకు... ఛీ... అయినా మళ్ళీ మరోసీసా... మిరపకాయ బజ్జీలు తిన్నాడు. నోరు తన జీవితంలా మండింది. పకోడీలు తిన్నాడు. విసిరేసిన ఖాళీసీసాల్లో ఒకటి ఎవరికో తగిలింది.

దొంగనాయాల... అన్నాడు అవతలవాడు. మీదిమీదికి వచ్చేడు. ఒకళ్ళ కిద్దరు. ఇద్దరికి ముగ్గురు. జనం గూడేరు. యాదగిరిని కొట్టలేదు. కొట్టినంత పనిచేశారు. సీసాలు, ముంతలు యుద్ధానికి వచ్చేయి – బూతులు బండబూతులు తిట్టుకున్నారు మిరపకాయ బజ్జీలు తింటూ...

పావుగంటసేపు హడావిడి జరిగింది.

ఖాళీసీసాలు – విరిగిన ముంతలు విశ్రాంతి తీసుకుంటున్నాయి.

నిషా దిగింది.

కోపం తగ్గింది.

తాపం పరితపించింది.

గుంపులోంచి, జనంలోంచి, నిషాతగ్గని మనుషుల్లోంచి తప్పించుకుని బయటపడ్డాడు.

సైకిల్ యాదగిరి కోసం నిరీక్షిస్తోంది – ఇంటి దగ్గర మంచానంటుకుని ఉన్న భార్యలా...

అమ్మో... నేనేం పనిచేశాను... అనుకున్నాడు.

మళ్ళీ జీవితాన్ని తొక్కుకుంటూ బయలుదేరాడు. ఇల్లు దగ్గరపడుతున్నకొద్దీ ఆరాటం ఎక్కువవుతోంది. ఇల్లు ఎంతసేపు రాకుండా ఉంటుంది గనుక వచ్చింది. ఇంటికి వెళ్ళి భార్యను ఓదార్చాలి. పక్కన పడుకోవాలి. దగ్గరకు తీసుకోవాలి. ఉక్కిరి బిక్కిరి చేయాలి. చీరెకొనే సంగతి, డబ్బు దొరికిన సంగతీ... కష్టాలు గట్టెక్కే సంగతి చెప్పాలి. దగ్గరకు తీసుకుంటే – ఆ ఎముకల పోగు తన బలానికీ తన ప్రేమకు తట్టుకోలేదు. చాలా జాగ్రత్తగా ఉండాలి. నిషా, ఏదో జ్ఞాపకం చేస్తోంది... శనిదేవత రథచక్రంలా తిరిగిన సైకిలు చక్రాలు వాకిట్లో మూలుగుతున్నాయి. ఇంట్లో పిల్లలందరూ

నిద్రపోతున్నారు. మర్నాడు ఓ మోస్తరు ఖరీదులో షిఫాన్ చీర కొనాలి భార్యకు. పండుగనాడు అది తనె కట్టాలి. చీర జాకెట్టు విప్పుతుంటే సిగ్గుపడుతుంది. సిగ్గెందుకని ఆ చీర పొరలు పొరలుగా తనే విప్పుతాడు. ఎదురుగా నిల్చుని కొత్తచీర తనే కడతాడు. బొడ్డుకిందకు బాగా కిందకు గుంజి మరీ కడతాడు. చీరెతోపాటు జాకెట్టు బ్రా కూడా కొంటాడు. బోలెడు డబ్బుంది.

దగ్గరకు వెళ్ళి మెమ్మదిగా పలుకరించాడు.

ఆమె సన్నగా నవ్వి మెల్లగా మూలిగింది. పక్కన చేరేడు. దగ్గరకు తీసుకున్నాడు.

అబ్బ! కంపు... అని దూరంగా జరిగింది.

తాగడం తప్పే... ఏదో పొరపాటయింది... ఇవ్వాళ తాగాలనిపించింది. మరేం లేదు. ఇంకా దగ్గరకు తీసుకున్నాడు. ఆ ఎముకల పోగు గువ్వలా యాదగిరిలో ఇమిడిపోయింది.

భోజనానికి ఉపక్రమించాడు.

ఇంకా తూలుడు తగ్గలేదు.

ఆవురావురుమని – ఆ కారం, ఆ పచ్చడి, ఆవకాయ...

ఇంకా ఎన్నో –

అసలే నిషా–

భోజనం చేసిన తరువాత అగ్నికి ఆజ్యం తోడైనట్లుగా ఉంది యాదగిరికి. మత్తు ఎక్కువైంది.

నే కట్టినట్లు ఎవరుకట్టగలడు చీరె – వా యాల అన్నాడు త్రేపుతూ.

భోజనం సుఖం, నిషా సుఖం, డబ్బు సుఖం, కోరికలు తీరబోతున్న సుఖం, అతన్ని చుట్టిముట్టినయి, మజాలో మస్తిష్కం పనిచెయ్యటం మానేసింది.

ఆమె దగ్గర చేరాడు. దగ్గరకు తీసుకున్నాడు.

ఆ చీరెలో నిన్ను చూడాలి. నీ అందం చూడాలి. ఆ చీరె నేను కట్టాలి. ఆ చీరెలో నీ అందంముందు అంతా బలాదూర్... నిన్ను సైకిల్‌మీద కూర్చోపెట్టుకుని

ఊరంతా తిప్పుతాను. అందమైన అమ్మాయిలందరూ తలవంచుకోవాలి... ఏవేవో మాట్లాడుతున్నాడు.

ఆమె సన్నగా మూలుగుతూ...

అబ్బ వేరే పడుకుందురూ... అంటోంది...

షిఫాన్ చీర మజా నీకేం తెలుసునే అంటూ ఇంకా దగ్గరకు తీసుకున్నాడు. ఎముకలు గుచ్చుకుంటూన్నై... కొంచెం చిరు చలి... మత్తులో యాదగిరి – మైకంలో మానవుడు కన్పించలేదు అతనిలో. ఆమెనే కప్పుకున్నాడు. ఆమె ఉక్కిరి బిక్కిరైంది. గిలగిలమంది, అతనిలో ఒదిగిపోయింది.

మన కష్టాలు గట్టెక్కినై... ఇదిగో నీ డబ్బు... అంటూ జేబులోంచి నోట్లు తీసేడు... ఆమె అతనివైపు చూస్తున్నట్లుగా లేదు...

రేపు రాత్రికి షిఫాన్ చీర తెస్తాను. నా వైపు చూడు. నిన్నే... ఈ డబ్బు చూడు... చూడమంటే చూడవేం... పోనీ నన్ను చూడు...

ఆమె చూడటంలేదు. ఉలకలేదు, పలకలేదు.

నిన్నేనే అని పెద్దగా కేకవేశాడు.

కౌగిలిలోంచి విడిపోయిన ఆమెను మళ్ళీ కౌగిలించుకుందామని చేతులతో దగ్గరకు తీసుకోబోయాడు. కదలిక లేదు. కాళ్ళు పెనవేసుకుని ఉన్నై. ఆమె శరీరం చల్లగా తగిలింది...

అమ్మో... అని భోరుమని బావురుమన్నాడు. ఆమె మీదపడి, చేతిలోని నోట్లు విలవిల తన్నుకుని, బయటపడి ఆమె ముఖాన్ని, ఊడిపోయిన చీరెలోని శరీరాన్ని కప్పేసినై...

*ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 7-2-1972*

# 7

# వలయంలో లయం

బిత్తుకంటే భయం, చావంటే భయం, సుఖం అంటే భయం, దుఃఖమంటే విపరీతమైన భయం, వానంటే భయం... మంటలంటే మరీ భయం... మనిషంటే భయం... దయ్యాలు అంటే భయం... సముద్రమంటే మరి చెప్పక్కర్లేదు. ఆ భయానికి అంతులేదు. దేన్నిచూస్తే భయం లేదో అతని విషయంలో చెప్పలేం. అలా అని అతను వట్టి పిరికివాడు అంటే చూస్తూచూస్తూ నమ్మలేం. అసమర్థుడా అంటే అదీ కాదు. అమాయకుడంటే అంతకన్నా కాదు. మరేవిటి? అతను అతనే.. అతని జీవితంలో సంఘర్షణ ఉంది అతనిపేర్లో రావు ఉంది. అంచేత అతని జీవితంలో సంఘర్షణలు రావని అనుకోవడానికి వీలులేదు. రావు ఏదో ఆఫీసులో చెప్పుకోదగ్గ ఉద్యోగమే చేస్తున్నాడు.

అతని కుటుంబం మరీ పెద్దది కాదు... మరీ చిన్నదీ కాదు. తనూ, భార్య నలుగురు పిల్లలు, తల్లీ. రావుకు బయటి ప్రపంచం అంటే ఎంత భయమో, ఇంటి ప్రపంచం అన్నా అంతే భయం. కాని తను భయపడుతున్నట్లు ఎవ్వరికీ తెలియదు. తెలుసుకోలేరు. అతని ప్రవర్తన చాలా గుంభనంగా ఉంటుంది. రావుని గురించి ఉపోద్ఘాతం ఇంతవరకు చాలు... రావుకు ఒక్కొక్కప్పుడు కోపం కూడా ఎక్కువగా వస్తుంటుంది.

  

ఆరోజు ఆఫీసునుండి ఇంటికి రాగానే ఒక విషయం తెలిసింది రావుకు. తన సుపుత్రుడు... పదేళ్ళ పసివాడు... ఘనుడుఘోరం... పరీక్షలో తప్పాడని...

ఆ పిల్లవాడి ముద్దుపేరు ప్రసాదాయ్... తన కుటుంబంలో కాని... ఇంకా కిందటి తరంలో కాని ఎవ్వరూ పరీక్షలు తప్పలేదు. తన వంశమే పేరు ప్రతిష్ఠలుగల వంశమని రావుకు చాలా అహంభావం ఉండేది... ఆ అహం... ఇప్పుడు దెబ్బతిన్నది... తోకతొక్కిన త్రాచులాగా లేచాడు...

ఒరే... య్... ప్రసాదాయ్... అని గావు కేక పెట్టాడు... వాడు భయపడుతూ.. భయపడుతూ వచ్చి... దగ్గర నిల్చున్నాడు... వాణ్ణి చూసేటప్పటికే... రావుకు కోపం... కాదు క్రోధం... కాదు... ఆగ్రహం... అదీకాదు... దాన్ని వర్ణించలేం... రాక్షసునికున్న బలం వచ్చింది... తనకు... అదంతా పుంజుకొని ప్రసాదాయ్ మీద విరుచుకుపడ్డాడు... కొట్టిన దెబ్బలకు అంతులేదు. పసివాణ్ణి అలా కొట్టావురా.... పరీక్ష తప్పితే మాత్రం... వాడి ప్రాణంపోదూ... అంటే... బామ్మగారు... అంటే రావు తల్లి సోమిదేవమ్మగారు మందలించింది. భార్య శ్రీలక్ష్మి మౌనం వహించింది. భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నదా అన్నట్లు... ప్రసాదాయ్‌కి ఒంటిమీద స్పృహలేదు. ప్రాణం ఉందో లేదో అనుమానంగా ఉంది. రావుకు అప్పుడు తెలివి వచ్చింది. కొంచెం తమాయించు కొన్నాడు. పిల్లవాణ్ణి అంతగా ఎందుకు కొట్టానో అనుకొన్నాడు... రావుకు భయం వేసింది... వాడు నిజంగా ప్రాణాలు వదిలాడేమో అని.. దగ్గరకు వెళ్ళి శ్వాస... చూశాడు. గుండె నీరసంగా కొట్టుకుంటోంది. ఇంట్లో అందరు నిశ్శబ్దంగా ఉన్నారు. అందరి కళ్ళు ప్రసాద్ మీదనే ఉన్నాయి. వాడు కదల్లేదు మెదల్లేదు... మన చూపు లేదు...

అరగంటయింది -

డాక్టరుని పిలిస్తే బావుంటుందేమో.... అని నెమ్మదిగా అన్నది శ్రీలక్ష్మి. ఇంక కొంచెం సేపాగి అలాగే చేద్దామని అన్నాడు రావు. పైకి అలాగే అన్నాడు కాని రావుకు భయంగానే ఉన్నది. ఇది ఏమైనా తీవ్రంగా పరిణమిస్తుందేమోనని... అతనికేదో భయంగా ఉంది... డాక్టరు వచ్చాడు... తరువాత ప్రసాద్ కన్ను మూయవచ్చు. ఇది నల్గురికి తెలుస్తుంది. తనను హంతకుడు.. అంటారు. తను హంతకుడైతే దాని పర్యవసానం చాలా ఉంటుంది. శిక్ష పడవచ్చు... శిక్షపడితే... తనకు ఉద్యోగం ఊడిపోవచ్చు. తరువాత తన భార్యాపిల్లలు, తల్లి రోడ్డుమీద నిలబడాలి... భవతీ భిక్షాం దేహి... తప్పదు... ఇవి అతని ఆలోచనలు.

ఇంతలో ప్రసాద్ కొంచెం కదిలాడు... కాని స్పృహలేదు, వాడేదో సన్నగా మూల్గుతూ ఏదో మంత్రాలు చదువుతున్నట్లుంది. అందరూ దగ్గరకు వెళ్ళి పరీక్షగా చూశారు...

ఓం... నమో... వాసుదేవాయ... అని నెమ్మదిగా వినబడుతున్నది. అంత కంతకు ఆ మంత్రధ్వని ఎక్కువవుతోంది. ప్రసాద్... ఎప్పుడూ మామూలుగా ఉన్నప్పుడు ఇది ఉచ్చరించి యెరుగడు. మరి కొంచెంసేపటికి సంస్కృతంలో ఏవో శ్లోకాలు చదువుతున్నాడు. ఒకటేమిటి వేదమంత్రాలు కూడా ప్రారంభమయినాయి. ప్రసాద్ చిద్విలాసంలో ఉన్నాడా అనిపించింది. ప్రసాద్ ముఖంలో చిరునవ్వు తాండవిస్తోంది. కాని ఇంకా మన లోకంలోకి రాలేదు. సోమిదేవమ్మగారు మంత్రించి కొంత విభూతి వాడి నుదిటిమీద వ్రాసింది. దగ్గరగా చేతులు జోడించి నిల్చున్నది. శ్రీలక్ష్మి ఆనందానికి అంతులేదు. రావు ఎందుకో తికమక పడుతున్నాడు.

ఒక గంటసేపటికి వాడు లేచి కూర్చున్నాడు. కళ్ళు నలుముకుంటూ ఎందుకు అలా మంత్రాలు చదివాడని అందరూ అడిగేరు. నాకేం మంత్రాలు రావు అన్నాడు ప్రసాద్. వాడికి ఆకలై భోజనం చేసి పడుకొన్నాడు. రావు నెమ్మదిగా తల్లి దగ్గర చేరి.. అమ్మా.. ఏమిటి ఈ వైపరీత్యం... నాకేం అర్థం కావడం లేదే అన్నాడు.

"వాడు మహా ఋషిరా నాయనా, ప్రారబ్ధం చాలక మనింట్లో ప్రసాదాయ్‌గా పుట్టాడు... వాడు దైవాంశ సంభూతుడు... సందేహంలేదు" అన్నది ఆమె.

అప్పటినుండి ప్రసాదాయ్‌ని చూసినా రావుకు భయంగానే ఉండేది.

సోమిదేవమ్మగారు మంచి జ్ఞాని, సంస్కారి కూడా. ఆమె ఎక్కువగా చదువుకోక పోయినా ఆధ్యాత్మికంగా చాలా ముందుకు పోయింది. ఆవిడ దగ్గర రెండు వజ్రాయుధాలు ఉన్నాయి. ఒకటి విభూతి, రెండవది ఇనుప గరిటె. ఆమెను బాగా ఎరుగున్న వాళ్ళు కొంతమంది ఇంటికి వచ్చిపోతూ ఉంటారు. ఎవరైనా శారీరకంగా గాని, మానసికంగా గాని అస్వస్థతగా ఉంటే ఆ రెండు ఆయుధాలతోనూ, వాళ్ళకు స్వస్థత చేకూరుస్తుంది. దెబ్బలు తగిలినా, బెణికినా, ఎలాంటి శరీర బాధ ఉన్నా ఆ ప్రదేశంలో నెమ్మదిగా రాసి ఏదో మంత్రం చదువుతుంది. బాధతో వచ్చిన వాళ్ళు నవ్వుతూ వెళ్ళిపోతారు, బామ్మగారు చాలా మంచిది అనుకుంటూ.

రావుకు శీలాంటి వాటిల్లో బొత్తిగా నమ్మకం లేదు, అతని దృష్టిలో ఆవిడ చాదస్తం మనిషి.

ఒకసారి ఓ తమాషా జరిగింది. రావు ఇంటిముందు విశాలమైన స్థలం. అందులో కొన్ని రాళ్ళ గుట్టలు ఉన్నాయి. ఇంకా పూర్తిగా చీకటి పడలేదు. ఎవరో ఒకపిల్లవాణ్ణి చేతుల మీద తీసుకు వచ్చి బామ్మగారి దగ్గరకు వచ్చారు. రాళ్ళగుట్ట దగ్గర ఆడుకుంటుంటే ఆ పిల్లవానికి పురుగు ముట్టిందట.

బామ్మగారూ, మీరే రక్షించాలి... అంటూ వాళ్ళు ఒకటే గోల...

బామ్మగారు నవ్వుతూ బయటికు వచ్చి ఏం పర్వాలేదు నాయనా..అంటూ ఆ పిల్లవానికి పాముకరిచిన చోట తన చేతివ్రేళ్ళతో నెమ్మదిగా రుద్దుతూ.. రెండు దెబ్బలు నేలమీద కొట్టింది, కొంచెం విభూతి కూడా ఇచ్చింది. కొంచెం సేపటికి పిల్లవాడు నవ్వుతూ లేచి కూర్చున్నాడు. ఆ తీసుకువచ్చిన వాళ్ళు బామ్మగారికి దణ్ణంపెట్టి వెళ్ళారు. రావు ఇదంతా చూస్తూనే ఉన్నాడు... తన కళ్ళను తాను నమ్మలేకపోయినాడు. తను చదివాడు ఎం.ఏ.... చదువుకొన్న వాడు దీన్ని నమ్మడం ఎలా, కళ్ళ ఎదుట జరిగిన సంఘటన. బామ్మను అడగటానికి ధైర్యం చాలలేదు. అతనిలో నిజంగా సంఘర్షణ బయలుదేరింది.

బామ్మగారు ఆ రోజు రావుకు ఇష్టమైన కందిపచ్చడి చేసింది. చాలా తృప్తిగా భోంచేశాడు. సిగరెట్టు వెలిగించి వరండాలో కూర్చున్నాడు. ఎదురుగా ఉన్న ఆకాశంలోకి... నక్షత్రాల్లోకి చూస్తూ....

ఎన్ని నక్షత్రాలు ఉన్నాయో లెక్కపెట్టగలమా... అనుకున్నాడు. అందులోని అవి కొన్ని చిన్నవిగానూ, కొన్ని పెద్దవిగానూ ఉన్నాయి. సప్తఋషులూ... నక్షత్రాలుగా ఉన్నాయి. అని ఆమె ఒకసారి చెప్పింది. నాన్సెన్స్ అనుకున్నాడు రావు. ఋషికీ నక్షత్రాలకు ఏమిటి సంబంధం అనుకున్నాడు. ఆ తరువాత రెండు రోజులకు రావు ఆఫీస్ పనిమీద క్యాంప్ వెళ్ళవలసి వచ్చింది. రైల్లో వెళ్తున్నాడు. ఆ రైలు జి.టి. ఎక్స్‌ప్రెస్ చాలా వేగంగా వెళ్తున్నది. భూమి దద్దరిల్లిపోతున్నది. రావు ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్‌లో కూర్చున్నా చాలా 'రెస్ట్‌లెస్'గా ఫీలవుతున్నాడు. అతని కెందుకో విపరీతమైన భయం పట్టుకుంది. రైలు పడిపోతుందేమోనని అనుకున్నాడు – ఆ

విషయం తల్చుకున్నప్పుడల్లా రైలు నిజంగా పడిపోతుంది, తప్పదు; అన్నట్లుగా ఉంది. రైలు పడిపోయినట్లు - చాలా మంది చనిపోయినట్లు తను మాత్రం ఏదో విధంగా కొంచెం దెబ్బలతో బయటపడ్డట్టు... బయటపడి శవాలలోంచి నడిచి వెళ్తున్నట్టు... ఇదీ... అతనికి కళ్ళ ఎదుట కన్పించిన దృశ్యం... రైలు అత్రం వేగం తగ్గలేదు. నెమ్మదిగా లేచి "అలారం" గొలుసు లాగాడు. రైలు తప్పక ఆగిపోవాలి. లేకపోతే పడిపోతుంది అని. రైలు ఆగిపోయింది. అందరూ వచ్చి గొలుసు ఎందుకు లాగారు. అని అడిగారు. "రైలు పడిపోయేట్లుగా ఉంది" అన్నాడు రావు. గార్డూ, డ్రైవరు, ఇంకా కొంతమంది వాళ్ళకు అనుమానం వేసింది. కొంత దూరం ముందుకు వెళ్ళి చూశాడు. రైలు పట్టాలు అంత బలంగా లేవు. ఒకచోట ఫిష్‌ప్లేట్స్ తీసివేయబడి ఉన్నాయి. రైలు ఆపకపోతే ప్రమాదం జరిగేది. మీరు దేవుడిలాగా రక్షించారు అని అందరూ రావుని అభినందించారు. రావుకి ఇది అర్థం కాలేదు. మళ్ళీ తికమక పడ్డారు. తను రైలు పడిపోతుందని భయపడడానికి కారణం ఏమిటి? భయపడకుండా ఉంటే ఇది జరిగేది కాదేమో, ఈ సంఘటన అమ్మకు చెప్పి దీని అంతరార్థము అడుగుదామనుకొన్నాడు.

  

ఆఫీసుపనిమీద తను వెళ్ళిన ఊరికి "డాక్" బంగళా కొంచెం దూరంలో ఉంది. చుట్టుపక్కల ఇళ్ళు ఏమీ లేవు. రాత్రి సుమారు పదిగంటలయింది. అంతా నిశ్శబ్దంగా ఉంది. అక్కడక్కడ కీచురాళ్ళధ్వని వినిపిస్తున్నది. ఉక్కగా ఉండటం వల్ల ఫ్యాన్ జోరుగా వేశాడు రావు. నిద్రపట్టక ఏదో పుస్తకం తీసుకొని చదువుతున్నాడు రావుకు డిటెక్టివ్ నవలలంటే ఇష్టం. "షెర్లాక్ హోమ్స్" కథ మంచి పట్టులో ఉంది. కథకు గడియారానికి పందెం వేసినట్లుగా ఉంది. గడియారం ముందుకు పోతున్నది. అంతా నిశ్శబ్దంగా ఉంది. మధ్య మధ్య కీచురాళ్ళధ్వని - గడియారం వైపూ, పుస్తకం వైపూ చూస్తున్నాడు-ఇంతలో ధడక్ - ధడక్ మని చప్పుడయింద తలుపు - ఎవరో తలుపు కొడుతున్నారు. రావు ఒక్కక్షణం ఉలిక్కిపడ్డాడు. కొంపదీసి దయ్యం కాదు గదా అనుకున్నాడు. దయ్యాలంటే రావుకు నమ్మకం లేదు. కాని, దయ్యాలను గురించి విన్నాడు. ఆడ దయ్యాలు కూడా ఉంటాయి అని విన్నాడు. తలుపు చప్పుడుతో విచిత్రమైన గజ్జెల ధ్వనికూడా విన్పిస్తున్నట్లుగా ఉంది. లేచి తలుపు తీద్దామనుకున్నాడు-

అది దయ్యమైతే, ఏమో కావచ్చు, కాకపోవచ్చు. ఇంతలో రూమ్‌లో వెనకవైపు, మరో చప్పుడయింది. కాఫీ కప్పు కిందపడిన ధ్వని. వెనక్కు తిరిగి చూశాడు. మళ్ళీ తలుపు చప్పుడు. అంతా క్షణంలో అయోమయంగా ఉంది. రావు చివాల్న లేచాడు బాబూ, నేనండీ వీరాస్వామిని, బంగళా వాచ్‌మన్‌ని తలుపు తీయండి అని విన్పించింది. ధైర్యంగా తలుపు తీశాడు. చేతిలో తాళం చేతుల గుత్తి, వీరాస్వామి ఎదురుగా నిల్చున్నాడు.

బాబూ ఊళ్ళో కొంచెం పనివుండి వెళ్ళి ఇప్పుడే వచ్చాను. బయట గేటుకు, ఇక్కడ గదులకూ తాళాలన్నీ వేస్తున్నాను. మీకు ఉదయం కాఫీ, టిఫిన్ ఇక్కడకు తెమ్మన్నారా లేకపోతే మీరే వెళ్తారా హోటలుకు అని అడిగి పోదామని వచ్చాను.

"ఇక్కడికే తీసుకురావోయ్" అని చెప్పి తలుపు వేసుకొని వెళ్తుండగా కొంచెం ఎలుకలు కూడా ఉన్నాయి. జాగ్రత్త బాబూ"అని చెప్పి వీరాస్వామి వెళ్ళాడు. కొంచెం సేపటికి రావుకు నిద్రపట్టింది, తెల్లవారింది. బద్ధకంగా లేచాడు. అప్పటికే వీరాస్వామి కాఫీ, టిఫినూ తెచ్చి రెడీగా ఉన్నాడు.

కాఫీ తాగి సిగరెట్టు వెలిగించాడు, రాత్రి తనకు వచ్చిన కలను గురించి ఆలోచిస్తూ తనకు అనుకోకుండా ప్రమోషన్ వచ్చినట్లు మిత్రులందరూ వచ్చి తనను అభినందించినట్లు, తనకిప్పుడు ప్రమోషన్ రావల్సిన టైము కాదే తనపై ఇంకా 'సీనియర్స్' ఉన్నారే అని తను అనుకున్నట్లు... ఇది కలలోని దృశ్యం... ఇది పట్టికల నిజమెందుకవుతుంది అనుకున్నాడు. అబ్సర్డ్ అని సమాధానపర్చుకున్నాడు. రావు పని ముగించుకొని తిరుగు ప్రయాణం అయ్యాడు.

ఆఫీసుకు వెళ్ళగానే "ఆఫీసరు" అంటే "బాస్" ఎందుకో పిలుస్తున్నారని కబురు వచ్చింది. తనేం తప్పు చేశాడో, ఎందుకు వెంటనే పిలుస్తున్నాడో, ఏం జరుగుతుందో అని భయపడుతూనే వెళ్ళాడు. రావులోని ఈ భయానికి అంతులేదు. రావుని చూస్తూనే "బాస్" కంగ్రాట్సు మిస్టర్ రావు... అని చేతిని అందుకున్నాడు. రావుకు నవ్వాలో ఏడ్వాలో తెలీలేదు. మరి మన సీనియర్స్ సంగతేమిటి, అనుకుంటూ తన రూముకు వచ్చేశాడు. ఈ సంతోషానికి అతనికి భయం వేసింది. కొంచెం వణుకు కూడా వచ్చింది. తన మనసులోని భయం ఎవరికి కన్పించదు. అందరి దృష్టిలో రావు

చలాకీ అయిన మనిషి, ఇక తనను చూసికూడా తను భయపడటం మొదలుపెట్టాడు. ఇంతకు ముందు తన భయాన్ని గురించి ఎవరితోనూ చెప్పుకోనివాడు, ఆ రోజు చెప్పుకోవాలనిపించింది. లేకపోతే తను భరించలేడు. ఈ విషయం అమ్మకు చెప్పాలి అనుకున్నాడు.

ఆ రాత్రి భోజనాలయిన తరువాత అమ్మ దగ్గర కూర్చుని తన విషయం అంతా చెప్పుకున్నాడు. దీనికి తరుణోపాయం ఏమిటి అని అడిగాడు. సోమిదేవమ్మగారు నవ్వింది. నవ్వుతూ దీనికి సమాధానం మీ నాన్నగారే చెప్పాలి అన్నది. నాన్నగారు ఈ లోకంలో లేరు, చిన్నప్పుడే నాన్నను పోగొట్టుకున్న దురదృష్టవంతుణ్ణి అంటూ కంటతడిపెట్టాడు రావు. నాయనా బాధపడకు తండ్రీ నిజంగా మీనాన్నగారే చెప్తారు. నీవు నమ్మవుగాని నాకప్పుడప్పుడు కన్పిస్తుంటారు ఆయన్నే తల్చుకో అంటూ ఆమెకూడా ఆయన్నే తల్చుకున్నది కొంచెంసేపు కళ్ళు మూసుకుని. ఆమె దృష్టి ఎందుకో ఏదో వ్రాసుకుంటున్న ప్రసాద్‌వైపు మళ్ళింది. "బాబూ" అని పిలిచింది. ఏమిటిరా వ్రాస్తున్నావూ అన్నది. లెక్కలు బామ్మా అన్నాడు వాడు. వాడివైపు ఎందుకో తీక్షణంగా చూసింది. వాడేదో వ్రాసుకుపోతున్నాడు. రావుకూడా వాడివైపే చూస్తున్నాడు. వాడు వ్రాస్తున్నది లెఖ్ఖలు కాదు. ఏవిటో, ఏవిటో, పెద్ద వాళ్ళమాదరి రాసేస్తున్నాడు. గబగబా అక్షరాలు వాడివిగాదు, శైలి వాడిది కాదు. ఆ పుస్తకం అక్కడపడేసి నిద్రవస్తున్నది. బామ్మా అని వెళ్ళాడు. రావు పుస్తకం తీసుకుని చూశాడు. "ఎందుకురా అంత భయం భయపడుతున్నది నీవు కాదుఅసలు? నీవునీవే కాదు నీ నీడను చూసి నీవు భయపడుతున్నావని నీవనుకుంటున్నావు. నీవెవరు అసలు నీవు వేరు భయం వేరు నీ భయంవేరు ఎవ్వరూ ఏదీ కాదు, ఎవ్వరూ దేనిని చూసీ భయపడనక్కరలేదు నీవని నీవు చూసుకో, ప్రసాద్ వుండగా నీకేం భయంరా" అని ఉన్నది దాంట్లో.

అమ్మా అని కేకవేశాడు రావు.

"అది మీ నాన్నగారి స్వదస్తూరిరా అబ్బాయి" అన్నది ఆమె మామూలుగా నవ్వుతూ- రావుకు భయం పోయిందో లేదో ఇంకా అనుమానంగా ఉంది. అతనిలోని సంఘర్షణ ఇంకా ఉన్నాననిపిస్తోందేమో!

 

*ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 30-8-1968*

# 8

# ఆకుపచ్చ ప్రపంచం

మాధవయ్యది మామూలు ప్రపంచం కాదు. మరో ప్రపంచం. ఆకుపచ్చ ప్రపంచం. అదో ప్రపంచం. ఎప్పుడూ పుస్తకాలు చదివేవాళ్ళ్ని పుస్తకాల పురుగు అంటారు. ఆ పద్ధతిలోనే, మాధవయ్యను పొలంపురుగు అన్నారు. 'పొలం పిచ్చోడు' అన్నారు ఆ ఊరువాళ్ళంతా. ఆ అనే వాళ్ళను చూసి నవ్వుకునేవాడు మాధవయ్య. ఆ నవ్వులో బోలెడంత తృప్తి ఉండేది.

ఎప్పుడూ రాళ్ళు తప్ప ఏమీ పండని ఆ పొలంలో బంగారం పండించి సెభాష్ అనిపించుకున్నాడు. రాళ్ళు పండుతున్న పదెకరాల పొలాన్ని చౌకగా కొన్నాడు. కొన్న తరువాత, నీళ్ళకోసం భగీరథ ప్రయత్నం చేశాడు. సాధించాడు. దానికి చాలా డబ్బు ఖర్చయినా, తన ఆశ ఫలించిందని ఎంతగానో సంతోషించాడు. అప్పటి నుండి పంచప్రాణాలూ పొలంమీదనే పెట్టుకుని పసిపిల్లను సాకినట్లు సాకాడు దాన్ని.

ఇల్లూ, నగా నట్రా తాకట్టు పెట్టి శెట్టి దగ్గర తెచ్చిన డబ్బంతా పొలం మీద పెట్టాడు. అసలు సంగతి అలా ఉంచి వడ్డీమాత్రం కట్టేటప్పటికి తల ప్రాణం తోకకు వచ్చేది మాధవయ్యకు.

పక్షులన్నా, మొక్కలన్నా, చెట్లన్నా, తోటలన్నా మాధవయ్యకు పంచప్రాణం. మాధవయ్య ఇంటికి బోలెడు పెరడు ఉంది. ఒక్క అంగుళం స్థలం ఊరికే పోనివ్వకుండా – పూలమొక్కలతోనూ కూర పాదులతోనూ నింపేశాడు దాన్ని. ఎప్పుడో నిద్రపోయేటప్పుడు ఆ కొన్ని టైమూ తప్ప, మిగతాకాలం అంతా, పొలం మీదా, పెరడుమీదా వినియోగించేవాడు.

ఇదిగాక, పావురాళ్ళు, కోళ్ళు పెంచేవాడు మాధవయ్య. మాధవయ్య దగ్గర తెల్లటి ఆవు ఒకటి ఉంది. ఉదయం లేస్తూనే దానికి దణ్ణం పెట్టంది ఏ పనికీ ఉపక్రమించేవాడు కాదు. ఆ ఆవుకో బుజ్జాయి ఉంది. దానిది గోధుమవన్నె ఛాయ. దాన్నెప్పుడూ ముద్దాడుతూ ఉంటాడు. పెరట్లో ఉన్న పూలమొక్కలు మాధవయ్యను చూస్తే నవ్వుతాయి. నవ్విస్తాయి. మాధవయ్య భాష, మనుషులకు తప్ప అందరికీ అర్థమవుతుంది. మొక్కలతోనూ, పక్షులతోనూ, ఆవుతోనూ మాట్లాడుతూ ఉంటాడు. అందుకనే రామాపురంలో ఉన్నవాళ్ళంతా మాధవయ్యను 'పిచ్చోడు' అన్నారు. ఎవరి పిచ్చి వాళ్ళకానందంలే అనుకున్నాడు మాధవయ్య.

మాధవయ్య కొడుకు పట్నంలో చదువుతున్నాడు. ఎప్పుడూ డబ్బు పంపమని తండ్రిని ఒత్తిడిచేస్తూనే ఉంటాడు. ఎందుకొచ్చిన కాలేజి చదువులో అని మాధవయ్య అనుకుంటూ ఉంటాడు. మాధవయ్య కొడుకు కూడా తండ్రిని 'పిచ్చోడి' కింద కట్టేశాడు. ఒకసారి సెలవులకు వచ్చినప్పుడు తండ్రితో అన్నాడు... 'ఏమిటి నాన్నా ఎప్పుడూ పొలం పొలం... అని పట్టుకు కూచుంటావు. దానిమీద బోలెడు అప్పు చేశావు... ఎందుకొచ్చిన శ్రమ చెప్పు... ఈ వయసులో... ఈ ఇల్లు పొలం అమ్మేసి పట్నానికి వెళ్దాం... నేనేదో ఉద్యోగంలో చేరతాను... పట్నవాసం హాయిగా ఉంటుంది" అని.

మాధవయ్యకు కొరడాతో కొట్టినట్లయింది. తమాయించుకుని నవ్వి ఊరుకున్నాడు.

మాధవయ్య చేతి చలవో, లేకపోతే అతను చేసిన కృషి ఫలితమో గాని... పట్టిందంతా బంగారం అయింది.

కాయగూరలు ఏపుగా పెరిగినై.

రంగు రంగుల రోజాపూలు విపరీతంగా ఎదిగినై.

పొలంలో కొంతభాగం చెఱకు, అరటి కింద వినియోగించాడు.

పట్నంలో ఎగ్జిబిషన్ జరిగినప్పుడల్లా తను పండించిన కాయగూరలూ మొదలైనవి ఉత్సాహంగా తీసికెళ్ళి ప్రదర్శించేవాడు. ఎన్నో బహుమతులందుకున్నాడు. ఇంటికి వచ్చి మొక్కల్ని, ఆవును, ఆ ఆనందోత్సాహంతో కావలించుకునేవాడు. ఆనందంలో అతని కళ్ళు చెమర్చేవి...

చెఱకుతోటకు అరటితోటకు మళ్ళీ బోలెడు డబ్బు కావల్సి వచ్చింది. ఎక్కడి డబ్బూ సరిపోవడం లేదు. ఎరువులకు, వాసాలకు... ఇంకా అమాంబాపతు ఖర్చులకు డబ్బుకు కొంచెం గిజగిజలాడుతున్నాడు. శెట్టిదగ్గర తెచ్చిన డబ్బు వడ్డీతో సహా మూడింతలయింది అప్పటికే...

పరిస్థితులిలా ఉంటే కొడుకు డబ్బు పంపించమని ఒత్తిడి చేస్తున్నాడు. అవతల ఆడపిల్ల పెళ్ళికి ఎదిగి కూచుంది.

తెలుగు పేపర్లలోనూ, రేడియోలోనూ... ఈ మధ్య ఎక్కువగా వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వంవాళ్లు ఇంకా కొన్ని బ్యాంకులూ సహాయం చేస్తున్నట్లు ప్రకటిస్తున్నారు. ఎన్నో సదుపాయాలున్నాయి అంటున్నారు. మాధవయ్యకు ఈ విషయం తెలిసిందిగాని 'అసలే అప్పుల్లో నిండామునిగి ఉన్నాను నా కెవరు సహాయం చేస్తారు' అనుకున్నాడు. 'నే నేదో చిన్న రైతును... బ్యాంకుకు వెళ్ళి అడిగే తాహతు నా కెక్కడ ఉంది' అనుకున్నాడు. ఒకవైపు ఏదో ఆశ, మరో వైపు నిరుత్సాహం... అతన్ని తరుముతున్నై... ఊళ్ళో ఒకరిద్దరు పెద్ద రైతులతో సంప్రదించాడు. "మాధవయ్యా... ఓసారి పట్నం వెళ్ళి బ్యాంకులో ప్రయత్నం చెయ్యి... కష్టసుఖాలు చెప్పుకో... ఆదుకుంటే ఆదుకుంటారు... ప్రయత్నం చేయడంవల్ల నష్టం లేదు కదా" అన్నారు.

ధైర్యం చేసి పట్నంవెళ్ళి భయపడుతూ... భయపడుతూ బ్యాంక్‌లో అడుగు పెట్టాడు. తనకొచ్చిన బహుమతులు చూపించాడు. ఎన్నేళ్ళబట్టి ఎలా కృషిచేస్తున్నాడో చెప్పుకున్నాడు. బ్యాంక్ వడ్డీ చాలా తక్కువ అని తెలుసుకునేటప్పటికి ఎగిరి గంతేశాడు.

ఆ సమయంలో శెట్టి అతనికి ఓ కిరాతకుడుగా కన్పించాడు. బ్యాంక్ వారు మాధవయ్యను విచారించి అన్ని విషయాలు తెలుసుకున్నారు. పంట చేతికి రావడానికి ముఖ్యంగా ఎంత డబ్బు అవసరమో వివరించి చెప్పాడు. అంచనా ప్రకారం డబ్బు ఖర్చుపెడితే చెఱకుమీద, అరటిమీద బోలెడు డబ్బు వస్తుంది. మాధవయ్య నిజాయితీని బ్యాంక్‌వాళ్ళు అర్థం చేసుకున్నారు. రామాపురం వచ్చి బ్యాంక్ వాళ్ళు మాధవయ్య తోటను చూశారు. శెట్టిని వదిలించుకోడానికి కూడా డబ్బు ఇస్తామన్నారు. పొలం, ఇల్లు, నగ నట్ర.. ఉన్న స్థిరాస్తి చరాస్తి కూడా బ్యాంక్ వారి అధీనంలో ఉంచడానికి ఒప్పుకున్నాడు మాధవయ్య

బ్యాంక్‌వారిచ్చిన డబ్బుతో కావలసిన ఎరువులు మొదలైనవి కొని... అరటితోటను, చెఱకు తోటను తన చెమటతో తడిపేశాడు. అతని కృషి ఫలించింది...

చెఱకు ఏపుగా పండింది. పంచదార ఫ్యాక్టరీవాళ్ళు ఎక్కువ ఖరీదుకు కొనుక్కున్నారు. అరటి గెలల సంగతి చెప్పనే అక్కర్లేదు. కాయలు పది మొదలు పన్నెండంగుళాల వరకూ వచ్చినయి. మాధవయ్య సంతోషానికి మేరలేదు.

బి.ఏ. అయిన తరువాత ఇంటికి వచ్చాడు కొడుకు. పట్నంలో మళ్ళీ ఎం.ఏ. చదవాలని అతని కోరిక.

మాధవయ్యకు అనుకున్న దానికన్నా ఎక్కువే ఆదాయం వచ్చింది. దాంట్లో కొంత మొత్తం బ్యాంకుకు కట్టేశాడు. మరో సంవత్సరమైతే మిగతాది కూడా తీర్చేస్తాడు.

కొడుకును పై చదువులకు పంపించడం ఇష్టంలేదు మాధవయ్యకు. కొడుక్కు ఈ విషయం చెప్పడానికి భయపడుతున్నాడు. రెండు మూడేళ్ళు ఇలా కష్టపడితే మరికొంత పొలం కొనుక్కోవచ్చు... ఆకుపచ్చ ప్రపంచం తప్ప మరోటి కన్పించడం లేదు మాధవయ్యకు...

కొడుకుని ఒకటి రెండుసార్లు పొలానికి తీసికెళ్ళి చూపించాడు. క్రమ క్రమంగా అతనిచేత చిన్న చిన్న పనులు గూడా చేయిస్తున్నాడు.

'నీవొచ్చిన తరువాత కాయగూరలు, పూలమొక్కలు బాగా వస్తున్నాయిరా అబ్బీ...' అన్నాడు ఓ రోజున మాధవయ్య కొడుకుతో...

అనుకోకుండా క్రమేణా కొడుకులో వచ్చినమార్పు గ్రహించాడు. తనకన్నా ఎక్కువ శ్రద్ధచూపిస్తున్నాడు. దిగిన తరువాత లోతు తెలిసింది కొడుక్కి. పట్నానికి రాసికొన్ని పుస్తకాలు తెప్పించాడు వ్యవసాయానికి సంబంధించినవి.

ఒక రోజు భోజనాలు చేస్తుండగా మాధవయ్య కొడుకును హెచ్చరించాడు. 'ఏరా అబ్బీ... ఎం.ఏ. సంగతేం చేశావ్' అని.

'ఎం.ఏ. లేదు గిం.ఏ. లేదు నాన్నా... నాకీ ఆకుపచ్చ ప్రపంచం తప్ప... మరోదాంతో సంబంధం లేదు.. వచ్చే ఏడు పంటలో తెలుస్తుందిలే నా తడాఖా...' అన్నాడు అబ్బీ...

ఆనందబాష్పాలో... ఏవిటో తెలియదుగాని మాధవయ్య కళ్ళు చెమర్చినయి. .!

# 9

# విప్లవ కారులు

బొనిన గూడెంలోంచి బయటపడ్డ రోజుల్లో విషం కక్కుతున్న నల్లత్రాచు వేసిన కాటుకు కళ్ళు చెదిరి, వేసిన పాదం వేసినట్టుగానే ఉంచి... మూడోకన్ను సగం తెరచిన త్రిమూర్తులలో ఒకడైన శంకరుని భంగిమలో ముందుకు పోదామా వద్దా అని గుంజాటన పడుతూ... చంద్రుడివంటివాడు తన నెందుకు పిలుస్తున్నట్టు అని మహానందపడి... శూన్యాన్ని పులుముకున్న చిక్కటి చీకటిలోకి దూసుకుపోయినాడు కాదు దూసుకు పోయినారు. చూపుమేర దూరంలో ముగ్గురు కనపడీ కనపడనట్టుగా ఉన్నారు. ఊరి పొలిమేరలు దాటిందీ లేందీ కనపడలేదు...

గూడెంలో ప్రజలు నాలికలు కొరుక్కున్నారు.

పుట్టుకతోనే పుట్టతేనె తప్ప మరోటి ఎరుగని గూడెంలోని పసిపిల్లలకు మద మాత్సర్యాలంటే ఏమిటో మనం చెప్పాలి.

ఈర్ష్యలూ, ద్వేషాలూ గూడెంలోని అమాయకపు తల్లులకి లేవు. శీలానికీ మనస్తత్వానికీ మంచితనానికీ... ఆ చేరడేసి కళ్ళతో చూస్తున్న తల్లులనే తలచుకోవాలి...

బద్ధవిరోధులూ... సూర్యుడూ... చంద్రుడూ... ఆ గూడెంలో తప్ప మరోచోట అంత ఎక్కువగా సంచారం చెయ్యరు. గూడెం బొనినగూడెమైనా వాళ్ళ కెందుకో అంత ప్రేమ!!

అంతకుముందు కులం గోత్రంతో నిమిత్తంలేని గూడెంలో అది బొనినగూడె మయ్యేటప్పటికి... అభిప్రాయభేదాలూ మాట పట్టింపులూ అప్పుడే వచ్చినయి... ఆ వచ్చిన అభిప్రాయ భేదాలే... పునాదులై... పారిన మనుష్య రక్తంలో నాటుకుపోయి...

పీకినా రాకుండా... పెట్టిన కోటగోడలవలె... నక్షత్రాలని అందుకుంటూ... దూరాన కనపడుతున్న సముద్రంలోకి వంగి చూస్తున్నయి...

ఇప్పుడు:

గూడెం బానిసగూడెం...

గూడెంలోని మనుష్యులు బానిసలు...

బానిసలు చేసేవని బానిసత్వము...

గూడెంలో పంట కొచ్చిన ఆహారం చేతిదాకా వస్తుంది...

కాని నోటిదాకా రాదు...

గూడెం నానాటికి క్షీణించిపోతున్నది.

గూడెంలో మనుషులు కొంతమంది చచ్చిపోతున్నారు.

ఇంకా ముందు ఏమవుతుందో–

ఇవి గూడెంలో ఒకరిద్దరు అనుకున్న మాటలు...

వాళ్ళ కళ్ళు చెమ్మగిలినాయి...

ఇది సహించలేం అని... ఉద్రేకం కలవాళ్ళు వాళ్ళల్లో వాళ్ళు అనుకుని... నైరాశ్యం భుజిస్తూ నెట్టుకుపోతున్నారు. ముందుకు పోతున్న రథ చక్రాల్ని...

ఎన్నడూలేంది బానిసగూడెంలో ఉన్నట్టుండి కల్లోలం బయలుదేరింది... పసిపిల్లలు పాలుత్రాగక కెవ్వుమని ఏడుస్తున్నారు. ఏ విధాన లాలించినా ఊరుకోరు ఏమిటో కావాల్ట వాళ్ళకి... దాని కోసం చాలీ చాలని చేతుల్ని చాచుతూ... అందుకుంటామా అందుకోలేమా... అన్నట్టు

గూడెంలోని ప్రజలకు చదువు సంధ్యలు అంత బాగా అబ్బకపోయినా మనం బానిసలుగా ఎందుకుండాలి... అనుకునేంత జ్ఞానం వచ్చింది.

అమ్మా... బాబోయ్... పొంగి పొర్లి వస్తూన్న వాళ్ళల్లోని ఉద్రేకం కట్టలు తెంచుకొని... ఈ పరిధిలోని బ్రహ్మాండానికి పునాదులు కదిలించి ఊగిస్తుందని... గూడెం దయ్యం వేషం వేసుకుని జుట్టు విరియబోసుకుని అరుస్తున్నట్టుగా ఉంది.

రండి... రండి అని చేతులెత్తి పిలుస్తున్నది... గూడెంలోని అమాయకపు అమ్మలకి పీడ కలలు వచ్చి... భూతాలూ పిశాచాలూ కన్పించినయి... పసిపిల్లలు నిద్రపోవటం లేదు. పెద్దవాళ్ళు తికమక పడుతున్నారు... ఏవిటి చెయ్యడం అని... ఆకాశం విరుచుకుపడేట్లుగా గాండ్రించి ఉరుముతున్నది... గూడెం దిగిపోతున్నది...

గూడెంలోని ప్రజలు కొంతమంది పస్తులుండి... ప్రాణాలు వదలలేక వదలిన రోజులూ ఉన్నయి...

బానిస గూడెంలో పెద్దబానిస దగ్గరకు తడబడుతున్న అడుగుల్తో వెళ్లారు. పెద్ద బానిస చిరునవ్వు నవ్వి... ఏదో చెవుల్లో వినపడీ వినపడనట్లు చెప్పాడు. పెద్దబానిసకు చేతులెత్తి దణ్ణం పెట్టారు. వాళ్ళ ముఖాలలో ప్రసన్నత ఇప్పుడు కన్పిస్తున్నది...

గూడెంలో కన్పడని ఆ ముగ్గురు మనుషుల్ని గురించి ఇప్పటికీ అనుకుంటుంటారు ప్రజలు... కొందరు. గూడెంలో కన్పడకుండా ఉన్నారు వాళ్లు అని అనుకుంటారు. గూడెం అంతా కుమిలిపోతున్నది.

రక్తపాతం అక్కర్లేదని పెద్దబానిస సలహా...

మాటలు వస్తూన్న పసిపిల్లలు... గూడెంలో కన్పించకుండా తిరుగుతున్నవాళ్ల విషయం తలుచుకుని... విప్లవకారులు అని అంటున్నారు... వాళ్ళ కెవరు నేర్పారో?

*సృజన, ఏప్రిల్ 1971*

# 10

# మనిషి రంగు

మా సంస్థకు సంబంధించిన సుమారు ఇరవైమంది సీనియర్ ఆఫీసర్స్ ఒకచోట కలుసుకోవడం తటస్థించింది. దేశంలో పెద్ద పెద్ద ఊళ్ళనుండి వచ్చారు. కొంతమంది విమానాల్లోనూ, కొంతమంది రైళ్ళలోనూ వచ్చారు. మా అందరికీ బంజారాహిల్స్‌లో పెద్ద భవనంలో బస. అక్కడే ప్రోగ్రామ్ అంతా. ఒక వారం రోజుల పాటు. ప్రతిరోజూ లెక్చర్లూ, గ్రూప్ డిస్కషన్లూ, సెమినార్లూ, కాన్ఫరెన్సులూ ఉదయం తొమ్మిదినుండి సాయంత్రం అయిదువరకూ ఊపిరి సలపని కార్యక్రమం.

మేం వెళ్ళగానే నోటీస్ బోర్డులో మా పేర్లూ, మాకు కేటాయించిన రూమ్సు చూసుకున్నాం. ఒక్కొక్క రూములో ఇద్దరు. కలకత్తా, బొంబే, ఢిల్లీ, త్రివేండ్రమ్, భోపాల్, నాగపూర్, మద్రాసు, లక్నో, గౌహతి, పంజిమ్... ఇంకా అనేక ఊళ్ళనుండి వచ్చారు కార్యక్రమంలో పాల్గొనేందుకు. ఛటర్జీ, జైన్, సనాతె, అద్వాని, బల్దేవ్‌సింగ్, ప్రేమ్‌నాథ్, కురూప్, కృష్ణస్వామి, భట్టాచార్జీ, దివేకర్, సోమ్‌నాథ్, సోహన్‌లాల్... ఇంకా ఇలాంటి పేర్లుగలవారందరూ ఉన్నారు.

అందరమూ ఒకరికొకరు పరిచయం చేసుకున్నాం. ఈ ప్రోగ్రామ్ మూలకంగా అందరం ఒకచోట కలుసుకోవడం తటస్థించింది. ఇది చాలా బావుంది అని ఛటర్జీ పెద్దగా నవ్వేడు. ఆ నవ్వులో ఆప్యాయత సుహృద్భావం ఉట్టిపడుతోంది. జైన్ అందర్నీ కౌగిలించుకున్నాడు. అందరమూ ఇంచుమించు సమవయస్కులమైనా సనాతె అందరిలోకి పెద్దవాడుగా కన్పిస్తాడు. బహుశా అతని ఆకారంవల్లనేమో! మనిషి ఆజానుబాహుపు, ఠీవిగా ఉంటాడు. సిగార్ కాలుస్తూ పంటి మొనలతో మాట్లాడుతాడు.

అతని మాటల్లో ఒక్కొక్కప్పుడు స్పష్టత కన్పించదు. అతని గొంతు చాలా బావుంటుంది. నోట్లో సిగార్ తీసి మాట్లాడుతుంటే సంగీతం వినిపించినట్టే ఉంటుంది.

మళ్ళీ కలుసుకుందామని మాకు కేటాయించిన బసలకు వెళ్ళాము. ప్రయాణ బడలికవల్ల అందరూ అలసిపోయినారు. ఒకరూమ్ నాకూ, చటర్జీకి కేటాయించారు. రూమ్‌లో సామానూ అవి సర్దిన తరువాత రేడియో వింటూ 'టాస్'లో కూర్చున్నాను. పరిసరాలంతా ప్రశాంతంగా ఉన్నవి. ఎత్తైన ప్రదేశంలో ఉండడంచేత దూరంనుండి అలంకరించిన బొమ్మరిళ్ళలాగ ఉన్నాయి కన్పిస్తున్న భవనాలు. కొంచెం దూరంలో హుసేన్‌సాగర్‌లోని నీటి కదలిక, సూర్యకిరణాలు నీళ్ళల్లోపడి ప్రతిఫలించి తమాషాగా మెరుస్తున్నాయి.

వరండాముందు పెద్ద లాన్. ఆకుపచ్చ తివాచీ పరచినట్టుగా ఉంది. లాన్‌కూ వరండాకూ మధ్యన లెక్కలేనన్ని ఫ్లవర్‌పాట్స్. అవి అన్ని రంగులలోనూ అమర్చి ఉన్నాయి. కొన్ని పొట్టిగానూ, కొన్ని పొడవుగానూ ఉన్నాయి. పొట్టిగా ఉన్న పాట్స్ మూడు చిన్న చిన్న కాళ్ళమీద నిల్చుని వున్నాయి. కొన్ని శంఖం ఆకారంలోనూ, కొన్ని కోడిగుడ్డు ఆకారంలోనూ, కొన్ని గంధపుగిన్నె ఆకారంలోనూ ఉన్నాయి. ఎంట్రెన్స్‌లో బోగిన్ విలా అల్లుకుని అందరికీ స్వాగతం చెప్తున్నది. పాట్స్‌లో రకరకాల పూలమొక్కలు, రోస్, బటర్‌కప్, క్లోవర్, పాపీ, డెయిసీ, డేఫడిల్ ఇంకా ఎన్నో... ఈ పూలను ఎంతసేపైనా చూస్తూ కూర్చోవచ్చు... చూస్తూ కూర్చున్నాను. ఎయిర్‌హోస్టెస్ అందమైన ముఖం. ఆమె వయ్యారపు నడక లాన్ చూస్తుంటే ఆమె ధరించిన ఆకుపచ్చ షిఫాన్ చీరె, ఫ్లవర్‌పాట్స్ వాటిలోని రకరకాల పూలూ ఆమె అవయవ సౌందర్యమూ ఒక్కసారి కళ్ళముందు తిరిగినట్టయింది. ప్రతి పువ్వులోనూ ఆమె ముఖం కనిపిస్తున్నది. ఆమెలోని సుకుమారం ఆమె కంటిపాపలలోని కదలిక సూర్యకిరణాలు నీళ్ళను తాకి, సంధ్యా సమయపు చల్లదనానికి సూర్యుడు నీళ్ళను కౌగిలించుకున్నాడో, నీళ్ళు సూర్యుణ్ణి కౌగిలించుకున్నాయో తెలియకుండా ఉంది.

ఇంతలో బోయ్ 'టీ' తీసుకువచ్చి 'సార్' అంటే మళ్ళీ ఈ లోకంలోకి వచ్చేను. చటర్జీగారు నీలపు పైజామా వేసుకుని వచ్చుటి లాబీలో తన శరీరాన్ని ఊపుకుంటూ హుందాగా వచ్చి నాపక్కన కూర్చున్నాడు, ఇద్దరం టీ తాగి పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ

అక్కడే చాలాసేపు కూర్చున్నాం. మాకు 'టీ' తెచ్చిన బోయ్ చాలా హుషారుగా ఉన్నాడు.

'బాబూ గీజర్ స్విచ్ వేశాను. మరో పది నిమిషాల్లో వేడినీళ్లు రెడీ అవుతాయి. మీరు స్నానం చెయ్యొచ్చు' అన్నాడు.

బోయ్ జుట్టంతా తెల్లగా ముగ్గుబుట్టలా ఉంది. వయసులో తాతలా ఉన్నా అతను వేసుకున్న తెల్ల యూనిఫారమ్ వల్లా, చలాకీగా నడుస్తున్న నడకవల్లా యువకుడిలాగే కన్పిస్తున్నాడు. ఏ పని చేసినా చాల శ్రద్ధగా చేస్తున్నాడు.

రూమ్‌లో రెండు అలమారాలూ, రెండు టేబిల్సు, రెండు టీపాయిలు,రెండు స్టాండ్సు ఉన్నయి. ఎవరి అల్మారాలో వాళ్ళ వస్తువులు అమర్చుకున్నాం. టేబిల్‌లైట్ ఎటువైపు కావాలంటే అటువైపు వంచుకోవచ్చు. ఇద్దరికీ కలిపి ఒక డ్రస్సింగ్ టేబిల్. దానికి అమర్చబడిన అద్దం ముందుకూ వెనక్కూ కదలించవచ్చు. బాత్‌రూమ్‌లో ఒక స్టాండూ, వాష్‌బేసిన్, ఒక మిర్రర్ అక్కడక్కడా 'ఒడోనిల్' కూడా ఉంది. సువాసన విరజిమ్ముతూ.

చటర్జీ ఏం మాట్లాడినా సోదరభావం కన్పిస్తోంది.

'మీరు స్నానంచేస్తారా' అన్నాడు నన్ను స్నానానికి లెమ్మని గుర్తు చేస్తూ. ఆ పూలచెట్లు, ఆ వాతావరణం నాకు చాలా హాయిగా ఉంది. స్నానం అయిన తరువాత మళ్ళీ వచ్చి కూర్చుని చూడవచ్చుననుకొని స్నానానికి బయలుదేరాను.

షవర్‌లో స్నానం చేస్తున్నంతసేపూ ఎయిర్ హోస్టెస్ జ్ఞాపకం వచ్చింది. ఇంకా విమానంలో కూర్చున్నట్టే ఉన్నది. షవర్‌లోంచి సన్నటి ధారలు నా తలమీద పడుతుంటే కలిగిన ధ్వని చిటపట చినుకుల్లా ఉన్నాయి. ఎయిర్ హోస్టెస్ మాటలూ అలానే ఉన్నాయి. ఆమెను నేను ఎరుగను. పరిచయంలేదు. ప్లేన్‌లో బ్రేక్‌ఫాస్టూ లంచీ సర్వ్‌చేసేటప్పుడు నాకు చాలా దగ్గరగా వచ్చింది. ఆమె అందాన్ని చూస్తూ ఆమెను తలుస్తూ నా తలమీద పడుతున్న చిటపట చినుకుల్లో ముఖానికి రాసుకున్న సబ్బునురగలు చల్లగా మెత్తగా శరీరంమీదికి జారుతుంటే ఆమెచేత్తో నా భుజాన్ని నిమిరినట్టే ఉంది. స్నానం అయిన తరువాత ఆకుపచ్చ టవల్ వంటికి చుట్టుకుని బాత్‌రూమ్ సాండల్స్‌లో కాళ్ళుపెట్టేటప్పటికి ఆమె షిఫాన్ చీరె నా వంటికి చుట్టి

నన్ను దగ్గరకు తీసుకున్నట్టే ఉంది. ఆమెను మరచిపోవడానికి ప్రయత్నించినా జ్ఞాపకం వస్తూనే ఉంది. మళ్ళీ తిరిగి వెళ్ళేటప్పుడు విమానంలో కన్పిస్తే బావుండు ననుకొన్నాను. ఏదో కూనిరాగం తీస్తూ బాత్‌రూమ్‌లోంచి బయటపడ్డాను.

నన్ను చూసి చటర్జీ మీరు చాలా బాగా పాడతారు అన్నాడు.

'నాకేం సంగీతం రాదు. అది వట్టి బాత్‌రూమ్ మ్యూజిక్' అన్నాను.

బాత్‌రూమ్‌లో మనసు నిర్మలంగానూ, హాయిగానూ ఉంటుందని అతనన్నాడు.

ఆ తర్వాత చటర్జీ స్నానానికి వెళ్ళేడు.

మళ్ళీ బాయ్ వచ్చేడు. ధోబీకి వేయవలసిన బట్టలు ఏమైనా ఉన్నయ్యా అని అడగడానికి. నా హోల్డాల్లోంచి కొన్ని గుడ్డలు తీసి ఇచ్చాను.

నీ పేరేమిటి అన్నాను.

'జాన్' అన్నాడు.

జాన్ నాతో హిందీలో మాట్లాడేడు. నేను హిందీలోనే సమాధానం ఇచ్చాను.

చటర్జీ స్నానం ముగించుకుని వచ్చిన తరువాత జాన్ అతణ్ణి కూడా బట్టల సంగతి అడిగేడు. బెంగాలీలో ఇతనికి బెంగాలీకూడా వచ్చే... అని ఆశ్చర్యంగా అతనివంక చూస్తున్నాను. చటర్జీ కూడా జాన్ వైపే చూస్తున్నాడు.

'డిన్నర్ ఎనిమిదింటికి రెడీ అవుతుంది. మీరు ఆ టైముకు రావచ్చు. నేను అక్కడే ఉంటాను' అన్నాడు జాన్.

నేనూ, చటర్జీ వరండాలో కూర్చున్నాం. ఇంతలో చీకటిపడి, కొంత నిశ్శబ్దాన్నీ ప్రశాంతతనూ తీసుకువచ్చింది ఆ పరిసరాలకు. బండమీద ఉన్న నియాన్ లైట్లన్నీ మిణుకు మిణుకుమని దూరానికి కన్పిస్తూ ఆ కాంతి హుస్సేన్‌సాగర్‌లోని నీళ్ళలో ప్రతిఫలిస్తూ నీళ్ళన్నీ [illegible] కన్పిస్తున్నాయి. ఆకుపచ్చరాళ్ళు పొదిగిన నెక్లెస్‌లా ఉన్నాయి బారుగా బండమీద ఉన్నలైట్లు. నీటి కదలికకు లైట్లు కూడా కదుల్తున్నట్టే ఉంది. ఎయిర్ హోస్టెస్ మెళ్ళోని ఆకుపచ్చ పగడాల దండ గుర్తుకు వచ్చింది. విమానంలో ఆమె అటూ ఇటూ కదుల్తుంటే ఆమె సుకుమారమైన శరీరాన్ని అంటిపెట్టుకుని చిన్న పాముపిల్లలా ఆ దండ కదిలేది. ఏది చూచినా ఆమే కన్పించడం

నాకేం బాగులేదు. ఏదైనా మంచి నవల చదివితే అందులోని పాత్రలు నిత్యమూ జ్ఞాపకం వస్తారు. మంచి స్నేహితుడు ఎంత దూరాన ఉన్నా కళ్ళల్లో మెదుల్తూ ఉంటాడు. ఎక్కడయినా తృప్తిగా భోజనంచేస్తే ఆ తృప్తినిచ్చిన భోజనపదార్థాలు జ్ఞాపకం ఉంటాయి. ఎయిర్ హోస్టెస్ నాకో పెయింటింగ్‌లాగే కన్పిస్తోంది. చటర్జీ ఏమీ మాట్లాడకుండా ఆకాశంలోకి చూస్తున్నాడు.

డిన్నర్‌వేళ అయిందని జాన్‌వచ్చి జ్ఞాపకం చేసేడు.

విజిటేరియన్ టేబుల్ దగ్గర కూర్చున్నాం ఇద్దరమూ. మా పక్కనే, నవాతె, జైన్ వచ్చి కూర్చున్నారు. మిగతా వాళ్ళందరూ మిగతా టేబిల్స్‌లో సర్దుకున్నారు. చటర్జీ డిన్నర్ ప్లేట్ ముందుకు జరువుకుని, నేప్‌కిన్ వళ్ళో పరుచుకొని 'మెనూ' కార్డువైపు చూస్తున్నాడు. అందరిదృష్టీ ఆ కార్డువైపే మళ్ళింది. ఇంతలో జాన్ వెజిటబిల్ సూప్ తెచ్చి డిషెస్‌లో అందరికీ ఇచ్చేడు. ప్రతి డిన్నర్ ప్లేట్ పక్కనా స్పూన్, ఫోర్క్ ఉన్నాయి.

మెనూ కార్డులో కాలీఫ్లవర్ భాజియా, వెజిటబిల్ పలావ్, ధార్, రావెజిటబిల్స్ టొమేటో, ఆనియన్... ఇంకా ఏవో ఉన్నాయి. చటర్జీ "ఇక్కడ 'రొసొగుల్లా' దొరుకుతుందా?" అని అడిగేడు.

'టిన్స్‌లో దొరుకుతుంది సాబ్ బజార్లో' అన్నాడు జాన్.

డైనింగ్ హాలంతా సందడిగా ఉంది. తెల్ల యూనిఫారాల బేరర్సు అటూ ఇటూ తిరుగుతున్నారు. నీళ్ళు చల్లగా ఉన్నాయి. పింగాణీ ప్లేట్లమీద ఫోర్క్సు, స్పూన్సు చేసే చప్పుడు ఏదో వాయిద్యం వాయించినట్లే ఉంది. నాలుగు మూలలా నాలుగు పెడస్టల్ ఫాన్సు కూడా తిరుగుతున్నాయి. ఆ ఫాన్స్ తిరుగుతున్నప్పుడు ఎయిర్ హోస్టెస్ విమానమూ జ్ఞాపకము వచ్చాయి. ఆరడుగుల మనిషి నిల్చుని విసురుతున్నట్టుగా ఉంది. పెడస్టల్ ఫాన్ రంగు ఆకుపచ్చగా ఉన్నది. మరోసారి చూస్తే ఎయిర్ హోస్టెస్సే అక్కడ నిల్చుని ఉన్నదేమోననిపించింది.

కప్పులో ఉన్న కర్డ్ స్పూన్‌తో తీసుకుని తింటూ 'ఇక్కడ కర్డ్ చాలా బావుంది' అన్నాడు జైన్. డిన్నర్ అయిన తరువాత కప్పుల్లో ఐస్‌క్రీమ్ తెచ్చి ఇచ్చేడు బేరర్. అది బావుందని చప్పరిస్తూ అన్నాడు జైన్. ట్రేలో కాఫీపాట్, మిల్క్‌పాట్, షుగర్‌బౌల్,

చిన్న చిన్న కప్పోలూ, స్పూన్లూ ఉంచి మాకు దగ్గరగా వచ్చాడు జాన్. ఖాళీ కప్పులు అందరికీ అందిచ్చి పాట్‌లోని డికాక్షన్ కప్పుల్లో పోసేను. చటర్జీ పాలు అందరికీ పోస్తున్నాడు. జైన్ షుగర్ టిన్‌లోంచి స్పూన్‌తో వన్ ఆర్ టూ అంటూ వేస్తున్నాడు. నవాతె చెయ్యి అడ్డంపెట్టి నో ప్లీజ్... అయాం డయబిటిక్... అంటూ తన జేబులోంచి ఏదో పొట్లం తీసి రెండు మాత్రలు వేసుకున్నాడు దాంట్లో. జైన్ కాఫీ కప్ చేతులో ఉన్నప్పుడు అతడి చేతులు కొంచెం వణకడం గమనించాను.

డిన్నర్ అయిన తరువాత ఎవరి రూమ్స్‌కు వాళ్లు వెళ్ళేం.

నేనూ చటర్జీ నైట్ డ్రస్ వేసికొని వరండాలో కూర్చున్నాం. నన్ను మళ్ళీ దూరాన ఉన్న రాళ్ళ నెక్లెస్ ఆకర్షిస్తున్నది. సిగరెట్ ముట్టించి చటర్జీకి ఒకటి ఆఫర్ చేసేను.

నాకు కొంచెం లివర్ కంప్లయింట్ ఉంది... డాక్టరు సలహావల్ల మానేశాను అన్నాడు.

చటర్జీ రేడియోదగ్గరకు వెళ్ళి ట్యూన్ చేస్తున్నాడు. బెంగాలీ సంగీతం వస్తోంది. 'రవీంద్ర సంగీతం మీరెప్పుడైనా విన్నారా' అన్నాడు.

'విన్నాను చాలా బావుంటుంది' అన్నాను.

ఆ మాటకు చటర్జీ ఉప్పొంగి పోయాడు.

'సంగీతమేకాదు బెంగాలీ సాహిత్యం కూడా బావుంటుంది... శరత్, బంకిమ్, వనఫూల్, తారాశంకర్... వీళ్ళ అనువాదాలు చదివేను. అవి మణిపూసలు' అన్నాను.

'వాళ్ళు కొంచెం ఇప్పుడు పాతపడిపోయినారు. ఆధునిక రచయితలు చాలామంది పైకి వస్తున్నారు. ఆ రచనలు చాలా బావుంటవి. మనోజబోస్, ప్రబోధ కుమార్ సన్యాల్, దేనేశ్ దాస్, సేన్‌గుప్త ఇంకా ఇలాంటి వాళ్ళు చాలామంది ఉన్నారు' అన్నాడు చటర్జీ. రచనలనగానే నాకు తెలుగు రచనలు జ్ఞాపకం వచ్చినవి. బుచ్చిబాబు, విశ్వనాథశాస్త్రి, కుటుంబరావు మొదలైనవాళ్ళ పేర్లు చెప్పి... కొన్ని కథల ఇతివృత్తం ఇంగ్లీషులో చటర్జీకి చెప్పేను.

చాలా బావున్నాయి అన్నాడు చటర్జీ.

నేనూ చటర్జీ దగ్గరగా వచ్చాం.

'కాళీటెంపిల్‌లో ఇంకా బలి జరుగుతునే ఉందా?' అన్నాను.

'విక్షేపంగా' అన్నాడు.

ఆ మాట అనగానే నాకు రామకృష్ణ పరమహంస జ్ఞప్తికి వచ్చేడు. పరమహంస జీవితం అద్భుతమైనదన్నారు.

'మీరు బేలూరు తప్పక చూడాలి' అన్నాడు చటర్జీ.

బేలూరులో మొదలైన పరమహంస, వివేకానంద వేదాంతం వరకూ చెప్పుకపోయినాడు చటర్జీ. వివేకానంద గొప్ప ప్రవక్త అన్నాడు చటర్జీ.

వివేకానంద అంటే నాకూ ఎంతో ఆసక్తి ఉన్నది కనుక మేమిద్దరం మరింత దగ్గరగా వచ్చేం.

పది గంటలు కావస్తోంది.

చటర్జీ నెమ్మదిగా లేచాడు.

'నన్ను క్షమించాలి. పడుకుంటాను. పెందలాడే పడుకొమ్మని డాక్టరు చెప్పేడు. మీరేమీ అనుకోరుగదా' అన్నాడు చటర్జీ.

నాకు త్వరగా నిద్రరాదు నేనేదైనా చదువుకుంటానన్నాను. చటర్జీ దుప్పటీ కప్పుకుని దోమతెరలో ప్రవేశించాడు.

'చటర్జీసాబ్! నేను సిగరెట్టు కాలిస్తే మీకేం అభ్యంతరం లేదు గదా' అంటూ 'మొరేవియా' పుస్తకం తీసుకొని చదవడం ప్రారంభించేను.

తెల్లవారింది. బద్ధకంగా ఉండటంచేత మెలుకువ వచ్చినా అలాగే పడుకున్నాను దుప్పటీ కప్పుకుని. అప్పటికే చటర్జీ లేచి అన్ని పనులూ ముగించుకొని అటూ ఇటూ తిరుగుతున్న హడావుడి కన్పిస్తోంది. నేను అటూ ఇటూ పొర్లుతున్న సమయంలో జాన్ వచ్చి, సార్ ఇంకా లేవలేదు... బెడ్ కాఫీ రెండుసార్లు తెచ్చి వెళ్ళిపోయినాను... అని నన్ను పలుకరించాడు. నేను నెమ్మదిగా వళ్ళు విరచుకొని లేచి మంచం మీదనే కూర్చున్నాను. నేను ఏ పనైనా హడావిడిగా చేయడం ఇష్టం ఉండదు. అది నా స్వభావం. నిద్ర ఆలస్యంగా లేస్తాను. లేచినా వెంటనే ఏ కార్యక్రమానికి ఉపక్రమించను. మంచంమీదనే కూర్చుని ఒక సిగరెట్టు ముట్టించి... రింగు రింగులుగా పొగ గాలిలో

వలయాలుగా నృత్య భంగిమలో వెళ్తుంటే చూస్తాను. గడియారం వైపూ సిగరెట్టు వైపూ చూసి... సిగరెట్టు అయిన తరువాత నెమ్మదిగా లేచి టేబిల్ దగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చుంటాను. అద్దంలో నా ముఖం చూసుకుంటే జుట్టంతా రేగి భయంకరంగా ఉంటుంది. నిద్రలో ఏదైనా కలవస్తే ఆ కలను గురించి ఆలోచిస్తాను. మంచి కలైతే ఆ కలలోని స్మృతులను జ్ఞాపకం చేసుకుంటాను. మళ్ళీ సిగరెట్టు ముట్టిస్తాను. నిద్రలేచిన తరువాత అప్పటికి కనీసం ఒక అరగంట అవుతుంది. ఇతరుల దృష్టిలో కేవలం ఇది లేజినెస్ కిందనే లెక్క. బాత్‌రూమ్‌లోకి వెళ్తే చాలాసేపు స్నానం చేస్తాను. స్నానం చేస్తున్నా దేన్నిగురించో ఆలోచిస్తాను.

కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్న సమయంలో జాన్ కాఫీ కప్పుతో ప్రత్యక్షమైనాడు. కాఫీ తాగుతుంటే కాఫీ రుచించలేదు. 'కాఫీలో పాలు బాగా తక్కువగా ఉండాలి. చక్కెర కూడా తక్కువగా ఉండి స్ట్రాంగ్‌గా ఉండాలి' అన్నాను జాన్‌తో.

'అంత స్ట్రాంగ్ కాఫీ తాగగూడదు సార్. ప్రొద్దున్నే మీరు బ్రేక్ ఫాస్ట్‌కు వచ్చినప్పుడు స్ట్రాంగ్ కాఫీ ఇస్తాను అన్నాడు.

'నాకిప్పుడే కావాలి. అన్నాను.

'మా దొరగారుండేవారు, ఆయన పొద్దున్నే కాఫీ లైట్‌గా తీసుకునేవారు'.

'మీ దొరగారెవరు?'

'మా దొరగారిపేరు మేజర్ బిల్. ఆయన చాలా రోజులు మిలటరీలో పనిచేశారు. ఆ రోజుల్లో ఆయన దగ్గర బట్లరుగా ఉండేవాణ్ణి'.

'ఇప్పుడాయన ఎక్కడ?'

'ఇంగ్లండ్‌లో ఉన్నారేమో, ఈ దేశం వదలి సుమారు ఇరవై ఏళ్ల దాటింది' అంటూ అక్కడ వున్న నా బూట్లను తీసుకెళ్ళాడు. జాన్‌కు ఏ విషయమూ చెప్పక్కర్లేదు. మా బ్లాకులో మూడు రూమ్సు ఉన్నయ్. అందరిబూట్లూ తీసుకుని వరండాలో ఓ మూల కూర్చుని తన పనిలో నిమగ్నుడైనాడు. ఎడమపక్కగా చిన్న అట్టపెట్టె ఉన్నది. దాంట్లో రంగురంగుల పాలిష్ డబ్బాలూ, రకరకాల బ్రష్‌లూ ఉన్నాయి. తనకోటు తీసి పక్కనపెట్టి బూట్లకు పాలిష్ చేస్తున్నాడు. నేను లేచి రెండడుగులు వరండాలోకి

వెళ్ళి అటువైపుగా మా బ్లాకులో ఉన్న మిగతా రూమ్స్‌కి వెళ్ళేను. కృష్ణస్వామి, నవాతె ఒక రూములో ఉన్నారు. రషీద్, దివేకర్ ఒక రూములో ఉన్నారు. నే వెళ్ళేటప్పటికి కృష్ణస్వామి వంటిమీద చొక్కాలేదు. లుంగీ చుట్టుకుని ఉన్నాడు. ముఖాన విభూతి పట్టెలు శాంతి విరజిమ్ముతున్నై. వేళ్ళూ అవీ తిప్పుతూ మనసులో ఏవో మంత్రాలు చదువుతున్నాడు. నన్ను చూసి మాట్లాడకుండా చేత్తో సంజ్ఞచేస్తూ నన్ను కూచోమన్నాడు. నవాతె ఇంకా పైజామాలో ఉన్నాడు. ఎలక్ట్రిక్ షేవరుతో గెడ్డం గీసుకుంటున్నాడు. పక్కరూములో రషీద్ నమాజు చేసుకుంటున్నాడు. దివేకర్ యోగాసనాలు వేస్తున్నాడు, లంగోటీకట్టి. అందరూ ఎవరి పనుల్లో వారున్నారు. తిరిగి నా రూముకు వచ్చేను. ఎనిమిదిన్నరకు బ్రేక్ ఫాస్టుకు వెళ్ళాలి గనుక కార్యక్రమానికి ఉపక్రమించాను. అన్ని పనులూ అరగంటలో ముగించుకుని తయారైనాను.

బ్రేక్ ఫాస్టులో అందరం కలుసుకున్నాం. అందరూ సూట్లతో పెళ్ళికొడుకుల్లా ఉన్నారు. కొంతమందికి జుట్టు కొంచెం తెల్లబడి, కొంతమందికి బాగా తెల్లబడి ఉంది. చాలామందికి కళ్ళజోళ్ళు, అందరి ముఖాల్లోనూ వయస్సు, వర్రీ తెచ్చిన ముడుతలు, కళ్ళ కింద నల్లటి అర్ధచంద్రాకారాలు. అంత ముసలివారు కారు, అంత వయసువారూ కారు. సోహన్‌లాల్ అందర్నీ పరీక్షగా అబ్జర్వు చేస్తున్నట్టుగా ఉన్నాడు. నిగనిగలాడే బూట్లూ, ఆకర్షణీయంగా ఉండే సూట్లూ వేసి ముఖాలకు స్నో క్రీమ్ వగైరాలు పట్టించి తలకు బ్రిలియంటైన్ లాంటివి రాసి ఎంత అందంగా ముస్తాబైనా అందరి ముఖాల్లోనూ దాచలేని లోటు ఏదో కనిపిస్తున్నది.

శనివారం మా కార్యక్రమం పెందలాడే అవడం చేత సాయంత్రం ఊళ్ళోకి వెళ్ళాలని నిశ్చయించుకున్నాం. దివేకర్, సోమనాథ్, నవాతె మా రూమ్‌కు వచ్చేరు. అందరూ షాపింగ్‌కు బయలుదేరే ఉత్సాహంతో ఉన్నాం. చటర్జీ కూడా ఆ ప్రయత్నంలోనే ఉన్నాడు.

ఇంతలో జాన్ 'టీ'తో ప్రత్యక్షం.

చటర్జీ గాజులూ, బ్లౌస్‌పీసెస్, చీరెలు కొనాలనీ, నవాతె ఏదైనా పురాతన వస్తువులు కొనాలనీ అన్నారు. అందరమూ జాన్‌ని అడిగేము ఊళ్ళోకి ఎక్కడికి వెళ్ళాలో.

'చార్మినార్ దగ్గరకు వెళ్తే చాలామటుకు దొరుకుతై. ఆ రోజుల్లో మా దొరగారు కూడా అక్కడికి వెళ్ళేవాళ్ళు ఏమైనా కావాలంటే. ఆయనకు రకరకాల టేబిల్‌లైట్స్

అంటే ఇష్టం. పురాతన వస్తువులు ఎక్కడైనా దొరుకుతాయేమోనని తిరిగేవారు. ఆయన ఇంగ్లండు వెళ్ళినప్పుడు ఎన్నో అలాంటివి తీసుకుని వెళ్ళేరు' అన్నాడు.

నవాతె చాలా ఉత్సాహంగా ఉన్నాడు. తన పంట పండిందనుకున్నాడు.

అందరం బయలుదేరేం టాక్సీలో.

మాటల సందర్భంలో చటర్జీకి పెళ్ళికాలేదన్నాడు. అన్నేళ్ళు వచ్చినా చటర్జీకి ఇంకా పెళ్ళి ఎందుకు చేసుకోలేదో అర్థం కాలేదు.

'మరి గాజులెవరికి?' అన్నాను కొంచెం చనువు తీసుకొని.

'మా అన్న కూతురికి. నేనంటే ఆమెకు చాలా ఇష్టం. బాబాయ్ అంటూ ఉంటుంది. ఆప్యాయంగా ఉంటుంది. కాలేజీలో చదువుతున్నది. అన్నాడు చటర్జీ.

టాక్సీ చౌరస్తాలో ఆగింది. మేమందరం దిగి నడుస్తున్నాం.

'చటర్జీభాయ్ ఇంకా పెళ్ళిచేసుకోలేదేం' అన్నాను.

'పెళ్ళికి ఇప్పుడేం తొందర. అదీగాక నా ఆరోగ్యం కూడా బాగులేదు. మా దేశంలో చాలామంది ఆలస్యంగానే పెళ్ళి చేసుకుంటారు. నేనేమంత ముసలివాణ్ణి కాదే. ఇంకా నలభై అయిదన్నా నిండలేదు' అన్నాడు. నాకాశ్చర్యం వేసింది.

నవాతె నడుస్తూ షాపులవైపు అటూ ఇటూ చూస్తున్నాడు తనకు కావలసిన వస్తువులకోసం.

మేమందరం నడుస్తూ ముందుకు పోతున్నాం. నవాతె ఏదో షాపులోకి వెళ్ళేడు. రెండడుగులు వెనక్కు వేసి అటో ఇటో చూస్తే ఓ షాపులో కనిపించేడు.

ఆ షాపులో పాత సీసాలూ, లోహంతో చేసిన రకరకాల యాష్ట్రేలూ, పూర్వం రోజుల్లో నవాబులు ఉపయోగించిన రకరకాల దీపాలూ, పాత కుర్చీలూ ఎన్నో ఉన్నాయి. నవాతె ప్రతీది పరిశీలిస్తూ ధరలు అడుగుతున్నాడు. అక్కడక్కడ కొన్ని కత్తులూ, జనానాలో ఉపయోగించే వస్తువులూ ఉన్నాయి. మరో మూల హుక్కాలు రకరకాలవి ఉన్నాయి. ప్రతీ వస్తువును చూస్తూ ఉప్పొంగిపోతున్నాడు. ఇదంతా గత చరిత్ర అంటున్నాడు. మధ్య మధ్య ప్రతివస్తువూ ఒక్కో కథను చెప్తుంది.

నవాతెకు ఒక యాష్‌ట్రేమీద కన్నుపడింది. రెండుసార్లు దాన్ని తడిమి చూసి చేతిలోకి తీసుకున్నాడు. 'సిర్ఫ్ బీస్ రూపాయ్' అన్నాడు షాపువాడు. వెంటనే నవాతె రెండు పదిరూపాయల నోట్లు పర్సులోంచి తీశాడు. నాకు నవ్వువచ్చింది. రెండు మూడు రూపాయలు పెడ్తే యాష్‌ట్రే వస్తుంది. ఇరవై రూపాయలు పెట్టి దీన్ని ఎందుకు కొన్నాడో నాకర్థం కాలేదు. ఎవళ్ళ పిచ్చి వాళ్ళకానందం అనుకున్నాను.

ఆ షాపులోంచి బయటకువచ్చి గాజులకోసం బయలుదేరేం.

నా పక్కనే నవాతె నడుస్తున్నాడు యాస్‌ట్రేను పదేపదే చూసుకుంటూ. అతని ముఖంలో సంతృప్తి కనిపిస్తోంది.

నవాతె నావైపు చూశాడు. నేనేదో అనాగరికునిలా ఉన్నాను అతని దృష్టిలో. 'బాయ్‌సాబ్, దీని విలువ నీకేం తెలుసు' అన్నాడు నా వైపు చూస్తూ. 'ఇలాంటి పురాతన వస్తువులు సేకరించడానికి నేను బోలెడంత డబ్బు ఖర్చు చేశాను. నాకు బొమ్మలంటే ఇష్టం' అన్నాడు.

'ఇవన్నీ సేకరించి ఏం చేస్తారు... ఏవిటి ప్రయోజనం' అన్నాను.

'నాకు దాదాపు అన్నిదేశాల్లోనూ స్నేహితులున్నారు. వాళ్లతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉంటాను. ఈ స్నేహితులకు పురాతన వస్తువులంటే చాలా సరదా. ఎప్పుడైనా స్నేహితులకు ఇలాంటి వస్తువులు బహుమతులుగా పంపిస్తుంటాను. పంపించినప్పుడల్లా కృతజ్ఞతను తెలియజేస్తూ ఉత్తరాలొస్తయి. ఆ ఉత్తరాలు చదువుతుంటే నాకు కలిగే ఆనందం నీవొక లక్షరూపాయలు నా జేబులో కూరినా రాదు. నా స్నేహితుల్లో ఆడవాళ్లూ మొగవాళ్ళూ ఉన్నారు. నాకూ వాళ్ళ దేశాలనుండి బహుమతులు ఏవో వస్తురూపంలో వస్తూ ఉంటాయి. వాటిని చూచినప్పుడల్లా ఏవో చెప్పరాని అనుభూతి కలుగుతుంది. ఆ దేశాలు వెళ్లినట్టే ఉంటుంది. జపాన్‌లో ఒక గ్రైషా అమ్మాయితో నాకు పరిచయమైంది పోస్టుద్వారా. రెండు మూడు ఉత్తరాల తరువాత మేం ఎంతో దగ్గరగా వచ్చాం. ఒకసారి ఆమె చక్కగా ప్యాక్ చేసి చాలా అందమైన పూలు పంపించింది విమానంలో. నేను చిన్న గాంధి విగ్రహం పంపించాను. మనదేశపు బొమ్మలంటే ఆమెకు చాలా ఇష్టం. జర్మనీలో ఒకామె ఉంది. రెండో ప్రపంచ యుద్ధంలో ఆమె భర్త బాగా గాయపడి తర్వాత హృద్రోగంతో మరణించేడు.

ఆమెకు ఇద్దరు ఆడపిల్లలు. ఒకమ్మాయి ఏదో డిపార్టుమెంటు స్టోరులో సేల్స్‌గర్ల్‌గా పనిచేస్తోంది. ఆమె కుటుంబానికి మనదేశపు పట్టుటి చేనేత దుస్తులంటే సరదా. పోయిన నెలలో ఒక స్నేహితుడు జర్మనీ వెళ్తుంటే అతనిద్వారా కొన్ని పంపించేను. ఒకసారి ఆమెకు నటరాజ విగ్రహాన్ని పంపించేను. దానికి ఆమె ఎంతో సంతోషించింది. యావజ్జీవము నాకు ఋణపడి ఉన్నానని కృతజ్ఞత తెలుపుతూ ఉత్తరం వ్రాసింది. వీటన్నిటివల్లా ఏమిటి ప్రయోజనం అంటే నేనేం చెప్పేది?' అన్నాడు నవాతె.

నాకు నవాతెను అమాంతం కౌగిలించుకొందామనిపించింది. అందరూ ఎవరికి కావలసినవి వాళ్లు కొనుక్కున్నారు. మా బసకు బయలు దేరేం.

  

నేను రూంలోకి వెళ్లగానే జాన్ ఫర్నిచరూ, అద్దాలు తుడుస్తున్నాడు శ్రద్ధగా. జాన్ మా యెడల ఇంత శ్రద్ధ ఎందుకు వహిస్తున్నాడో మా కర్థం కాలేదు.

'జాన్... నీవు ఇంటికి వెళ్ళవా? ఎప్పుడు చూసినా ఇక్కడే ఉంటావు. ఎక్కడికి వెళ్లినా నువ్వే కన్పిస్తావు. గార్డెన్‌లో మొక్కలకు నీళ్లు పోయిస్తూనో, గదులు శుభ్రం చేస్తూనో, లేకపోతే మెస్‌లోనో ఎక్కడ చూసినా నీవే' అన్నాడు.

'నాకు అంతా శుభ్రంగా ఉంటేనేగాని తోచదు సాబ్. మా దొరగారుకూడా నేను బాగా పనిచేస్తానని మెచ్చుకునేవారు. ఆయన దుస్తులు ఇస్త్రీ మడత నలగనిచ్చేవారు కాదు. ఆయన పిస్తోలు ఎప్పుడూ శుభ్రంగా తుడిచి నిగనిగలాడేట్లు చేసేవాణ్ని. ఇహ బూట్ల సంగతి చెప్పక్కర్లేదు. ఆయనకు వేట అంటే సరదా. రెండు తుపాకులుండేవి. అదిలాబాద్ అడవులకు వెళితే జంతువును కొట్టందే వచ్చేవారు కాదు' అన్నాడు గ్లాస్‌జార్‌లో నీళ్ళు నింపుతూ.

డిన్నర్ కాగానే నేనూ చటర్జీ, నవాతె, సోహన్‌లాల్ అలా రోడ్డుమీదకు వెళ్ళేం. భోజనం అయిన తరువాత కొంచెం దూరం నడిస్తే బావుంటుందన్నాడు నవాతె.

వెన్నెలరోజులు... దూరాన ఆకుపచ్చ రాళ్ల నెక్లెస్, పరిచిన ఆకుపచ్చ చీరెలా ఉన్న నీళ్ళు.తూర్పున ఒకవైపు చిన్న చిన్న కొండలూ.

సోహన్‌లాల్ చుట్టూ పరకాయించి...

'ఈ ప్రదేశం ఎంత హాయిగా ఉంది' అన్నాడు.

'వెన్నెల రాత్రులంటే కొంతమందికి ప్రేయసి ప్రియుడు తప్ప మరేం జ్ఞాపకం రావు. వెన్నెలను విరజిమ్ముతున్న ఆకాశాన్ని చూస్తూ కూచోవాల్లనిపిస్తుంది. ఎంతసేపైనా కూర్చుంటాను' అన్నాడు నవాతె.

అందరం నెమ్మదిగా నడుస్తున్నాం.

ఎక్కడినుంచో కమ్మటిపరిమళం వ్యాపించింది.

'ఇది నైట్‌క్వీన్'... అవతలున్న బంగాళాలోంచి వస్తోంది. సంపెంగ వాసనకూడా వస్తోంది... ఆహా... ఎంతహాయి... అన్నాడు నవాతె. సోహన్‌లాల్ తనలో తాను సన్నగా వినపడీ వినపడనట్లు పాడుకుంటున్నాడు.

'భాయ్‌సాబ్.. ఓ పాట మాకూ వినిపించండి' అన్నాను.

'నాకు పాటలురావు. ఏదో గీతం జ్ఞాపకం వచ్చింది. మననం చేసుకుంటున్నాను. మీరు గాలిబ్ గీతాలు ఎప్పుడైనా విన్నారా?' అన్నాడు.

'వినకేం... బ్రహ్మాండంగా ఉంటయి...' అన్నాను.

సోహన్‌లాల్ ఉప్పొంగి పోయాడు.

రెండు గీతాలు నెమ్మదిగా... సుస్నితంగా... అతికోమలంగా చేతులు తిప్పుతూ వినిపించాడు.

బహుత్ అచ్ఛాహై... అన్నాడు నవాతె గీతాలు వింటూ... ఆకాశంలోకి చూస్తూ... ఆనందిస్తూ...

'జీవితంలో మధురమైన వస్తువేది?' అన్నాడు హఠాత్తుగా చటర్జీ.

'మానవత్వం' అన్నాడు నవాతె తడుముకోకుండా.

నాకు వేమన శతకం జ్ఞాపకం వచ్చింది. వేమనను గురించి వాళ్ళకు కొంచెం చెప్పడం ప్రారంభించాను. నా మాటల్లో నవాతె చాలా ఆసక్తిని చూపిస్తున్నాడు.

వేమన గీతాల్లోని కొన్ని నాకు వచ్చీ రాని హిందీలో వాళ్ళకు చెప్పేను.

నవాతె బహుత్ అచ్ఛాహై అన్నాడు.

లాల్... వాళ్ళంతా యుగపురుషులు, అలాంటి వాళ్ళుండబట్టే కలియుగం ఈ మాత్రం నడుస్తున్నది. ప్రతి శతాబ్దంలోనూ ఎవరో ఒకరు ఉద్భవించి 'మంచి' చెప్తానే ఉంటారు. వాళ్ళ విలువ వాళ్ళుపోయిన తరువాతగాని తెలియదు" అన్నాడు.

చటర్జీ చటుక్కున అందుకుని... "వివేకానంద అకాలమరణం చాలా అన్యాయం. ముప్పై తొమ్మిదేళ్ళకే కన్నుమూశారు. గొప్ప ప్రవక్త' అన్నాడు.

'ఇతర దేశాల్లో తన ఉపన్యాసాలతో ఆయన చాలా మందిని సమ్మోహితుల్ని చేశారు. సిస్టర్ నివేదిత చూడండి ఎలా మారిపోయిందో... మనదేశం వచ్చి... మనదేశపు సంస్కృతే అలాంటిది' అన్నాడు నవాతె.

అన్నదమ్ములలోనైనా భేదాభిప్రాయాలుంటాయేమోగాని మాలో... మేం అందరం ఒకటైనాం. నేను వాళ్ళ పక్కన ఉన్నప్పుడు ఏదో చెప్పరాని అనుభూతిని పొందుతున్నాను. కలుసుకున్న కొద్దిరోజుల్లో చాలా దగ్గరగావచ్చేం. మేమంతా ఇంచుమించు సమవయస్కులం. ఏ రాష్ట్రంలో ఉన్నా, ఏం చేస్తున్నా అందరి దృక్పథాలూ ఒకటిగానే ఉన్నాయి. ఇంతమందిని కలిపే వస్తువు మానవత్వమేమోననిపిస్తుంది. నవాతె చాలా చక్కగా చెప్పేడు. అతని మనసు ఎంతో పరిపక్వమైనది. ఏదో భుక్తికి అందరమూ ఉద్యోగాలు చేస్తున్నాం. భేషజం ఏ ఒక్కరిలోనూ కన్పించడం లేదు. మనిషి వేసుకున్న దుస్తులూ... పటాటోపం అన్నీ తీసేసి అందరినీ చూస్తే అందరిలోనూ మానవత ఉట్టిపడుతూ ఉంటుంది. నవాతెను చూస్తుంటే ఏదో నేర్చుకున్నట్టుగానే ఉంటుంది. అతడు చాలా సింపిల్‌టన్. చుట్టకాలుస్తూ పలువరుసలోంచి ముత్యాలు కురిపిస్తాడు. అతను నా దృష్టిలో చాలా పెరిగేడు. నేను చాలా కురుచగా కన్పిస్తున్నాను అతనిముందు... నేనిలా అనుకుంటుండగా... నన్ను తోసుకుని లాల్ ముందుకు వచ్చి...

'భాయ్‌సాబ్... ఖలీల్‌జిబ్రాన్ గొప్పకవి, తాత్వికుడు చిత్రకారుడు గూడా... మీరాయన గీతాలు విన్నారా?' అన్నాడు.

వినే అదృష్టం కలగలేదన్నాను.

"అయితే మీరు తప్పక 'ది ప్రొఫెట్' చదవాలి. ఆహా ఏం రచనలు... ఆయన బతికింది కొద్ది సంవత్సరాలే అయినా... ప్రపంచంలో ఎన్ని భాషల్లోనో ఆయన

రచనలు స్థానం ఆక్రమించుకున్నాయి. దుఃఖాన్ని గురించీ సంతోషాన్ని గురించి ఏం చెప్పేడో తెలుసా... దుఃఖం-సుఖం రెండూ విడదీయలేని బంధాలు. ఆ రెండూ మన అతిథులు... మన సహపంక్తిన ఒకటి తింటుంటే ఒకటి పడక గదిలో విశ్రాంతి తీసుకుంటుంది. అవి వంతుల ప్రకారం మన సహపంక్తిని చేరుతూ ఉంటాయి" అన్నాడు.

'ఏదైనా ఒక గీతం వినిపించు భాయ్'... అన్నాను చాలా ఉత్సాహంగా మొదలు పెట్టేడు లాల్.

అతను గీతాలు పాడుతుంటే నేను, చటర్జీ, నవాతె ఏ లోకంలోనో విహరిస్తున్నట్టుగా ఉంది.

గీతాలు పాడుతూ వాటి అర్థం హిందీలో చెప్తున్నాడు. 'గుడి పునాదిరాయి కంటే గోపురాన పైన ఉన్న రాయి గొప్పదేమీ కాదు. ఏదైనా అది గుడి రాయే...' అని 'మనం కోరుకునేదీ, భయపడేదీ, ఏవగించుకునేదీ, ఇష్టపడేదీ, వెంటపడేదీ, తప్పించుకొనదలచేదీ, ప్రతీదీ మనలోనే ఉంది. అన్నీ కలిసి మెలసి వెలుగు నీడలవలె మనలోనే జంటలుగా ఉంటయి....' అన్నాడు.

మరో గీతం పాడుతుండగా... మా వెనకాల కారుహారన్.. చాలాసార్లు మోగింది... మేం గమనించినట్లులేదు. కారు ఆగింది. 'ఎన్నిసార్లు హారన్ మోగించినా కదలరేం... రోడ్డుకు అడ్డంగా మరీ అలా నడిస్తే ఎలా? అంటూ కారుడ్రైవ్ చేస్తున్న ఒకామె నవ్వుగా అంటూ స్టార్ట్ చేసింది... 'సారీ, మేడమ్...' అన్నాడు నవాతె... మేం అందరం పక్కకు తప్పుకున్నాం.

కారు మేం చూస్తూ ఉండగానే బాణంలా దూసుకుపోయింది. మేం అందరం మళ్ళీ తిరుగుముఖం అయినాం. తిరిగివస్తూ ఉంటే అదివారంనాటి ప్రోగ్రామ్ జ్ఞాపకం చేసేడు నవాతె. ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు, మా కందరికీ నాగార్జున సాగర్ ట్రిప్ అరేంజ్ చేసేరు. ఉదయం ఏడు గంటలకు అందరూ సిద్ధంగా ఉండాలన్నారు. నా విషయంలో మాత్రం పెందలాడే లేచి ఆ సమయానికి రెడీ అవడమే ఒక సమస్య. అది కూడా అంత ఇబ్బంది లేదు. చటర్జీ ఉన్నాడు నన్ను గురించి శ్రద్ధతీసుకునేందుకు. బసకు చేరిన తరువాత అందరం అలసిపోయినాం. గీతాలు పాడి మమ్మల్ని ఉత్తేజ పరచినందుకు సోహన్‌లాల్‌కు కృతజ్ఞత చెప్పుకున్నాం.

సాగర్‌కు అందరమూ వెళ్తున్నామని చాలా సరదాగా ఉంది. మిగతా వాళ్లను కలుసుకోవాలని అవతల బ్లాక్కుకు వెళ్ళేను. మొదటి రూమ్ బల్దేవ్‌సింగ్, ప్రేమ్‌నాథ్ లది. బల్దేవ్‌సింగ్‌కు చాలా పెద్ద పొట్ట. ఎప్పుడూ తలపాగా చుట్టుకుని ఉంటాడు. తలపాగాలోంచి పొడుచుకువస్తున్న కళ్ళజోడు, పెద్ద పెద్ద మీసాలు, ఎప్పుడూ మీసాలు దువ్వుకుంటూ కన్పిస్తాడు. ఏపుగా పెరిగిన గడ్డం, నల్లటి సిల్కు దారంతో దాన్ని ఎప్పుడూ అణచిఉంచుతాడు. చేతికి తెల్లగా మెరుస్తున్న సన్నటి తీగె కడియం. విశాలమైన ఛాతీ. నేను వెళ్ళేటప్పటికే డ్రెస్ కూడా తీయకుండా బెడ్‌మీద వెల్లికిలా పడుకుని ఉన్నాడు. రెండుచేతులూ, రెండుకాళ్ళూ విసిరేసి ముందుకువస్తున్న పొట్ట బెడ్‌మధ్యలో ఉంది. బెడ్‌లో ఖాళీ ఎక్కడా కన్పించకుండా అంతా ఆవరించి ఉన్నాడు. అతను ఊపిరి పీలుస్తుంటే పొట్టకూడా చాలా వేగంగా పైకివస్తూ లోపలికి వెళ్తున్నది. నేను వెళ్ళగానే పడుకునే నావైపు తిరిగేడు. అతని కళ్లు పెద్దపులి కళ్ళలా ఉన్నాయి. ప్రేమ్‌నాథ్ టేబిల్ లైటుముందు కూర్చున్నాడు. ఆ లైటు తనవేపుకు వంగి ఉన్నది. కుర్చీలోంచి బల్లమీదకు వొరిగి ఏదో వ్రాసుకుంటున్నాడు. ఎడంచేతిలో 'టూత్‌పిక్' ఉన్నది. దాంతో పళ్ళు కుట్టుకుంటున్నాడు. రూమంతా నిశ్శబ్దంగా ఉన్నది. అతని కుర్చీ వెనకాల కోటూ, టై వేళ్ళాడుతున్నై.

నన్ను చూస్తూనే 'ఆయియే భాయ్‌సాబ్' అంటూ కుర్చీలోంచి లేచేడు. నేను పక్కకుర్చీలో కూర్చున్నాను. బల్దేవ్‌సింగ్ శరీరాన్ని అమాంతం తిప్పి బోర్లా పడుకుని చేతులు గడ్డంకింద నిలచి మా ఇద్దరివైపూ చూస్తున్నాడు.

'ఏమిటి వ్రాస్తున్నారు ప్రేమ్‌నాథ్' అన్నాను.

'సోమవారం కాన్ఫరెన్స్‌లో నేనో పేపరు ప్రజంటు చేయాలి. దాంతో కుస్తీ పడుతున్నాను' అన్నాడు.

'నాగార్జునసాగర్‌కు తయారవుతున్నారా' అన్నాను.

'ఓ' అన్నాడు.

'మరి సర్దార్‌జీ సంగతో'.

'హోఁ అయెగా'.

'లేదన్నాడు ' బల్దేవ్...

'అందరం సరదాగా వెళ్తున్నాం మీరూ రాకూడదూ'.

'ఆ బస్సు ప్రయాణం నాకు పడదు. అంతదూరం నాకు వాంతులు వస్తయి'.

'మరి మీరొకరూ ఏం చేస్తారు'.

'రానివాళ్ళు ఇంకా ఇద్దరున్నారు. ఊళ్ళో ఎక్కడన్నా తిరిగొస్తాము. సాలార్‌జంగ్ మ్యూజియమ్ ఉంది కద... వీలైతే జూకు కూడా వెళ్తాం' అన్నాడు బల్దేవ్ అటువైపు పొర్లుతూ.

భాయ్‌సాబ్.. ఈ పేపరు మీరోసారి చూడండి అంటూ తను రాస్తున్న కాగితాన్ని నాకిచ్చేడు.

నే నా కాగితాన్ని చూస్తూ... ఠీక్ హై... బాగుంది... అన్ని పాయింట్లూ కవర్ చేసేరు' అన్నాను.

'ఇక్కడ గ్రేప్స్ మంచివి దొరుకుతై అని అన్నారు. ఎక్కడ బావుంటయి...?' అన్నాడు బల్దేవ్.

మొజంజాహికి వెళ్ళండి... లేకపోతే గార్డెన్స్‌కే వెళ్ళి కొనుక్కోవచ్చు. ఊరికి ఏడెనిమిది మైళ్ళు బయిటికి వెళ్ళాలి' అన్నాను.

'షుక్రియా' అన్నాడు బల్దేవ్.

వాళ్ళిద్దరికీ గుడ్ నైట్ చెప్పి నా రూమ్‌కి వచ్చేను. అప్పటికే చటర్జీ ఫ్యాన్ వేసుకుని దోమతెరలో రాజకుమారుడిలా సుఖంగా నిద్రపోతున్నాడు.

నాకు ఏదో పుస్తకం చదివితేగాని నిద్రరాదు. హక్స్ లీ 'జీనియస్ అండ్ ది గాడెస్' మొదలెట్టాను. ఇంతలో దివేకరు వచ్చేడు. మా వరండాల్లో 'ఫ్యాన్' ఉన్నది చిన్న స్టూల్‌మీద, దానికెదురుగా కుర్చీ వరండాలో మరోమూల వాటర్ కూలర్.

'కొంచెంసేపు బయట కూర్చుందాం రాకూడదూ' అన్నాడు దివేకరు. నే తీసిన పుస్తకం బల్లమీద ఉంచి సిగరెట్టు వెలిగించి నేనూ దివేకరూ వరండాలో కూర్చున్నాం. నాకు మళ్ళీ ఆకుపచ్చ నెక్లెసు, నీళ్ళకదలిక, పూలకుండీలలోని పూలకదలిక, లాన్‌లో పరచిన షిఫాన్ చీరె, గాలిలో రెపరెపలాడుతున్న బోగన్‌విలా స్వాగతం చెప్పినయ్. దివేకరు ఫోన్ దగ్గిర కూర్చున్నాడు. కొంచెం సీరియస్‌గా ఉన్నాడు. ఫోన్ తీసేడు.

'హలో... బొంబే కాల్ బుక్ చేసేను, ఇంకా ఎంతసేపట్లో వస్తుంది' అని అడుగుతున్నాడు. నా కుర్చీ అతని కుర్చీకి దగ్గరగా జరుపుకుని 'బొంబే కాల్ త్వరలోనే వస్తుంది ఏమిటి హడావిడి' అన్నాను.

'మా బేబీకి కొంచెం సుస్తీగా వుంది. ఎలావుందో కనుక్కుందామని, అదీకాక శ్రీమతి అక్కడ ఒంటరిగా ఉంది. ఒకసారి మాట్లాడితే అన్ని విషయాలు తెలుస్తాయి' అన్నాడు.

'ఏం ఫర్వాలేదు. డోంట్‌వర్రీ... బేబీ ఆరోగ్యం ఈపాటికి సర్దుకునే ఉంటుంది. మీరేం ఆందోళన పడకండి' అన్నాను.

'అచ్ఛే.. ఆందోళన ఏం లేదు... ఊరికే ఫోన్ చేద్దా'మని అన్నాడు.

ఇంతలో ఫోన్ మోగింది... నిశ్శబ్దాన్ని ఛేదించుకుంటూ ఫోన్ చేసిన శబ్దం కొంత కటువుగానే ఉంది. దివేకరు ఆదుర్దాగా కుర్చీముందుకు జరుపుకుని పైజామా సవరించుకుని రిసీవర్ ఎత్తేడు.

నేను నెమ్మదిగా రెండడుగులు వెనక్కు వేసి వరండా మెట్లు దిగి లాన్‌లోంచి కొంచెం దూరంగా చెట్లవైపు వెళ్ళేను.

దివేకర్ ఫోన్‌లో బిగ్గరగా ఆదుర్దాగా మాట్లాడుతున్నాడల్లే ఉంది... మేమ్‌సాబ్‌తో... నే దూరం వెళ్ళే కొద్దీ మాటలు స్పష్టంగా వినపడ్డంలేదు. మరి కొంచెం దూరం వెళ్ళేను.

తెల్లయూనిఫారమ్‌లో జాన్ అటువైపుగా వెళ్తున్నాడు... నన్ను చూసి ఆగేడు.

'క్యాసాబ్... ఇంకాపడుకోలేదా... పెందలాడే పడుకోండి తెల్లవారి ఏడుగంటల కల్లా రెడీ అవాలి. ప్రయాణానికి అన్నీ సిద్ధం చేస్తున్నాను. అందరికీ జ్ఞాపకం చేసి వస్తున్నాను' అన్నాడు.

నేను తిరుగుముఖం పట్టేటప్పటికి దివేకరు నా కెదురు వస్తున్నాడు. అతని ముఖకవళికలను బట్టి చూస్తే ఇంటిదగ్గర పరిస్థితులు సవ్యంగానే ఉన్నట్టు కనబడుతోంది.

'కాల్ వచ్చింది. బేబీకి కొంచెం కులాసాగానే ఉంది. మీ గుడ్ విషెస్‌కు చాలా థ్యాంక్స్' అన్నాడు.

'వర్రీలేకుండా హాయిగా నిద్రపోండి, తెల్లవారితే నాగార్జునసాగర్‌కు మన ప్రయాణం' అన్నాను.

'ఓ ఐసీ... ఆ సంగతే మరచిపోయినాను' అన్నాడు.

గుడ్ నైట్ చెప్పి రూముకు చేరుకున్నాను. లైట్లన్నీ ఆఫ్ చేసి నెమ్మదిగా బెడ్‌మీద చేరేను. అక్కడకు వచ్చిన అందరూ కొద్దికాలంలోనే ఆప్తమిత్రులయినారు. ఏదో చెప్పరాని బంధం మమ్మల్నందర్నీ దగ్గరకు తీసుకువచ్చింది.

నాకు కళ్ళు మూసుకుంటే అందరూ కన్పిస్తున్నారు. ప్రత్యేకంగా నవాతె. మానవత్వం అంటే నవాతె. నవాతె అంటే మానవత్వం. పక్కనే చటర్జీ పసిపిల్లవానిలా ఎవరో జోకొట్టిన ఆనందానికి నిద్రపోతున్నాడు. బోర్లపడుకుని ఉన్నాడు. చేతులు రెండూ బుజాలపైగావచ్చి దిండు దగ్గర కలుసుకున్నై. ఒక కాలు ముడుచుకుని... ఒక కాలు నిటారుగానూ, ముఖం కన్పడకుండా దిండులో దాచుకుని పడుకున్నాడు. అతణ్ణి అంటిపెట్టుకున్న పైజామా మడిమల దగ్గరా, మోకాళ్ళ దగ్గరా, జోరుగా తిరుగుతున్న ఫ్యాన్ గాలికి సన్నగా కదుల్తోంది.

నాకు పడుకున్నా నిద్రపట్టేట్టులేదు... ఆ ప్రయత్నంలోనే ఉన్నాను.

తెల్లవారినట్లున్నది. మగత నిద్రలో ఉండగానే నన్నెవరో తాకినట్లుగా ఉంది. కళ్ళు తెరచి చూస్తే, ఎదురుగా యూనిఫారమ్‌లో జాన్.

'సాబ్... బెడ్ కాఫీ తెచ్చేను గరమా గరమ్... త్వరగా లేవండి' అని అంటున్నాడు.

అప్పటికే రూమంతా సందడిగా ఉంది. స్నానం చేసినట్టున్నాడు చటర్జీ. టవల్ గట్టిగా విదలించి స్టాండుమీద వేస్తున్నాడు. తలనిండా స్నానం చేసినట్టున్నాడు. అతని తల మెరుస్తోంది. తెల్లటి శరీరం, వీపు మీద అక్కడక్కడా నీటి చారలు నెమ్మదిగా కదులుతున్నయి. నేను లేచి కూర్చున్నాను. జాన్ హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నాడు కప్పులతో.

కాఫీ అయిన తరువాత కార్యక్రమం ముగించుకుని డ్రస్ అయి నేనూ, చటర్జీ రెడీగా ఉన్నాం.

ఇంతలో బస్ హారన్ కూడా మోగింది. పదే పదే మోగిస్తున్నాడు డ్రైవర్. నేనూ, చటర్జీ బస్సు వైపు వెళ్ళేం. అందరూ ఒక్కొక్కరే వస్తున్నారు. హాలిడేమూడ్‌లో అందరూ హుషారుగా ఉన్నారు. జాన్ మరో ఇద్దరు బేరర్స్ సహాయంతో సామాను బస్సులో సర్దుతున్నాడు. ఒక పెద్దవుడన్ కేస్‌లో కోకోకోలా సీసాలున్నాయి. అయిస్ బాక్స్ దాని పక్కనే పెద్దబుట్టనిండా పళ్ళున్నాయి. స్టెయిన్‌లెస్ స్టీల్ వాటర్ డ్రమ్... మరో పెట్టెనిండా ప్యాకెట్లు...

బస్సు కదిలింది. నా పక్క సీట్లో నవాతె వచ్చి కూర్చున్నాడు. డ్రైవర్ కాకీ యూనిఫారమ్‌లో... కూలింగ్ గ్లాసెస్‌లోంచి మావైపు ఓసారి చూసి హారన్ మోగిస్తూ, గేరుమారుస్తూ సీటుకునిండుగా కూర్చుని, రథసారథి మాదిరి బస్సును అదలిస్తున్నాడు. బస్సు వేగం అందుకుని ఊరిపొలిమేరలు దాటుతోంది.

రెండు మూడు దినపత్రికలు, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ, ఫిలిమ్‌ఫేర్... ఇంకా కొన్ని పత్రికలు తీసుకువచ్చి ఎవరికి కావల్సినవి వాళ్లకు ఇస్తున్నాడు జాన్. కొంతమంది పేపరు చూస్తూ, కొంతమంది బొమ్మలు తిరగేస్తూ, కొంతమంది సిగరెట్లు కాలుస్తూ ఎవరి పనుల్లో వాళ్ళున్నారు.

జాన్ వల్చటి అట్ట పెట్టెలు అందరికీ ఇస్తున్నాడు. ఆ ప్యాకెట్స్‌లో తినుబండారాలున్నాయి. వెజిటబుల్ కట్లెట్... శాండ్ విచెస్, ఒక యాపిల్ పండూ, రెండు బిస్కట్లు... చాలా నీట్‌గా ప్యాక్ చేసి ఉన్నయి.

  

ఆరోహణ అవరోహణ అయి మళ్ళీ రాగం అందుకున్నాడు. వహావ్వా... అంటున్నారు కొందరు పెద్దగా. ఖవాలీ మంచి పట్టులో ఉంది. కొందరు చప్పట్లతో తాళం వేస్తున్నారు. తాళధ్వని చాలా క్రమబద్ధంగా ఉంది. బస్సులో పాటకచేరీ జరుగుతున్నట్లే ఉంది.

సోమ్‌నాథ్ తన్మయత్వంలో రాగం ఆలాపన గొంతెత్తి చేస్తున్నాడు. చప్పట్ల క్రమం బాగా ఎక్కువైంది. బస్సు తనుకూడా పాటవింటూ వయ్యారంగా వెళ్తోంది. జాన్ ఓ మూల కూచుని కునికిపాట్లు తీస్తున్నాడు. డ్రైవరు అప్పుడప్పుడు మా వైపు చూస్తూ నవ్వుతున్నాడు, ఆనందిస్తున్నాడు.

పాట ముగిసింది. అందరూ చప్పట్లు కొట్టారు. తరువాత వంతు ఎవరిమీదికి వస్తుందో అని ఎవరికి వారు భయపడుతూనే ఉన్నారు. హుకుమ్ ఎవరికి వస్తే... వాళ్లు శిరసావహించవలసిందే, తప్పించుకునే మార్గం లేదు.

అందరి దృష్టి కృష్ణస్వామి మీదకు పోయింది. అతను భయపడుతూ భయపడుతూ ఒదిగి కూర్చున్నాడు. బస్సుతోపాటు కదిలివస్తున్న పొలాలవైపు చూస్తూ, ఒకరికి ఇద్దరు... ఇద్దరికి ముగ్గురు... అందరూ కృష్ణస్వామి, కృష్ణస్వామి అని కేకవేశారు. కృష్ణస్వామి అందరివైపూ చూసి పెద్దగా నవ్వేడు. అందరము నవ్వేం. 'నాకేం పాటలు రావు' అన్నాడు. అదేం లాభంలేదు. పాడి తీరవలసిందే... అన్నారు అందరూ. అయితే నేనో శ్లోకం చదువుతానన్నాడు. అందరూ సరే అన్నారు.

అందరూ చప్పట్లుకొట్టారు. అందరూ కృష్ణస్వామివైపు చూస్తున్నారు.

సన్నని గొంతుతో మంచిరాగంతో 'మాణిక్యవీణాం...' అని మొదలెట్టాడు. అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు. శ్లోకం అయిన తరువాత అందరూ చప్పట్లు కొట్టారు. శభాష్ అన్నాడు నవాతె.

ఆ శ్లోకం అర్థం విడమరచి ఇంగ్లీషులో అందరికి చెప్పేడు. అందరూ మళ్ళీ చప్పట్లు కొట్టారు.

'కొంచెం వల్గర్‌గా ఉంటుంది. సంస్కృతంలో ఒక జోక్ చెప్తాను వినండి' అన్నాడు కృష్ణస్వామి.

స్వామి మంచి మూడ్‌లో ఉన్నట్టున్నాడే... అన్నారందరూ.

చెవులు రిక్కపొడుచుకుని వింటున్నారు. కృష్ణస్వామి ఒక శ్లోకం చదివేడు. తన చేతులు రెండూ గుండెలమీద ఉంచి దీని అర్థం ఏమిటంటే... అంటూ చేతుల్తో అభినయం చేస్తూ విపులీకరించాడు. అందరి నవ్వుకూ అంతులేదు. నవ్వు ఆగినట్టే ఆగి మళ్ళీ వస్తున్నది. అందరి నవ్వుతోనూ బస్సు ప్రతిధ్వనిస్తున్నది. ఆ జోక్ మననం చేసుకుంటూ నవ్వినవాళ్ళు నవ్వినట్లే ఉన్నారు. నవ్వు తెరలు తెరలుగా వస్తున్నది. డ్రైవర్‌కు కూడా అర్థం అయినట్లే ఉంది. నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని విరగబడి నవ్వుతున్నాడు. జాన్‌కు కూడా ఏదో అర్థం అయినట్లే ఉంది. కునికిపాట్లు పడుతున్న వాడు లేచి కూర్చుని మరీ నవ్వుతున్నాడు. కృష్ణస్వామి మాత్రం నవ్వడం లేదు.

కృష్ణస్వామి అసాధ్యుడన్నాడు సవాతె.

వండర్‌ఫుల్ జోక్ అన్నాడు చటర్జీ.

బహుత్ ఖూబ్ సూరత్ అన్నాడు జైన్.

ఒక జంక్షన్ దగ్గర బస్సు ఆగింది. మరో ముప్పై మైళ్ళు వెళ్తే గమ్యస్థానం చేరుతాం. ప్యాకట్లన్నీ ఒకరొకరే విప్పడం మొదలెట్టేరు. జైన్ తన ప్యాకెట్‌లోని స్వీట్ ఒకటి తీసి కృష్ణస్వామికిచ్చేడు. కృష్ణస్వామి వెజిటబుల్ కట్‌లెట్ ఒకటి తీసి నాకిచ్చేడు. అందరూ ప్యాకెట్లన్నీ ఖాళీచేసి, ఖాళీప్యాకెట్లు బయటపారేశారు. కిందపడ్డ ప్యాకెట్ల చుట్టూ ఇద్దరు పిల్లలు మూగేరు. ఒకడికి సుమారు పదేళ్ళుంటాయి. రెండోవాడికి అయిదేళ్ళుంటాయి. ఒక్కొక్క పెట్టేతీసి, ఆదుర్దాగా చూసుకుంటూ బిక్క మొగాలు పెట్టేరు. ఒకని చేతికి పిడికిలిగట్టిగా మూసి ఉన్నది. నల్లని పిడికిలిలోంచి తెల్లటి వానాల కొనలు మెరుస్తున్నయి. తను పెట్టుకున్న గోచీని సవరించుకుంటూ మొల్తాడు మరీ బిగువుగా ఉండడంచేత రెండువేళ్ళతో సర్దుకుంటున్నాడు. మొల్తాడు కింది బొడ్డు దగ్గరనుండి వీపువరకూ సన్నగా ఒరుసుకు పోయిన గీత కన్పిస్తున్నది, లేత శరీరం మీద. చిన్నవాడి భుజంమీద చేయివేసి బస్సు కిటికీ దగ్గరకు వస్తున్నాడు.

  

కళ్ళతో పలుకరిస్తూ, నా చేతిలోని యాపిల్ పండు ఇచ్చాను వాడికి. సవాతె పదిపైసలు తీసి వాడిచేతిలో పెట్టేడు. కొంతమంది బస్సు దిగి రెండడుగులు వేశారు. కొందరు టీ స్టాల్‌లో టీ తాగుతున్నారు. అందరూ గోచీపెట్టుకున్నవాణ్ణీ గమనించినట్టు లేదు. పెద్దవాడు యాపిల్‌పండు కొరికి చిన్నవాడికిచ్చేడు. చిన్నవాడు దాన్ని కొరికి అన్నకు ఇచ్చేడు. ఇలా కొంచెం కొంచెం కొరుక్కుంటూ ముందుకు పోతున్నారు. పెద్దవాడి పిడికిలి ఇంకా బిగుతుగానే ఉంది. బస్సు డ్రైవర్ అయిపోయిన సిగరెట్ పీకను అవతల పారేసి హారన్ వేసేడు. అందరూ వచ్చి ఎవరిసీట్లలో వాళ్ళు సర్దుకున్నారు, బస్సు కదిలింది.

వాటర్ డ్రమ్‌లో నీళ్ళు గ్లాసులతో నింపి అందులో కొంచెం కొంచెం ఐస్ వేస్తూ అందరికీ ఇస్తున్నాడు బాస్. ఆ సమయంలో మంచినీళ్ళు తాగితే ఎంతో హాయిగా ఉంది. బస్సు పోతూంటే ఆ గోచీ పెట్టుకున్న పిల్లవాణ్ణీ, వాడి తమ్ముణ్ణీ చూస్తున్నాను.

వాళ్ళు ఎందుకో నవ్వుకుంటున్నారు. వాళ్ల తెల్లని పలువరుస దూరానికి కూడా కనిపిస్తున్నది.

బస్సు వేగం అందుకుంది.

గమ్యస్థానం దగ్గరపడుతున్నకొద్దీ బస్సులో అలజడి తగ్గింది. అందరూ సీరియస్‌గా ఉన్నట్లున్నారు. సవాతె పేపరు చదువుతున్నాడు. చదువుతూ వెస్ట్ బెంగాల్ గవర్నమెంటు పడిపోయిందన్నాడు. పడక ఏం చేస్తుందని మరోరు అన్నారు. గవర్నమెంటు మారినంతమాత్రాన దేశం మారుతుందనుకోవడం పొరపాటు. మనదేశపు సమస్యల్నీ పరిష్కరించడం అంత తేలిక కాదు. మానవత్వం... కావాలి. అది ఉంటే దేశం అదే మారుతుంది, మనిషికి మనిషి గౌరవం ఇవ్వాలి. చాలా తేలిగ్గా అనేశాడు సవాతె.

లైన్ పేపర్లో మరో న్యూస్ అయిటమ్ చూసి తనలో తను నవ్వుకుని మా వైపు చూసి పెద్దగా నవ్వేడు.

కొన్ని రాష్ట్రాలలో హిందీ వద్దని, కొన్ని రాష్ట్రాలలో ఇంగ్లీషు వద్దని. అలజడి ఆందోళన, భాషా సమస్య పేరిట దేశం తగలబడుతోంది... రైళ్ళనూ, బస్సులనూ ఆపి... బస్సులను తగులబెట్టి... ఏది కనబడితే దాన్ని సర్వ నాశనం చేస్తున్నారు... ఈ అర్థంలేని ఉద్యమం భలే తమాషాగా లేదూ... మీకు నవ్వు రావడంలేదూ... అని నా వైపు చూశాడు. నేను సవాతె వైపు చూశాను.

భాష అనేది ఇంత పెద్ద సమస్యా? ఎవరి అవసరాన్నిబట్టి వాళ్ళు కావాలంటే భాషలు నేర్చుకుంటారు. అవసరం లేకపోతే మానేస్తారు. ఇతర దేశాల్లో ఎక్కడా ఈ సమస్య లేదే... అన్నాడు సవాతె.

మనిషికి ఓ వెర్రి ఉంది. ఎవరైనా ఒక పనిని చెయ్యమని శాసిస్తే... అది చేయకుండా ఉండడం, చెయ్యొద్దన్న పనిని చెయ్యడం, ఒకరవునంటే మరొకరు కాదంటారు. ఇది సహజం. చేయకూడని పనిచేస్తే ఆనందం, తాగవద్దని శాసిస్తే తాగుతారు. మీ ఇష్టం వచ్చినంత తాగండి... అంటే ఎలా ఉంటుందో... అప్పటి పరిస్థితి. అప్పుడు దాన్నిగురించి ఎవరూ మాట్లాడరేమో ఎవడిపిచ్చి వాడికానందం... అన్నాను.

బాగా చెప్పేవ్ భాయ్‌సాబ్... అన్నాడు నవాతె నా బుజం కదుపుతూ... నవ్వుతూ.

జాన్ చూడండి ఎన్ని భాషలు నేర్చుకున్నాడో అతను బెంగాలీకూడా మాట్లాడు తున్నాడు. నాకాశ్చర్యం వేసింది... అన్నాడు జైన్.

కృష్ణస్వామి... అందుకుంటూ.. నే నెప్పుడో స్కూల్లో చదివేటప్పుడు సరదాగా హిందీ నేర్చుకుని పరీక్ష కూడా పాసయ్యాను. నన్నెవరూ నేర్చుకోమని బలవంతం చేయలేదే... అన్నాడు.

గమ్యస్థానం దగ్గర పడుతోంది.

'అదుగో ఆ కనపడేదే ప్రాజెక్టు హౌస్. వచ్చేశాం' అన్నాడు జాన్.

బస్సు ఆగగానే అందరూ దిగేరు. కొందరు బద్ధకంగా వళ్లు విరిచేరు: కొందరు నడుములు సర్దుకుంటున్నారు.

డ్రైవరు కళ్ళజోడు తీసేసి బస్సు ఆపినచోట లాన్‌లో సిగరెట్టు ముట్టించి తను వేసుకున్న కాకీ యూనిఫారమ్ సర్దుకుంటూ బూట్లుకూడా విప్పకుండా వెల్లికిలా పడుకున్నాడు.

ప్రాజెక్టు హౌస్‌లో మాకో పెద్ద రూమ్ రిజర్వు చేశారు.

కొంతమంది కుర్చీలలోనూ, కొంతమంది సోఫాలలోనూ, కొంతమంది అక్కడవున్న బెడ్‌మీద రిలాక్స్ అవుతున్నారు. కొంతమంది వరండాలో అటూ ఇటూ తిరుగుతున్నారు.

నేను వరండాలో నిల్చుని, ఎదురుగా ఉన్న గార్డెన్‌లోని రకరకాల పూలమొక్కలవైపు చూస్తున్నాను. 'కేనాస్' ఏపుగా పెరిగి... గాలికి సన్నగా వయ్యారంగా కదులుతూ... రంగురంగులతో అందరికీ స్వాగతం చెప్తున్నయ్.

ఇంతలో ఓ టూరిస్ట్ బస్ వచ్చింది. అందులోంచి చాలామంది అమ్మాయిలు నవ్వుకుంటూ దిగుతున్నారు. కొంతమందికి కూలింగ్ గ్లాసెస్... చేతిలో వానిటీబ్యాగ్స్... కాలేజీ గరల్స్ అల్లే ఉన్నారు... వాళ్ళల్లోని చలాకీతనం ఉత్సాహం చూస్తుంటే... మరికొంతమంది కార్లలో దిగుతున్నారు. వాళ్ళు దిగగానే కార్ల డ్రైవర్లు కార్ల పక్కగా

తీసుకుని వరసగా పార్క్ చేసుకుంటున్నారు. ఎవరిదో ఒక జీప్ కూడా ఆగింది. కొందూరు ఖద్దరు లాల్చీలు... రుద్రాక్ష అంచు పల్చటి ధోవతులూ దిగేరు. కొంతమంది ప్రాజెక్టుహౌస్‌లోంచి వెళ్ళిపోతున్నారు. వెళ్ళిపోయేవాళ్ళు... వచ్చేవాళ్ళు... వీళ్ళందరితో ప్రదేశం చాలా సందడిగా ఉంది. అది చూస్తుంటే నాకు తీర్థయాత్ర స్థలం జ్ఞాపకం వచ్చింది. పెద్ద పెద్ద ఊళ్ళల్లో సత్రాల్లో ఇలాగే హడావిడిగా ఉంటుంది. నేను వచ్చే జనాన్ని వెళ్ళే జనాన్ని చూస్తూ నిల్చున్నాను. ఇంతలో నవాతె నా వెనకాలే వచ్చి 'భాయ్‌సాబ్... డ్యామ్ ఇక్కడి కెంత దూరం' అన్నాడు. సుమారు ఓ మైలు ఉంటుందేమో అన్నాను. అందరం సరదాగా నడిచివెళ్తే బావుంటుందేమో అన్నాడు.

  

నవాతె వెనకాల చటర్జీ, జైన్ వచ్చారు. మనం ఇక్కడ రెస్టు తీసుకుంటూ కూచుంటే అసలు లేచి బయలుదేరలేం. చూడవలసినవన్నీ ముందుచూసి తరువాత 'లంచ్' తీసుకుని రిలాక్స్ అవచ్చు. కొంచెం ఆలస్యం అయినా ఫరవాలేదన్నాడు నవాతె.

రూములో కూర్చుని రెస్టు తీసుకుంటున్న వాళ్ళను ఈ విషయమై హెచ్చరించేం. ఇంతలో క్యాంటిన్ కుర్రాడు అందరికీ కాఫీ తీసుకువస్తున్నాడు. ఆ కుర్రాడి వెనకాల జాన్ ఉన్నాడు. కాఫీ తీసుకోండి బాబూ అని అంటున్నాడు.

అందరమూ కాఫీ తీసుకుని బయలుదేరేం. నెమ్మదిగా పెళ్ళినడక ప్రారంభించి, మా ముందుకు వచ్చి ముందు మోడల్ డామ్ చూస్తే బావుంటుందన్నాడు జాన్. అతడు చూపిస్తున్న వైపుగా బయలుదేరేం.

మోడల్ డామ్ చూస్తూ... 'మన ఇంజనీర్లు ఎంత నిపుణులు... వృథాగా సముద్రంలో కలిసిపోయే నీటిని భద్రపరచి, ప్రజలకు ఉపయోగపడేటట్టు చేస్తున్నారు' అన్నాడు నవాతె.

'భక్రానంగల్ కూడా చాలా పెద్దదే' అన్నాడు జైన్.

'పవర్ హౌస్ కూడా పూర్తయితే ఇంకా బావుంటుంది' అన్నాడు చటర్జీ.

మోడల్ డ్యామ్ బ్యాక్‌గ్రౌండ్‌లో మనందరం ఫోటో తీయించుకుంటే బావుంటుందన్నాడు నవాతె.

నవాతె మధ్యలో నిల్చున్నాడు. జాన్‌ను పక్కన నిల్చోమన్నాడు. కొందరటువైపూ కొందరిటువైపూ నిల్చున్నారు. నేను కెమేరా క్లిక్ చేశాను. నాకు థ్యాంక్స్ చెప్తూ నవాతె 'భాయిసాబ్... నేను తీయమన్నచోటల్లా ఫోటో తీయాలి. ఈ ప్రాజెక్టు మన దేశంది,మనకు సంబంధించినది. దీనితో మనం ఎసోసియేట్ అవాలి' అన్నాడు. మాట్లాడుతూ ప్రపంచంలో ఎక్కడెక్కడ ఎంతెంత పెద్ద ప్రాజెక్టులున్నదీ... చెప్తున్నాడు. ఎప్పుడు మాట్లాడినా తను ప్రపంచానికి సంబంధించిన వాణ్ని అంటాడు.

డైవర్ట్ చేసిన నీటిని పెద్ద టనెల్ గుండా వదుల్తున్నారు. ఆ నీరు చాలా వేగంతో నురుగులు కక్కుతూ ప్రచండంగా ప్రవహిస్తూ పెద్ద ధ్వనితో ఇవతలికి వచ్చి పడుతున్నది. రోడ్డుమీద కటకటాల దగ్గర, టనెల్ ముఖద్వారం సమీపంలో నిల్చిఉంటే నీటి తుంపరలు చల్లగా ముఖానికొచ్చి తాకుతున్నాయి. పన్నీరు చల్లినట్టుగా ఉంది. సముద్రపు అలల కన్నా ఎక్కువ ధ్వనిగా ఉంది. నీటి వెలాసిటీ చాలా ఎక్కువగా ఉంటుంది. ఇక్కడ చాలా హాయిగా ఉందన్నాడు నవాతె. ఇక్కడ కూడా ఒక ఫోటో...

మేం అందరం వరసగా సెమిసర్కిల్లో నిల్చున్నాం. నవాతె కెమేరా క్లిక్ చేశాడు.

యర్త్ డామ్, మేసన్రీడామ్... చూసుకుంటూ రైట్ కెనాల్ ముఖద్వారంవైపు బయలుదేరేం. ముఖద్వారానికి అటుపక్కగా డామ్‌మీదికి మెట్లున్నాయి.

దీన్నే టెంపిల్ ఆఫ్ హ్యూమానిటీ అన్నాడు నెహ్రూపండితుడు అని నేనంటుంటే.

'ఈ టెంపిల్ కట్టినవాళ్ళు పుణ్యాత్ములు అన్నాడు నవాతె' ఈ రైట్ కెనాల్‌లోంచి వదలిన నీరు కొన్ని లక్షల ఎకరాల పంటలకు పనికొస్తుంది. దీని పొడవు బహుశా నూట ఇరవై మైళ్ళుంటుంది, అన్నాను.

'ప్రపంచంలోకెల్లా ఇంతపెద్ద ఇరిగేషన్ కెనాల్ ఇదేనేమో'... అన్నాడు నవాతె.

"అవును అక్కడ డిస్ప్లే చేసిన చార్ట్స్‌లో అలాగే వ్రాసి ఉంది అన్నాడు చటర్జీ.

మెట్లు గబగబా ఎక్కుతూ పైకి వెళ్తున్నాడు నవాతె. వెనకాలే మేమూ బయలుదేరేం. పైకి ఎక్కిన తరువాత చూస్తే నాలుగువైపులా నీరు ఆవరించి నిశ్చలంగా పొలిమేరలు లేని తటాకంగా ఉంది. 'ఈ నీటి వైశాల్యం సుమారు నూటపది చదరపు మైళ్ళు' అన్నాడు చటర్జీ. చటర్జీ దీనిని గురించిన వివరాలన్నీ నోట్ చేసుకుని జ్ఞాపకం ఉంచుకున్నాడు.

  

రైట్ కెనాల్ నూట ఇరవైమైళ్ళ పొడుగునా ఉన్న గ్రామాలవాళ్ళు ఎంత సంతోషిస్తారో! ఇన్నాళ్ళూ బీడువడ్డ పొలాలు నీటితో తడిస్తే రైతు సంతోషానికి మేర ఉండదు... అనుకుంటూ ఉప్పొంగి పోతున్నాడు నవాతె.

అందరమూ మెట్లుదిగి కిందకు వచ్చి తిరుగు ప్రయాణం అయినాం. జైన్, చటర్జీ, సోహన్‌లాల్ కొంచెం అలసినట్లున్నారు.

ఆ ప్రాంతంలో ఒకామె నిల్చుని...

'చల్లని... నిమ్మకాయ సోడా... సోడా... చల్లని సోడా' అని కేకవేస్తున్నది. పక్కనే సోడా బండి ఉన్నది. బండికి ఉన్న రెండు చేతులూ నేలకు ఆనించి ఏటవాలుగా ఉంది. ఆ అమ్మాయి నల్లగా, యవ్వనంతో, అందంతో మిసమిసలాడుతున్నది. వయసు సుమారు పద్ధెనిమిది ఉండచ్చు. మోకాళ్ళకిందకి పరికిణీ,బలమైన పిక్కలూ, మడిమెకు వేసుకున్న కడియం కన్పిస్తున్నయ్. ఆమె వేసుకున్న వోణీ గాలికి రెపరెపలాడుతున్నది. గట్టిగా ముడివేసుకున్న రవిక... ఉబికి పొంగివస్తున్న యవ్వనాన్ని దాచలేకుండా ఉంది. జుట్టు తైల సంస్కారం లేకపోయినా, మనిషి నల్లగా ఉన్నా, ఆమె కళ్లల్లో కాంతి కన్పిస్తున్నది.

నవాతె నా దగ్గరగా వచ్చి నా చెవిలో నెమ్మదిగా 'బ్లాక్ బ్యూటీ' అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. మాకు కావలసినవాళ్ళం సోడాలు తాగేం. సోడాలు ఘాటుగా రుచిగా ఉన్నయి.

'ఏ మేకప్ లేకుండా ఎంత అందంగా ఉందో ఆ అమ్మాయి. 'అమాయకత్వంలో అందం ఉంది' అన్నాడు నవాతె.

సోడాలు తాగిన తరువాత నెమ్మదిగా నడుస్తున్నాం కబుర్లు చెప్పుకుంటూ. సూర్యుడు నడినెత్తి మీదికి వచ్చి చిందులు తొక్కుతున్నాడు. చిరాకుగా ఉంది. సోడాలమ్మాయి డబ్బులు లెక్కచూసుకుంటున్నది.

గట్టుమీదకు వచ్చేం. దూరాన కనపడే స్తంభాన్ని చూసి 'అదేమిటి?' అన్నాడు నవాతె.

'బాబూ నేను చెప్తాను' అంటూ జాన్ ముందుకు వచ్చేడు.

'ఈ ప్రాజెక్టు కట్టేటప్పుడు ప్రారంభదశలో కొంతమంది తమ ప్రాణాలు కోల్పోయారు. వాళ్ళ జ్ఞాపకార్థం ఈ స్తంభం నిలబెట్టారు. దీన్ని 'పైలాన్' అంటారు. ఆ ప్రాణాలు పోగొట్టుకున్నవాళ్లు పుణ్యాత్ములు. వాళ్ళలో నా కొడుకు కూడా ఉన్నాడు. అన్నాడు జాన్ చాలా క్యాజువల్‌గా.

కొడుకు చావును గురించి ఎంత తేలిగ్గా చెప్పాడు జాన్ అనుకున్నాను. నవాతె జాన్‌వైపు జాలిగా చూశాడు. 'ఈ ప్రాజెక్టు ఉన్నన్నాళ్ళూ ఈ స్తంభం ఉంటుంది. ఈ స్తంభం ఉన్నన్నాళ్ళూ మా వాడుంటాడు' అన్నాడు జాన్.

ఇక మేము జాన్ కొడుకును గురించిన వివరాలు అడిగి అతన్నీ గతంలోకి తీసుకువెళ్ళి బాధపెట్టదల్చుకోలేదు. నవాతె ఆ స్తంభానికి దగ్గరగా వెళ్ళి కొంచెం సేపు నిల్చుని ఇవతలకు వచ్చేడు.

లంచ్ అయిన తరువాత అందరం బయలుదేరి లెఫ్టుకెనాల్ గూడా చూసేం. అక్కడ కొంచెంసేపు ఆగి దాన్ని లాల్‌బహదూర్ కెనాల్ అంటారు. అక్కడ రాతితో చెక్కిన రెండు ఏనుగులున్నయి. ఏనుగు దగ్గర నిల్చుని ఫోటో తీయించుకోవాలన్నాడు నవాతె. నేను కెమేరా క్లిక్ చేశాను.

అక్కడ పెట్టెలోని కూల్‌డ్రింక్స్ అన్నీ తీసి అందరికీ ఇచ్చేడు జాన్. దాంతో బయలుదేరినప్పుడు తీసుకువచ్చిన సామాన్లన్నీ అయిపోయినై.

డిన్నర్ టైములోపలే హైదరాబాద్ చేరుకున్నాం.

డిన్నర్‌లో బల్దేవ్‌సింగ్ మరో ఇద్దరు ఒక టేబిల్ దగ్గర కూర్చున్నారు. నేను, నవాతె, చటర్జీ, జైన్ ఒక చోట కూర్చున్నాం. డైనింగ్ హాలంతా కబుర్లతో నిండిపోయింది. చాలామంది నాగార్జునసాగర్ సంగతే చెప్పుకుంటున్నారు. బల్దేవ్‌సింగ్ వాళ్లు ఆరోజు వారు చూసిన సాలార్‌జంగ్ మ్యూజియమ్, చార్మినార్, జులాజికల్ గార్డెన్స్ విషయం మాట్లాడుకుంటున్నారు.

'ఒక్క మనిషి అన్ని వస్తువులు తన జీవిత కాలంలో సేకరించేడంటే కళంటే ఆయనకు అభిరుచి, ఆసక్తి... ఎంతో మ్యూజియంలోని వస్తువులకన్నా అవి సేకరించిన వ్యక్తి చాలా గొప్పవాడు' అంటున్నాడు బల్దేవ్.

'జూలాజికల్ గార్డన్స్‌లో చిలుకలు చాలా బావున్నాయి. రకరకాల రంగు రంగుల చిలకలు' మరో కంఠం.

'చార్మినార్ చాలా ఠీవిగా పట్టణాన్నంతటిని ఆవరించుకుని చేతులు చాచుతూ చూస్తూన్నది'. మరో కంఠం, వాళ్ల టేబిల్ దగ్గర జాన్ నిల్చుని డిషెస్ అందిస్తూ వాళ్ల మాటలు ఆసక్తితో వింటున్నాడు. వాళ్ల టేబిల్ మా టేబిల్ దగ్గరగా ఉండటంచేత వాళ్లమాటలు మాకు బాగా విన్పిస్తున్నాయి.

చిలుకల మాటవినగానే జాన్ ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నాడు.

'బాబూ ఆ చిలుకల్లో ఏదైనా ముసలి చిలుక, ఆకుపచ్చ రంగు, చాలా పొడుగ్గా ఉండేది చూశారా?' అన్నాడు జాన్.

'చూశాం అద్భుతంగా ఉంది' అన్నాడు బల్దేవ్.

నవాతె జాన్‌ని మా టేబిల్ దగ్గరకు రమ్మని సంజ్ఞ చేసేడు. దగ్గరకు వచ్చి చేతులు కట్టుకుని నిల్చున్నాడు జాన్.

'ఆ ముసలి చిలుక కథ ఏవన్నా ఉందా? ఏవిటి విశేషం' అన్నాడు నవాతె.

'చాలా వుంది బాబు తరువాత చెప్తాను మీకు తీరుబాటుగా' అన్నాడు జాన్.

అప్పటికి మా డిన్నర్ చాలా భాగం అయిపోయింది. చటర్జీ స్పూన్‌తో స్వీట్ తింటున్నాడు చప్పరిస్తూ.

సోమవారం మేం కొన్ని పేపర్లు ప్రజంట్ చెయ్యాలి. జైన్ ఆ పేపర్లని గురించి ఆలోచిస్తున్నాడు.

ఆ రోజు రాత్రి ఎంత ఆలస్యమైనా తయారు చేసి వాటి విషయం చూదాలి అన్నాడు జైన్. రేపటితో మా కార్యక్రమం చాలా భాగం అయిపోతుంది. జాన్‌ని వదలగూడదు. చిలుకల కథ రేపటికి వాయిదా వేద్దాం అన్నాడు.

మర్నాడు కాన్ఫరెన్స్‌లో అందరూ పేపర్లు ప్రజెంట్ చేశారు. కాన్ఫరెన్స్ అంతా సందడిగా ఉంది. నవాతె మైక్‌దగ్గర చదువుతుంటే చాలా హుందాగా ఉంది. అందరూ ఎటెంటివ్‌గా వింటున్నారు. నేనూ, జైనూ అతను చదివేటప్పుడు కొన్ని పాయింట్లు రాసుకుంటున్నాం.

  

అతను చదువుతున్న పేపర్లో మా సంస్థకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన సజెషన్స్ ఉన్నాయి. అవి అమలుపరుస్తే సంస్థ ఇంకా పురోగమించడానికి అవకాశం ఉంటుందన్నాడు తన ఉపన్యాసంలో. కాన్ఫరెన్సుకు వచ్చిన బాసెస్ కూడా అతన్ని అభినందించారు. ఇతర దేశాలలోని సంస్థల ప్రయోజనాలు, వాటి విధానాలు కొన్ని మనం అవలంబిస్తే బావుంటుందని కూడా సలహా ఇచ్చేడు.

తనకీ అవకాశం ఇచ్చినందుకు సంస్థకు కృతజ్ఞత తెలుపుతూ తన ఉపన్యాసాన్ని ముగించేడు.

దగ్గరకు ఆ రోజు కార్యక్రమం అయిన తరువాత నవాతె నన్నూ, చటర్జీని రమ్మన్నాడు డిన్నర్ అయిన తరువాత. డిన్నర్ తరువాత కొంచెం సేపు వరండాలో కూర్చుని ఓ సిగరెట్టు కాల్చి, ఆకుపచ్చ నెక్లసును మరోసారి చూసి, నవాతె రూంకు బయలుదేరేను.

చటర్జీ నీలపుగీరల పైజామాలో నా పక్కనే కుర్చీలో ఉన్నాడు. నే రాలేను భాయ్... నిద్రవస్తుంది. ఈ బస్సు ప్రయాణం కాదు గానీ వళ్లంతా నొప్పులు ఇంకా తగ్గలేదు అన్నాడు చటర్జీ.

నాకు ఆకుపచ్చ నెక్లెస్‌ను చూస్తూ మరికొంచెం సేపు కూచోవాల్ననిపించింది. కొంచెంసేపు కూర్చుని నవాతె రూమ్‌కు వెళ్ళేను.

నవాతె సిగార్ కాలుస్తున్నాడు. జాన్‌ని కూచోమంటున్నాడు. అతడు నిల్చునే ఉన్నాడు. కూచోమని మళ్ళీ బలవంతం చేస్తున్నాడు. జాన్ నేలమీద పద్మాసనం వేసి కూర్చున్నాడు. నేను ఓ కుర్చీ పక్కకు లాక్కుని అతని ఎదురుగా కూర్చున్నాను.

చిలుకమాట అనగానే మా దొరగారు జ్ఞాపకం వచ్చేరు అంటూ మొదలెట్టాడు జాన్. 'మా దొరగారికి చిలుకలంటే చాలా ఇష్టం. ఆకుపచ్చ చిలుక ఒకటుండేది. దాన్ని పెంచేవారు. చాలా పొడుగ్గా ఉండేది. దానికి రెక్కల దగ్గర అక్కడక్కడ కెంపు రంగు ఉండేది. ఆ చిలుకను చాలా ప్రేమతో చూసేవారు. దానికి యాపిల్ పండ్లూ, దానిమ్మ పళ్ళూ తెచ్చి ఇచ్చేవారు. దొరగారు ఇంటికి రాగానే దాన్ని చూస్తూ ఆ చిలుకకు మాటలు కూడా వచ్చు. గుడ్ మార్నింగ్ మేజర్... గుడ్ నైట్ మేజర్... థ్యాంక్యూ మేజర్... అంటూండేది. ఆయన ఇంగ్లండు వెళ్ళేవరకూ ఆయన దగ్గరే ఉండేది.

'ఆయనెందుకో ఆ చిలుకను తనతో తీసికెళ్ళడం ఇష్టపడలేదు. ఇంత అందమైన చిలుక మీదేశానిది. దాన్ని ఇక్కడే ఉంచేస్తాను, అని దాన్ని 'జూ' అధికారులకు ఇచ్చేశారు. చిలుకలు చాలా రోజులు బతుకుతయి బాబు... కొన్ని అరవై డెబ్బై సంవత్సరాలు కూడా ఉంటయి. నేనెప్పుడైనా వెళ్ళి జూలో దాన్ని చూస్తుండేవాణ్ణి. నన్ను చూస్తే ఏదో పరిచయమున్న దానల్లే నా వైపు చూసేది ముక్కు కదలిస్తూ' అన్నాడు.

'మీ దొరగారు ఇంకా ఇంగ్లండులోనే ఉన్నారు' అన్నాడు నవాతె.

'ఏమో బాబు, ఆయన్ను గురించిన వివరాలు తెలియవు. నాలుగేళ్ళక్రితం వరకూ నాకు నెల నెలా ముప్పై రూపాయలు పంపిస్తుండేవారు. ఆ తరువాత డబ్బు రావడం మానేసింది. ఉంటే తప్పక పంపేవారే... మహారాజు. ఆయన ప్రేమమయుడు. ఆయన దగ్గర ఓ కుక్క ఉండేది. ఆ కుక్క అంటే ఆయనకు ఎంత ప్రాణమో తెలియదు. ఆయన ఇంటికిరాగానే ఆయన మీదకు ఎగిరి నాలికతో ఆయన్ని తాకేది. ఆయన దాన్ని ఎత్తుకునేవారు. చాలా పౌరుషంగల కుక్క. దానికి కోపం వస్తే, దాని దగ్గర పులికూడ నిలువలేదు'.

'మీ దొరగారు తుపాకులు గూడా వెంటతీసికెళ్ళారా? నీకేమైనా ఇచ్చారా?' అని నేనడిగేను. 'నా కెందుకు బాబూ తుపాకి... ఆయనే తీసికెళ్ళారు. ఆయన అప్పుడప్పుడు ఆకుపచ్చకోటు తొడుక్కుండేవారు. చాలా బావుంటుంది. అది మాత్రం నా కిచ్చి వెళ్ళేరు. చలికాలంలో దాన్ని వేసుకుంటుంటాను. దాన్ని చూసినప్పుడల్లా దొరగారు నా పక్కన ఉన్నట్టే ఉంటుంది. చాలాభద్రంగా దాచి జాగ్రత్తగా వాడుతున్నాను. నన్నే మనిషినిచేసి నన్నోమనిషిగా చూసేవారు. ఆయన ఋణం నే తీర్చుకోలేను'.

నీవు మనిషివి కాదా... మనిషిని·మనిషిలా చూడక ఇంకెలా చూస్తారూ? అన్నాడు నవాతె. అతని దగ్గర నుండి ఇంకా ఏమైనా విషయాలు సేకరిద్దామని.

ఆయన్ని గురించి కథలు చెప్తుంటే ఎన్నిరోజులైనా చాలవు. మీ కెందుకు బాబూ అవన్నీ.మీరంతా పెద్ద ఆఫీసర్లు. మిమ్మల్ని అవన్నీ చెప్పి విసిగించమంటారా?" అని బోసిగా నవ్వేడు జాన్.

రేపు కార్యక్రమంలో మాకు విశేషించి పని లేదులే. కొన్ని లెక్చర్లు మాత్రమే ఉన్నాయి. చెప్పు ఫరవాలేదు చెప్పు. మీ దొరగారి సంగతులేమైనా చెప్పు అన్నాను.

'నా పేరు అసలు జాన్ కాదండి. మాది అదేదో అంటారే అంటరాని కులం. మా నాయనమ్మ బతికున్న రోజుల్లో ఆమె చెప్పేది మా కులాన్ని గురించి. మేం ఉండే గ్రామంలో మేం ఎవరికంటా పడకూడదట, ఎవర్నీ తాకకూడదట, మాదో ప్రత్యేకమైన జాతి అనేది. ఊళ్ళో మంచినీళ్ల చెరువు ఉండేది, ఆ నీళ్లు కూడా మమ్మల్ని తాకనిచ్చేవారు కాదు. మేమెక్కడో ఊరిబయట గుడిసెల్లో, అప్పుడప్పుడు అడవుల్లోనూ ఉండేవాళ్లం. అడవంటే జ్ఞాపకం వచ్చింది. అడవంటే ఓ కథ చెప్తాలెండి... ఏదో మాటల సందర్భంలో మా దొరగారికి చెప్పేను ఈ విషయం. ఆయన బలే తమాషాగా ఉందే అని పెద్దగా నవ్వేరు. ఆ చిలుక కూడా నా వైపు చూసి ఏదో భాషలో అరచింది. ఆ నవ్వు చాలా సేపటికిగాని ఆగలేదు. నవ్వు ఆగిన తరువాత రేపటినుండీ నీ పేరు 'జాన్' అన్నాడు. అలాగే పిలిచేరు. అప్పటికీ ఇప్పటికీ ఆ పేరే నిలబడిపోయింది.

"అందరమూ మనుష్యులమే కాదుటోయ్.. ఏం నీ రక్తం ఏవన్నా వేరుగా ఉంటుందా?" అని మళ్ళీ నవ్వేరు.

మధ్యలో నవాతె నవ్వేడు.

"నాకేవో కొన్ని సూక్తులు చెప్పేరు. మనిషిని మనిషి కాకపోతే మరెవరు ఆదరిస్తారు. అందరినీ దయతో చూడాలన్నారు. ఆ కుక్కని టైగర్ అంటుండేవారు. చచ్చిపోయినప్పుడు చాలా బాధపడ్డారు. రెండురోజులు భోజనం చేయలేదు. ఆ పులిమీద పగ తీర్చుకునే వరకూ ఆయన నిద్రపోలేదు.

'పులేవిటి? పగేవిటి' అన్నాడు నవాతె. ఆదిలాబాద్ అడవులకు వెళ్ళినప్పుడు నేను కూడా ఆయన వెంట వెళ్ళేవాణ్ణి. ఆయన దగ్గిర తుపాకులతో పాటు ఓ బల్లెం కూడా ఉండేది. ఆ రోజు రాత్రీ అడవిలో ఓ టెంట్ వేసుకుని ఉన్నాం. ఎంత ప్రయత్నించినా ఆయనకు జంతువు దొరకలేదు.

ఆ టెంట్ నేనే బిగించేవాణ్ణి, ఆ రోజు రాత్రి చాలా పొద్దుపోయింది. ఆయన కొంచెం విస్కీ తాగి అలా పడుకున్నారు. టెంట్ బయట కుక్క (టైగర్) కాపలా కాస్తున్నది. నేను కూడా ఓ తుపాకీ పుచ్చుకుని నిల్చున్నాను. నాకు నిద్రకునుకు వస్తున్నది. అయినా నిద్రను ఆపుకుని దొరగారికి ఏ ఆపదా రాకుండా చూస్తున్నాను. 'ఇంక పడుకో జాన్ ఎంతసేపు మేలుకుని ఉంటావు. మనకేం ఫర్వాలేదు కుక్క ఉందిగా

అన్నారు దొరగారు మధ్యలో లేచి. ఆయన ఆ మాట అనగానే నేను తుపాకి పక్కనపెట్టి కొంచెం సేపు పడుకున్నాను. నేపడుకున్న పదినిమిషాలకు కుక్క అరుపు వినిపించింది. అరవడం అరపు ఆగిపోవడం జరిగేయి. దొరగారు గబగబా లేచారు. ఆయన వెనకాలే నేనూ వెళ్ళేను బయటకు వచ్చి చూస్తే అక్కడ కుక్కలేదు.

బ్యాడ్‌లక్ జాన్ అని ఆయన పెద్దగా అరచేరు. ఆ కుక్కను జంతువు పొట్టన పెట్టుకుంది. టార్చిలైట్ వేసి దగ్గరగా చూశారు పులి అడుగుజాడలు కన్పిస్తున్నయి. కుక్కను ఈడ్చుకు వెళ్ళినట్టు కూడా కన్పిస్తున్నది. 'ఆ పులి మన మీదనే పగపట్టింది దొరా. పోయినసారి మీరు ఒక పులిని కొట్టినప్పుడు దానికి దెబ్బ తగిలింది. కాని అది చావలేదు. బహుశా ఆ పులే అయి ఉంటుంద'న్నాను. దానికేం సందేహం లేదన్నారు దొరగారు. తెల్లవారిన తరువాత దాని అడుగు జాడలన్నీ పరీక్షగా చూశాం. కొంత దూరం పోయిన తరువాత కుక్క కళేబరం కన్పించింది. దాన్ని చూస్తూనే ఆయన కళ్ళు వత్తుకున్నారు. 'మనల్ని కాపాడ్డం కోసం తన ప్రాణాల్నే ధారపోసింది... ఈ పులి పని పట్టాలి' అని పళ్ళు కొరికేరు...

ఆ తరువాత కొన్నాళ్ళకు మళ్ళీ ఆ అడవికి వెళ్ళేం. 'ఈసారి అది మన కంటపడకుండా పోదులే' అన్నారు దొరగారు.

దాని స్థావరం కనిపెట్టేశారు. అక్కడన్నీ పొదలు గుబురు గుబురుగా ఉన్నాయి. ఆయన ప్యాంట్ ప్యాకెట్‌లో పిస్తోలు, చేతిలో బల్లెం. ఆయన వెనకాల నేను తుపాకితో, ఇద్దరం ఒక పొదలో చాటున కూచుని ఆకులన్నీ కప్పుకున్నాం. నిశ్శబ్దంగా చాలా సేపు కూర్చున్నాం.

నరవాసన ఎంతదూరాన ఉన్నా జంతువు సులభంగా పట్టుంది. దొరగారు ఆ రోజు ఆయన ప్రాణాలు తెగించి కూర్చున్నారు. ఆయన వెనకాల నేను. పులిని కొట్టడానికి ఎవరూ అలా కూర్చోరు. ఎందుకో పగవల్ల అలా ధైర్యం చేశారు. నాకు ప్రాణాలు బిక్కు బిక్కు మంటున్నాయి. పులిని చంపడానికి సామాన్యంగా తుపాకే వాడతారు. ఈయన చేతిలో బల్లెం మాత్రం ఉంది. ఆ బల్లెం పొడవు సుమారు ఏడు అడుగులుంది. చివర కొనదేలి పదునైన ఇనుప అంచు. చాలా మందంగా ఉంది. అది ఒక వేళ ఎగిరి నా మీదపడితే ఏం చేయాలో తోచలేదు.

దొరగారికి అవసరమైతే దానిమీదపడి, కలబడి దాంతో యుద్ధంచేసి చంపగల ధైర్యమూ, బలమూ పట్టుదలా ఉన్నాయి. ఆయన వెనకాల నేనుంటే నాకేం భయం లేదు. నా చేతిలో తుపాకి ఉంది. సిద్ధంగా ఉన్నాను. ఆయన తలకు బెల్టుతో పెద్దలైట్లు బిగించుకుని ఉన్నారు. అది స్విచ్ విపరీతమైన కాంతితో వెలుగుతుంది. ఆయన నుదుటి మధ్యలో ఉంది బల్బు. ముని కాళ్లమీద కూచుని ఉన్నారాయన.

అనుకున్నట్లుగానే అది వచ్చే అలికిడీ అయింది. పులివాసనకూడా వస్తున్నది. దూరాన ఉన్నా పొదల్లోకి ఓ రాయి విసిరేరు దొరగారు. ఆ పొదల్లో చప్పుడైంది. అటువైపు వెళ్ళింది పులి. మరోక్షణంలో ఎడంవైపుగా పిస్తోలు పేల్చేరు గాలిలోకి. ఆ వైపు ఎవరూ లేరు ఏదీ కన్పించడంలేదు. రాయిపడ్డ వైపునుండి పిస్తోలు పేలిన వైపుకు వెళ్ళింది. దానికి దిక్కు తోచడం లేదల్లే ఉంది.

కొంచెంసేపు అటూ కొంచెం సేపు ఇటూ చూస్తున్నది. ఇంతలో మేం కూర్చున్న పొదలో చప్పుడు చేసేరు దాని కళ్ళల్లోకి. అది నోరంతా తెరిచి ముందుకు వచ్చేట్టుగా ఉంది. లైటు కాంతికి దాని కళ్లు మెరుస్తున్నాయి. నోటిదగ్గర తెల్లగా రెండు వైపులా వస్తున్న కోసుగావున్న మీసాలూ, నోట్లో తెల్లగావున్న కోర పళ్ళూ కనిపిస్తున్నాయి. కూర్చునే రెండడుగులు ముందుకు వేశారు. లైటు వేయడం, ఆయన ముందుకు జరగడం, ఆయన చేతిలోని బల్లెం దానినోట్లోకి విసరడం అన్నీ ఒకేసారి జరిగాయి. పులి గాండ్రించడం భయంకరంగా ఉంది. అంతెత్తున ఎగిరి మళ్లీ కిందపడింది దొరగారు బల్లెం వదలలేదు. గట్టిగా పట్టుకుని ఇంకా దాంతో పెనుగులాడుతున్నారు. దాని నోట్లోంచి బల్లెం వీపుగుండా బయటకు వచ్చింది.

ఎగిరిన తరువాత పెద్దశబ్దం చేసుకుంటూ నేలమీది కొరిగింది. బలమైన పెద్ద రాక్షసుడు నేలమీద పడ్డట్టుగా ఉంది. తన చేతిలోని బల్లేన్ని దాని శరీరంలోకి గుచ్చిన తరువాత గుండ్రంగా తిప్పుతున్నారు. పులి నాలిక బయటపెట్టింది. దగ్గరకు వెళ్ళి చూస్తే నోరు తెరిచేవుంది. అంత పెద్దపులిని నేనెప్పుడూ చూడలేదు. అది నేలమీద పడి ఉంది దాని పొడవు సుమారు పదిపన్నెండు అడుగులుంటుంది. పచ్చటి శరీరంమీద నల్లటి చారలు, శరీరం తాకి చూసేను, పట్టుకుచ్చులా ఉంది.

'దీని చర్మం కావాలి జాన్' అన్నారు. 'తరువాత ఓ రోజల్లా అక్కడ ఉండి చర్మం తీయించుకుని మరీ తిరిగివచ్చాం. ఆ చర్మం శుభ్రం చేయించి తమతో దాన్ని ఇంగ్లండు తీసుకెళ్ళారు. ఆయన పట్టుదలతో పగ సాధించాడు...' అన్నాడు.

జాన్ చెప్తున్న కథను వింటుంటే మాకందరికీ ఒళ్ళు జలదరించింది గగురుపొడిచింది, పులకరించింది.

మేజర్ బిల్ సామాన్యుడు కాడు మనిషంటే అలా ఉండాలి అన్నాడు సవాతె.

'మరి దొరగారికి పెళ్ళి కాలేదా? ఎప్పుడూ మేం సాబ్‌ని గురించి చెప్పలేదే? అన్నాను నేను.

'పెళ్ళి కాలేదు బాబూ, ఆయన ఇక్కడ ఉండే రోజుల్లో ఒక అందమైన ఆమెతో పరిచయమైంది. ఆమెను వదలి ఓ క్షణం ఉండేవాడు కాదు. ఆమె ఆకుపచ్చ చీరె కట్టుకుంటే చాలా సంతోషంగా ఉండేది ఆయనకు. వాళ్ళకు ఓ ఆడపిల్ల కూడా కలిగింది. చక్కని చుక్క. ఎప్పటిమాట పాతికేళ్ళకుపైమాట... అమ్మగారెప్పుడూ దొరగారి దగ్గరే ఉండేది. మరో సంవత్సరానికి ఇంగ్లండు వెళ్తారనగా ఏదో వాళ్ళిద్దరికీ భేదాభిప్రాయం వచ్చి చంటిపిల్లను తీసుకుని ఈ ఊరు విడచి వాళ్ళ బంధువుల దగ్గరకు ఎక్కడికో ఆమె వెళ్ళిపోయింది. ఆయన ఇంగ్లండు వెళ్ళేప్పుడు కూడా అమ్మగార్ని గురించి తలుచుకుని చాలా బాధపడ్డారు. ఆ అమ్మాయి పెరిగి పెద్దదయి చదువుకుని ఎక్కడో విమానాల్లో పనిచేస్తోందట. నా కామధ్య తెలిసింది. ఆ అమ్మాయి ఎప్పుడైనా కన్పిస్తే బావుండును, అంటూ ముగించేడు జాన్.

నా కెందుకో విమానంలో కన్పించిన ఎయిర్ హోస్టెస్ జ్ఞాపకాని కొచ్చింది.

కథ వింటున్న మేం అందరం ఆ లోకంలోంచి ఈ లోకంలోకి వచ్చేం.

'మీ శలవైతే నే వెళ్తాను బాబూ. మా దొరగారిని తలచుకుంటూ నేనీ జీవితం గడుపుతున్నాను... ఆయన్ని రోజూ పువ్వులతో పూజించినా ఆయన ఋణం తీర్చుకోలేను, అంటూ లేచాడు.

'జాన్... మనిషంటే నీవోయ్....' అన్నాడు అతని భుజం నిమురుతూ సవాతె.

  

మేం వచ్చిన పనీ మా కార్యక్రమం పూర్తి అయింది.

ఆ రోజు ఎవరి ఊళ్ళకు వాళ్ళు వెళ్ళే రోజు విమానంలో వెళ్ళే వాళ్ళ టిక్కెట్లూ, రైల్లో వెళ్ళే వాళ్ళ టిక్కెట్లూ మా ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు మా కందరికీ ముందుగానే ఇచ్చేరు.

అందరమూ ఎక్కడివాళ్ళం అక్కడికి వెళ్ళడం ఎంతో బాధాకరంగా ఉంది. నేను నవాతె వాళ్ళ రూముకు వెళ్ళాను. నవాతె నన్ను కౌగిలించుకున్నాడు. నన్ను అమాంతం ఊపేశాడు. ఈ కార్యక్రమం రూపేణ మనం అందరం కలుసుకున్నాం, రోజులు సరదాగా గడిచిపోయినాయి. ఎంతో నేర్చుకున్నాం. ఎంతో చూశాం. ఇంత ఆప్యాయంగా నన్ను కౌగిలించుకుంటేను కళ్ళు చెమర్చినయి. ఆ రోజు లంచ్ అయిన తరువాత ఒకరిదగ్గర ఒకరు శలవు తీసుకోవడంతో సాయంత్రం అయిపోయింది. ఎవరి దగ్గరికి వెళ్ళినా, ఎవరిని ఎవరు కలుసుకున్నా అందరిలోనూ ఆప్యాయత, అభిమానం, ప్రేమ, కన్పిస్తున్నవి. అప్పటి పరిస్థితులు చూస్తే ఒకరిని వదలి ఒకరు ఎలా వెళ్ళిపోతామో అనిపించింది. చటర్జీ కలకత్తా రమ్మని ఆహ్వానించేడు. తప్పక రావాలి ఈసారి శలవు పెట్టినప్పుడు. వచ్చి నా ఆతిథ్యం స్వీకరిస్తేగాని నేనొప్పుకోను. వారానికోసారి ఉత్తరం మాత్రం తప్పక రాయాలి. నవాతె అలాగే అన్నాడు.

కృష్ణస్వామి అలాగే అన్నాడు.

మా అధికారుల వద్ద శలవు తీసుకుని ప్రయాణానికి సిద్ధం అయినాం. జాన్‌కు తలా ఒక అయిదు రూపాయలు వసూలు చేసి టిప్‌గా ఓ వంద రూపాయలిచ్చేం. జాన్ కృతజ్ఞతగా మా వైపు చూసి దణ్ణం పెట్టేడు. మా ఇన్‌స్టిట్యూట్ బస్ కదుల్తుంటే జాన్ అక్కడ ఉండిపోయినా మాతో వస్తున్నట్టే ఉంది. మనిషంటే నిజంగా జానే మనిషి.

# 11

# చీకటి

నెమ్మదిగా బరువుగా నడుస్తున్నాను. నాతోకూడా ముగ్గురు వస్తున్నారు. ఆ ముగ్గురూ నా స్నేహితులే. మా ముందు గుర్రబ్బండీ మరీ నెమ్మదిగా నడుస్తోంది. గుర్రబ్బండీలో ప్రసాదు పడుకుని ఉన్నాడు. ప్రసాదులో చలనం లేదు. స్నేహితుల్లో సీతాపతి ఒకడు. నవ్వుతున్నాడు. నవ్విస్తున్నాడు. మాట్లాడుతున్నాడు. మాట్లాడిస్తున్నాడు. సిగరెట్టు తాగుతున్నాడు. నా చేత తాగిస్తున్నాడు. యాంత్రికంగా పొగ వదులుతున్నాను. మిగతా ఇద్దరూ రమాపతి, విశ్వం. వీళ్ళిద్దరూ తడీపొడీగా మాట్లాడుతున్నారు. సీతాపతి ఇంగ్లీషు నవలలు తెగ చదువుతాడు. ఎప్పుడు చెప్పినా ఏదో కొత్త నవల్లోని కథే చెపుతాడు.

వెర్రిగా నవ్వుతాడు. జోక్సు విసురుతాడు. ఆ జోక్సులో అప్పుడప్పుడు శృంగారం ఒలకబోస్తూంటాడు... నేను వాళ్ళ దృష్టిలో పెద్ద మనిషిని. నాకు కోపం చాలా ఎక్కువ.

బండిలో చలనం లేకుండా పడుకుని ఉన్న ప్రసాదునే చూస్తున్నాను. సీతాపతి మాటలు వింటున్నా తలకెక్కడం లేదు. వాళ్లందరితోపాటు నవ్వుతూనే ఉన్నాను. ఆ నవ్వు పేలవంగా ఉంది. సీతాపతి ఈ మధ్య ఓ నవల చదివాడుట! దాని పేరు 'జింజర్‌మాన్'. ఆ నవలలోని కథానాయకుణ్ణి గురించి విపరీతంగా చెబుతున్నాడు. "ఆ నవల చదవని జీవితం ఏం జీవితమోయ్!" అంటున్నాడు. ఆ కథానాయకుడి పేరు డేంజర్ ఫీల్డుట... వాణ్ణి మాటలతో ఆరాధిస్తున్నాడు.

"అలాంటి పచ్చిశృంగారం కథలు నా దగ్గిర చెప్పక..." అని నాజూగ్గా విసుక్కున్నాను.

నేనే పరిస్థితుల్లో ఉన్నానో గ్రహించికూడా ఇలా మాట్లాడుతుంటే నాకు విపరీతమైన కోపం వచ్చింది. వాడి ముక్కుమీద బలంగా పొడుద్దామనుకున్నాను. 'ఒరి, రాస్కెల్!...' అనుకున్నాను. ఆ మాట బయటకు అనడానికి సభ్యత అడ్డు వచ్చింది...

రెండు చేతులతోను ముఖం కప్పుకున్నాను. దుఃఖం కట్టలు తెంచుకుని వస్తూంది. అంత పబ్లిగ్గా ఏడవడం బాగా లేకపోయినా ఆగేటట్టు లేదు. చేతిగుడ్డతో రెండు కళ్ళూ తుడుచుకున్నాను. బండిలో ప్రసాదు... బండి నెమ్మదిగా వెళుతున్నది. వెనక మేము నెమ్మదిగా నడుస్తున్నాం.

"సూర్యుడు ఉదయిస్తాడు, అస్తమిస్తాడు. ఇది నిజం కాదంటావా?"

..........................

"మొదట వెలుతురు... తరువాత చీకటి... ఇది కూడా నిజం కాదంటావా?"

..........................

"ప్రపంచంలో మామూలుగా జరిగేదే జరిగింది... తేలిగ్గా తీసుకో, బ్రదర్..."

ఇలా అంటున్నాడు. లాగి లెంపకాయ కొడదామనిపించింది. నేను కోపగించుకుంటే నన్ను ఒంటరివాణ్ణి చేసి వాళ్లు ముగ్గురూ వెళ్లిపోతారు.

'నిన్నేదో ఓదారుద్దామని కూడా వస్తూంటే ఇంత అసభ్యకరంగా ప్రవర్తిస్తావా?' అని కూడా అనగలడు సీతాపతి. సీతాపతి ఎప్పుడూ జీవితంతో ఆడుకునే మనిషి.. మనస్సులో ఏదుంటే అది బయిటికి అనేస్తాడు.

మేం బయలుదేరి చాలా సేపయింది...

చీకటి పడుతూ పడుతూ ఉంది...

రమాపతి ఏవో సినిమా కబుర్లు చెబుతున్నాడు.

ముగ్గురూ మూడు రకాలుగా ప్రయత్నం చేస్తున్నారు, నన్ను ఏ లోకంలోకో తీసుకు వెళ్లాలని. నా కేమీ కనిపించడం లేదు, వినిపించడం లేదు, ఎదురుగా పోతున్న బండి, బండిలో ప్రసాదు, వెళుతూ బండిచేస్తున్న చప్పుడు తప్ప. బండివాడు బీడీ తాగుతూ పొగ వదులుతున్నాడు. ఆ పొగ ప్రసాదుమీదుగా వెళుతున్నది.

చీకటి తరుముకుంటూ వస్తున్నది.

"పొద్దున ఎప్పుడో తిన్న అన్నం. ఆకలి వేయడం లేదా?... హోటలుకు వెళ్లి ఏదైనా టిఫిన్ తీసుకురానా?..." అన్నాడు సీతాపతి...

నాకు నిజానికి ఆకలి వేస్తున్నది.

ఇంట్లో ఏడ్చి... ఏడ్చి... నీరసపడిపోయాను... ఇంతదూరం నడకతో మరీ నీరసం వచ్చింది.

"శరీరం అన్న తరవాత ఆకలి లేకుండా ఉంటుందా?... మనం యోగిపుంగవులం కాదుగా... దుఃఖం వేరు... ఆకలి వేరు..." అంటూనే హోటలువైపు పరిగెత్తేడు సీతాపతి.

'అసలే దుఃఖంతో కుళ్లుతున్న నేను ఇంకా టిఫిన్ కూడా తినాలా?... సీతాపతి వట్టి వెధవ...' అనుకున్నాను.

సీతాపతి దృష్టిలో ఏ పిక్నిక్‌కో, ఏ వాకింగ్‌కో వెళుతున్నట్టుగా ఉంది. పాపం సీతాపతి మంచివాడు. బండి కుదిర్చిపెట్టి నాకు సహాయం చేశాడు. చాలామంది బండివాళ్లు రామని మొరాయించారు. రెండు గంటలు అటూ ఇటూ తిరిగి ఏదో విధంగా బండి తీసుకువచ్చాడు. సీతాపతి ఏమయినా సాధించగలడు.

నాలుగు పొట్లాలు తీసుకుని మాలో కలుసుకున్నాడు. వాళ్ళు ముగ్గురూ పొట్లాలు విప్పేరు. నా చేతిలోని పొట్లం అలాగే ఉండిపోయింది. ఆ పొట్లం ప్రసాదు చూస్తే ఎగిరి గంతేసేవాడు. తాను కొంచెం తిని ఇంట్లో అందరికీ పెట్టేవాడు. ఇప్పుడు బండిలో ఉన్నాడు. బండి నెమ్మదిగా వెళుతున్నది.

"పొట్లం విప్పవోయ్..." అని భయపడుతూ నెమ్మదిగా అన్నాడు విశ్వం. విశ్వం అభిమన్యుణ్ణి గురించి ఏదో కథ చెబుతున్నాడు.

ఆకలికి తట్టుకోలేక పొట్లం విప్పేను. నోరు ఎందుకో బెరుడు కట్టుకుపోయింది. ఆ పొట్లంలో పకోడీలు, బజ్జీలు ఉన్నాయి. ఒక్కొక్కటే నములుతున్నాను.

"ఆకలికి మించిన అగ్ని మరోటి లేదు. మనిషిని దహించి వేస్తుంది" అంటున్నాడు సీతాపతి.

నా దగ్గర తుపాకీ ఉంటే సీతాపతిని కాల్చి పారేద్దును!

పోయిన దీపావళికి ప్రసాదుకు గన్ కొని ఇస్తే ఇల్లంతా ఎగిరేదు. నేనోసారి ఆఫీసునుండి ఇంటికి వచ్చినప్పుడు నా వైపే గురిపెట్టి ఠప్ మనిపించాడు. ఆ తుపాకిలో శబ్దం తప్ప మరేం రాలేదు.

ప్రసాదుకు పెట్టకుండా పకోడీలు తింటూ నడుస్తున్నాను. రోడ్డుమీద అందరూ నా వైపే చూస్తున్నారు.

  

నెమ్మదిగా ఊరి పొలిమేరలు దాటేం... ఊరికి ఉత్తరాన...

"అదుగో, వచ్చేశాం..." అన్నాడు సీతాపతి. చూపుమేర దూరంలో ఎక్కడా వెలుతురు కనిపించడం లేదు.

బండి ఆగింది.

"నా కిచ్చేదేదో ఇచ్చేయండి, బాబూ... చాలా పొద్దు పోయింది. పోతాను" అన్నాడు బండివాడు.

జేబులోంచి డబ్బు తీసి ఇచ్చాను...

బండివాడు ముఖం చిటచిటలాడించి నా వైపు అదోలా చూశాడు. వాడికి కూడా చులకనై పోయాను నేను.

"నాకీ పాటికి మూడు నాలుగు బాడుగలు వచ్చేవి... చాలా ఆలస్యం అయిపోయింది... మరో రెండు రూపాయలు..." అన్నాడు.

ఈ బండివాళ్లకున్న తెగులే ఇది. ఎంత ఇచ్చినా తృప్తి ఉండదు. ఎంత వస్తే అంత పిండుదామని చూస్తారు.

నాకు కోపం వచ్చింది. అనుకున్న దానికన్నా ఒక దమ్మిడీ ఎక్కువ ఇవ్వనన్నాను.

"చచ్చినోడ్ని బండిలో వేసుకుని ఎవరు తీసుకు వస్తారండీ... ఆ అయ్యగారి మాట తీసెయ్యలేక వచ్చాను. మా బండివాళ్లు అసలు ఒప్పుకోరు. ఏదో నాలుగు డబ్బులు వస్తాయనే వచ్చాను. ఇంటిదగ్గర నా పెళ్ళాం రోగంతో మూలుగుతున్నది..." అన్నాడు.

నేను ఇవ్వనంటే ఇవ్వనన్నాను.

బండివాడు లుంగీ పైకి మడిచి రెండు అడుగులు ముందుకు వేసి, "అయితే బండి మళ్లిస్తాను. బయలు దేరినచోటుకే తీసుకెళ్లి అక్కడ వదిలేస్తాను. మీ ఇష్టం..." అన్నాడు.

నాకు తిక్క రేగిపోయింది. అసలే కోపం. అందులో వీడు ప్రసాదును చచ్చినోడు అంటున్నాడు. మళ్లీ తీసుకెళ్లి వాణ్ణి ఇంటిదగ్గర వదులుతాను అంటున్నాడు. బండివాణ్ణి కత్తితో పొడిచి చంపుదామా అనిపించింది. కత్తి లేదు. డొక్కలో తందామా అనిపించింది బలం అంతా పుంజుకుని. వాడి నాలిక కోసేస్తే మరీ బావుంటుంది.

"వీడి కింత పొగరా? స్కౌండ్రల్... చూడు, సీతాపతీ, వీడేమంటున్నాడో!" అన్నాను.

.........................

"ఏందయ్యా, పొగరు గిగరు అంటున్నావ్... మాటలు జాగ్రత్తగా రానీ..." అని ఒక అడుగు ముందుకు వేశాడు బండివాడు.

నేను వాడి చొక్కా లంకించుకుని ఒక్క లాగు లాగాను.

బండివాడి కళ్లు ఎర్రగా జ్యోతుల్లే ఉన్నాయి.

వాడు లుంగీ ఎగగట్టి, "క్యా బోల్తారే... సువర్..." అంటూ నా మీదికి చెయ్యి ఎత్తాడు. నాకు చెమటలు పోయడం, గజగజ వణకడం సీతాపతి గమనించి మా ఇద్దరి మధ్యకు వచ్చి... రాజీ ప్రయత్నంలో ఉన్నాడు.

"నేను తలుచుకుంటే మీ ముగ్గురి నెత్తురూ కళ్లజూసి... మీ అబ్బాయితో పాటు మీ ముగ్గుర్నీ ఇక్కడే పూడ్చిపెట్టి మరీ వెళతాను... నా తడాఖా చూస్తారా?..." అని పళ్ళు పటపట కొరికాడు. చీకటి నిమిష నిమిషానికీ తరుముకు వస్తున్నది. రమాపతి, విశ్వం దూరంగా నిల్చుని ఉన్నారు.

సీతాపతి ఎలాగైతేనేం బండివాడికి, నాకు రాజీ కుదిర్చేడు. మరో రెండు రూపాయలు అదనంగా ఇచ్చి వదిలించుకున్నాను. సీతిపతి బండివాడికి ఓ సిగరెట్టు కూడా ఇచ్చాడు. సిగరెట్టు గట్టిగా దమ్ము లాగి, "అంత కోపమైతే ఎలాగండీ, అయ్యగారూ..." అంటూ బండిని వెనక్కి తిప్పేడు.

నేను ప్రసాదును భుజాన వేసుకున్నాను. ప్రసాదు చల్లగా బరువుగా ఉన్నాడు. చిన్నప్పుడు వాణ్ణి ఎత్తుకున్నప్పుడు నా ముక్కూ, చెవులూ... మెత్తగా తన బుజ్జి వేళ్లతో నిమిరేవాడు. వాడి చేతులు కదిలిస్తుంటే బంగారు గాజులు, బిల్లివి, గలగలమనేవి.... నెలల పిల్లవాడు.

ప్రసాదును భుజాన వేసుకుని రెండడుగులు ముందుకు వేశాను.

రమాపతి, విశ్వం వెనక్కి తగ్గారు.

"ఇక నేను వెళతానోయ్. ఇంటి దగ్గర అర్జంటు పని ఉంది..." అన్నాడు విశ్వం...

"నేనూ వెళతాను... ఇంటి దగ్గర చుట్టాలున్నారు. అమ్మాయికి ఆరోగ్యం తిన్నగా లేదు... డాక్టరు దగ్గరికి వెళ్లాలి" అన్నాడు రమాపతి. నాకు దుఃఖం పొర్లుకు వచ్చింది.

"సీతాపతీ, నీవూ వెళతావా?" అని దీనంగా అన్నాను. నా కసలు నోట మాట రావడం లేదు...

"నేనుంటాలేవోయ్... ఇంకా జరగవలసింది చాలా ఉంది" అన్నాడు సీతాపతి. ఆ మాటవింటే నాకు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది. నేనూ, భుజాన ప్రసాదూ... పక్కన సీతాపతీ... పుణ్యభూమిలో... నెమ్మదిగా నడుస్తున్నాం...

రమాపతి, విశ్వం... కనుచూపు మేరలో లీలగా కనిపిస్తున్నారు. వాళ్ల తెల్లటి చొక్కాలు మాత్రం... వడివడిగా పోతున్నట్టుగా ఉన్నాయి. భుజాన ఉన్న ప్రసాదును కిందికి దింపి, నేలమీద పడుకోబెట్టమన్నాడు సీతాపతి. కిందంతా రాళ్లు... మట్టీ... చీకటి... ఎక్కడ ఏముందో తెలియడం లేదు... కటికనేలమీదయితే రాళ్లు గుచ్చుకుంటాయి... అసలీ ప్రయాణం ఇంతసేపు పట్టిందేమా అని ఆలోచిస్తున్నాను. నెమ్మదిగా నడుస్తూ, మాట్లాడుకుంటూ వచ్చాం. ప్రసాదయితే ఈపాటికి పెద్ద పెద్ద అంగలతో పరిగెత్తుకుంటూ వచ్చి నిమిషంలో చేరేవాడు. వాడికి స్కూల్లో అన్ని గేమ్సులోనూ ప్రయిజులే. రన్నింగ్‌రేస్ అయితే అసలు చెప్పక్కర్లేదు. రేసుగుర్రంలా పరిగెత్తుతాడు... ఎప్పుడు గెలిచినా వాడి స్నేహితులందరూ ఎత్తుకుని గాలిలో గిరగిర తిప్పి... "ప్రసాదు... హిప్... హిప్... హుర్రే..." అనేవాళ్లు. వాడి బర్త్‌డేకి బోలెడు ప్రజెంట్సు ఇచ్చారు వాళ్ళందరూ.

నేనూ, సీతాపతీ అక్కడ కాసేపు నిల్చున్నాం.

"ఇక్కడ ఎవరూ లేరేం?" అన్నాను.

సీతాపతి అటూ ఇటూ చూస్తున్నాడు.

ఇక్కడ ఓ ఎంక్వైరీ ఆఫీసు లేదు. ట్యూబులైట్లు అంతకన్నా లేవు. ఫ్యాన్ లేదు. ఎటు చూసినా కటిక చీకటి... నక్షత్రాల వెలుగులో మాత్రం అక్కడ ఎత్తుపల్లాలు కనిపిస్తున్నాయి. చిన్న చిన్న మట్టి గోపురాల్లా ఉన్నాయి... నల్లటి మట్టి... నల్లటి చీకటి... కీచురాళ్ల శబ్దం...

"వీ డెక్కడా కనపడ్డేం?..." అని అటూ ఇటూ చూస్తున్నాడు సీతాపతి.

కాస్త మిణుకుమిణుకుమంటున్న నక్షత్రాలు గూడా కనిపించడం మానేశాయి. దట్టంగా మబ్బు ఆవరించి పులుముకుంటున్నది...

"నీ విక్కడే ఉండు... నేను వెళ్లి... పిల్చుకు వస్తాను వాణ్ణి... బహుశః వాడి ఇల్లు కూడా ఈ దరిదాపుల్లోనే ఉండవచ్చు...." అన్నాడు సీతాపతి.

ఆ మాట అనడం... రెండడుగులు వేయడం ఒకేసారి జరిగాయి. నాకు నోట మాట రాలేదు. సీతాపతి మోసం చేస్తాడా? నన్ను ఒక్కణ్నీ ఈ కీకారణ్యంలో వదిలేసి... పోతాడా?... లేక నిజంగా వెతికి వాణ్ణి పట్టుకు వస్తాడా? నాకెందుకో అడుగడుక్కి సమస్యలే ఎదురవుతున్నాయి. ఎవర్ని నమ్మేందుకు వీలులేకుండా ఉంది. రమాపతి, విశ్వం అలా చేశారు. సీతాపతి ఏం చేస్తాడో?...

సీతాపతి వెళ్లాడు. ఎంతసేపటికి రాడు. క్షణం ఓ యగంగా ఉంది. టైమెంతయిందో చూసుకుందామంటే గడియారం ముళ్లుకూడా సరిగా కనిపించడం లేదు.

నేను నిల్చునే ఉన్నాను.

ప్రసాదు కింద పడుకుని ఉన్నాడు.

చుట్టూ చీకటి కళ్లు పొడుచుకున్నా ఎటువైపూ... ఏదీ కనిపించడం లేదు. భరించలేని భయంకరమైన నిశ్శబ్దం... ఉండి ఉండి గాలి శబ్దం వినిపిస్తున్నది. కాస్సేపటికి ఎక్కడో నక్క అరుస్తున్న శబ్దం... నా ముక్కుపుటాల్లోంచి వచ్చే శ్వాస

మాత్రం చాలా స్పష్టంగా వినిపిస్తున్నది. ఆ శ్వాస నాదేనని తెలుసుకోలేక పాము దగ్గిర్లో ఉండి బుస కొడుతున్నదేమో అని ఆలోచన! ప్రసాదు కేం అపాయం లేదు కదా... అని వాడివైపు ఓసారి చూశాను. ప్రసాదు కొంచెం పక్కకు పొర్లినట్టుగా కనిపించాడు. వాడివైపే మళ్లీ మళ్లీ కళ్లు పెద్దవి చేసి చూశాను. ప్రసాదు కాలు కదిలినట్లుగా ఉంది. కాలువైపు చూశాను. చేతులవైపు చూశాను. ఏం చూసినా, ఎక్కడ చూసినా ఎక్కడా చలనం లేదు. అలసి సొలసి, హాయిగా భోంచేసి, సుఖంగా విశ్రాంతి తీసుకుంటూ పడుకున్నట్టుగా ఉన్నాడు.

చీకటి మీది మీదికి చేతులు జాపుతూ వస్తున్నట్టుగా ఉంది... చీకట్లో చూస్తున్నకొద్దీ ఏవో ఆకారాలు కనిపిస్తున్నట్టున్నాయి. అవి మళ్లీ కరిగిపోతున్నట్టు... మళ్లీ ఆకారాలు... మళ్లీ శూన్యం... ఎక్కడో నక్క అరుపు... చెవులు మూసుకున్నాను. కళ్లు మూసుకున్నా, తెరిచినా ఒకటిగానే ఉంది. కాళ్లు లాక్కుపోతున్నాయి. కూచుందామంటే ప్రసాదును మరీ దగ్గరగా చూడాలి... వాడి వైపు చూడబుద్ధి కావడం లేదు. ప్రసాదుమీద విపరీతమైన కోపం వచ్చింది. ప్రసాదు నిన్న చచ్చిపోయినా బావుండేది. లేక అది ఈవేళ ఉదయం జరిగినా బావుండేది. బాగా వెలుతురుండగా ఇక్కడికి చేరుకునేవాళ్లం. ఎటూగానివేళ మిట్టమధ్యాహ్నం కళ్లు మూసేడు. క్రికెట్ ఆడుతూంటే వాడికి అది బాటింగ్ టైం. బాంబే వెళ్లినప్పుడు వాడికి జూనియర్ క్రికెట్‌సెట్ తెస్తే... ఆ సంతోషం పట్టలేక ఇల్లంతా ఎగిరేడు. ఎన్నిసార్లో థాంక్యూ చెప్పేడు· వాడికి పరవశత్వం కలిగింది...

ఇంతలో ఉలిక్కిపడ్డాను. ఒళ్లు జలదరించింది. టప్‌మని ఒక చినుకు నా నెత్తిమీద పడింది. ఒకటి, రెండు, మూడు చినుకులు టపటప... వాన వాసన. రెండు చేతులు అడ్డం పెట్టుకున్నాను. బాణంలా దూసుకుపోతున్నాయి నాలోకి చినుకులు... వాడి చినుకులు... బరువైన చినుకులు... చీకటి చినుకులు... చిందులు తొక్కే చినుకులు... ఆ చినుకులు ప్రసాదును కూడా పొడుస్తున్నాయి. ప్రసాదుకి వానంటే అసలు పడదు. ఇట్టే జలుబు చేస్తుంది.... వానలో తిరగద్దురా అని వాళ్లమ్మ ఎప్పుడూ కేకలు వేస్తూనే ఉంటుంది. లేదమ్మా... లేదమ్మా అంటూ... అమ్మకు నచ్చజెప్పేవాడు...

ప్రసాదు తడుస్తున్నాడు.

నేనూ తడుస్తున్నాను.

ఈ వానకు బొత్తిగా జాలిలేదు. గుర్రబ్బండివాడికీ నా మీద జాలి లేదు. వాన కెలా ఉంటుంది?... సీతాపతికి నా మీద జాలి ఉంది. అయితే వెళ్లినవాడు ఇంకా రాడేం? చీకటంటే నాకు భయమని మా శ్రీమతి కొక్కదానికే తెలుసు. చీకటి నా మీదికి రాకుండా ఎప్పుడూ జాగ్రత్త పడుతుంది. సీతాపతికి ఆ విషయం తెలియదు. అందుకే నన్ను చీకట్లో వదిలివేసి వెళ్లాడు. లేకపోతే సీతాపతికి కూడా చీకటంటే భయమేమో! అందుకే ఇక్కడనుండి పారిపోయినాడేమో! ఈ అంధకారం అందరికీ అందవికారంగానే కనపడుతుందేమో! స్నేహితులంటే అంతా పైపై స్నేహమే. ఎవరూ ఎవరికీ ఏమీకారు. ఎవరికి వారే. ఒకరు ఒకరి మీద జాలిగాని, సానుభూతిగాని చూపించవలసిన అవసరం లేదు. అలా చేయాలని మనిషి ఉద్యోగ నియమాలల్లో ఎక్కడా రాసిపెట్టలేదు. ఒకవేళ రాసినా, అది ఉల్లంఘిస్తే తగు చర్య తీసుకోడానికి ఎవరికి అధికారం ఉంది?

ప్రసాదు చావుకాదు కాని, నాకు చావు మూడింది. పన్నెండేళ్లకే వాడికి టైఫాయిడ్ జ్వరం ఎందుకు రావాలి? వచ్చినా అది పోకుండా వాణ్డే ఎందుకు అంటిపెట్టుకుని ఉండాలి? డాక్టరు ఎన్నో ఇంజక్షన్లు ఇచ్చి వాడి శరీరం అంతా చిల్లులతో నింపేడు. అభిమన్యుణ్ణి అన్ని వేపులనుండి బాణాలతో గుచ్చినట్టుగా ఉంది. చివరివరకూ "ఫరవాలేదు, ఫరవాలేదు..." అని అంటూనే ఉన్నాడు డాక్టరు. ఎవరికి ఫరవా? తనకా, ప్రసాదుకా?... క్రితం రాత్రి నిద్రలో కలవరించాడు ప్రసాదు. నల్లగా లావుగా ఎవరో భటుల్లాంటి వాళ్లు కనిపించి వాణ్ణి రమ్మంటూ సైగ చేశారట. అప్పుడు తాగినవాడు మైకంలో మాట్లాడినట్టుగా నిషాలో మాట్లాడాడు. వాళ్ల పొరపాటున ఎక్కడికో వెళ్లిపోవలసి ఇక్కడికి వచ్చి ఉంటారు. ఎడ్రస్సులో ఏదో తికమకపడి ఉంటారు. న్యాయం కోసం హైకోర్టులో రిట్ పడేస్తే... వల్లకాట్లో రామనాథయ్యా!.... ప్రసాదు తరఫున ఎవరు వాదిస్తారు?

సీతాపతి ఇంకా రాలేదు. రాడేమో! ఈ చీకటి నన్ను వదలడం లేదు. పాములా చుట్టుకుంది. నా శరీరంలో కొంచెం కూడా ఖాళీ లేకుండా చుట్టేసింది. క్షణక్షణానికీ ఆ చుట్టు బిగుసుకుంటున్నది. ఉక్కిరి బిక్కిరి అవుతున్నాను. అంతా చుట్టుకుని పడగ ఎత్తి నా మీద ఊదుతున్నది... చినుకుల వేగం కొంచెం తగ్గింది. చలిగాలి చెవుల్లోంచి దూసుకుపోతున్నది.

ఎక్కడో దూరంగా మాటలు వినపడుతున్నాయి. మినుకు మినుకుమంటున్న సన్నని వెలుతురు కూడా నావైపే వస్తున్నది.

'హమ్మయ్య...' అనుకున్నాను.

అవును... ఆ వస్తున్నది సీతాపతే అయి ఉండాలి... వెలుతురు ఇంకా దగ్గరగా వస్తున్నది.

సీతాపతే... పక్కన నల్లగా పొడుగ్గా ఉన్నతను వస్తున్నాడు. చేతిలో పార, పలుగు ఉన్నాయి. ఒక చేతిలో తాటాకు గొడుగు ఉన్నది. సీతాపతి లాంతరు పట్టుకుని నడుస్తున్నాడు.

నాకు దేవుడు ప్రత్యక్షం అయినట్టుగా ఉంది.

అతను వస్తూనే పలుగు, పార కింద పడేశాడు.

"ఇతన్ని వెదికి పట్టుకునేటప్పటికి తలప్రాణం తోకకి వచ్చింది" అన్నాడు సీతాపతి...

అతను కొంచెంగా తూలుతున్నాడు. ప్రసాదువైపు చూస్తున్నాడు.

ఇంక పనికి ఉపక్రమిద్దాం అన్నాడు సీతాపతి.

'కానీవోయ్...' అని పురమాయించాడు సీతాపతి.

పలుగు, పార తీసుకుని ప్రారంభించాడు. అటువక్క ఇటుపక్క రెండు చిన్న గోపురాలున్నాయి, మట్టివి.

'ఇంత మరీ దగ్గిరగానా? మరోచోట చూద్దాం' అన్నాను.

'ఎక్కడైతే ఏమిటోయ్!' అన్నాడు సీతాపతి.

నేను అటూ ఇటూ చూశాను. కొద్దిగా ఖాళీగా ఉన్న స్థలం కనిపించింది.

'అక్కడయితే?' అన్నాను ఆ స్థలాన్ని చూపిస్తూ.

'సరే, అక్కడే కానిద్దాం' అన్నాడు సీతాపతి. నా మాటకు విలువ ఇచ్చి తవ్వుతున్నవాణ్ణి ఆపమన్నాడు సీతాపతి.

మా మాటలు విని అతను పలుగు, పార తీసుకుని నేను చూపించిన స్థలం వైపుగా వెళ్లాడు. ఆ లాంతరు వెలుతురు స్పష్టంగా కనిపిస్తాంది. ట్యూబ్‌లైటు కన్నా కాంతిగా ఉంది హరికేన్ లాంతరు.

గబగబా గుంట తవ్వేశాడు. ఆ గుంట బొత్తిగా లోతు లేదు. పొడుగూ లేదు. మహా ఉంటే మూడు అడుగుల పొడుగుంటుంది...

తవ్వుతున్నప్పుడు అతనిలో ఓ విధమైన విసుగు కూడా కనిపిస్తున్నది. గబగబా ప్రసాదు దగ్గరికి వచ్చాడు. అమాంతం రెండు చేతులతోనూ లేవనెత్తాడు. ఆ ఎత్తుకోడంలో ఓ విసురు ఉంది. ఏ కీలుకాకీలు ఊడిపోతుందేమో అనేట్లుగా ఉంది. రైల్వేప్లాట్‌ఫారంమీద పోర్టరు ఓ పెద్ద బరువును నిర్లక్ష్యంగా లేవనెత్తినట్లుంది...

ప్రసాదును ఇంజక్షను ఇస్తుంటేనే చూల్లేక మొహం అటు తిప్పుకునేవాణ్ణి. ప్రసాదుని తీసుకు వెళ్ళి ఆ గుంటలో పడేశాడు. మొహం అటు తిప్పుకున్నాను. మొహం రెండు చేతులతోనూ కప్పుకున్నాను. హరికేన్ లాంతరు నా వైపే చూస్తున్నది.

ప్రసాదు కోసం ప్రాణం గిలగిలలాడింది. అటువైపు చూశాను. నడుంవరకే ప్రసాదు శరీరం లోపల ఉంది. కాళ్లు బయటకు వచ్చినాయి.

'అదేమిటోయ్, అంత చిన్న గుంట తవ్వేవ్? వాడసలే కాలు పొడుగు పిల్లవాడు. మరికొంచెం తవ్వు...' అన్నాను .

'భలేవారండి... ప్రాణం లేనివాడికి... ఎంత గుంటయితే నేమిటండి...' అంటూ పారతో మట్టి తీసి లోపల వేస్తున్నాడు గుంట పూడ్చడానికి.

'కాళ్లు బయట ఉంటే ఎలా...' అన్నాను.

'బయట ఎందుకు ఉంటాయి... చూడండి మీరు...' అంటూ కాళ్లు రెంటినీ లోపలకు నొక్కేశాడు, పారతో మట్టిని నింపుతూ, ప్రసాదుకు ఎంత నొప్పి కలిగిందో!

'లోతుకూడా ఎక్కువ తవ్వలేదు కదా, పై మట్టిని నక్కలు, గీరేసి ప్రసాదును ముట్టుకోవూ తెల్లవారేటప్పటికి?' అన్నాను...

అతను విసుగ్గా హేళనగా ఒక నవ్వు నవ్వాడు.

నాకు కోపం వచ్చింది.

'మామూలు ప్రకారం నీకు డబ్బు ఇస్తున్నాంగా. కొంచెం పెద్ద గుంట తవ్వితే నీ దేం పోయింది?' అన్నాను.

'మీరిచ్చే డబ్బుకు ఇది చాలు...' అన్నాడు.

పిచ్చికుక్కలా అతనిమీద పడి కరుద్దామనుకున్నాను.

'అయ్యగారూ, పని పూర్తయిపోయిం' దన్నాడు.

నా పిడికిలితో నిండా మట్టి తీసుకుని అక్కడ చల్లాను. సీతాపతికూడా చేత్తో కొంచెం మట్టి వేశాడు.

ప్రసాదు తలమీద భోగిపళ్లు పోసినట్టే అయింది. వాడికి అయిదేళ్లప్పుడు భోగినాడు... రేగిపళ్లు, పువ్వులు, శనగలు, అక్షింతలూ, రాగి నయాపైసలూ అన్నీ కలిపి నెత్తిమీద పోస్తే, చప్పట్లు కొట్టి కిలకిలా నవ్వుతూ ఎగిరేడు. ఆ నవ్వు ఇంకా వినిపిస్తూనే ఉంది. ఆ నెత్తిమీదనే ఈ మట్టి వేశాను...

'బాబూ, ఇంత రేత్రికాడ వచ్చాను, నా మీద దయ ఉంచండి' అన్నాడతను.

సీతాపతి సంఖ్య చెప్పాడు. జేబులోంచి తీసి ఇచ్చాను.

'ఇదేంది? అయ్యగారూ, ఇంత కొంచెమా?...' అన్నాడు...

'ఇంతకాక మరెంత?...' అన్నాను.

'అయితే నే నసలు వచ్చేవాణ్ణే కాదు... ఇంత రేత్రికాడ..." అని విసుక్కున్నాడు.

'మరేం చేస్తాం... ఇంకొంచెం ఇవ్వు...' అన్నాడు సీతాపతి.

సీతాపతి ఆజ్ఞ శిరసావహించాను. సీతాపతి దేవుడు... అతడు నిప్పుల్లో దూకమన్నా దూకుతాను.

పలుగు, పార తీసుకుని ఒక చేత్తో లాంతరు పుచ్చుకుని అతను వెళుతున్నాడు తృప్తిగా...

ఖాళీ చేతులతో నడుస్తున్నాను. ఒక్కసారి వెనక్కి చూశాను, ప్రసాదు పిలుస్తున్నట్టుగా. అంత చీకట్లోనూ ఒక్కణ్ణీ వదిలేసి వస్తున్నాను. భయపడతాడేమో!

సీతాపతి మౌనంగా నడుస్తున్నాడు...

పుణ్యభూమిలోంచి రోడ్డుమీదికి వచ్చాం. చీకటి తరుముతూనే ఉంది... సీతాపతిని కావలించుకుందా మనిపించింది.

# 12

# అనుభూతి

ఆ రోజు శనివారం అవడంచేత పెందలాడే ఆఫీసుపని ముగించుకుని, అలవాటు ప్రకారం నేరుగా క్లబ్‌కు వెళ్లి తనివితీరా మూడు సెట్లు టెన్నిస్ ఆడుకుని, అలసిపోయి వరండాలో ఈజీఛైర్‌లో విశ్రాంతి తీసుకుంటూ మామూలుగా సిగార్ వెలిగించాను. బ్రిడ్జి ఆటకోసం ఇంకా మిత్రులు రాలేదని ఎదురు చూస్తున్నాను. చేతిలో ఏదో పత్రిక చూస్తున్నానన్నమాటేగానీ మనసు అదో మాదిరిగా ఉంది ఎందుచేతో? ఇంతలో సుబ్బారావూ, చలపతీ వచ్చారు. సుబ్బారావు వస్తూనే... "ఏం గురువుగారూ... ఏదో ఆలోచనలో ఉన్నట్టున్నా"రని పలుకరించాడు. ఇవ్వాళ కోరమ్ పూర్తవలేదే అన్నాడు చలపతి. ఇంకా జడ్జీగారు వచ్చేటైము రాలేదన్నాను నేను. ఇంతలో ఆయన కారు రానే వచ్చింది.

ఆయన... వస్తూనే... "శాస్త్రీ, ఇవ్వాళ టెన్నిస్ బాగా దంచేసినట్టున్నారే" అన్నారు. నలుగురం బ్రిడ్జికి ఉపక్రమించాం. మా పార్టనరు ఫైవ్ డైమండ్స్ వరకూ బిడ్‌చేసి నా వైపు ఆదుర్దాగా చూస్తుంటే... ఏం ఫర్వాలేదు అన్నట్లుగా పొగ వదిలి ముక్కలు పరిచాను. "ఈ రోజు శాస్త్రి మామూలుగా లేడు ఏదో ఉంది..." అన్నాడు సుబ్బారావు. "క్లబ్‌లో కూడా ఆలోచన ఏమిటీ?" అన్నాడు చలపతి. జడ్జీగారు ఒక నవ్వు నవ్వి... "మీ రెందుకో ముభావంగా ఉన్నారు" అన్నారు. "మనం తప్పక ఈసారి గేం చేయాలండీ!" అన్నాను. ఆట ముగింపు రాబోతున్నది... నేను నిజంగానే ఏవో ఆలోచనల్లో ఉన్నట్లున్నది. నాకు తెలీకుండానే నేను తీవ్రంగా ఉన్నానేమో మరి.

'జీవితం చాలా విచిత్రమైనదండీ...' అన్నాను నేను.

'ఇప్పుడే నీవు ఏదో కొత్తగా కనిపెట్టినట్టున్నావే అని సుబ్బారావు నవ్వేశాడు.

పోయిన శనివారం జరిగిన సంఘటన జ్ఞాపకానికి వచ్చి ఇంకా నేను ఆలోచిస్తూనే ఉన్నాను.

'మీ ఆలోచనలకు కారణమేమిటో త్వరగా చెబితే బావుటుంది" అని అన్నారు జడ్జిగారు. ఆయనకు కబుర్లంటే చాలా సరదా. అందరినీ నవ్విస్తుంటారు. జడ్జీగారు మా స్నేహితుల్లో ఒకరైనప్పటికీ ఆయనంటే ఒక విధమైన భయమూ, గౌరవమూ ఉన్నాయి మాకు. "మీరు చెప్పటంలేదు. ఏదో ఉంది విశేషం. మీ ముఖకవళికలను బట్టి ఆ మాత్రం పసిగట్టగలం" అన్నారు ఆయన. "బ్రిడ్జి, కబుర్లూ రెండూ కుదరవండీ....' అన్నాను తీవ్రంగా.

అయితే లాన్‌లోకి పోదాం అని బోయ్‌ని పిలిచి కుర్చీలు వేయమన్నాడు సుబ్బారావు. "కూల్ డ్రింక్స్ తెప్పించు చలపతీ... మీకో తమాషా సంఘటన చెబుతాను..." అన్నాను. అందరూ నా వైపు కుతూహలంగా చూస్తున్నారు.

'పోయిన శనివారం...' అంటూ మొదలు పెట్టాను. ఏమీ తోచక రెండో ఆట ప్లాజా సినిమాకు వెళ్ళాను. సినిమాలో నా పక్కనే ఒకామె కూర్చున్నది. ఇంటర్వెల్లో ఆమెవైపు చూశాను. ఆమె చాలా అందంగా ఉన్నా ముఖంలో విషాదచ్ఛాయ లున్నట్లున్నాయి. లైట్ బ్లూ నైలాన్ చీరె, దానికి మ్యాచ్ వచ్చే జాకెట్టూ ఆమె పసిమిఛాయకు ఇంకా అందాన్నిచ్చాయి. వయసు సుమారు ముప్పై ఉండవచ్చు. అంతలావు కాదు... అంత సన్నం కాదు. మనిషి చాలా సరళంగాను, ఠీవిగాను ఉంది. ఆమె ఒంటరిగా సినిమాకు ఎందుకు వచ్చిందో అని అనుకున్నాను. సినిమా అయిన తరువాత కారు బయటకు తీసి జనంలోంచి నెమ్మదిగా బయలుదేరి రోడ్డుమీదకు వచ్చాను... కొంచెం దూరం పోయిన తరువాత ఆమె వెనకనుండి నెమ్మదిగా నడిచి రావడం చూశాను. కారు ఆపుదామా వద్దా అని ఆలోచిస్తూ నెమ్మదిగా వెళుతున్నాను. ఆమె బహుశా రిక్షాకై కొంచెం దూరం నడుస్తున్నదేమో, ఆమెను వెంబడించే ఉద్దేశం నాకు లేనప్పటికీ... ఒక అందమైన స్త్రీ... అర్ధరాత్రి సమయంలో ఒంటరిగా అలా వెళ్ళడం క్షేమకరం కాదేమో అనిపించింది. కారు ఆపడానికే సాహసించాను. కారులోంచి బయటకు వచ్చి, 'చూడండీ... క్షమించాలి... మీరేమీ అనుకోకపోతే కారులో ఎక్కండి మిమ్మల్ని డ్రాప్ చేస్తాను...' అన్నాను. ఆమె చిరునవ్వు నవ్వి... 'చాలా థాంక్స్... మీకు ఇబ్బంది అవుతుందేమో... నేను చాలా దూరం

పోవాలి' అన్నది. 'ఫరవాలే'దంటూ కారుడోర్ తీశాను. ఆమె వచ్చి కూర్చుంది. కొంచెంగా చినుకులు పడుతున్నాయి. కారు నెమ్మదిగా దూసుకుపోతున్నది. కొంచెంసేపు ఉభయులం మౌనంగానే ఉన్నాం... సంభాషణ ప్రారంభిస్తూ...

'ఈ రోజు వెదర్ హఠాత్తుగా మారిపోయింది. వర్షం కూడా రానురాను ఎక్కువవుతున్నది' అన్నాను.

'అవునండి... అందులో అనుకోకుండా... ఈ రోజు సినిమాకు వచ్చేశాను. చాలా ఆలస్యం కూడా అయింది... మీకు చాలా శ్రమ కలిగిస్తున్నానేమో...', అన్నది నవ్వుతూ.

'నా కేం శ్రమ లేదండి... మిమ్మల్ని క్షేమంగా ఇంటికి చేరుద్దామనే ఉద్దేశ్యంతోటే కారాపాను...' అన్నాను. నన్నామె ఎక్కడ అపార్థం చేసుకుంటుందేమోనని. 'మీరు కారు స్టార్టు చేస్తున్నప్పుడు చూసి నేనే మిమ్మల్ని లిఫ్ట్ కోసం అడుగుదామనుకుని... మీకు శ్రమ కలిగించడం ఎందుకని ఆగిపోయాను...'

'మీరు సహజంగా అందంగా ఉన్నా.. ఈ లైట్ బ్లూ చీరెలో మరీ అందంగా ఉన్నారు'.

వర్షం ఎక్కువ కావడం ఆరంభించింది. తారురోడ్డు అంతా తడిసిపోయి... ఎదురుగా వచ్చే కార్ల లైట్ల ప్రతిబింబాలు తమాషాగా కన్పిస్తున్నాయి. ఆమె రోడ్డు వైపే విచిత్రంగా చూస్తున్నది. కారువైపరు అటూ ఇటూ కదులుతూ అద్దంమీద పడిన నీటి బిందువులను తుడిచివేస్తున్నా... ఆ నీటిబిందువులు మాకేం ఫర్వాలేదన్నట్టుగా అద్దాన్ని అంటి పెట్టుకుని వంపులుగా తిరుగుతూ వెళుతున్నాయి. కారుటాపుమీద పడుతున్న చినుకులు సన్నగా... సున్నితంగా శబ్దం చేస్తూ మహావిద్వాంసుని చేతిలోని మృదంగధ్వనులను జ్ఞాపకానికి తెస్తున్నాయి.

డాష్‌బోర్డులోని సిగరెట్టూ అగ్గిపెట్టే అందుకుందామని పక్కకు వంగి లైటు వేశాను. అప్రయత్నంగా ఆమె చేయి నా చేయికి తగిలి సారీ అన్నాను. ఆమె చిరునవ్వు నవ్వి మళ్ళీ రోడ్డువైపు చూస్తున్నది.

'వర్షం చాలా అందంగా ఉందండీ...' అన్నది. ఇది నా కర్థం కాలేదు.

'ఈ వైపరు అటూ ఇటూ వేగంగా కదులుతూంటే నా కేమిటో భయంగా ఉన్నదండీ... దయచేసి ఆపుతే బావుంటుందేమో...' అన్నది నావైపు ప్రశ్నార్థకంగా చూస్తూ...

"వైపరు ఆపేస్తే రోడ్డు సరిగా కనపడదు..." అన్నాను ముక్తసరిగా.

"మీ కభ్యంతరం లేకపోతే నేను డ్రైవ్‌చేస్తా" నంటూ... తను స్టీరింగు తీసుకుని వెంటనే వైపరు ఆపేసింది... కారు నడుపుతున్నంతసేపు వర్షాన్ని గురించి... ప్రకృతిని గురించి పొగుడుతూనే ఉంది.

"మానవుడు ప్రకృతిని ఆరాధించడం ఎందుకంటారూ?" అని ఆమె ప్రశ్న.

"మానవుడు భగవంతుని సృష్టి గనక" అన్నాను.

"నాంపల్లిలో రెస్టారెంటు దగ్గిర కారు ఆపుతాను అక్కడ కొంచెం టీ తాగి టాక్సీలో నేను ఇంటికి వెళతాను మీరు అక్కడనుండి వెళ్ళచ్చు... ఇది మీకు అంగీకారమే అనుకుంటాను" అన్నది. అలాగే రెస్టారెంటు దగ్గిర ఆగి టీ తీసుకున్నాము. ఆమె కొంచెం టిఫిన్ కూడా తీసుకున్నది. టిఫిన్ తీసుకుంటూ తను ఆ రోజు భోజనం చేయలేదనీ, ఆకలి అవడంచేత తప్పనిసరిగా టిఫిన్ తీసుకోవలసి వచ్చిందనీ అన్నది. ఆమె ఇంటికి వెళ్ళదానికి ఇంకా సందేహిస్తున్నట్టుగా ఆలస్యం చేస్తున్నది. టాక్సీని పిలుద్దామని రెండడుగులు ముందుకు వేశాను. ఇంతలో ఆమె ముందుకు వచ్చి "నాకు అప్పుడే వెళ్ళాలని లేదు. నేను మీతో మీ ఇంటికి వస్తాను మీకు అభ్యంతరం లేకపోతే" అని మనోవేదనతో బాధపడుతున్న వాళ్ళమాదిరిగా దీనంగా అన్నది. "నాకేం అభ్యంతరం లేదు. మిమ్మల్ని చూస్తూంటే మీరు గొప్పింటి ఇల్లాలుగా కన్పిస్తున్నారు. మీరు ఒంటరిగా సినిమాకు ఎందుకు వచ్చారో, వచ్చి ఇంటికి తిరిగి వెళ్ళదానికి ఎందుకు సందేహిస్తున్నారో, మీ ముఖంలోని విషాదచ్ఛాయలకు కారణమేమిటో, మీకు వైపరంటే భయం ఎందుకో తెలుసుకోవాలని ఉంది. నా ఈ అనవసర కుతూహలానికి మీరేమీ అనుకోరనుకుంటాను" అని నెమ్మదిగా అన్నాను. ఆమె అందం, గాంభీర్యం, ఠీవి, చిరుమందహాసం... మెరిసేకళ్ళు చూసి నేను కొంచెం చలించినమాట వాస్తవం ఆవిడ మళ్ళీ నవ్వడం ప్రారంభించింది. "మీరడిగిన వాటిల్లో ఆఖరుదానికి సమాధానం చెబుతాను. నాకు వేగంగా కదిలే ఏ వస్తువు చూసినా భయంగా ఉంటుంది.

అది నాలోని బలహీనతేమో... పరిగెత్తే గుర్రం, దూసుకుపోయే రైలు, మెలికలు తిరిగి వెళుతున్న పాము, విపరీతమైన శబ్దంచేస్తూ వెళుతున్న డకోటా విమానం... ఇంకా ఇలాంటివి ఎన్నో... వైపరు కదలడం చూస్తే పాముని భ్రాంతి కలిగింది. అప్పుడప్పుడు కలలో పాములు కన్పిస్తూంటాయి. మనసు ఆందోళనగా ఉంటుంది. నేను ఎదురుచూస్తున్న ప్రకృతిలోని ప్రశాంతత, గంగాజలంలోని నైర్మల్యం... మీలో నాకు కన్పించి... మీ రెండుకో నన్ను ఆకర్షించారు. ఈ ఆకర్షణలో విపరీతార్థానికి తావులేదు. మీతో కొంచెంసేపు మనసువిప్పి మాట్లాడాలని, నా మనోవేదనను తెలియచేద్దామని... మీ రెండుకో నాకు ఆప్తులుగా కన్పించారు... నేను వివాహితను. ఈ సమయంలో పరాయి మగవాడిని ఒంటరిగా కలుసుకుని... అతనితో కారులో వచ్చి... అతనింటికే వెళ్ళి మాట్లాడడానికి సాహసించడం నాలోని దౌర్భల్యమేమో తెలియదు. మళ్ళీ చెబుతున్నాను. మీలోని ఆప్యాయత నన్ను ఆకర్షించింది... ఇక వెళదాం పదండి మీ ఇంటికి" అంటూ వచ్చి నా కారులో కూర్చుంది. ఈమె మనస్తత్వం నా కర్థంకాలేదు... అంది నా మనసు. గుర్రంలా పరిగెడ్తున్నది. నాలో నాకు తెలీని శక్తి ఏదో.. గుర్రానికి కళ్లెం వేస్తూ "ఆగు... ఆగు..." అంటున్నది. నేనేదో ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను. ఆమె భుజంమీద ఎందుకో చెయ్యి వెయ్యాలని... ఆమె శరీర స్పర్శకోసం...మనసు తహతహలాడుతున్నది. సందేహిస్తున్నాను. నాలోని శారీరక శక్తులేవో పోరాటంలో ఉన్నట్టు గమనించాను. నా గుండె వేగం కొట్టుకోవడం ప్రారంభించింది... నాలోని పశుత్వమేమో బహుశః అనుకోకుండానే గగుర్పాటుతో నా ఎడంచెయ్యి ఆమె భుజంమీదకు వెళ్ళింది. ఆమె చిరునవ్వు నవ్వుతూ నెమ్మదిగా నా చేయి భుజంమీదనుండి తీసేస్తూ... "మీరింకా నన్ను సరిగా అర్థం చేసుకోలేదు..." ఆమె ముఖకవళికలో కొంచెం మార్పు గమనించాను. నేను తప్పుచేసినవాడి మాదిరి కుంచించుకు పోయినాను. ఆమె మళ్ళీ నవ్వుతూ... "ఇంకా మీ ఇల్లు ఎంత దూరం?..." అన్నది. మరో అయిదు నిమిషాలకు ఇల్లు సమీపించాం. మా ఇంటిముందున్న తోటచూస్తూ... లోపలకు ప్రవేశించి... "మీ తోట చాలా అందంగా ఉన్నదండి..." అన్నది. "అవును మీలాగే!" అని నవ్వేశాను.

ఆమె ముఖంలో పరిపూర్ణ వికాసం కన్పించింది. డ్రాయింగ్‌రూమ్‌లో గోడలకున్న ఫోటోలు, పెయింటింగ్స్‌చూస్తూ..."అద్భుతం... అత్యద్భుతం...." అన్నది.

నాకు ఫోటోగ్రఫీ అంటే ఆసక్తి అనీ, అవి ఎక్కడెక్కడ తీసినవీ... వాటి వివరాలు చెప్తూ... ఇంతకూ "మీ విషయం చెప్పారు గారు..." అన్నాను ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"ఇది మన ప్రథమ పరిచయం కాబట్టి అన్ని విషయాలూ ఒకసారే చెప్పను... మీ పరిచయంవల్లా, స్నేహంవల్లా కలిగిన ఈ అనుభూతి నాకు ప్రశాంతతనిచ్చింది. మీలోని సోదరవాత్సల్యం... మీ ఇంటి వాతావరణం... మీ నిర్మలమందహాసం... మీలోని సహృదయతనూ చూస్తూంటే మీరు గొప్ప కళారాధకులేమో అన్పిస్తుంది... మిమ్మల్ని తరచూ కలుసుకుంటుండే అవకాశాన్నిస్తే... చాలా సంతోషం" అన్నది సోఫాలో విశ్రమిస్తూ. నా కెందుకో ఆమెను చూడగానే ఆమెకు తప్పక సంగీతం వచ్చి ఉండాలని అనుకున్నాను.

"మీకింకా వివాహం కాలేదా?" అని ఆమె ప్రశ్న.

"వివాహం అయికూడా ప్రస్తుతం బ్రహ్మచారినే. మా శ్రీమతి వాళ్ళ నాన్నగారూ వాళ్ళతో కొడైకెనాల్ వెళ్ళింది విశ్రాంతి కోసం..." అన్నాను.

"మీరిద్దరూ చాలా అదృష్టవంతులు".

"మీలో దురదృష్టవంతులెవ్వరో తెలుసుకోవచ్చా" అన్నాను.

"ఉభయులం" అన్నది నవ్వుతూ...

"ఇంతకూ నేను మొదట్లో అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పకుండానే సంభాషణ దొర్లిస్తున్నారు. మీరు చెప్పక తప్పదు..." అన్నాను. ఆమె చెప్పింది.

"అయితే వినండి... ఇలా రావడంలో పొరపాటు నాదేనేమో.... ఆర్థికంగానూ హోదాలోనూ మాకు ఏ లోటూ లేదు. మా శ్రీవారు చాలా చదువుకున్నవారు. బోలెడంత ఆస్తి ఉన్నది. అదీకాకుండా ఆయన వ్యాపారంలో లక్షలు ఆర్జిస్తున్నారు. కావలసినంత పలుకుబడి ఉన్నది. జీవితం అతి వేగంగా గడిపేవాళ్ళలో ఆయనొకరు. కాఫీకూడా నిదానంగా తీసుకోవడం నేను చూడలేదు. ప్రతివనీ అవతల ఏదో మునిగి పోతున్నట్లుగా... పరిగెత్తుతూ చేస్తారు. ఆయన ఇంట్లో ఉండడమే కొన్ని క్షణాలు... ఆ సమయంలో భోజనం చేయడం కూడా హడావిడే. పేరు ప్రతిష్ఠలు, హోదా... అంటే ఆయనకు ప్రాణం. నేనంటే కూడా చాలా ఇష్టం. కాని వ్యాపారవిషయాల్లోని తొందరపనుల్లో కొంచెం చిరాకుగా ఉంటారు. ఆ చిరాకు ప్రతి విషయంలో ప్రతిఫలిస్తూ

ఉంటుంది. ఆయన వైఖరి చూస్తూ ఉంటే... పరిగెత్తి దూసుకుపోయే రైలు జ్ఞాపకం వస్తుంది. నేను ఎంతో అందంగా ఉంటానని మావాళ్ళు అంటారు. నేను అందంగా ఉన్నదీ లేనిదీ చూడటానికే ఆయనకు తీరిక ఉండదు. పాపం... నా కప్పుడప్పుడు జాలివేసి నవ్వువచ్చినా కొన్ని సమయాల్లో మనస్సు చివుక్కుమంటూ ఉంటుంది. పదిరోజుల క్రితం ఒక రోజు వారి ఆఫీసుకు ఫోన్ చేశాను. "మంచి సినిమా ఉంది. త్వరగా వచ్చేయండి వెళదాం" అని. "నా కర్జంటుగా మీటింగ్ ఉన్నది రేపు విమానంలో కలకత్తా వెళదాం... ఇంకా నా ఎయిర్ టిక్కెట్ రాలేదు. బహుశా కలకత్తా నుండి ఢిల్లీ వెళ్ళవలసి ఉంటుంది..." అంటూ ఏదో చెప్పుకుపోయారు. ఆయన ఫోన్లో మాట్లాడినా హడావిడిగానే ఉంటుంది. ఫోను పెట్టేసి నాలోని కన్నీరును తుడుచుకుంటూ... ఏదో పత్రిక చదువుతూ... ఆ రోజు భోజనం కూడా చేయకుండా పడుకున్నాను. వారెప్పుడో పది గంటలకు... కొంచెం తూలుతూ వచ్చి పడుకున్నారు. మీరు పొరపడతారేమో. మా వైవాహిక జీవితంలో... శారీరక సుఖానికి ఏ అంతరాయమూ లేదు. అయినా నాకెందుకో ఏదో పెద్ద వెలితి ఉన్నట్లు... ఏదో తెలీని అసంతృప్తి నన్ను వెంటాడుతూ ఉంటుంది. మనసు విప్పి శ్రీవారితో ఏమని చెప్పను? ఏదైనా చెప్పడానికి ప్రయత్నించినా వినడానికి టైము లేనట్లు గాబరాను ప్రకటిస్తారు. నిజానికి ఈ రోజు నా పుట్టినరోజు... నాకు నచ్చిన ఈ చీరె కట్టుకుని శ్రీవారితో ఈ రోజు తీరుబాటుగా ముచ్చటిద్దామని ఉవ్విళ్ళూరాను. ఆయనకు జ్ఞాపకం ఉన్నదో లేదో తెలియదు. "అర్జంటు పనులున్నాయి. కొంచెం ఆలస్యంగా వస్తాను..." అని ఫోన్ చేశారు. తొమ్మిది గంటలవరకూ చూశాను. ఏం మనిషి! అని విసుగు వచ్చింది. నా కెందుకో దుఃఖం కట్టలు తెంచుకు వచ్చింది. 'వైవాహిక జీవితం అంటే ఇదేనా?'... అన్పించింది. అయినా నేను వివాహిత స్త్రీని కనక భర్తను నేనే అపార్థం చేసుకుని అనవసరంగా నిందిస్తున్నానేమోనని నాలో నేను తర్కించుకున్నాను. ప్రశాంతత కోసం... ఎందుకో ఒకటి రెండు గంటలు బయటికి వెళ్ళి అలా తిరిగి రావాలనిపించింది. శ్రీవారు వస్తే భోజనం వడ్డించమని నాయరుతో చెప్పి ఇలా అనుకోకుండా సినిమాకు వచ్చాను. ఇల్లు కదలి ఒంటరిగా ఎప్పుడూ రాలేదు. మొదట్లో కొంచెం భయంవేసినా... ఇప్పుడు గుండెరాయి చేసుకున్నాను. నాకు తెలిసి నేను ఏ తప్పు చేయలేదు. అందుకు మీరే సాక్ష్యం...." అంటూ కళ్ళు ఒత్తుకున్నది. నాకు జాలి వేసింది. మా చెల్లి జ్ఞాపకానికి వచ్చింది.

"మీరిలా అధైర్యపడకూడదు... ఇది జీవితం... కష్టం... సుఖం... మంచీ చెడూ... శాంతీ... అశాంతీ... అన్నీ ఉంటాయి. మీరేమీ అనుకోకుండా ఉంటే ఒక విషయం అడుగుతాను. జవాబు చెప్పండి. నిర్మొహమాటంగా"అన్నాను."మీ శ్రీవారు అలా ఎందుకు ఉంటున్నారో ఎప్పుడన్నా ఆలోచించారా? వారిని ఎప్పుడైనా దగ్గరికి తీసుకుని... అప్యాయంగా.... వారి తెలివితేటలనూ, పేరుప్రతిష్ఠలనూ... ప్రతిభా విశేషాలనూ కొనియాడి... ఆయనకు సంతోషం ఉత్సాహం.. కలిగించే మాటలు ఎప్పుడైనా అన్నారా? మీ మాటలసందర్భాన్నిబట్టి చూస్తే వారు కూడా అందంగా ఉంటారనుకుంటాను. మీరొకసారి అయినా ఆయనను... ఆ డ్రెస్‌లో మీరు ఎంత అందంగా ఉన్నారండీ అని టై సవరిస్తూ... దగ్గరికి చేరి ప్రేమతో పలుకరించారా..." అని అంటూండగానే ఆమె ముఖం కొంచెం వెలవెలపోవడం చూశాను. ఏదో మహాపరాధం చేసినవాళ్ళమాదిరి అయిపోయింది.

"క్షమించండి... వీలైతే మా ఇంటిదగ్గర డ్రాప్ చేస్తారా. మీకు కృతజ్ఞురాల్ని.. ఇప్పటికే మీకు శ్రమ కలిగించాను" అన్నది. ఆ తరువాత ఆమెను ఇంటిదగ్గర వదిలి వచ్చాను.

"ఈ విషయం మీ శ్రీమతికి తెలిస్తే ఏమన్నా ఉందా?" అన్నాడు సుబ్బారావు.

మరునాడే శ్రీమతికి ఉత్తరం వ్రాశాను జరిగిందంతా. "మీరు చాలా ఉత్తములు" అని పొగుడుతూ జవాబు వ్రాసింది. కాని ఈ రోజు ఆ అందమయిన పరిచితురాలి దగ్గర నుండి చిన్న కబురు వచ్చింది... అని జేబులో ఉన్న కాగితం తీసి చదవడం మొదలెట్టాను. "పూజ్యులయిన అన్నగారికి నమస్కారాలు. మళ్ళీ మిమ్మల్ని మరో మాటు కలుసుకోవలెనని ఉన్నది. రేపు సాయంత్రం 9 గంటలకు ప్లాజాదగ్గర మీ రాకకై నిరీక్షిస్తుంటాను".

"అయన, ఒంటరిగా ఆ రోజు ఇల్లు వదిలి వెళ్ళినందుకు ఏం శిక్ష విధించాడో పాపం!" అన్నాడు చలపతి.

"ఇలాంటి విషయాల్లో మీరు చిక్కుకోకూడదు శాస్త్రీ!" అన్నారు జడ్జీగారు.

"లోకానికి కళ్ళుండవు.. చెవులే..." అన్నాడు సుబ్బారావు. నే నింకా ఆవిడ్ని కలుసుకోవాలో అక్కర్లేదో ఏ నిర్ణయానికీ రాలేదు. ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాను.

# 13

# వెళ్ళొస్తాను

'మీవాళ్ళెవరైనా నిన్ను చూడాలనుకునే వాళ్ళు ఉంటే చెప్పు' అన్న జైలర్ ప్రశ్నకి సమాధానం వెంటనే దొరకలేదు సింహానికి కాదు నరసింహానికి... నారమ్మ జ్ఞాపకానికి వచ్చింది.

ఎవ్వరూ లేరు, ఎవ్వరు రారూ, రారు-నారమ్మ కూడా రాదేమో...

అయినా ఎందుకో ఇష్టం లేకపోయిన నారమ్మ పేరు ఉచ్చరించాడు నరసింహం. నాలుగు రోజుల క్రిందట... రావచ్చు రాకపోవచ్చు. ఎవరు వచ్చినా ఎవరు రాకపోయినా పరవాలేదు. ఎప్పుడో చచ్చిపోయిన నరసింహం... మరో ఇరవై నాలుగు గంటలలో నిజంగా చచ్చిపోతున్నాడు.

ఇంక ఉన్నది ఒక పగలు... ఒక రాత్రి.

తెల్లవారింది. పగలు గడుస్తోంది. రాత్రి గడిస్తే తెల్లవారక మునుపే నరసింహం కళ్ళు మూస్తాడు. అతని మెడను ఉరితాడు కావలించుకుంటుంది. ఆప్యాయంగా... హత్తుకుని ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. కళ్ళల్లోంచి గుడ్లు బయటికి వస్తాయి. ఒకే ఒక క్షణం... బాధలేని చావు... నిల్చున్నవాడు నిల్చున్నట్లుగా... ఎనిమదడుగుల లోతుకు... ధడక్... మనే శబ్దంతో వెళ్తాడు. తలవాలిపోతుంది. ఉరిలో ఎంతహాయి. కత్తులు లేవు. కత్తిపోట్లు లేవు. రక్తపాతం లేదు. వేడి పచ్చి నెత్తురు లేదు. ఎర్రరంగు లేదు. వట్టి నీరసం చావు. ఇలాంటి చావులో సుఖం లేదు. చేతకాని చావు.

పట్టపగలే సూర్యుణ్ణి ఎవరో కత్తితో పొడిచారు. రక్తం చిమ్ముతున్నది. కత్తి పోట్లతో సూర్యుడి శరీరం కన్పించడం లేదు. రక్తం వర్షంధారగా చిమ్ముతోంది.

వేడిలో చల్లదనం. నెత్తురు చినుకులు వాడిగా బాకులల్లే భూమిని పొడుస్తున్నాయి. భూమిది ఉక్కు శరీరం. బాకు పోట్లు దిగడం లేదు. శబ్దం చేస్తున్నది మొరాయిస్తూ...

మనిషి శరీరం ఎంత మెత్తని... బాకుపోటు మెత్తగా శరీరంలోకి దూసుకు పోయేది. ఎదురు చెప్పకుండా ఎన్ని పోట్లయినా సులభంగా దిగిపోతయి.

ఇటీవల నరసింహం బాకు పోట్లకు గురైన సీతయ్య శరీరం తూట్లుపడి వేడి పచ్చి నెత్తురు చిమ్మింది. చిమ్ముతున్న నెత్తురు చూసి నరసింహం వికటాట్టహాసం చేశాడు. అప్పటికీ కసి తీరలేదు. పడిపోయిన సీతయ్యను కాలితో ఒక తన్ను తన్నాడు... సీతయ్య శవం కదిలింది. కాని లేవ లేదు. నరసింహానికి దాహం తీరలేదు. దాపునున్న తాటాకు పాకలోకి వెళ్ళి దాహం తీర్చుకున్నాడు.

నరసింహం అంటే అందరికీ సింహస్వప్నమే. ఆ ఊళ్ళో పోలీసులు కూడా భయపడ్డారు. చూసిన వాళ్ళుకూడా సాక్ష్యం చెప్పడానికి పూనుకోరు. సింహం కలలోకి వచ్చినా భయమే. అంతా అయిపోయి మాటు మణిగిన తరువాత పోలీసులు విచారణకు వస్తారు.

దాహం తీర్చుకున్న తరువాత సరాసరి పోలీసు స్టేషన్‌కు వెళ్ళి బాకు విసిరేస్తూ 'ఇన్‌స్పెక్టరుగారూ ఇదిగో నేనే వచ్చాను.ఆ సీతాయిగాణ్ణి చంపిన నా చేతులకు బేడీలు వేయండి. అన్నాడు. పోలీసువాళ్ళు భయపడుతూ, భయపడుతూ బేడీలు వేశారు. బేడీలు ఒకదాన్ని ఒకటి రాసుకునేట్లు శబ్దం చేయిస్తూ పెద్దగా నవ్వాడు నరసింహం. ఆ నవ్వుకు పోలీసు స్టేషన్ దద్ధరిల్లిపోయింది.

నరసింహానికి శిక్ష పడినప్పుడు అందరిలాగా బాధపడలేదు. నేరం చేశాను. దానికి తగిన శిక్ష పడింది. ఇందులో బాధపడేందుకేముంది అనుకున్నాడు. అతని దృష్టిలో ఈ శిక్ష చాలా అల్పమైనది. ఎవరైనా తనను బాకుతో పొడచి రక్తం చిమ్మిస్తే చాలా సంతోషించేవాడు. అంత సాహసానికి ఎవ్వరూ పూనుకోలేదు. అదే అతని బాధ. దెబ్బకు దెబ్బ... రక్తానికి రక్తం... నరసింహాన్ని ఎవరూ ఆ రకంగా శిక్షించలేక పోయారు. ఈ మనో వ్యధతో చాలా కాలం బాధపడి విసుగెత్తి పోలీసులకు తనంతట తాను లొంగిపోయాడు ఇక లాభం లేదనుకుని.

ఒకసారి ఊళ్ళో పలుకుబడి ఉన్న పెద్దిరెడ్డిని బాకుతో పొడిచినప్పుడు అది రహస్యంగా జరిగిపోయింది. పొలంనుండి తిరిగి వస్తున్నప్పుడు తను కాటేశాడు.

ఎవరి కోసమో చేశాడు ఈ పని. ఎవరో ఈ పనిచేస్తే ఇంత ఇస్తామన్నారు. పుచ్చుకుని బాకుకు పనిచెప్పాడు. నరసింహాన్ని కావలసిన వాళ్ళు కావలసినట్టుగా ఉపయోగించు కున్నారు.

నరసింహం పేరు బయటకు రాలేదు. అతడు పట్టుబడలేదు. ఎవరికోసమో కొంత మందిని చావకొట్టి చంపకుండా చెవులు మూసేవాడు.

ఉగ్రనరసింహాన్ని తాటాకు పాకలోని సీసాలు శాంతింప చేసేవి.

మీసాలు దువ్వుతూ నడి బజార్లో అంకమ్మ చెట్టు దగ్గర నిల్చుంటే నరసింహానికి ఎదురుగా ఎవరూ వచ్చేవారు కాదు. కత్తిపోటు కోసం ఎన్నో సార్లు ఎదురు చూశాడు. తన మీద కత్తి కాదు గదా కర్రైనా ఎవరూ విసర్లేదు. రక్తపు చినుకులు బాకుపోట్లు నెత్తురు ధారగా కురుస్తోంది, విధి విరామం లేకుండా.

ఎదురు చూస్తున్న ముహూర్తం ఇంకా రావడం లేదు. క్షణం ఓ యుగంలా గడుస్తోంది. గడియారం ముల్లు నెమ్మదిగా కదుల్తోంది. కాలానికి కళ్ళెం వేసినట్లయింది. ఒకవైపు చినుకులు. ఒకవైపు బరువులు. నెమ్మదిగా చీమల్లే వెళ్తున్న పాములాంటి గడియారం ముళ్ళు. చావుకూ బతుక్కూ తేడా కన్పించడం లేదు నరసింహానికి.

తనేదో నేరం చేసినట్టు నేరానికి శిక్ష అనుభవిస్తున్నట్టు అనుకోడం లేదు నరసింహం. ప్రయాణంలో ఒక మజిలీ అయి మరో మజిలీకి వెళ్తున్నట్టుంది. ఒక స్టేషన్లో దిగి కొంత కాలం బలాదూరు తిరిగి మరో స్టేషనుకు వెళ్ళినట్టు.

జైలు భోజనం చాలా మందికి తృప్తిగా లేకపోయినా నరసింహానికి బాగానే ఉన్నది. ఆ వేళకు భోజనం చేశాడు. మామూలుగా అతనిలో ఎలాంటి ఆందోళన కన్పించడం లేదు.

వర్షం తగ్గలేదు. కాలం జరగడం లేదు. నరసింహానికి ఆలోచనలే ఏవీ రావడం లేదు. అతని కళ్ళు శూన్యంలోకి చూస్తున్నాయి. అతని మెదడు వానలో తడుస్తున్నది. కోరికలు, ఆశయాలు, ఆందోళన, భయం, వణుకు, పశ్చాత్తాపం, నిద్ర, మెలుకువ, కోపం, అసూయ, అహంభావం, పిరికితనం, ధైర్యం, అసహ్యం, ప్రేమ, ఇవేవీ లేవు నరసింహానికి ఇప్పుడు. అతని మనసులో ఏం ఉందో తెలియడం లేదు.

నరసింహం కోసం ఎవరో వచ్చారని కబురు వచ్చింది. నరసింహం చూశాడు.

వానలో తడుస్తూ నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నారమ్మ వస్తున్నది.

'కబురందింది. చూసిపోదామని వచ్చాను...' అన్నది నారమ్మ నెమ్మదిగా.

వర్షంలో తడిసిన నారమ్మ వయసులో ఉన్నదే. తడిసిపోయిన చీరే, జాకెట్టూ వొంటికి అంటిపెట్టుకుని శరీరపు నాజూకును వొలకపోస్తున్నది. నారమ్మది బీద బతుకు. భగవంతుడిచ్చిన అందమూ, వయసూ ఆమె ఆస్తి. తడి బట్టలలోని సౌందర్యం కొట్టవచ్చేట్టుగా ఉన్నది. జైల్లో అక్కడ ఉన్నవాళ్ళంతా ఆమె వైపే చూస్తున్నారు. విరాట్ రాజు కొలువుకు ఊరిబయట నుండి వస్తున్న కేశ సంస్కారం లేకుండా, మాసిన బట్టలతో ఎంత దాచుకున్నా దాగని అందంతో ఉన్న ద్రౌపదిలా ఉంది నారమ్మ. ఆనాడు ద్రౌపది వస్తుంటే ఆమె ఎవరో తెలియక ఆమె అందానికి ఆశ్చర్యపడుతూ ఊళ్ళో వాళ్ళంతా గుమ్మం దగ్గర నిల్చుని మరీ మరీ చూశారు.

నరసింహం మాట్లాడలేదు.

'నిన్ను ఊళ్ళో వాళ్ళందరూ కలిసి మోసం చేశారు...' అన్నది నారమ్మ.

'నన్నా... మోసమా....' అన్నాడు నరసింహం.

'నేను నీ దాన్నయినపుడు మరోరు నన్ను కన్నెత్తి చూడడమే ఎవరికున్నై అంత దమ్ములు' అన్నది నారమ్మ. 'మరి ఆ సీతాయ్‌గాడు' అని గొణుక్కున్నాడు. 'సీతాయి ఎర'అన్నది నారమ్మ.

నరసింహం పళ్ళు కొరకలేదు. కత్తి దుయ్యలేదు. కళ్ళు ఎర్రపడలేదు.

'నిన్ను ఉసిగొల్పేరు...' అన్నది నారమ్మ.

'సీతాయి నీ దగ్గరకు రాలేదా?' అన్నాడు నరసింహం.

'వణుకుతూ వచ్చాడు. అల్లంతదూరంలోనే ఉన్నాడు. తుపుక్కున ఊసేను మొహంమీద... నలుగురూ చేరారు. రభస అయింది... సీతాయి పరుగెత్తుతుంటే తరిమి తరిమి... పట్టుకుని నీపు బాకు దూశావు... నెత్తురు చిమ్మింది...'

నరసింహం నారమ్మను చూస్తూనే ఉన్నాడు...

నీ మనసు నాకు తెలుసు. మెత్తనిగుండె గలోడివి... అందరికీ తెలుసు... పట్టపగలు పదిమందిలో పౌరుషం చూపించావు... అందరి ప్రయత్నం ఫలించింది... నరసింహం

విరగడ అయిపోనాడన్నారు... నేను ఎన్నాళ్ళో ఏడ్చేను. ఏడ్చి ఏడ్చి ఇప్పుడే ఏడుపు రావడం లేదు. ఈ రాత్రికి సుఖంగా నిద్రపో. తెల్లారితే ప్రయాణం కోడి కూసే వేళ' అన్నది నారమ్మ.

నారమ్మలో కన్నీరు ఏనాడో ఇంకిపోయింది. తడి బట్టలలోంచి నీటిచుక్కలు ఒక్కొక్కటే భూమ్మీద బరువుగా పడుతున్నాయి.

'మంచి పని చేశారు. మంచి మార్గం వెదికారు. నన్ను నడి బజార్లో ఎవరైనా చంపితే బాగుండేది. నా నెత్తురు నేను చూసుకుంటూ కళ్ళు మూసే వాణ్ణి. ఈ వెధవచావు నేను చావలేను' అన్నాడు నరసింహం చాలా సేపటికి నోట్లోంచి మాట పెకిల్చుకుని.

నారమ్మ వెనక్కు తిరిగి వెళ్లిపోతోతున్నది. 'వస్తాను నరసింహా... నేనెప్పుడూ నీదాన్నే' అంటూ నారమ్మ కదిలింది.

తడి బట్టలలోంచి కన్పిస్తున్న ఆమె పిరుదులను ఆ కదలికను చూస్తూ నిల్చున్నాడు నరసింహం.

'వెళ్ళొస్తాను నారమ్మా' అన్నాడు. ఒక సారి వెనక్కు తిరిగి చూసి మళ్ళీ కదిలింది నారమ్మ.

ఏదో ఊరికి వెళ్తూ చెపుతున్న మాటల్లా ఉన్నాయి. నరసింహం వెళ్ళొస్తానన్నాడు, తెల్లారేలోపున ప్రయాణం.

*యువ, 1 సెప్టెంబర్ 1968*

# 14

# భగవంతుని కథ

నాకు పెళ్ళిళ్ళంటే సరదా! ఏమాత్రం అవకాశమున్నా, ఎవరు పిల్చినా తప్పనిసరిగా వెళ్తాను. పెళ్ళికొడుకు తరఫువారైనా, పెళ్ళికూతురి తరఫు వారైనా... నాకు పట్టింపు లేదు. ఏదో నాకు తోచిన పెళ్ళికానుక నా శక్తికొలది కొని తీసుకువెళ్తాను. పెళ్ళిసందడి, పెళ్ళి వాతావరణం అంటే అదో రకమైన పెళ్ళివాసనేమో నన్ను ఆకర్షిస్తుంది. పెళ్ళి మొదల్నించీ చివరవరకు శ్రద్ధతో చూస్తాను. మనసు కందని ఏదో గొప్పతనం ఉంది పెళ్ళిలో. అసలు పెళ్ళిపందిరే చూడముచ్చటగా ఉంటుంది. వాసాలతోనూ, తాటాకులతోను, తోరణాలతోనూ అలంకరించిన ఎంత చిన్న పందిరైనా నన్ను దగ్గరకు రమ్మంటుంది. పెళ్ళంటే ఎందుకంత సంబరం? అని నన్నెవరన్నా అడిగితే నేను ఫలాన అని ఇదమిత్థంగా చెప్పలేను. ఎందరితోనో కొత్త వ్యక్తులతో పరిచయం అవుతుంది. ఎందరో ఎరగని వాళ్ళు, ఎరిగినవాళ్ళు కనిపిస్తారు. పాలు తాగుతున్న పసిపిల్లలు, ఎప్పుడూ చూడని కన్నెపిల్లలు, యవ్వనాన్ని పులుముకున్న యువతులు, చిరునవ్వులతో అటూ ఇటూ తిరుగుతున్న ప్రౌఢలు, పట్టుచీరలు కట్టుకొని పరిగెత్తుతున్న మరికొంచెం పెద్దవాళ్ళు, ఇంక మగవాళ్ళలో నిక్కర్ల వాళ్ళూ, పైజామాల వాళ్ళూ, గొట్టం ప్యాంట్లవాళ్ళూ, లుంగీలవాళ్ళూ, పెద్దమనుషులుగా ఉండాలని ప్రయత్నించే ధోవతులు, ఉత్తరీయాలవాళ్ళూ... స్థానిక రాజకీయాలు మొదలు ఢిల్లీ రాజకీయాలవరకూ చర్చించే కొంతమంది నాయకుల్లాంటి వాళ్ళూ కాలం మారిపోయింది- ఆ రోజులే బావుండేవి అని చప్పరించే తలపండిన తాతయ్యలూ... ఎదురవుతారు.

బాజాభజంత్రీల వాళ్ళూ, మద్దెల సన్నాయి ఈ రెండు కలిస్తే చెప్పనక్కర్లేదు. భూమి దద్దరిల్లిపోతుంది. ఆ తరువాత పురోహితులు చదివే మంత్రాలు వినముచ్చటగా ఉంటాయి. ఇలాంటి వాతావరణంలోకి ఓసారి వెళ్లాను. ఆడపెళ్ళివారు నాకు చాలా దూరపుబంధువులు. అది మరీ పల్లెటూరు కాకపోయినా పట్నం మాత్రం కాదు. అటూ ఇటూ కాకుండా ఉంది. రైల్వేస్టేషనుకు రెండు మైళ్ళదూరం. గుర్రం బండ్లు చాలా కొద్దిగా ఉన్నాయి. వంట్టెద్దుబండ్లే ఎక్కువ. మా బండ్లో ఎక్కమంటే మా బండ్లో ఎక్కమని పోటీపడి... వాళ్ళు గోలచేస్తుంటే నాలో నేను నవ్వుకుని ఓ మంచి వంటెద్దుబండి చూసుకుని పెళ్ళివారింటికి వెళ్ళాను. ఎద్దుబండి ప్రయాణం ఎంతో హాయిగా ఉంది. సాఫీగా వెళ్ళిపోయింది. రిటైరైనవాడి జీవితంలా పెళ్ళివారింటికి సులభంగా తీసుకువెళ్ళగలిగాడు బండివాడు.

అప్పటికీ ఉదయం పదిగంటలు దాటింది.

నిప్పురవ్వలు రాజుకుంటున్నట్టుగా ఎండ చిటచిటలాడుతోంది. గుమ్మం ముందు ఆడచెప్పులు, మగచెప్పులు, చిన్న పిల్లల చెప్పులు అనేకం గుమిగూడి ఉన్నయి. నావి కూడా ఆ గుంపులో కలిసినై.

నన్ను చూడగానే నన్ను ఎరిగి ఉన్నట్టుగా ఒకాయన ముందుకువచ్చి... ఈ బండికేనా రావడం... ఎన్నాళ్ళకు... ఎన్నాళ్ళకు.. మీరు రావడం ఎంతో సంతోషం.. అంటూ చిరునవ్వుతో పలుకరించాడు. ఆయన్ను ఎక్కడో ఎప్పుడో చూసినట్టు గుర్తు.

ఎవరో కాళ్లు కడుక్కోవడాన్కి నీళ్ళు ఇచ్చారు.

ముహూర్తం దగ్గరపడుతోంది... సమయానికే వచ్చారు అంటూ మరోరు పలుకరించారు. నాకు సామాన్ల గది చూపించారు. చిన్న బెడ్డింగ్, ఒక లెదర్ సూట్‌కేస్ చిన్నది. అది నా సామాను. అడుగుపెట్టను సందులేదు. ట్రంకు పెట్టెలు, బెడ్డింగులు, చిన్న చిన్న మూటలు, ఇంకా ఎన్నో సామానులు. ఒక మూలగా సామాను పడేశాను. ఓ చిన్న కిటికీలో ఓ కొబ్బరినూనె సీసా, వెలిసిపోయిన అద్దం, అక్కడక్కడ పళ్ళూడి పోయిన దువ్వెన ఉన్నాయి. అక్కడే బట్టలు మార్చుకుని, ఓసారి దువ్వుకుని అక్కడున్న సామాన్ల మీదుగా అంగలు వేస్తూ బయటకు వచ్చాను.

ఇంతలో ఎక్కడినుండో దూసుకువచ్చింది తుఫానులా లలిత.

'ఇప్పుడేనా రావడం... ఒక్కడివీ వచ్చావేం... ఎన్నాళ్లకు... ఎన్నాళ్ళకు బావా... అంతా కులాసాయేనా?' అంటూ మాటల వర్షం కురిపిస్తోంది. లలిత నాకు మేనత్త కూతురు. ఏనాటిదో ఈ బంధుత్వం. లలితకు నలభై ఏళ్ళు దాటినై. వెంట్రుక వాసిలో తప్పిపోయింది. లేకుంటే నేనే లలితను పెళ్ళి చేసుకోవల్సింది.

బావా అన్న పిలుపులో ఏదో అనిర్వచనీయ ఆత్మీయత, తియ్యదనం ఉంది.

'టిఫిన్ తీసుకుందుగాని రా బావా' అంటూ ముందు వసారాలోకి తీసుకు వెళ్ళింది. లలితను చూసి ఏ పదేళ్ళో అయింది. లలిత వాళ్ళు భువనేశ్వర్‌లో ఉంటున్నారుట.

'నీ వొక్కడివీ వచ్చావేం అని నిలదీసింది.'

'పిల్లలకు పరీక్షలు... పెద్ద సంసారం కదా... ఇల్లు వదిలి రావడానికి ఆవిడకు వీలుపడదు..' అన్నాను.

వసారాలో ఈతాకు చాపమీద కూర్చున్నాను. వరుసగా నాలుగైదు చాపలు వేసున్నాయి... చాప మీద అక్కడక్కడా కాఫీ మరకలు... ఉప్మాతిన్న ఆకులు అక్కడక్కడా గాలికి అటూ ఇటూ కదుల్తున్నాయి... ఇంతలో టిఫిన్, కాఫీ తీసుకోండి... అంటూ ఒకాయన వచ్చి నా వైపు చూసి చిరునవ్వు నవ్వుతూ... నా ముందు ఉంచి వెళ్ళాడు. పక్కనున్న ఖాళీ ఆకుల మీదకి ఎగబడి, అవి తీసుకుని, ఒక తడిగుడ్డతో చాపమీదున్న కాఫీ మరకలు తుడిచి గిరుక్కున తిరిగివెళ్ళాడు. అతనెవరో నాకు అంతుబట్టలేదు. అతన్ని చూసి అతని వయసు కనుక్కోవడం కష్టం. జుట్టు ముగ్గుబుట్టలా ఉంది. కాబట్టి డెబ్బయిఏళ్ళదాకా అంచనా వేయవచ్చు. అతను వేసుకున్న బట్టల్నిబట్టి పెళ్ళికి సంబంధించిన బంధువర్గంలోని వాడేమోనని అన్పించలేదు. పోనీ పనివాడేమో అనుకుంటే... పనివాడి లక్షణాలు కన్పించలేదు. పనివాళ్ళెవరూ అంత చురుగ్గా పనిచేయరు. క్షణం విరామం లేకుండా పని చేస్తున్నట్టుగా అలసి ఉన్నాడు. పెదిమల మీద చిరునవ్వు, నుదుటిమీద చెమట బిందువులు...

ఎక్కడ బడితే అక్కడే అతను కన్పిస్తున్నాడు. కొంతసేపు పెళ్ళి పందిట్లో, కొంతసేపు వంట సావిడిలో... ఏదో వంట వాళ్ళకు పురమాయిస్తున్నాడు. కాస్సేపటికి మళ్ళీ వసారాలో కన్పిస్తున్నాడు. అతని వాలకం చూస్తే తన చేతిమీదుగా పెళ్ళి

జరిపిస్తున్నట్టుగా ఉంది. అతనిలో ఉన్న ఉత్సాహాన్ని చూసి అతనెవరో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. అయినా పెళ్ళిళ్ళలో ఎవరి హడావిడి వాళ్ళది.

పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ, ఒకరిమీద ఒకరు తలంబ్రాలు పోసుకుంటున్నారు. కన్యాదాత బాగా అలసి ఎందుకో నీరసంగా కన్పిస్తున్నాడు. కళ్ళు బాగా లోతుకు పోయినట్లున్నాయి. ఇంత కష్టం పొయ్యాల్సి వచ్చిందే అని కళ్ళెర్ర చేసినట్టుగా ఉన్నాయి అతని కళ్ళు...

వచ్చిన వాళ్ళందరూ తెచ్చిన కానుకలు చదివిస్తున్నారు. పంతులుగారు ఇచ్చిన వాళ్ళ పేర్లూ, బంధుత్వమూ ఎనౌన్సు చేస్తూ కానుకలన్నీ వాళ్ళకు అందజేస్తున్నాడు. పెళ్ళికూతురు వెనకాల ఒక గౌనుపిల్ల, బహుశా చెల్లెలేమో.... ప్యాకెట్స్ కొన్ని విప్పి కుతూహలంగా చూస్తోంది.

పెళ్ళి హడావిడి అంతా అయిపోయింది. పెద్ద పూలవాన కురిసి వెలసినట్లుగా ఉంది. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చాడు. ఎంత తీక్షణత ఎక్కువవుతోంది...

కొంతమంది వచ్చి అక్కడున్న జంపకానాలు, దుప్పట్లు, చాపలు, అన్ని విదిలించి... ఆ స్థలాన్ని పరిశుభ్రం చేసి వడ్డనకు సిద్ధం చేస్తున్నారు.

భగవాన్లూ భోజనాల వేళ అయిందయ్యా... ఆ ఏర్పాట్ల సంగతి కొంచెం చూడు... అంటున్నాడు కన్యాదాత.

భగవాన్లెవరో నాకిప్పుడు తెలిసింది. ఈ ఏర్పాట్లన్నీ అతని చేతిలో ఉంటే అంతకన్న ఏంకావాలి? యుద్ధరంగంలో కమేండరల్లే అన్నీ చక్కకా అయిపోతాయి. కమాండరు సామాన్యంగా తనేమీ చేయడు. కాని భగవాన్లు అలాంటి కమాండరు కాదు తనే ఎక్కువగా చేస్తాడు. ఇతర్ల చేత చేయిస్తాడు. ఇంత క్రమశిక్షణ దేశంలో అందరికీ ఉంటే దేశం ఎప్పుడో బాగుపడేది. ఈ భగవాన్లు పొద్దున నాకు టిఫిన్ కాఫీ ఇచ్చినాయనే. భగవాన్లను చూస్తున్నాను. నన్నెందుకో ఇతను ఆకర్షించాడు. ఇంతపని చేస్తున్నా అతనిలో విసుగు అన్నది ఎక్కడా కనిపించడం లేదు.

అతను నడుం కట్టాడు. విస్తళ్ళు, గ్లాసులు, వరుసలో టపటపా పడ్తున్నాయి క్రమంలో. కొందరమ్మలక్కలు పప్పూ, పచ్చడి కూరలు వేసుకున్నారు. వాళ్ళలో లలిత కూడా కన్పించింది. నాకు సరదా వేసింది. ఇంతమంది ముందుకు వచ్చి వస్తు

చేస్తుంటే నేను మాత్రం ఆ సైన్యంలో ఎందుకు చేరకూడదూ. నడుం కట్టాను. భగవాన్లు దగ్గరగా వెళ్ళి నిల్చున్నా.

'మీరెందుకులెండి బాబుగారూ... మీరు పెద్దవారు... మీరలా ఉండండి... మేం చూసుకుంటాంగా...' అన్నాడు ఆప్యాయంగా. 'ఒక్క పట్టు పట్టామంటే చిటికెలో అయిపోతుంది. అంతమంది ఒకసారి భోజనం చేయడానికి స్థలం లేదు' అన్నాడు.

అదేం లాభంలేదు. ఆయన కూడా నడుం వంచాల్సిందే అంది లలిత.

రంగంలోకి దిగక తప్పలేదు.

'నాకింత బరువుని వప్పగించి, నీవు తేలిగ్గా నెయ్యి మాత్రం తీసుకుంటావా...' అన్నాను లలితతో.

లలిత ఫెళ్ళున నవ్వింది. అదే నవ్వు, అదే చిలిపితనం. ఎన్నేళ్ళు వచ్చినా ఇది మాత్రం మారలేదు. నాకు చిన్నతనం జ్ఞాపకం వచ్చింది.

భగవాన్లు నడుపుతూ, నడిపిస్తున్నాడు రంగాన్ని, చకచకా సాగిపోతున్నాయి వడ్డనలు.

ఒక వంక్తి అయిపోయింది. అందరూ త్రేంచుకుంటూ లేచారు. గబగబా పనివాళ్ళు విస్తళ్ళు తీసేశారు భగవాన్ల సహాయంతో.

'బాబుగారూ మీరు ఈ వంక్తికి కూచోండి. మేం చూసుకుంటాంగా...' అన్నాడు భగవాన్లు.

అతని మాట తీసేయలేక కూర్చున్నాను. అదీగాక బాగా ఆకలి వేస్తున్నది. తప్పలేదు. భగవాన్లుకు మరింత ఉత్సాహం ఎక్కువయింది. రంగంలో కలియబడ్డాడు. టైము రెండు గంటలు కావస్తోంది.

భోజనం చేసి భుక్తాయాసంతో ఓ మూల పడుకున్నాను. నిద్రపోవడం లేదుగాని మూడో వంక్తి భోజనాలు గమనిస్తున్నాను. తాంబూలం నెమరేస్తూ. భగవాన్లలో అదే ఉత్సాహం, అదే పరుగు, అదే చిరునవ్వు, నుదుటిమీద చెమట... అలసట, ఆకలీలేని ఈ భగవాన్లెవరు? నిజంగా భగవంతుడా... అనిపించింది. నాలుగో వంక్తికి వంట వాళ్ళూ, ముసలమ్మలూ, ఇంకా మిగిలిపోయిన వాళ్ళూ కూర్చున్నారు. ఎక్కడా

ఉత్సాహం పరుగూ కన్పించటం లేదు. ఆయాస పడుతూ కొంతమంది పిల్లలు నడిపిస్తున్నారు.

నా కళ్ళు భగవాన్ల కోసం వెతుక్కున్నై. వడ్డనలోనూ లేదు. కూచున్న పంక్తిలోనూ లేదు. మూడు గంటలయింది. ఏ తెల్లవారు జామున్నో పని ప్రారంభించి ఉంటాడు. ఇంత వరకు విధి విరాం లేకుండా పనిచేశాడు. చివరకు మనిషే మాయం అయ్యాడు. నేను ఒకరిద్దరిని అడిగాను. ఏమో అంటే ఏమో అనుకున్నారు. ఎవరో భగవాన్ల కోసం వచ్చారు. వాళ్ళతో ఏమో మాట్లాడాడు వెంటనే వెళ్ళిపోయాడన్నారు ఎవరో... వెళ్ళిపోయాడని నాకు చింతలేదు. కాని భోజనం చెయ్యకుండా వెళ్ళాడని నాకు చాలా బాధగా ఉంది... అతన్ని గురించి చాలాసార్లు అనుకున్నాను. మరికొంచెం సేపటికి నా నెక్లెస్ పోయిందండీ అంటూ ఒకామె వచ్చింది. చెమటకు మెళ్ళో మరీ గుచ్చుకుంటుంటే మధ్యాహ్నం పెట్టెలో పెట్టిందట. భోజనాలయిన తరువాత మళ్ళీ చూసుకుంటే లేదట. లబోదిబో అంటోంది ఆమె.

మరీ సోద్యం... పెట్టెలో పెట్టింది ఎలా పోతుందమ్మా అన్నది మరో వనిత. నాకాశ్చర్యం వేసింది. పట్టపగలు ఇలాంటిది జరిగిందంటే.

నలుగురూ చేరారు. చర్చ జరిగింది.

ఈ విషయం కన్యాదాత వరకూ పోయింది. ఆయన నొచ్చుకున్నాడు. శుభమా అని పెళ్ళి జరిగిన ఇంట్లో ఇలాంటిది జరగడం.

ఆ భగవాన్లు తీసేడేమో... ఉన్నట్టుండి కనపడకుండా వెళ్ళాడు... అని మరోరన్నారు.

కన్యాదాతకు బాధ, బాధతోపాటు కోపం కూడా కలిగింది.

అతను దేవుడిలాంటివాడు. అతనిని ఆ మాటలంటే మహాపాపం... అన్నాడు.

అలాంటి వాళ్ళే ఇలాంటి పనులు చేసేది... అంటూ ఒకామె మూతి విరిచింది...

పైకి అందరూ మర్యాదస్తులు లాగానే కన్పడుతున్నారు, ఎవరినీ అనుమానించ డానికి ధైర్యం చాలటం లేదు.

ఈ భగవాన్లెవరండీ... అన్నాను కన్యాదాతతో.

భగవాన్లు ఇతరులకు సాయం చేసేవాడేగాని ఇతరుల దగ్గర నుండి ఆశించే రకం కాదు... అని ముక్త సరిగా అన్నాడు కన్యాదాత. నాకు భగవాన్ల మీద అభిమానం పెరిగింది.

'భగవాన్లు భోజనం చేయకుండా వెళ్లాడు. పొద్దుట్నుండీ పచ్చిగంగ కూడా ముట్టలేదు. నా కదే కొరతగా ఉంది. పెళ్ళంతా అతని చేతిమీదుగానే జరిగింది. అన్నం కూడా తినకుండా నాకింత అన్యాయం చేస్తాడా! నేనేం పాపం చేశానని..!' అని అన్నాడు కన్యాదాత. ఆయన కళ్లు చెమర్చినాయి...

నెక్లెస్ సంగతి తేలలేదు. ఆడవాళ్లు కొంతమంది పోట్లాడుకుంటున్నారు. కొంత మంది ఘర్షణ పడుతున్నారు. ఎవరూ భగవాన్లను గురించి అనుకోవటం లేదు. కన్యాదాత తలమీద చేయి పెట్టుకుని ఓ మూలగా వెళ్ళి మౌనంగా కూర్చున్నాడు.

సాయంత్రం అవుతోంది. సూర్యుడు కూడా చెప్పకుండా వెళ్ళిపోయే ప్రయత్నంలో మబ్బుల చాటున కొండల చాటున దాక్కుని కన్పడీ కన్పడనట్టుగా ఉన్నాడు. నేనటు వెళ్ళాను.

'కూచోండి' అని సౌంజ్ఞ చేశాడు.

'ఈ భగవాన్లు ఎక్కడ ఉంటాడు?' అన్నాను.

'అతని మకాం శివాలయంలో' అన్నాడు.

"అదెక్కడ?" అన్నాను.

"మీరు స్టేషన్ నుండి వస్తుంటే అంకమ్మ చెట్టు ఉంది చూశారా! సెంటర్‌లో... దానికి తూర్పుగా ఓ సందు ఉంది, ఆ సందులోంచి వెళ్తే కొసాన ఉంది..."

నాకు నెక్లెస్‌ను గురించి ఆరాతీయటం కన్నా భగవాన్లను గురించి తెలుసు కోవాలనే ఆసక్తి ఎక్కువయింది.

శివాలయం వైపు వెళ్ళాను.

అది శివాలయం కాదు. శిథిలాలయంలా ఉంది. ఏనాటిదో ఆ శివాలయం. బయట గోడలన్నీ పుచ్చిపోయిన శరీరంలా ఉన్నాయి. లోపల ఆకాశాన్నంటుతున్న ధ్వజస్తంభం, దానిముందు చెవి విరిగిపోయిన పెద్ద నంది కొట్టవచ్చినట్టుగా ఉన్నాయి.

గుడి చుట్టూ ప్రదక్షిణ చేశాను. గుడి ఆవరణ పెద్దది. నరసంచారం ఎక్కువగా ఉన్నట్టు కనపడదు. మంచి మంచి చెట్లు ఉన్నాయి. పొగడ చెట్టు శివుణ్ణి పొగుడుతూ ఉన్నట్లుగా ఉంది. మృదువైన వాసన. దేవగన్నేరు దానిపక్కనే. అటువైపుగా చిటికేశ్వర చెట్టు. చెట్లనిండా పూలు. ఓ మూల అరుగులాంటిది ఉంది. పెరటి వైపుగా గర్భగుడికి దూరంగా ఓ బావి ఉంది. ఆ బావినీళ్లు తియ్యగా ఉంటాయట. అప్పుడే పూజారి వచ్చి గుడి తలుపులు తీస్తున్నాడు.

గర్భగుడిలోకి వెళ్ళి శివుని దర్శనం చేసుకున్నాను.

పూజారి ఇచ్చిన విభూది కొంచెం తీసుకొని నుదుట రాసుకున్నాను. దేవగన్నేరు పువ్వు చెవులో పెట్టుకున్నాను. పళ్ళెంలో పది పైసలు వేశాను.

అరుగుమీద వచ్చి కూర్చున్నాను. పూజారితో మాట్లాడుతుంటే భగవాన్లను గురించి మరికొన్ని విషయాలు తెలిసినై.

భగవాన్ల అసలు పేరు భగవంతుడట. కొంతమంది అతన్ని భగవాన్లూ అనీ, భగవాయ్ అనీ పిలుస్తారు. అతను ఏనాటివాడో ఎవరికీ తెలియదు. ఆ ఊళ్ళో నీటి ఇబ్బంది ఉంది. ఆ ఊళ్ళో చాలా మంది శివాలయం బావినీటి మీద ఆధారపడి ఉంటారు. నీటి కావిడి తీసుకొని కొంతమందికి నీళ్లు సప్లై చేస్తుంటాడు భగవాన్లు. బిందెకు అణా చొప్పున ఇస్తుంటారు. భగవాన్లు ఎప్పుడూ శివాలయంలోనే మకాం. ఎవ్వరితోనూ ఎక్కువగా మాట్లాడడు. పరోపకారమే అతని ధ్యేయంగా అనిపిస్తోంది. ఎప్పుడూ ఎవరో ఒకరు అతన్ని పిలుస్తుంటారు. అతను నిలబడితే ఏ పనైనా నిరాఘాటంగా జరిగిపోతుంది. అతనుంటే కొండంత బలం. ఆపదలో ఉన్న వారిని ఆదుకోడమే అతని ఆశయం. ఎవ్వరి దగ్గరనుండీ ఏమీ ఆశించడు. ఎవరైనా ఏదైనా ఇస్తే కృతజ్ఞత తో తీసుకుంటాడు. బతికున్న వారికన్న చనిపోయిన వాళ్ళకు అతని అవసరం ఎక్కువ. దగ్గరుండి అన్ని కర్మకాండలు చేయిస్తాడు. అవసరమైతే శవాన్ని మోసుకు పోవడంలో సహాయ పడ్తాడు. చచ్చిపోయినవాళ్ళు తనతో మాట్లాడలేరు గనుక వాళ్ళకే ఎక్కువ సహాయం చేస్తాడేమో...

ఆ ఊరు ఓసారి చూద్దామని శివాలయం నుండి బయలుదేరి వెళ్లాను. ఆ ఊళ్లో పది పన్నెండు వీథులకన్నా ఎక్కువ లేవు.

శివాలయం వీధి దాటి పడమటి వైపుగా వెళ్లాను. దాన్ని కోటబజారు అంటారుట. ఎప్పుడో ఇక్ష్వాకులనాడు అక్కడ ఓ రాజావారుండేవారుట. దోవలో మట్టికోట కన్పించింది. సుమారు శివాలయం వయస్సుంటుంది ఆ కోటకు.

కోట బజారు గుండా చివరకు వెళ్లాను. ఓ పెంకుటింటి ముందు కొంచెం జనం ఉన్నారు. అందరూ హడావిడిగా ఉన్నారు.

శవ ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తున్నారు. సూర్యాస్తమయం అవబోతూంది, త్వరగా కానివ్వండి అంటున్నారెవరో. దగ్గరకు వెళ్లి చూశాను. అది భగవాన్ల గొంతే. అంతా భగవాన్లే నడిపిస్తున్నట్లుగా ఉంది. ఆ పెంకుటింట్లో పెద్దగా ఏడ్పులు వినిపిస్తున్నాయి. ఊరుకోండమ్మా అంతగా బెంబేలు పడిపోతే ఎలా? ఏడిస్తే పోయినాళ్లు తిరిగొస్తారా... ఆఖరు క్షణాల్లో ఆయన్ని ప్రశాంతంగా పోనివ్వండి... అంటున్నాడు భగవాన్లు. శవ వాహనం భగవాన్లు భుజం మీదకు లాక్కున్నాడు ఇంకా ముగ్గురున్నారు. శివా శివా అంటూ కదిలారు ఊరికి ఉత్తరం వైపు. నా కళ్లు చెమ్మగిల్లినై... మూడో బంతి భోజనాలయిన తరువాత భగవాన్ల కెవరో కబురందించి ఉంటారు. పెళ్లింట్లో చావు మాట చెప్పడం ఎందుకని ఎవ్వరికీ చెప్పకుండా జారుకున్నాడు. అతనికి పెళ్ళి, చావు రెండూ సమానమే. అందరికి కావలసింది సహాయం. అతను చేయవలసింది సహాయం. అన్యాయంగా నెక్లెస్ తీశాడేమోనని అభాండం వేశారు. పాపం! అన్నమే అక్కర్లేని వాడు నెక్లెస్ కొరుక్కు తింటాడా? ఆ అమ్మలక్కల్లో ఎవరో ఒకరు నెక్లెస్ తీసి ఉంటారు.

నాకు కలిగిన అనుభూతిని తలుచుకుంటూ, అంకమ్మ చెట్టుమీదుగా, బరువుగా కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరాను, భగవాన్లు నా కళ్ళల్లో మెదులుతున్నాడు.

*వసుధ దీపావళి సంచిక, అక్టోబరు 1971*

# 15

## కొవ్వొత్తి

సత్యనారాయణ, నీలాద్రి స్నేహితులు. మామూలు స్నేహితులు కాదు, ప్రాణ స్నేహితులు.

అయితే

సత్యనారాయణ ఉత్తరం–నీలాద్రి దక్షిణం.

సత్యనారాయణ వెలుగు–నీలాద్రి చీకటి.

సత్యనారాయణ బతుకు–నీలాద్రి చావు.

సత్యనారాయణ చావంటే భయం లేదు. నీలాద్రి రోజూ చస్తూ ఉంటాడు.

సత్యనారాయణకు నిన్న గడిచి పోయిన దానిలో లెక్క రేవనలే లేదు. అతనికి కావల్సింది ఈ రోజు.

నీలాద్రి మాటలు.. సలహాలు... అంటే సత్యనారాయణకు గురి... కాని ఆచరణలో పెట్టలేడు. వారానికి కనీసం మూడు సార్లన్నా కలుసుకోవాలి... మాట్లాడుకోవాలి... ప్రేయసీ ప్రియులల్లే ఒకరిని విడిచి ఒకరుండలేరు.

కాని

నీలాద్రి చీకటిలోనే వెదుకుతుంటాడు.

పేపరు చదువుతుంటే నీలాద్రికి... చావు సంగతులే కన్పిస్తాయి.... ప్రమాదాలు... వ్యాధులూ... దుర్మరణాలూ... విమానాలు కూలడం... రైళ్ళు పట్టాలు తప్పడం... భూకంపాలూ... వరదలు... వానలు.. ఒకటేవిటి... వెదికి వెదికి మరీ

చదువుతాడు ఇలాంటివి... చదివి చలిజ్వరం వచ్చిన వాడల్లే వణుకుతూ ఉంటాడు... వాన చినుకులు తనమీద పడ్తే... ఎవరో బాణాల్తో కొట్టినట్టు... శూలాలతో పొడిచినట్టు ఉంటుంది...

సత్యనారాయణకు వాన చినుకులంటే సరదా... పన్నీరు చల్లినట్టుగా ఉంటుంది... తడుస్తూ దద్దరిల్లిపోయేట్టు నవ్వుతాడు...

నీలాద్రికి... న్యుమోనియా... టెంపరేచర్... దగ్గు... ముసుగు... మూలుగు.... ఇవి వెంటాడుతూ ఉంటయ్, వర్షానికి తలుచుకున్నప్పుడు...

మరి

ఇద్దర్లో ఎవరు గొప్ప... ఎవరు మనిషి... ఏం మనుషులు... ఎవరు పిరికి... ఏది నిజం... ఏది అబద్ధం... ఎవరు నిర్ణయిస్తారు. మీరా... నేనా... సత్యనారాయణా... నీలాద్రా... ఇది వివేకమా.... అవివేకమా... ఆదర్శమా... పుణ్యమా... పాపమా...

ఉండండి!

సత్యనారాయణకు సిగరెట్టన్నా... స్కాచ్ అన్నా ప్రాణం. ఎవరు ఎవరికి బానిసో తెలియదు. సిగరెట్టుకు మాత్రం దాసుడు.

చదువుతున్న రోజుల్లో (చిన్నప్పుడు) నలుగురు స్నేహితులుండేవాళ్ళు...

వాళ్ళల్లో సీతా రామ్మూర్తి అనేవాడు తనలాగే బలాఢ్యుడు. ఉక్కుమనిషి. మిగతా వాళ్ళల్లో వాసు అందంగా ఉండేవాడు. అందరూ ఇంచుమించు సమవయస్కులే. వాసు డాక్టరయినాడు.

ఇప్పుడు

అందరూ ఎక్కడెక్కడో ఉంటున్నారు. వయసు మాత్రం అందరికీ నలభై దాటింది. అప్పుడప్పుడు బాల్యస్నేహితులను తలచుకుంటూ ఉప్పొంగి పోయేవాడు.

ఆఫీసులో ఒక రోజు ఓ సుముహూర్తాన సత్యనారాయణకు పిడుగులాంటి వార్త అందింది ఓ కార్డు ముక్క..

"మా నాయన గారైన సీతారామ్మూర్తిగారు అకస్మాత్తుగా గుండెపోటు వచ్చి కన్ను మూశారు. ఈ రోజు పెద్ద కర్మ..."

సీతారామ్మూర్తి చచ్చిపోయి కొడుకుచేత ఆ ఉత్తరం వ్రాయించాడు.

ఆఫీసులో ఆ రోజు పనిచెయ్యి బుద్ధి పుట్టలేదు సత్యనారాయణకు.

సీతారామ్మూర్తి టపాకాయ పేలినట్లు 'ఢాం' అన్నాడు.

ఆ వార్త విన్న సత్యనారాయణకు భయమా, దిగులా, దుఃఖమా... ఏవిటి? చచ్చిపోయిన సీతారామ్మూర్తి తన వయసు వాడు. ఉక్కు శరీరం, మరి గుండెపోటేమిటి? వెధవ గుండె ఉన్నట్టుండి ఆగిపోతుంది చెప్పా చెయ్యకుండా. ఆగిపోతున్నాను జాగ్రత్త అని వార్నింగ్ అయినా ఇవ్వదు. ఇస్తే మాత్రం చేసేదేముంది. తన గుండెకూడా ఆగిపోదు కదా. ఆగదు, ఆగదుగాక ఆగదు. ఆగితే గుండెను చంపేస్తాడు. పిచ్చి పిచ్చి చేస్తాడు. అంత కోపం గుండెమీద. తనది గుండె గాదు, గుర్రం, వడి, గుర్రంకాదు జాతిగుర్రం, రేసు గుర్రం, అదిలిస్తే వేగాన్ని అందుకుంటుంది. అది తెల్ల గుర్రం తను నల్ల మనిషి.

మర్నాటి సాయంత్రం నీలాద్రిని కలుసుకున్నాడు. నీలాద్రి మాట్లాడుతున్నాడు చీకటి మాటలు.

"ఏరా సత్యం! రోజులు ఏం బాగా లేవురా! మా మేనమామ ఇటీవల బ్లడ్ ప్రెషర్ ఎక్కువై కన్నుమూసేడు..."

"ఒరేయ్ ఇలాంటి వార్తలు చెప్పకు. ఇవ్వాళ పేపర్లో చూశావా పెర్నీ హోటల్లో డాన్స్ ప్రోగ్రామ్ ఉంది. క్యాండిల్ లైట్ డాన్స్, రీటా. ఒరేయ్ రీటారా, రీటా ఈ ఫోటో చూడు పేపర్లో".

"అది కాదురా కేన్సర్‌ను గురించి ఓ స్పెషల్ వ్యాసం ఉంది చూశావా. సిగరెట్లకు దానికి లంకె ఉందిట..."

"ఒరేయ్ ఆపరా ఆపు నీ ఉపన్యాసం పెర్నీకి పోదాం పద".

"బాబూ నీకూ నీ పెద్దలకు ఓ నమస్కారం. ఈ ప్రోగ్రామ్‌లు పెట్టకు నిద్ర ఉండదు. ఆరోగ్యం చెడిపోతుంది.

"అంత పాడైపోయే ఆరోగ్యం ఎన్నాళ్ళుంటుందిరా అంతగా చస్తే రేపటికి రెండు. జనాభాలో ఎంత మంది చావడం లేదు గనుక ఏనాటికైనా మట్టిలో కలిసిపోవల్సిందేగా..."

బలవంతాన నీలాద్రి సత్యనారాయణను అనుసరించాడు, బలికి వెళ్తున్న మేకలాగా...

సత్యనారాయణ గ్లాసు నింపుతున్నాడు. పెళ్ళి గుర్రం పరుగెడుతోంది గుండె లదిరేట్టుగా. కళ్ళెం లాగుదామంటే ఆగడం లేదు.

"ఒరేయ్ సత్యం ఈ తాగడానికైనా మితం ఉండద్యురా ఇప్పటికి మూడు పూర్తిచేశావ్. ఇది నాలుగోది. ఈ ద్రావకం లోపల దహించి వేస్తుందిరా నీ అయుస్సు ప్రతి గ్లాసుకూ కొంత తగ్గిపోతుందిరా. నీవు తాగే ప్రతి సిగరెట్టూ, ఊపిరితిత్తులను అంగుళం, అంగుళం తూట్లు పడేస్తుందిరా. నీవిక ఎక్కువ రోజులు బతకవురా!"

నీలాద్రి మాటల్లో నిజం ఉందా లేదా! అది వేరే సంగతి. అది నిజమని సత్యనారాయణకు తెలుసు. నీలాద్రి చెప్తూనే ఉంటాడు. సత్యనారాయణ వింటూనే ఉంటాడు. నీలాద్రి అలా చెప్పకపోతే సత్యనారాయణకు హుషారు లేదు.

"నాలుగు వేదాలూ క్షుణ్ణంగా చదవాలిరా. ఉపనిషత్తుల మాటటేం గానీ" అంటూ సత్యనారాయణ అగ్ని హోత్రాన్ని అదలించాడు. అగ్ని స్వాహాదేవిని కావలించుకున్నాడు. "ఈ హవిస్సు లందుకున్నవాళ్ళు పుణ్యాత్ములు, ఊర్వశీ, రంభా, ఉంచుకున్న ఇంద్రుణ్ణి వదిలి పెట్టి చీ, పో అని నెట్టేస్తూ పరుగెత్తుకొస్తారు. ఆ దేవతలకు మనుషులంటే మహాప్రాణం రా!" ఇదీ సత్యనారాయణ ధోరణి...

సత్యనారాయణ ఇక మారడు.

నీలాద్రి చెప్పడం మానడు.

మరి కొన్నాళ్ళకు సత్యనారాయణకు ఓ వార్త అందింది. వాను అంటే ఇప్పుడు డాక్టరు. హఠాత్తుగా ఏదో జబ్బుచేస్తే హాస్పిటల్లో చేర్చారు. ఏ క్షణాన్నయినా కన్ను మూయవచ్చు.

రెండు రోజులు ఆలోచించాడు. పోయి చూసివస్తే బావుండుననుకున్నాడు. అక్కడికి వెళ్తే కనపడే దృశ్యం ఊహించుకున్నాడు. వ్యాధులు, రోగులు, డాక్టరు, మంచాలు, ఆస్పత్రి, డెట్టాల్ వాసన, ఆస్పత్రి వాసన, టోపీలు పెట్టుకున్న మగ నర్సులు, చలాకీగా పరుగెత్తుతున్న ఆడ నర్సులు...

పోవడానికి మనస్కరించలేదు. అది భయమా, అసహ్యమా, పిరికితనమా, ఏమో మరి సత్యనారాయణ వెళ్ళలేదు, నీలాద్రికి చెప్పలేదు.

ఒక రోజు నీలాద్రి, రొప్పుకుంటూ యుద్ధంలో ఎవరో తరిమి తరిమి కొడ్తే పారిపోయినట్లుగా పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఒరేయ్ సత్యం నాకో భయంకరమైన కల వచ్చిందిరా. నేను చచ్చిపోయినా్నా... నా శవం త్వరగా కాల్చాలని అందరూ మహా అదుర్దా పడుతున్నారు. కొరివి అంటించారు, శ్మశానంలోంచి అమాంతం లేచి కూచుని, పెద్దగా అరిచాను. నా శవం చాలా అసహ్యంగా ఉందిరా. కుళ్ళు వాసన కూడా, ఆ వాసన భరించలేక పోయాను తెల్లవారింది. అది అదృష్టవశాత్తు కల కాబట్టి సరిపోయింది గానీ, తెల్లవారే వరకూ అది నిజంగానే తోచింది. కలలో చచ్చిపోయినా, బతికిపోయాను" మాటలు చెప్తూ వణుకుతున్నాడు.

"ఇది శుభ సూచన, నీ కేం ఫర్వాలేదు. ఎవరికో మూడిందన్న మాట. మీ బాబాయో, బావో మరి ఎవరో".

ఇద్దరూ అబిడ్స్ వైపు నడిచి వెళ్తున్నారు. చీకటి పడింది. అబిడ్స్ అంతా సందడిగా ఉంది...

వచ్చేపోయే కార్లు, రిక్షాలూ, స్కూటర్లూ, జంటలు, లైట్లు, జనసమ్మర్ధం, రద్దీ, పరుగు, అందమయిన అమ్మాయిల నడకా...

'నీలూ, అబిడ్స్ భూలోక స్వర్గం రా' అన్నాడు సత్యం.

ఇంతలో ఎక్కడో కారు సడన్‌గా ఆగిన 'క్రీక్' అనే చప్పుడు.

"ఒరేయ్ సత్యం ఎవరో కారు కింద పడి చచ్చేద్రా ఇంటిదగ్గర చెప్పి వచ్చేడో లేదో..." అన్నాడు నీలాద్రి.

"ఏమీ లేదు ట్రాఫిక్ జామ్‌రా వస్తూ వస్తున్న కారు ఎర్రలైటు చూసి ఆగిపోయింది అంతే..."

పేవ్‌మెంట్ మీద నడుస్తున్నా నీలాద్రికి భయంగానే ఉంది. ఒక వేళ ఏదైనా కారుగానీ, బస్సుగానీ, దోవతప్పి పేవ్‌మెంటు మీదికి వస్తే, పక్కకు పక్కకు జరిగి జరిగి నడుస్తున్నాడు.

ఎప్పటికైనా అలాంటి విపత్తు తప్పదనుకున్నాడు నీలాద్రి.

  

తెల్లవారక తప్పదు, అందుకనే తెల్లవారింది.

ప్రతిరోజూ చూసుకుండే అద్దంలో సత్యనారాయణ తన ముఖం చూసుకున్నాడు.

అద్దంలో ముఖం నీరసంగా ఉంది. కళ్ళు లోతుకు పోయినై, జ్యోతుల్లా ఎర్రగా ఉన్నాయి. కళ్ళకింద నల్లటి చారలు...

చచ్చిపోయిన సీతారామ్మూర్తి అతని వెనకాల వానూ కన్పిస్తున్నారు అద్దంలో. నీవెప్పుడు వస్తావురా మాతో అంటున్నారు. అద్దంలో సత్యనారాయణ ముఖం.

అద్దం-మనిషిలా! మనిషి మనసులా నిజాన్ని దాచలేదు. మనిషిలో మనిషో మరి...

"ఏడిశారు వీళ్ళతోనా నేవెళ్ళేది" అనుకున్నాడు.

భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళేడు. ఆఫీసులో పని సాగలేదు. కొంచెం పైత్యంగా ఉండి కళ్ళు తిరిగినట్లయింది.

పెందలాడే ఆఫీసు వదలి బయటపడ్డాడు.

మామూలుగా బార్ ఆహ్వానించింది.

ఏ ఆహ్వానాన్నీ ఎప్పుడూ తిరస్కరించలేదు. తన పక్కన నీలాద్రి లేనిలోటు కన్పించింది. నీలాద్రి వస్తే బావుండును అనుకున్నాడు. నీలాద్రి బోధలు వింటూంటే సరదాగా ఉంటుంది. నిజాన్ని గట్టిగా చెప్పగలడు.

గుర్రాల పరుగు అయిపోయింది. గుండె గడియారం వేగంగానే కొట్టుకుంటున్నది.

బయట పడ్డాడు బార్‌లోంచి.

తన నెరిగి ఉన్న రిక్షావాడు కన్పడ్డాడు. సత్యనారాయణను ఎక్కడికి తీసుకు వెళ్ళాలో అతనికి తెలుసు...

తరువాత రెండు రోజులకు నీలాద్రి కన్పించాడు. వస్తూనే...

'ఏరా! సత్యం ఇదేం అవతారం రా! రోజు రోజుకూ తీసిపోతున్నావ్! త్వరగా డాక్టరుకు చూపిస్తే మంచిది ముఖం పాలిపోయి ఇవ్వాలో రేపో అన్నట్లు ఉన్నావు రా!' అన్నాడు.

ఇవి నీలాద్రి కుశల ప్రశ్నలు.

'డాక్టర్ని చూడడం, అవసరం . నేను బాగానే ఉన్నాను. వ్యాధి అంటూ లేకుండా ఎవడూ ఉండడు. వైద్యుడు ఎప్పుడూ ఏదో వ్యాధి ఉందనే అంటాడు. వ్యాధి ఉన్నా మనల్నేం చేస్తుంది...' అని నవ్వుతూ అన్నాడు సత్యనారాయణ.

ఆ నవ్వు చాలా నీరసంగానూ భయంకరంగానూ ఉంది.

ఎంత మందికి ఎన్ని వ్యాధులున్నా ఏ వ్యాధీ తన దాకా రాదు సత్యనారాయణకు. ఎంతమంది చచ్చిపోతున్నా, ఆ చావు తనదాకా రాదు. ఇది ధైర్యమా, బలహీనతా, పిరికితనమా, గొప్ప గుణమా, ఏమో నీలాద్రికి తెలుసేమో. నీలాద్రికి సత్యనారాయణ సంగతి బాగా తెలుసు.

అద్దం మీద కోపం వచ్చింది. అద్దాన్ని తీసేశాడు. అద్దం లేకుండానే కాలం గడుపుతున్నాడు.

మామూలు అలవాట్లు మానలేదు.

ఎక్కువవుతున్న సిగరెట్లను తగ్గించలేదు.

రిక్షావాడి స్నేహం ఉండనే ఉంది.

నీలాద్రి తప్పించుకు తిరుగుతున్నాడు. అయినా ఎప్పుడో ఒకప్పుడు కనపడుతూనే చీకటిని గుర్తుచేస్తూనే ఉన్నాడు.

ఒక రోజున సత్యనారాయణ వేసిన ప్రశ్నకు నీలాద్రి అదిరి పడ్డాడు...

'ఒరేయ్ నీలూ నే చచ్చిపోతే ఏం చేస్తావురా!' అది ప్రశ్న.

'అంత మాట అనకురా సత్యం. ఇలాంటి మాటలు మాట్లాడకు. నీవు లేంది నేను లేను. నేను నిన్ను చూసే బతుకుతున్నాను. నీలో వెల్తురుంది' ఇది జవాబు.

  

నాలుగు రోజుల తరువాత–

సత్యనారాయణ ఓ అమావాస్యనాడు ఆఫీసులో పనిచేస్తుండగా రక్తం కక్కుకుని, తాపీగా కన్నుమూశాడు. ఆ కొవ్వొత్తి కాలి కాలి, కాంతి నిచ్చి హరించి పోయింది కర్పూరంలా...

నీలాద్రి ఐక కన్పడడు. మనకూ సత్యనారాయణకు కూడా. కన్పడడు అనుకున్న నీలాద్రి నాకోసారి కన్పించాడు.

'సత్యనారాయణ దేవుడులాంటివాడు' అన్నాడు.

'అంటే నీ ఉద్దేశ్యం మంచివాడనా, గొప్పవాడనా, ఏమిటి?' అన్నాను...

"సత్యనారాయణకు ఆత్మహత్య మహాపాతకం అని తెలుసు. అందుకే తాపీగా తనను తాను హత్య చేయించుకున్నాడు ఆనందంగా. ఈ హత్యకు ఆయుధంలేదు. మనిషిలోని మనిషి హత్య చేశాడు. నాలుగేళ్ళుగా అతని భార్య పోయినప్పటినుండీ అతనిలో పొంచి ఉన్నాడు..."

'పొంచి ఉండి రోజూ కొంచెం కొంచెం చంపుతున్నాడు. సత్యనారాయణ భార్యను మరచిపోలేక, మళ్ళీ పెళ్లి చేసుకోలేదు. నేనెప్పుడూ అతని శరీరంతో మాట్లాడుతుండేవాణ్ణి...' అన్నాడు నీలాద్రి.

నెమ్మదిగా సిగరెట్టు తీశాను వెలిగిద్దామని.

నీలాద్రిని చూసి... ఆగాను...

సత్యనారాయణ నాకిప్పటికీ ఒక ప్రశ్నగానే ఉండిపోయాడు...!

# 16

# దారితప్పిన కథ

డి.యస్.ఆర్. మయ్యకు – అంటే దశరథ రామయ్యకు పెళ్ళాం అంటే అసహ్యం. ఉద్యోగం అంటే రోత. పిల్లలంటే డోకు. ప్రపంచం అంటే జుగుప్స కలిగింది.

మయ్యకు కలిగిన ఈ వికారానికి కారణం ఫలానా అని ఇదమిత్థంగా చెప్పలేకపోతున్నాడు.

క్రోధి, విరోధి, వికార, రాక్షస నామ సంవత్సరాలలో ఏదో ఒకదాంట్లో పుట్టాడేమో!

ఇరవై ఏళ్ళనుండీ పెళ్లాంతో వ్యభిచారం సాగిస్తున్నాడు. ఆనాడు అంటే కార్యం రోజు పెళ్ళాన్ని తన గదిలోకి నెట్టి అమ్మలక్కలు తలుపులు బిగించినప్పుడే అసహ్యం కలిగింది. అప్పటినుండీ ఏక స్త్రీ వ్యభిచారం చేస్తూనే ఉన్నాడు. అప్పుడప్పుడు కొంతమంది పిల్లలు కూడా పుట్టారు, పెరుగుతున్నారు.

మయ్య, యమ్మే ప్యాసయిన తరువాత కక్కుర్తి కొద్దీ పెళ్లయిన కొత్తలో ఓ గుమాస్తాగా చేరాడు. చేరిన తరువాత ప్రతి తద్దినానికీ ఇచ్చే ఇంక్రిమెంట్లు తప్ప చెప్పుకోదగ్గ ప్రమోషనేదీ రాలేదు. మరీ గుమాస్తా కాకుండా, మరీ ఆఫీసరు కాకుండా మధ్యలో ఊగులాడుతున్నాడు. తను ఓ మేధావిని అని అనుకుంటూ ఉంటాడు. ఇతరులు ఇది గుర్తించలేదు. అందుకనే వాళ్ళు వెధవలు అతని దృష్టిలో. ఉద్యోగాలకు మస్తిష్కంతో బొత్తిగా పనిలేదు. అందరిలాగా బాస్‌కు, అవసరమున్నప్పుడు లేనప్పుడూ సలాంలు కొట్టి బాస్ తాగితే తను తాగి, తాగించి, ఆయన మేకను కుక్క అన్నా, కుక్కను మేకన్నా వినయ విధేయతలతో తలూపి ఇలాంటి పనులు చేయలేదు.

ఉద్యోగం దొరికినప్పుడు పదిరూపాయలకు చిన్న ఇల్లు కూడా దొరికింది. పెంకుటింట్లో ఒక పక్క భాగం. మధ్యలో తడికపెట్టి ఒక గదిగా చేసి ఇచ్చారు ఇంటివాళ్లు. అది మయ్య బెడ్‌రూం. తడికలోంచి అప్పుడప్పుడు చూస్తున్న పక్కింటి లావుపాటి లక్ష్మీకాంతమ్మను లాగి తందామనిపించేది మయ్యకు... ఒకటి రెండుసార్లు తన్నాడు కూడా తడికెను. ఉద్యోగంలో పెరిగిన హోదాతో హుందాగా తరువాత చాలా ఇళ్లు మారాడు మయ్య. మంచి ఉద్యోగం, మంచి భార్య, చిలకా గోరింకల్లా సంసారం మయ్య చేస్తున్న వ్యభిచారాన్ని గురించి ఇరుగు పొరుగువాళ్ళు అలా చెప్పుకునేవాళ్ళు. పగలల్లా ఆఫీసులో పనిచేసి, ఆలోచనలతో బుర్ర వేడెక్కి, రాత్రి అయ్యేసరికి తడికెల గదిలో చేరుతాడు. మయ్యా పెళ్లాంకూడా పగలల్లా వంట ఇంట్లో సతమతమై చాకిరి చేసి చేసి (గంపెడు సంసారం) రాత్రి అయ్యేటప్పటికి ఆ గదిలో చేరుతుంది. ఇద్దరూ అక్కడ కలుసుకుంటారు. తెల్లవారితే మళ్ళీ ఎవరిదారి వారిది. ఎవరి పనులు వాళ్ళవి. గడియారం ముల్లులా తిరుగుతూనే ఉంటారు.

ఇక తను చూసే ప్రపంచం సంగతి చూస్తే-

న్యాయం, నీతి, నిజాయితీ, ధర్మం... మంచి ఇలాంటివి కనపడతై... అని కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తూనే ఉన్నాడు. ఇవన్నీ ఎక్కడో నక్కినై, అతనికెక్కడా కన్పించలేదు. అతనికి కన్పిస్తున్నదల్లా దీనికి పూర్తిగా వ్యతిరేకమైనవే. తనలాంటి దృక్పథం కలవాడు నూటికి, కోటికి ఎవడన్నా ఉంటే వాణ్ణి అసమర్థుడనీ, పనికిరాని వాడనీ, వాజమ్మ అనీ, ఇంకా ఇలాంటి పేర్లేవో పెట్టి తరిమి తరిమి కొడతారు. తనదీ ఈ విషయంలో మైనారిటీ పక్షం అయిపోయింది.

తన ఉద్యోగాన్ని, సాగిస్తున్న సంసారాన్ని (అతని దృష్టిలో అది వ్యభిచారమే) తనకెదురుగా కన్పిస్తున్న ప్రపంచాన్ని చూసి విరక్తిచెంది ఈ ఊబిలోంచి తప్పించుకు బయటపడ్డానికి సన్యాసం పుచ్చుకోవాలనుకున్నాడు. ఒకరిద్దరు స్వాములవార్లను కలుసుకుని మాట్లాడాడు దీని మంచి చెడ్డలు.

ఒక స్వాములవారు చెప్పిన మాటలు విని ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

మనిషంటూఉంటే కోరికలు లేకుండా ఉండవు. స్వాములవారు మనిషే. కొద్దో గొప్పో కోరికలుంటాయి. చీమునెత్తురూ ఉన్నదిగామరి... ఉన్న కోరికలని పూజలనీ, పునస్కారాలనే పేరుతో అణచడానికి సాధ్యమైనంతవరకు ప్రయత్నం చేస్తాడు. మయ్య

తెలుసుకున్న నిజం ఇది. కాషాయ వస్త్రాలు, కమండలం లేకుండానే సంసారంలో ఉంటూ సన్యసించడానికి ప్రయత్నం చేయచ్చు, ఇది ఆ స్వాములవారిచ్చిన సలహా...

మయ్య, యమ్మే చదివేటప్పుడే అతని నెత్తురులోనూ, మెదడులోనూ పురుగు ప్రవేశించి క్రమేణా పెద్దదయి ఓ వ్యాధిగా తయారైంది. క్షయవ్యాధి కన్నా భయంకరమైన వ్యాధి. ఈ వ్యాధితో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. మనిషిని కుంగతీసింది. తననెవరో పంజరంలో తాళ్ళతో బంధించినట్టు, ఆ తాళ్ళను నరకాలని, పంజరంలోంచి బయటపడాలని... ఇదీ అతని వ్యాధి. ట్రెడిషన్ అంటే బొత్తిగా నమ్మకంలేదు. దీన్ని బ్రేక్ చెయ్యాలని కంకణం కట్టుకున్నాడు. అతని మెదడులో ప్రవేశించిన పురుగు ఇదే. దీన్నే మొదట్లో టి.బి. అని (ట్రెడిషన్ బ్రేకర్), ఈ పేరు బలే బాగుంది అని నవ్వుకున్నాడు. నేను టి.బి. పేషంటునేగా మరి. కాని నా ఊపిరితిత్తులు బాగానే ఉన్నాయి. టెంపరేచర్ లేదు. ఇదోరకమైన టి.బి. అని అనుకున్నాడు. మయ్యకు పెళ్ళికి ఎదిగి కూర్చున్న కూతురున్నది. కాస్తోకూస్తో చదువుకున్నది. ఆ అమ్మాయికి పెళ్ళి చెయాలంటే బోలెడు కట్నం పోయాలి. ఇంత కట్నం తీసుకుని ఆ అమ్మాయిని సరిగా చూస్తారో లేదో. ఏదో ఒక చిన్న విషయానికి కోపం వస్తే పుట్టింటికి పంపిస్తారు. తీసుకు వెళ్ళవయ్యా అల్లుడా అని అడిగితే... కొంత సైకము చెల్లించమనో, లేకపోతే ఒక వస్తువు కొనిపెట్టమనో (కనీసం స్కూటరులాంటిది) బేరం చేస్తాడు. అల్లుడి కోరిక నెరవేరకపోతే అమ్మాయి పని ఖాళీ... ఎన్నాళ్ళయినా పుట్టింట్లోపడి ఉండవలసిందే. ఇదో రకమైన వైధవ్యం (భర్త బతికి ఉండగా). కట్నం సంగతి అలా ఉండగా పెళ్లి ఖర్చుబోలెడు. పెళ్ళికి ముందు రోజు ఆనాడు, పెళ్ళి తరువాత... బంధువులంతా పిల్లా మేకతో వచ్చి విందులన్నీ ఆరగించి... పోతూ పోతూ ఏదో కొంటెమాట మాట్లాడిపోతారు. వంట బాగాలేదనో, విడిదిలో ఎరేంజిమెంట్స్ బాగా లేవనో, లేకపోతే మర్యాదలు గట్టిగా జరపలేదనో... ఇలాంటివి. అందరూ చేసినట్టు గాకుండా ఓ ప్రత్యేకమైన పద్ధతిలో మయ్య కూతురు పెళ్ళి చేయాలనుకుంటున్నాడు. కాని సాధించగలనన్న ధైర్యం లేదు. ఈ ఇరవై ఏళ్ళలోనూ అనేక విషయాల్లో ట్రెడిషన్ బ్రేక్ చెయ్యాలని చూస్తూ ఉన్నాడు. అన్నిట్లోనూ అపజయమే ఎదురవుతూ ఉన్నది.

పెళ్ళాం తనని దైవంగా చూస్తుంది. అదే అతనికి నచ్చదు. అతని దృష్టిలో పెళ్ళాం పెళ్ళాంలా కన్పించదు, దేవతలా అసలే కన్పించదు.

పెళ్ళి కంట్రాక్టు ప్రకారం, పెళ్ళాం అవసరమొచ్చినప్పుడల్లా ఆనందాన్నిచ్చే వస్తువు. ఇది ఖరీదులేని ఆనందం. ఇద్దరిలో ఏ ఒకరికి ఇష్టం ఉన్నా లేకపోయినా భార్యాభర్తల యంత్రం మాత్రం నిరాఘాటంగా తిరుగుతూనే ఉంటుంది. తిండీ, గుడ్డా, పండక్కీ పబ్బానికీ ఒకటో రెండో కొత్త చీరెలు... ఇవీ ఆమెకిచ్చే పారితోషికం.

ఎన్నో దీపావళులు ఉగాదులు వెళ్ళిపోయినయి. ఈ పండగలన్నా, పండుగలకు శలవలన్నా మయ్యకు మహాకోపం. ఇది దీపావళి కాదు, దగావళి అంటాడు. ఆ కోపం ఎవరిమీదనో ఏమిటో తెలియదు. పెళ్లాన్ని తిట్టినా, కొట్టినా, చీదరించుకున్నా ఆవిడ ఏమీ అనదు. తిరగబడదు. మళ్ళీ గదిలో తయారు. ఎప్పుడూ మాంగల్యం కళ్ళకద్దుకుంటూ ఉంటుంది. తను తిరగబడే స్వభావం కలవాడు. ఆవిడది దానికి పూర్తి వ్యతిరేకం. అందుకనే పెళ్ళాం అంటే అసహ్యం పుట్టిందేమో!

ప్రతిరోజూ పేపరు చూస్తుంటాడు మయ్య. టెలివిజన్‌లోలాగా అతని కంటికి నడుస్తున్న చరిత్ర కన్పిస్తుంది. వళ్ళు పటపటకొరుకుతాడు. మయ్యకు ఏవో కోరిక లున్నాయి...

చిన్న చిన్న గుడిసెల్లో కొంతమంది పెద్ద పెద్ద మేడల్లో కొంతమంది ఉండగూడదు. పేవ్‌మెంట్లమీద పడుకుని ఎవరూ దిక్కులేని చావు చావకూడదు. బతికున్న శవాలను రిక్షాలోవేసి మనుష్యులు లాగకూడదు. ఆఫీసుల్లో పనిచేస్తున్న ప్రతి చిన్న ఉద్యోగి ప్రతిరోజూ మల్లెపూవులాంటి తెల్లని ఇస్త్రీ మడతలు వేసుకుని ఠీవిగా ఉండాలి. ఫ్యాక్టరీల్లో పనిచేస్తున్న వాళ్ళున్నారు. వాళ్ళ సంతోషం చిమ్నీల్లోంచి బయటకు వచ్చి ఆకాశం అంతా వ్యాపించాలి. భూములన్నీ విపరీతంగా పండాలి. ఎక్కడ చూసినా ఆకుపచ్చ ప్రపంచమే కన్పించాలి. తిండి లేకుండా ఎవ్వరూ మాడి చావకూడదు... ఇలా చెప్పుకుపోతే ఎన్నో ఉన్నయి.

అతనికి కనిపించేదల్లా, గుడినీ గుళ్ళో లింగాన్ని మింగే తిమింగిలాలు. మనుష్యుల్ని పీక్కుతినే క్రూరజంతువుల్లాంటి పెద్దమనుష్యులు.

ఈ తిమిం లాల్లోనుంచి బయటపడదామనే ఓసారి ఏ అడవుల్లోకన్నా వెళ్తే బావుండుననుకున్నాడు. ఏ జింకచర్మమో ఒంటికి కప్పుకుని అడవిలో దుంపలూ, కాయలూ, పళ్లూ తిని కాలక్షేపం చేయవచ్చు. పులులూ, సింహాలూ, క్రూరజంతువు లుంటాయిగాని అవే నయం. ఆకలైతేగాని మీదికి రావు.... తనొకడూ వెళ్ళి ఆ

అడవిలో ఏం చేస్తానని... ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. ఎక్కడికి వెళ్ళినా పెళ్ళాం, పిల్లలూ వెంటవస్తామంటారు. పెళ్ళికి వెళ్తూ పిల్లిని చంకన పెట్టుకు వెళ్ళినట్టు! ఛ... అనుకున్నాడు.

ఏవీ చేయలేక చచ్చిపోదామనుకున్నాడు. ఛస్తే తన మీదపడి ఏడుస్తారు పెళ్ళాం పిల్లలు. తను పోతే, వాళ్ళని ఎవరూ పట్టించుకోరు. ప్రావిడెంట్ ఫండ్ డబ్బు పెళ్ళాని కివ్వడానికి చాలా తిప్పలు పెడతారు. పెళ్లానికి వేరే ఆధారం ఏమీ ఉండదు. ఎవ్వరూ మొగుడు చచ్చినవాళ్ళను గురించి పట్టించుకోరు. చచ్చి సాధించేదేమీ లేదు. అందుకని మయ్యి చావలేదు.

నా దగ్గరోసారి మయ్యి తన గోదంతా చెప్పుకున్నాడు. చిక్కి సగమైనాడు. 'టీ.బి. పేషంటులా ఇలా తయారయ్యావేంటి? కొంచెం ఆరోగ్యం జాగ్రత్త...' అన్నాను.

'నాకో తరుణోపాయం చెప్పవయ్యా' అన్నాడు.

నే నేవీ మాట్లాడలేదు.

'నీవు కథలు రాస్తావుగా... నన్ను గురించి ఓ కథ రాయి... నాలాంటి వాళ్ళెవరన్నా ఉంటే చదువుతారు...' అన్నాడు.

'నిన్ను గురించి రాసినా అది కథ ఎలా అవుతుంది? కథ అంటే మజాకా అనుకున్నావా? ఓ బలమైన సంఘటన ఉండాలి. క్లైమాక్స్ ఉండాలి. ముగింపులో కొంత ట్విస్ట్ ఉండాలి. కథలో ఆడవాళ్లుండాలి. గాజుల గల గల ఉండాలి. ప్రేమ పలకపొయ్యాలి... ఇన్ని ఉంటేగాని కథగాదు. పాఠకుల అభిరుచి ననుసరించి కథ రాయాలి. లేకపోతే ఎవరూ చదవరు. పత్రికలవాళ్లు అసలు వేసుకోరు. నీలాంటివాడి మీద కథ రాస్తే, రాసేవాడి పరువుపోతుంది. నేరుగా బుట్టదాఖలా అవుతుంది...' అన్నాను.

'అంతేనంటావా?' అన్నాడు జాలిగా.

నాకు నిజానికి మయ్యిమీద జాలేసింది.

కథ వ్రాయడానికి ప్రయత్నించాను గాని, బలమైన సంఘటన దొరకలేదు.

'నా జీవితమంతా ఓ సంఘటనే కదా?... పోనీ ఏదో కథ రాసి నాలాంటి వాణ్ణి ఇరికించగూడదూ?' అన్నాడు.

'కథ రాస్తే మంచి బిగువుగా ఉంటుంది. నీలాంటి వాణ్ణి ఇరికించడానికి వీలుండదు' అన్నాను.

మయ్యి నన్ను వదల్లేదు.

'కథల్లో పోనీ ట్రెడిషన్ బ్రేక్ చెయ్యరాదూ' అన్నాడు.

'అది అంత సులభమా? అందరూ దుమ్మెత్తి పోస్తారు. సంపాయించుకున్న ఆ కాస్త పేరు మట్టికొట్టుకుపోతుంది. నీ మూలంగా నా పేరును నేను త్యాగం చెయ్యలేను' అన్నాను.

'కథలు రాసేవాడివి నీలో ఇంత స్వార్థం ఉంటుందనుకోలేదు' అని నన్ను తిట్టాడు.

కళ్ళు ఎర్ర చేశాడు.

తల అటూ ఇటూ ఊపాడు.

మనిషంతా కదిలాడు.

అతని దగ్గర ఏమీ ఆయుధం లేదుగాని, ఉంటే నన్ను హతమార్చేవాడు.

అంత రౌద్రాన్ని కళ్ళల్లో నేనెప్పుడూ చూడలేదు.

తిట్టిన తిట్లన్నీ తిన్నాను. కొన్ని మింగుడుపడ్డయ్, కొన్ని పడలేదు. దెబ్బతిన్న పుల్లల్లే ఎగిరి గంతేశాను. గాయపడిన పులి మనుషులను తింటుంది. మరినేనో...

ఇది కలికాలం.

నాలుగు పాదాలలో ధర్మదేవత ఒక పాదంతో కుంటుతూ నడుస్తున్నది. ఆ కుంటికాలు కూడా దెబ్బతిన్నది. ఓ పులి నమిలేసింది. తోలు ఊడిపోయి ఎముక వేళ్లాడుతున్నది. నడవడానికి పట్టుచిక్కడం లేదు. ఆ వేళ్ళాడుతున్న కాలిని పట్టుకుని వేళ్లాడుతున్నాడు మయ్యి.

మయ్యిను గురించిన కథ రాయడానికి ప్రయత్నం చేస్తున్నాను. కలం కదలడం లేదు. మాటలు పెకలడంలేదు.

కథ రాద్దామని ఆలోచిస్తుంటే కల వచ్చింది. నేను కథలో పరిచయం చేద్దామనుకున్న మయ్యి కలలో కన్పించాడు. మయ్యితోపాటు మరో పదిమంది అలాంటి వాళ్ళు పళ్ళు పటపట కొరికారు. వాళ్ళ కళ్ళు రక్తపు బింతులవల్లే ఉన్నాయి. కొండలమీద

కత్తులు నూరుతున్నారు. పదునెక్కి తళతళ మెరుస్తున్నాయి... ఒక్కో కత్తి భూమండలాన్నంత ఛేదించినట్టుగా ఉంది.

చీకటి మొలకలెత్తి పెద్ద వృక్షమై, కొమ్మలూ, ఆకులూ ఆకాశాన్నంతా వ్యాపించినై. ఆకాశం బద్దలైంది. పెనుగాలి రాక్షసిలాగా వర్షం విరుచుకుపడ్డది. పగలు రాత్రి తెలియకుండా చీకటి కమ్మేసి వర్షం ఎన్ని రోజులు కురిసిందో చెప్పలేను. అంతా జలమయం. భూమి కన్పించడంలేదు. మయ్యా వాళ్ళు కొండగుహల్లో దాక్కున్నారు. వాళ్ళల్లో కొంతమంది ఆడవాళ్ళు, మొగవాళ్ళు ఉన్నారు. చివరకు మిగిలింది వాళ్లే...

వర్షం కురిసి కురిసి విసుగుపుట్టి అలసిపోలని శ్వాస అందక రొప్పుతూ, రొప్పుతూ ఆయాసంతో ఆగిపోయింది. ఆ కొండగుహలో ఎక్కడో ఓ వెలుతురు కిరణం బాణంలా చొచ్చుకు పోయింది. ఆ ఆడవాళ్ళలో కడుపుతో ఉన్న ఒక ఆమె భళ్ళున తెల్లవారినట్టుగా ప్రసవించింది. పసిపిల్లవాడి ఏడుపు ప్రపంచం అంతా వినిపించింది... కొండల్లో ప్రతిధ్వనించింది. వాళ్ళందరూ కొండల్లో కాపరం పెట్టారు.

ఇంతలో మెత్తని చెయ్యి ఏదో స్పర్శ సుఖం.

'ఎంత ఆదివారం అయితే మాత్రం ఇంత సేపు పడుకుంటారా ఇంక లేద్దురూ ఇడ్లీ చల్లారిపోతున్నది. చక్కటి కాఫీ మీకోసం ఎదురుచూస్తున్నది...' అంటున్నది మా ఆవిడ...

అబ్బ ఉండు అని నా మీదకు లాక్కున్నాను.

'ఏవిటీ మరీ చిన్నపిల్లలైపోతున్నారు. ఎంత కథకులైతే మాత్రం... అంటూ తప్పించుకుని వంట ఇంట్లోకి తరుముతూ పరిగెత్తాను, ఇదీ కథ అంటూ.

కాఫీ సేవిస్తూ కల సంగతి, కథ సంగతి చెప్పాను మా ఆవిడతో...

'అదేం కథ పిచ్చి కథ. ఎందుకొచ్చిన కథలివి. పుణ్యమా, పురుషార్థమా మీ బుర్ర చెడగొట్టుకోవడం తప్ప' విసురుగా అన్నది ఆవిడ.

'నేను కాస్తో కూస్తో పేరున్న కథకుణ్ణి కదా! ఒక్కమాటలో నన్ను తీసేశావే! నా విలువ నీకేం తెలుసు?' అన్నాను గర్వంగా.

'బాగా తెలుసు. ఒక కథరాస్తే ఒక ప్యాకెట్టు సిగరెట్లు కాలుస్తారు. ఆ కథ ఓ పత్రిక్కు పంపించి ఇంకా పడలేదే... ఇంకా పడలేదే... అని కాలుగాలిన పిల్లిలా అటూ

ఇటూ తిరుగుతారు. అవునూ ఓ సంగతి అడుగుతాను ఈ కథలవల్ల ఏమిటి ప్రయోజనం?' అన్నది.

ఇక ఆవిడకు నేనేం సమాధానం చెప్తాను....

కాని దశరథరామయ్యను నేను వదలతల్చుకోలేదు.

పెళ్ళాం అంటే అసహ్యం, ఉద్యోగం అంటే రోత, పిల్లలంటే డోకు, ప్రపంచం అంటే జుగుప్స కలిగిన మయ్యను గురించి కథ ప్రారంభించాను. అతను సన్యాసం పుచ్చుకోవడానికి ప్రయత్నం చేయడం-అడవిలో కాపురం పెట్టాలనుకోడం... ఓ సారి ఆత్మహత్యా ప్రయత్నం చేసి విరమించుకోవడం. ఇలాంటి సంఘటనలు కథలో... గుప్పించాను. మంచి ముగింపు కోసం ముచ్చటపడ్డాను కాని, అది కుదిరి చావలేదు. ఏదో విధంగా ముగించాను. పత్రికకు పంపాలని ఉబలాటం. పంపించే ముందు కొంతమంది రచయిత మిత్రులకు చదివి వినిపించాను.

'ఈ కథలో నీవు చెప్పదలుచుకున్న దేవిటి?' అని ఒకరడిగారు.

'నీ కథలోని పాత్రను ఓ అనార్కిస్టుగా, డిఫీటిస్టుగా చిత్రించావు. అదేం బాగాలేదు...' అని మరొకరన్నారు.

'దీనిలో సిద్ధాంతం ఏమిటి?' అని ఒకరు రాద్ధాంతం చేశారు.

ఈ ప్రశ్నలకు తట్టుకోలేక తెల్లమొగం వేశాను.

వాళ్ళు నన్ను వదల్లేదు.

'సంప్రదాయాన్ని వ్యతిరేకించిన మయ్య చివరకు జీవితంతో రాజీపడ్డాడు గదా! రచయితగా నీవు దాన్ని సమర్థిస్తావా?' అని ఒక క్రిటిక్ నన్ను నిలదీశాడు.

ఆ కథ రాసినప్పుడు ఇన్ని ప్రశ్నలు నన్ను ఎదుర్కొంటాయి అని నేనుకోలేదు. ఓ రకంగా ఆలోచిస్తే నేనోడిపోయానేమో ననిపిస్తుంది.

కథలో సంసారాన్ని వ్యభిచారం అని అన్నాను. ఈ మాటకు నన్ను కాకులు పొడిచినట్లు పొడిచారు.

మా సమావేశం ముగిసింది. నేను కొంత నిరుత్సాహపడ్డ మాట నిజమేగాని ఓ పత్రికకు పంపించి కథని చూస్తే అని అనుకున్నాను.

నిబంధనల ప్రకారం తగినన్ని స్టాంపులు పెట్టి, కవరులోపల నా అడ్రస్‌గల మరో కవరు పెట్టి పంపించాను.

ఓ నెలరోజులు తరువాత తాపీగా కథ తిరిగొచ్చింది. దాంతో మా ఆవిడకు మరీ చులకనైనాను. నా అహం దెబ్బతిన్నది. మయ్యమీద నాకు కోపం వచ్చింది. మయ్యను చిత్రవధ చేయాలనిపించింది. అదెంతసేపు. నాకు ఆయుధం ఉండనే ఉంది కదా అనుకున్నాను.

మయ్యకు పెళ్లానికి మధ్యన ఓ ప్రేయసిని ఇరికించాను. ఆవిడ మరీ సన్నగా ఉండేదేమో ఆ ఊహాసుందరి వయ్యారంగా ఒదిగిపోయింది. వారిద్దరూ కనీసం వారానికి రెండుసార్లన్నా పార్కులో కలుసుకుంటారు... నీవు లేని నా జీవితం వృథా అంటాడు మయ్య. నేనూ అంతేనంటుంది ఆమె. ఇద్దరూ చిలకల పలుకులు పలుకుతారు. ఒకరిమీద ఒకరు ఒరుగుతారు. వాళ్ళిద్దర్నీ మన్మథుడు బాధిస్తాడు. మయ్యకు ఇదివరకే పెళ్ళయిందని ఆ భామకు తెలియదు. బస్సు స్టాప్ దగ్గర అడపా దడపా కలుసుకుంటూ ఉంటారు. వాళ్ళ ప్రేమ పాకంలో పడింది. ఆ చిన్నది ఎక్కడో ఉద్యోగం చేస్తున్నది. మయ్యను గొప్ప మేధావిగా గుర్తించింది. ఓసారి అతని వడిలో తలదాచుకుంటూ మీరు 'జీనియస్' అంటే అదేం ఉత్ప్రేక్ష కాదు అన్నది. జీనియస్సూ మామూలు మనిషీ పెనవేసుకున్నారు. చుట్టూ ఉన్న ప్రపంచాన్ని మరిచారు. ఇలాంటి సంఘటనల వర్ణనలతో చాలా పేజీలు నింపే మయ్య, ప్రేయసిని పరీక్ష చేయడానికి ఓసారి మన పెళ్లిమాటేమిటి? నాకు నావారు లేరు, నీకు నీ వారు లేరు. మనిద్దరం ఒకటే అని చెల్ మోహనరంగ బాణీలో అడిగాడు.

'పెళ్ళెందుకులెద్దురూ... ఇప్పుడు మనం పెళ్ళి చేసుకున్నట్లు గాదా?' అన్నది ఆవిడ. ఆ మాటకు మయ్యకు బ్రహ్మానందం అయింది. పెళ్ళాం అంటే అసహ్యం పుట్టిన మయ్యకు ప్రేయసి దొరికిన తరువాత జీవితంలో లంకెబిందెలు దొరికినంత సంతోషం అయింది. పెళ్ళాంతో ఓరకంగా రాజీ పడ్డాడు. మామూలుగా సంసారం చేస్తున్నాడు. తను చేస్తున్న వ్యభిచారం విషయం మరచిపోయినాడు. చేసుకున్నవారికి చేసుకున్నంత అనుకుని ఉద్యోగంతో కూడా రాజీ పడ్డాడు. ఎక్కువ డబ్బు ఖర్చు లేకుండా ఓ ప్రేయసి దొరికింది అంతేచాలు. పిల్లలమీద ఎక్కడలేని మమకారం ఏర్పడింది, ఇప్పుడు మయ్య చాలా ఉత్సాహంగా ఉంటున్నాడు. అతనిలో సమస్యలేవీ ఉన్నట్లు కన్పించడం లేదు. ఈ కథను ఇలాగే సీరియల్‌గా పొడిగిస్తే బాగుండు ననిపించింది. ఎంత లాగినా సాగుతూనే ఉంటుంది. కథగాకుండా సీరియల్ గాకుండా ఓ పెద్ద కథగా తయారు చేశాను. కథలోని సంఘటనలతో ఈనాటి సమాజాన్ని

చిత్రించాను. మధ్య తరగతి కుటుంబాల ఇక్కట్లు అంతో ఇంతో కన్పడుతూనే ఉన్నాయి. ఇవి పాఠకులకు, మయ్య భార్యమీద బోలెడంత సానుభూతి కలిగేట్లు చేశాను. అందరూ అయ్యో! అమాయకురాలు పాపం... అనుకుండేట్టుగా కలలో కన్పించిన కొండలూ, వరదలూ కథలో తీసేశాను. అదో అర్థం లేని కల గనక. ఆ రోజుల్లో కన్పిస్తున్న ధరల పెరుగుదల, చాలీ చాలని జీతాలు, ఇరుకు ఇళ్ళు. సమాజంలో కొట్టవచ్చినట్లు ముందుకు వస్తున్న అవినీతి, అన్యాయం, అరాజకీయం అక్కడక్కడా చెదురు మదురుగా గుప్పించాను. కథలో పెద్ద కాన్వాస్ తయారయింది. పాత్ర పోషణకేం లోటు లేదు. రచనా విధానం సాఫీగానే పోతున్నది.

ఓ విలన్ లేకపోతే కథకు అందం, నిండుతనం రాదు. ఇలా ఉంటూ ఉండగా మయ్యకు ఓ రోజు ఎక్కడ నుండో ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది...

*మయ్యగారికి! మీరు వట్టి అమాయకులు. మీరు ప్రేయసి అనుకుంటున్న ఆ భామ ప్రేయసి కాదు. మీ పాలిట రాక్షసి. మీరు ఊబిలో పడుతున్నారు. ఇప్పటికి మీరు అయిదో వారు ఆమెకు. ఆమెకు ఉద్యోగం సద్యోగం లేదు. సంవత్సరం క్రితం బెజవాద నుండి వచ్చి మకాం పెట్టింది, మీలాంటి వాళ్ళను బుట్టలో వేసుకునేందుకు. మీరు మోసపోకండి. మీదగ్గర ఇంకా డబ్బు గుంజలేదని భ్రమపడుతున్నారేమో ముందున్నది మొసళ్ళపండగ... మీరేమో సుఖంగా సంసారం చేస్తూ గుట్టుగా రోజులు గడుపుతున్నారు. పాపం అమాయకులు. అడిగినంత డబ్బు ఇవ్వకపోతే మిమ్మల్ని రచ్చకీడుస్తుంది... ఇప్పటికే ఆ ప్రయత్నాలు జరుగుతున్నాయి. పర్యవసానం మీరు ఊహించలేనంత ప్రమాదకరంగా ఉంటుంది. మీ పై అధికారులకు, పోలీసులకు, మీ భార్యకు ఈ విషయం తెలుస్తుంది. మీరు ఆమెపై కన్నువేసినట్టు, ఓసారి బలాత్కరించినట్టు, ఒప్పుకోకపోతే హత్యచేస్తానని బెదరించినట్లు మీ మీద నేరారోపణ జరుగుతుంది. మరో మూడురోజుల్లో నోటీసు రాగలదు. మిమ్మల్ని కాపాడుకోవాలనుకుంటే రేపు సాయంత్రం పార్కుదగ్గర కొంత డబ్బుతో కలుసుకోండి...*

*ఇట్లు*

*మీ శ్రేయోభిలాషి*

*ఆకాశరామన్న*

ఆ ఉత్తరం చూసి పళ్ళు పటపట కొరికాడు మయ్య.

ఆ ఉత్తరం రాసింది ప్రేయసో, విలనో అర్థం కాలేదు.

ఎవరైనా ఈ సమస్యను ఎదుర్కొనే ధైర్యం లేదు. కొంత డబ్బు ముట్టచెప్పి లొంగిపోదామనే అనుకున్నాడు. మయ్య పెళ్ళాం ఆ సమయంలో ఓ దేవతగా కన్పించింది.

ఏదో కష్టం వచ్చిందని చెప్పుకున్నాడు పెళ్లాంతో. డబ్బు అత్యవసరం అన్నాడు. 'మీరలా బెంబేలు పడిపోకండి. కష్టాలు మనుషులకు గాక మానులకు వస్తాయా? ఈ గాజులు తీసుకెళ్ళి, డబ్బు సర్దుబాటు చేసుకోండి...' అని ఓదార్చింది ఆ ఇల్లాలు పతివ్రత గనక. మాంగల్యం కళ్ళకద్దుకుంది...

మార్వాడీ దగ్గర గాజులు తాకట్టుపెట్టి డబ్బు తీసుకుని పార్కుదగ్గర ఆకాశరామన్నను కలుసుకుని గండం గడచి బయటపడ్డాడు. మయ్యకు పెళ్లాం అంటే ప్రేమ. ఉద్యోగం అంటే ఆనందం ఉన్నట్టుండి పుట్టుకొచ్చినయి. బతికుంటే బలుసాకు తినచ్చు అనుకున్నాడు. ఇప్పుడు మయ్యకు పిల్లలంటే ప్రాణం...

ఈ కథ పూర్తిచేసి ఓ పత్రికకు పంపించాను. నా రచన అచ్చయింది. చదివిన మిత్రులు బాగుందన్నారు. ఒకటి రెండు ఉత్తరాలు కూడా అచ్చయినాయి.

'మీ(మా) పత్రిక ఇటీవల అత్యుత్తమంగా వెలువడుతున్నది. ఈ సంచికలో ముఖ్యంగా నన్నాకర్షించినది '..........' ఫలానా కథ. నాకు చాలా నచ్చింది. వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది. మయ్య భార్యను చూస్తే చాలా జాలేసింది. రచయితకు నా అభినందనలు తెలియజేయండి'.

ఈ ఉత్తరం చూసి నేను మురిసిపోయాను.

సంతోషంతో మా ఆవిడకు చూపించాను.

ఆవిడ నవ్విన నవ్వు ఇల్లంతా దద్దరిల్లిపోయింది. నీకేమన్నా పిచ్చా వెర్రా అన్నాను...

'మీరే పిచ్చివాళ్ళు... అమాయకులు.. అల్ప సంతోషులు.. ఆ ఉత్తరం రాసింది ఎవరనుకుంటున్నారు?' అంటూ నన్ను దగ్గరకు తీసుకుంది.

ఎంత మోసం! అనుకున్నాను ఆవిణ్ణి వదలలేదు.

చిత్రించాను. మధ్య తరగతి కుటుంబాల ఇక్కట్లు అంతో ఇంతో కన్పడుతూనే ఉన్నాయి. ఇవి పాఠకులకు, మయ్య భార్యమీద బోలెడంత సానుభూతి కలిగేట్లు చేశాను. అందరూ అయ్యో! అమాయకురాలు పాపం... అనుకుందేట్టుగా కలలో కన్పించిన కొండలూ, వరదలూ కథలో తీసేశాను. అదో అర్థం లేని కల గనక. ఆ రోజుల్లో కన్పిస్తున్న ధరల పెరుగుదల, చాలీ చాలని జీతాలు, ఇరుకు ఇళ్ళు. సమాజంలో కొట్టవచ్చినట్లు ముందుకు వస్తున్న అవినీతి, అన్యాయం, అరాజకీయం అక్కడక్కడా చెదురు మదురుగా గుప్పించాను. కథలో పెద్ద కాన్వాస్ తయారయింది. పాత్ర పోషణకేం లోటు లేదు. రచనా విధానం సాఫీగానే పోతున్నది.

ఓ విలన్ లేకపోతే కథకు అందం, నిండుతనం రాదు. ఇలా ఉంటూ ఉండగా మయ్యకు ఓ రోజు ఎక్కడ నుండో ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది...

*మయ్యగారికి! మీరు వట్టి అమాయకులు. మీరు ప్రేయసి అనుకుంటున్న ఆ భామ ప్రేయసి కాదు. మీ పాలిట రాక్షసి. మీరు ఊబిలో పడుతున్నారు. ఇప్పటికి మీరు అయిదో వారు ఆమెకు. ఆమెకు ఉద్యోగం సద్యోగం లేదు. సంవత్సరం క్రితం బెజవాడ నుండి వచ్చి మకాం పెట్టింది, మీలాంటి వాళ్ళను బుట్టలో వేసుకునేందుకు. మీరు మోసపోకండి. మీదగ్గర ఇంకా డబ్బు గుంజలేదని భ్రమపడుతున్నారేమో ముందున్నది మొసళ్ళపండగ... మీరేమో సుఖంగా సంసారం చేస్తూ గుట్టుగా రోజులు గడుపుతున్నారు. పాపం అమాయకులు. అడిగినంత డబ్బు ఇవ్వకపోతే మిమ్మల్ని రచ్చకీడుస్తుంది... ఇప్పటికే ఆ ప్రయత్నాలు జరుగుతున్నాయి. పర్యవసానం మీరు ఊహించ లేనంత ప్రమాదకరంగాఉంటుంది. మీ పై అధికారులకు, పోలీసులకు, మీ భార్యకు ఈ విషయం తెలుస్తుంది. మీరు ఆమెపై కన్నువేసినట్టు, ఓసారి బలాత్కరించినట్టు, ఒప్పుకోకపోతే హత్యచేస్తానని బెదరించినట్లు మీ మీద నేరారోపణ జరుగుతుంది. మరో మూడురోజుల్లో నోటీసు రాగలదు. మిమ్మల్ని కాపాడుకోవాలనుకుంటే రేపు సాయంత్రం పార్కుదగ్గర కొంత డబ్బుతో కలుసుకోండి...*

*ఇట్లు*

*మీ శ్రేయోభిలాషి*

*ఆకాశరామన్న*

ఆ ఉత్తరం చూసి పళ్ళు పటపట కొరికాడు మయ్య.

ఆ ఉత్తరం రాసింది ప్రేయసో, విలనో అర్థం కాలేదు.

ఎవరైనా ఈ సమస్యను ఎదుర్కొనే ధైర్యం లేదు. కొంత డబ్బు ముట్టచెప్పి లొంగిపోదామనే అనుకున్నాడు. మయ్య పెళ్ళాం ఆ సమయంలో ఓ దేవతగా కన్పించింది.

ఏదో కష్టం వచ్చిందని చెప్పుకున్నాడు పెళ్లాంతో. డబ్బు అత్యవసరం అన్నాడు. 'మీరలా బెంబేలు పడిపోకండి. కష్టాలు మనుషులకు గాక మానులకు వస్తాయా? ఈ గాజులు తీసుకెళ్ళి, డబ్బు సర్దుబాటు చేసుకోండి...' అని ఓదార్చింది ఆ ఇల్లాలు పతివ్రత గనక. మాంగల్యం కళ్ళకద్దుకుంది...

మార్వాడీ దగ్గర గాజులు తాకట్టుపెట్టి డబ్బు తీసుకుని పార్కుదగ్గర ఆకాశరామన్నను కలుసుకుని గండం గడచి బయటపడ్డాడు. మయ్యకు పెళ్లాం అంటే ప్రేమ. ఉద్యోగం అంటే ఆనందం ఉన్నట్టుండి పుట్టుకొచ్చినయి. బతికుంటే బలుసాకు తినచ్చు అనుకున్నాడు. ఇప్పుడు మయ్యకు పిల్లలంటే ప్రాణం...

ఈ కథ పూర్తిచేసి ఓ పత్రికకు పంపించాను. నా రచన అచ్చయింది. చదివిన మిత్రులు బాగుందన్నారు. ఒకటి రెండు ఉత్తరాలు కూడా అచ్చయినాయి.

'మీ(మా) పత్రిక ఇటీవల అత్యుత్తమంగా వెలువడుతున్నది. ఈ సంచికలో ముఖ్యంగా నన్నాకర్షించినది '..........' ఫలానా కథ. నాకు చాలా నచ్చింది. వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది. మయ్య భార్యను చూస్తే చాలా జాలేసింది. రచయితకు నా అభినందనలు తెలియజేయండి'.

ఈ ఉత్తరం చూసి నేను మురిసిపోయాను.

సంతోషంతో మా ఆవిడకు చూపించాను.

ఆవిడ నవ్విన నవ్వు ఇల్లంతా దద్దరిల్లిపోయింది. నీకేమన్నా పిచ్చా వెర్రా అన్నాను...

'మీరే పిచ్చివాళ్ళు... అమాయకులు.. అల్ప సంతోషులు.. ఆ ఉత్తరం రాసింది ఎవరనుకుంటున్నారు?' అంటూ నన్ను దగ్గరకు తీసుకుంది.

ఎంత మోసం! అనుకున్నాను ఆవిడ్ని వదలలేదు.

రమాకాంతం. కాని సూర్యకాంతం అంటే బావుంటుంది. ఆమె కళ్ళల్లో నిప్పు కణికెలు తొణికిసలాడుతూ ఉంటాయి. ఆ నిప్పు రవ్వలెప్పుడూ రామస్వామిమీదే కురుస్తాయి. బయట ఎంత పులైనా, రామస్వామి పెళ్ళాం ముందర పిల్లిలా ఉంటాడు. ఆమె మాటకు ఎదురులేదు. రమాకాంతం పెద్ద జమీందారి కుటుంబంలోంచి వచ్చింది. ఆమె మాటలోనూ, నడకలోనూ ఆ ఠీవి కన్పిస్తుంది. కాపురానికి వచ్చి పదేళ్ళయినా ఆమె కడుపున ఓ కాయన్నా కాయలేదని కోప్పడుతూ ఉంటుంది. ఎవరిమీదనో తెలియదుగాని, ఆ కోపం ఏదో రూపంలో రామస్వామిమీద కన్పిస్తూ ఉంటుంది. నా రాత ఇట్లా రాసింది. నా ముఖానికి ఇంకా పిల్లలు కూడానా అని అనుకుంటూ ఉంటుంది. రామస్వామి కొంచెం పొట్టిగా, కొంచెం లావుగా ఉంటాడు. అలాంటివాళ్ళు ప్రపంచంలో చాలామంది ఉంటారు. కాని సన్నగా పొడుగ్గా ఉన్నవాళ్లను అదోలా చూస్తాడు రామస్వామి. ఆచారి కూడా ఇంచుమించు సన్నగా పొడుగ్గా ఉన్న మనిషే. అయితే ఆచారి మీద రామస్వామికున్న కోపానికి కారణం ఇది మాత్రం కాదు మరేమిటి అని వెదికితే మాత్రం చప్పున దొరకదు. ఇక... రమాకాంతం భర్తని ప్రత్యక్షంగా తిట్టకపోయినా, దుమ్మటిని దులిపేసినట్లు దులిపేస్తూ ఉంటుంది. అప్పుడప్పుడు భార్య మాటలకు పట్టరాని కోపం వస్తుంది రామస్వామికి. భార్యను ఏం చేయలేక ఆచారి మీద ఎగురుతాడు. ఆ తిట్లని సునాయాసంగా మింగి ఊరుకుంటాడు ఆచారి. ఇన్ని తిట్లు తింటూ ఇక్కడే పడి ఉండాల్సిన ఖర్మ ఏం కాలిందీ అని అనుకుంటుంటాడు. కాని తప్పలేదు. రామస్వామి జీతం ఎక్కు విస్తున్నాడు. ఎప్పుడు కావాలంటే అప్పుడు డబ్బు వెదజల్లుతాడు. అత్యవసరం వచ్చి ఓసారి డబ్బు అదనంగా కావాలని అడిగేడు. రెండు వది రూపాయల నోట్లు ఆచారి మొహంమీద విసిరాడు రామస్వామి. అవి కళ్ళకద్దుకుని అవసరం గడుపుకున్నాడు ఆచారి.

ఆచారి తన జీవితంలో ఎంతమందినో చూశాడు. కాని వీళ్ళ దాంపత్యం విచిత్రంగా ఉంది. అది తలచుకుంటూ లోలోపల నవ్వుకుని బయటకు ఎంతో వినయ విధేయతల్తో ఉంటాడు. ఎన్ని తిట్టినా ఆచారి తొణకడు. వాళ్ళ దృష్టిలో ఆచారి ఓ మనిషికింద లెక్కకాదు. ఓ ఇనుప కుర్చీతో సమానం. రమాకాంతం పమిటన్నా సరిగా వేసుకోకుండా ఇంట్లో తిరుగుతూ ఉంటుంది నిర్లక్ష్యంగా. ఆచారే సిగ్గుపడి కళ్ళు మూసుకునేంత పని చేస్తాడు. ఆచారి ఓ రోజు బల్లలు కుర్చీలు

తుడుస్తున్నాడు. అతను చూస్తుండగానే గబగబా చీరె మార్చుకుంది రమాకాంతం. ఈ దృశ్యం భరించలేక ఆచారి కళ్ళుమూసుకుని తలవంచుకుని నెమ్మదిగా పక్క వరండాలోకి వెళ్ళాడు. ఆచారికి తన ఎడల ఆమె చూపుతున్న ఈ నిర్లక్ష్యానికి కొరడాతో కొట్టినట్లయింది. రామస్వామి తిట్టినా, కొట్టినా భరించాడుగాని, ఈ అవమానం భరించలేకపోయాడు.

అన్ని అవమానాలు భరిస్తూ ఆ ఇంటిని వదల్లేకుండా ఉన్నాడంటే ఓ కారణం ఓ అవసరం ఉంది. తను ఎవరికోసమో బతుకుతున్నాడు. దేనికో కంకణం కట్టుకున్నాడు. తననుకున్నది నెరవేరితేగాని మనశ్శాంతి ఉండదు. అప్పటికిగాని అతనికి కసితీరదు.

ఆచారిని పదహారేళ్ళ వయసులో చూడాలి. కొల్లూరులో వేదాధ్యయనం చేస్తున్నప్పటి మాట... వాక్ శుద్ధిగలవాడు. స్నానం చేసి విభూతి పట్టెలు పెట్టి వేదం చదువుతుంటే అతని ముఖం కళకళలాడుతూ, ఆ ముఖవర్చస్సులో శంకరాచార్యుల వారు కన్పించేవారు. తరువాత అతని జీవితం సాఫీగా నడవలేదు. తల్లిదండ్రులు పోయిన తరువాత మరీ అధ్వాన్నం అయింది. మంత్రాలు చెప్పుకుంటూ అక్కడా ఇక్కడా కొన్నాళ్ళు గడిపాడు. కొన్నాళ్ళు నీళ్ళబిందెలు, శవాలూ మోశాడు. పెళ్ళిళ్ళకీ తద్దినాలకీ వంటలు చేశాడు. ఆచారిది నలభీమపాకమని అందరూ మెచ్చుకునేవారు. అందరి శవాలతో పాటు తన భార్య శవాన్ని కూడా భద్రంగా మోసి ఓ దరికి చేర్చాడు. ఆమె ఉన్నప్పుడు వంటలకు వెళ్ళినపుడు సహాయ పడుతూ ఉండేది. ఆచారి మొదట్నించీ తిండి పుష్టిగలవాడు. తద్దినాలకు భోక్తగా వెళ్ళితే ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుని అతనికి వడ్డించేవారు. తాపీగా భోజనం చేసి అందరికి తృప్తి కలిగించేవాడు. చనిపోయిన వాళ్ళ ఆత్మలు ఎంతగానో సంతోషించేవి. ప్రేత శరీరాలు శభాష్... అనేవి.

నాలుగో దశాబ్దం కూడా దాటిపోతున్న ఆచారికి ఈ జీవితం నచ్చలేదు. విసుగు పుట్టింది. కొడుకు మీద ఆశలు పెంచుకున్నాడు. బాగా మార్కులతో ప్యాసయి స్కూలు వదలి కాలేజీలో పడ్డాడు. స్కాలర్‌షిప్ కూడా వచ్చింది. శంకరం ఏనాటికైనా బాగా చదువుకుని పైకి వస్తాడని నమ్మకం, ఆశ. ఆ ఆశవల్ల ఇంకా బతుకుతున్నాడు. భార్యపోయిన తరువాత దరిద్రాన్నే కావలించుకుని రోజులు గడుపుతున్నాడు. తను

సంపాయించిన దాంట్లో నెలనెలా చాలా భాగం శంకరానికి పంపిస్తుంటాడు.

పొట్ట చేతబుచ్చుకుని ఊరూరా తిరుగుతున్న రోజుల్లో రామస్వామి దేవుడిలా కన్పించాడు. అప్పటినుండీ రామస్వామిగారింట్లో వంటచేస్తున్నప్పటికీ మకాం మాత్రం ఊళ్లోనే ఉంచుకున్నాడు. ఒక రేకులషెడ్డులో ఉంటున్నాడు. దానికి అద్దె పదిరూపాయలు. రామస్వామిగారింట్లో ఎంత పొద్దుపోయినా, ఇంటికివెళ్ళి పడుకుంటేగాని అతనికి నిద్రపట్టదు. అక్కడే స్వేచ్ఛగా గాలి పీలుస్తాడు. చాలాసార్లు రామస్వామి ఒత్తిడి చేశాడు తనింట్లోనే పడుకోమని. ఈ విషయంలో మాత్రం ఆచారి వినలేదు. వాళ్లు భోంచేయగా మిగిలిన పదార్థాలతో అన్నం తిన్నాననిపించుకుని ఏదోవేళకు ఇంటికి చేరుకునేవాడు. తోడుగా ఉంటుందని ఓ కుక్కను పెంచుతున్నాడు రేకుల షెడ్‌లో.

ఆచారిది వజ్రశరీరం. ఒకరోజు కూడా జిర్రున చీది ఎరగడు. రామస్వామి గారింట్లో చేరినప్పటినుండీ ఒకరోజు కూడా నాగాలేకుండా పనిచేస్తున్నాడు. యంత్రమన్నా ఎప్పుడన్నా ఆగిపోతుందేమోగాని ఆచారి ఒకరోజు కూడా ఆగలేదు.

  

ఓ రోజు రాత్రి రామస్వామి రమాకాంతం భోజనాల దగ్గర హోరా హోరీగా పోట్లాడుకున్నారు. రమాకాంతం తమ్ముడి పెళ్ళికి పదిహేను రోజుల ముందరగా వెళ్ళాలని అరుస్తున్నది. పొరపాటున, అంతముందుగా ఎందుకలా అన్నాడు రామస్వామి. దాంతో ప్రారంభమైంది. రామస్వామిని తిట్టిపోసింది. రాక్షసిలా నోరుపారేసుకుంది. అమ్మగారివైపూ, అయ్యగారివైపూ భయం భయంగా చూస్తూ వడ్డిస్తున్నాడు ఆచారి. రామస్వామి భోజనం చేస్తూ చేతులు అటూ ఇటూ త్రిప్పుతున్నాడు. వడ్డించడంలో వేడి నెయ్యి రామస్వామి చేతిమీద పడి చురుక్‌మన్నది. దానికి ఆచారి ఎంతగానో బాధపడ్డాడు. ఆచారి చెంప చెళ్‌మన్నది. రామస్వామి అమాంతం లేచాడు. వెధవ జాతి, ఆ బుద్ధులెక్కడికి పోతాయి. ఈ కొంపలోపడి మేస్తుంటే కళ్ళు నెత్తిమీదికి వచ్చినయి. అని మరోటి అంటించాడు. ఆచారికి దుఃఖం వచ్చింది గాని తమాయించుకున్నాడు. దెబ్బలను కూడా మింగేశాడు. వాళ్ళిద్దరి భోజనాలు అయిన తరువాత తనూ రెండు మెతుకులు గతికి ఇంటికి చేరుకున్నాడు.

మర్నాడు ఆచారి రాలేదు. రామస్వామికి తిక్కరేగిపోయింది. ఆచారిని పట్టుకు రమ్మని నౌకర్ని పంపించాడు. ఆచారికి జ్వరం వస్తున్నదని రెండురోజుల తరువాత వస్తానని అన్నాడని నౌకరు చెప్పాడు. ఒక్కరోజు ఆచారి లేకపోయేటప్పటికి రామస్వామికి పిచ్చెక్కినట్లయిపోయింది. ఆ ఇల్లంతా బోసిపోయింది.

"ఈ ఆచారిగాడు వస్తాడా! అసలు" అనే అనుమానం వచ్చింది రామస్వామికి.

మర్నాడు కోపంగా ఆచారి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు రామస్వామి. రేకులషెడ్ సమీపించేసరికి పెద్దగా అరుపు వినపడుతున్నది. అవి ఆచారి కేకలు. కుక్క విపరీతంగా అరుస్తూ ఏడుస్తున్నట్టుగా ఉంది. సమీపంలో నిల్చుని వింటున్నాడు. ఆచారి రామస్వామి రాకను గమనించలేదు, అతను రేకులషెడ్ బయట నిల్చుని ఉండడం చేత.

"ఒరే రామస్వామీ నీకు మూడిందిరా ఇవ్వాళ నీ నెత్తురు కళ్ళచూస్తాను. సిగ్గులేని వెధవా. నీకా నాకా పొగరెక్కింది. అంటూ దెబ్బమీద దెబ్బ కొడుతున్నాడు కుక్కను. కుయ్యో మొర్రో అంటున్నది కుక్క ఇష్టం వచ్చినట్టు తిడుతున్నాడు కుక్కను. ఆ తిట్లకు ఆ దెబ్బలకు అంతు లేదు. నోరులేని కుక్క కట్టేసి ఉన్న గొలుసులోంచి తప్పించుకోలేక దెబ్బల కోర్చుకోలేక అరుస్తూ ఏడుస్తున్నది.

రామస్వామి గుమ్మంలో నిల్చుని "ఆచారీ" అని పెద్దగా కేకేశాడు. "అయ్యో! అయ్యో! తమరు వచ్చారా! కొంచెం నింపాదిగానే ఉంది. రేపు వస్తాను" అంటూ దణ్ణం పెట్టాడు ఆచారి. "పక్కింటివాళ్ళబ్బాయిని కరవబోయింది ఈ కుక్క అందుకని దానికి బుద్ధి చెప్తున్నాను" అన్నాడు.

"రాముా" అని పిల్చాడు ఆచారి గొలుసు వదుల్తూ, ఆ కుక్కవచ్చి రామస్వామిని గోముగా నాలికతో తడిమింది. ఎన్ని దెబ్బలు కొట్టాను నిన్ను అని. రామూని బుజ్జగించాడు ఆచారి. అయ్యగారిని అంతవరకూ సాగనంపి రేకులషెడ్‌కు చేరుకున్నాడు కసితీరని ఆచారి, రామును ఎప్పుడూ తిడుతూ, రాముతో మాట్లాడుతూ కసురుతూ కాలక్షేపం చేసే ఆచారి ఆ రోజు ఎందుకు కొట్టానా అని బాధపడ్డాడు.

# 18

# త్రివేణి

శ్రీపతి బస్సు దిగి రోడ్డుమీద ప్రవహిస్తున్న రిక్షాలనూ, సైకిళ్ళనూ, స్కూటర్లనూ, బస్సులనూ, కార్లనూ, జన సమూహాన్నీ చూసుకుంటూ నడుస్తున్నాడు. ఆఫీసు వదలిన వేళ. చల్లటి సాయంత్రం నగరం వరదలొచ్చినట్టుగా ఊగుతోంది. వేగంగా పరుగెడుతున్న ప్రవాహాన్ని చూస్తూ నెమ్మదిగా నడుస్తున్నాడు.

అతనికి కావల్సిన మజిలీ వచ్చింది. చేతిలోని పుస్తకాన్ని ఓసారి చూసుకుని మజిలీలో అడుగు పెట్టాడు. ఆ మజిలీ పుస్తకాల గుడి. పూజారి ఎదురుగా కూచున్నాడు. జీవితంతో యుద్ధం చేసి ఓడిపోయి గాయపడి లోతుకు పోయిన కళ్ళను పెకిలించుకుని మరీ చూస్తున్నాడా పూజారి, కాదు పుస్తకాల మనిషి. మాసిన గడ్డం, అస్థిపంజరానికి గుడ్డలువేసి కూచోపెట్టినట్లుగా ఉంది. లోపలి ఎముకలు కన్పిస్తున్న పల్చటి లాల్చీ శరీరం సగంపైగా కప్పేసింది. గీరల పైజామా మెరుస్తున్నది. అతని ముఖమూ జుట్టూ తాగిన మైకంలో రోడ్డు మీద విసిరేస్తే పగిలిన విస్కీ సీసా ముక్కల్లా ఉంది. చేతిలో చిన్న పెన్సిల్ ముక్క దాంతో మెడ దగ్గర గోక్కుంటున్నాడు.

శ్రీపతి పుస్తకం ఇవ్వగానే ఏవో కాగితాల్లో లెక్క చూసుకుని ఆరు రోజులు. అరవైపైసలు అన్నాడు. శ్రీపతి అరవై పైసలు చెల్లించి అతనివైపు బాధగా చూశాడు. మరేమైనా తీసుకోండి అంటున్నాడతను. అది చిన్న గేటు. బాగా రద్దీగా ఉంది. వచ్చేవాళ్ళూ పోయేవాళ్ళూ, పుస్తకాలు తీసికెళ్ళేవాళ్ళూ ఇచ్చేవాళ్ళూ, బయట కొన్ని పత్రికలు వేళ్ళాడుతున్నాయి.

శ్రీపతి తీసికెళ్ళిన పుస్తకం అంత పెద్దదేమీ కాదు. ఒక రోజులో చదివెయ్యచ్చు. "మొరేవియా" కథలు ఇద్దకించి ఆరు రోజులుంచుకున్నాడు. ఆ కొట్లో ఒకవైపు

ఇంగ్లీషు పుస్తకాలు, మరోవైపు తెలుగు పుస్తకాలు, పాత ఇంగ్లీషు పత్రికలు, తెలుగు పత్రికలు. చిన్న పిల్లల ఫ్యాంటమ్ సాహిత్యం ఇంకా ఎన్నో ఉన్నాయి.

పెరీమేసన్, లారెన్స్, హేడ్ హాస్, హెరాల్డ్ రాబిన్స్... ఇంకా ఇలాంటి పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. పుస్తకాల అట్టలమీద ఆకర్షణీయమైన బొమ్మలున్నా – పుస్తకాలన్నీ నలిగిపోయి కళాకాంతులూ లేకుండా ఉన్నయి. అర్ధనగ్నంగా, ముప్పావు నగ్నంగా ఉండే బొమ్మలు. ఎంత మంది చేతుల్లోనో పడి నలిగిపోయినై. కొన్ని బొమ్మలకు ముక్కు ముఖము కన్పించడం లేదు. తెలుగు పుస్తకాలలో ఎక్కువ శవసాహిత్యం. చౌకబారు ప్రేమ కథలూ, అక్కడక్కడ మంచి నవలలూ ఉన్నయి. ఒక పక్కన ఇంగ్లీషు పత్రికలు ... లైఫ్ టైమ్... సాటర్ డే ఈవినెంగ్ పోస్ట్, సైన్స్ పత్రికలూ, 'ట్రూ డిటెక్టివ్' ఫోటోగ్రఫీ పత్రికలూ, జియాగ్రాఫికల్ మేగజైన్. పినప్ గరల్స్ మాడల్స్. ఇంకా ఎన్నో ఉన్నయి. తెలుగులో కామసూత్రాలు, కామతృష్ణ, లైంగిక విజ్ఞానం, పడకటింటి రహస్యాలూ, భార్యను వశపర్చుకునేదెలా? మొదలైనవి. కొన్ని పుస్తకాలకు, పత్రికలకు క్లిప్స్ ఉన్నాయి.

శ్రీపతికి ఫోటోగ్రఫీ పత్రికమీద కన్ను పడింది. దానిమీద Study of fifty ruder అని ఉన్నది. శ్రీపతి ఆ పత్రికను తీసుకున్నాడు.

అలాంటివి ఇంటికి తీసుకుపోగూడదు. ఇక్కడే చూడాలి. పది నిమిషాలు, పది పైసలు 'అన్నాడు పూజారి'. పదిపైసలిచ్చి కొట్లో ఒక మూలగా వెళ్ళి తననెవరైనా చూస్తున్నారేమో అని అటూ ఇటూ చూస్తూ పేజీలు తిరగేస్తున్నాడు. అయిదు నిమిషాల్లో అయిపోయింది. మళ్ళీ మొదటి పేజీనుండి చూస్తున్నాడు. దాని కోసం మరో వ్యక్తి పక్కన నిల్చున్నాడు. క్యూలో కొంతమంది పుస్తకాలు సెలెక్టు చేసుకుంటున్నారు. ఎవరో ఆడపిల్లలు, బహుశా కాలేజీ పిల్లలల్లే ఉన్నారు, చలం పుస్తకాలు తీసుకుంటున్నారు.

పుస్తకాలు కొని చదువుకోలేని వాళ్ళకు ఈ కొట్టు ఓ గుడి. పుస్తకం ఖరీదు డిపాజిట్టుగా ఉంచుకుని పుస్తకం ఇస్తాడు పూజారి. అద్దె రోజుకు పది పైసలు. చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకునేవాళ్ళకు, కాలేజీ విద్యార్థులకు, వంట ఇంట్లో ఎప్పుడూ సతమతమవుతున్న అమ్మలక్కలకు ఈ కొట్టు ఓ నిధి. ఇంట్లో కాలక్షేపం కోసం పత్రికలు తీసికెళ్ళి చదివి మళ్ళీ తెస్తుంటారు. పది పైసలతో మంచి మంచి పత్రికలన్నీ

చదివెయ్యచ్చు. ఎక్కువగా సీరియల్స్ ఉన్న పత్రికలకు డిమాండు. అందరికీ అన్ని పత్రికలూ చదవాల్సనే ఉంటుంది. కొని చదవలేరు.

నగ్న చిత్రాలున్న పత్రికలైతే మధ్య వయస్కులు, వృద్ధాప్యం వచ్చీ రాని వాళ్ళూ, పుస్తకాలు ఇంటికి తీసుకుపోడానికి భయపడేవాళ్ళూ, వాళ్ళని ఎక్కువ ఆకర్షిస్తాయి. వాటికి రష్ చాలా ఎక్కువ. పూజారి అందరికీ ప్రసాదాలిస్తూ బిజీగా ఉంటాడు.

శ్రీపతి 'లారెన్స్' పుస్తకం తీసుకుని బయటకు వస్తూ, వెధవ బతుకు పుస్తకాలు గూడా అద్దెకు తీసుకోవాల్సి వచ్చిన ఖర్మ అనుకున్నాడు.

శ్రీపతి వంటరివాడు. చాలీ చాలనిజీతం... ఎదుగూ బొదుగూ లేని జీవితం. పెళ్ళిచేసుకోవడానికి భయం. సంసారం భరించడం కష్టం. ఈ నగరంలో ఇల్లు దొరకడమే పెద్ద సమస్య. జీతంలో కనీసం నాలుగోవంతు అద్దెకు పోతుంది. పెళ్ళిచేసుకుని పిల్లల్ని కంటే పాల డబ్బాలకూ, చీరెలకూ, సినిమాలకూ బోలెడు ఖర్చు. ఈ ఖర్చును ఊహించుకుంటే పై ప్రాణం పైన పోతుంది. తనను చూసి, తన జీతాన్ని చూసి పిల్ల నెవరిస్తారు పైగా ఎవరో దౌర్భాగ్యులు తప్ప అందమైన అమ్మాయి దొరికితే చేసుకుందామనే ఉంది శ్రీపతికి.

చూస్తూ చూస్తూ తనకెలా దొరుకుతుంది? పోనీ పెళ్ళి లేకపోతే పోయే... కనీసం ఎవరైనా గరల్ ఫ్రెండ్ అన్నా ఉంటే బావుండు అనుకుంటాడు. ఒకవేళ ఎవరైనా తటస్థపడినా బోలెడు ఖర్చుపెట్టాలి. సినిమాలకు, హోటళ్ళకు తిప్పాలి. ఏమైన ప్రజంట్సు ఇవ్వాలి. ఇవన్నీ తడిసి మోపెడవుతుంది. అది ఖరీదైన స్నేహం. పోనీ దానికైనా సిద్ధపడదామంటే సంఘం ఒకటి. బోలెడు కట్టుబాట్లు. బాహాటంగా ఇలాంటి పనులు ఈ దేశంలో పనికిరావు. శ్రీపతికి ఒక్కసారి ఏ జపాన్లోనో, జర్మనీలోనో స్వీడన్‌లోనో ఉంటే బావుండుననిపించింది. అవన్నీ గొంతెమ్మ కోరికలు. రోడ్డుమీద పోతున్న ఏ అందమైన అమ్మాయిని చూసినా కోరికలు పెంచుకుంటాడు. కోరికలు కోరికలుగానే ఉండిపోతాయి. ఒక్కొక్కప్పుడు కలలో కోరిక ఫలిస్తుంది. తన అసమర్థతకు అర్థం చెప్పుకుంటాడు... తను దురదృష్టవంతుణ్ణనీ, పిరికి వాణ్ణనీ. ఏదో కాంప్లెక్సుతో బాధపడుతున్నాననీ.

తన పెళ్ళిని గురించి ఎవరూ పట్టించుకోరు. తనంతట తాను పోయి నాకు పెళ్ళి కావాలని ఎవ్వరినీ అడిగే ధైర్యం లేదు. ఇది జిడ్డు సమస్య అయిపోయింది.

జాతకాలు కావాలంటారు. గోత్రాలు సరిపోవాలి. అతనున్న పరిస్థితులలో తండ్రిని గురించి చెప్పుకోవడం ఇష్టంలేదు. తల్లితండ్రులిద్దరు విడిపోయి ఎన్నాళ్ళో అయింది. తండ్రి కులం కాని ఆమెని ఎవర్నో ఉంచుకున్నాడని, ఆ పల్లెటూర్లో తన స్వంత ఊర్లో ఆయన్ను వెలివేశారు. తండ్రిని గురించిన వివరాలెవరైనా అడిగితే చెప్పటానికి సిగ్గుగా ఉంటుంది. తనకు పెళ్ళి అయ్యే యోగ్యత లేదని అనుకుంటూ ఉంటాడు. పుస్తకాల చుట్టూ తిరుగుతున్నాడు.

ఆ రోజు రాత్రి చాలా సేపటివరకు లారెన్స్ పుస్తకం నెమరువేశాడు. బ్రహ్మాండంగా ఉందనుకున్నాడు. ప్రతి రచయితా తనను ఓదారుస్తున్నట్టే ఉంటుంది. పుస్తకం పూర్తిచేసి ఒక్క పదిపైసలలో ఎంత ఆనందం అనుకున్నాడు. పుస్తకం ఆఫీసుకు తీసుకువెళ్ళాడు. సాయంత్రం తిరిగి వచ్చేటప్పుడు దాన్ని రిటర్న్ చేయవచ్చునని. బస్సులో ప్రయాణం చేస్తుంటే పక్కన ఎవరో పదేళ్ళ పసివాడు కూర్చుని కిటికిలోంచి రోడ్డువైపు చూస్తున్నాడు. శ్రీపతి ఆ పిల్లవాణ్ణి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. పిల్లవాడికి ఆలోచనకు సంబంధం లేదు. ఆలోచనలు లారెన్స్ కథమీద. రాత్రి చదివింది నెమరు వేసుకుంటున్నాడు. మనసు ఒకటి ఆలోచిస్తుంటే కళ్ళు మరోవైపు చూస్తుంటాయి. అతడి కళ్ళు పసివాణ్ణి చూస్తున్నాయి. బస్సులో శరీరం కదులుతున్నది. బస్సు వేగంగా పోతున్నది. చూపు శరీరానికి సంబంధించినది. ఆలోచన మనసుకు సంబంధించినది. కళ్ళున్నాయి. గనుక దేనినో ఒకదాన్ని చూడాలి. కనీసం వెలుతురునైనా, పగటిపూట కళ్ళు మూసుకుని ఎవరూ ఆలోచించరు. అందుకని శ్రీపతి కళ్ళు తెరిచే ఉన్నాడు.

బస్సు దిగి 'మజిలీ' కోసం వెళ్తున్నాడు చేతులు ఊపుకుంటూ. ఊగుతున్న కుడి చేతివైపు చూసుకుంటే పుస్తకం లేదు. గుండె ఆగిపోయినంత అయింది. చిన్న షాక్. పుస్తకం బస్సులో మరచిపోయినాడు. తన డిపాజిట్ అయిదు రూపాయలు నష్టం. అయిదు రూపాయలంటే కాస్తా కూస్తా కాదు.

వ్యాపారం చేసేవాడు లక్షలు నష్టం వచ్చినప్పుడు బాధపడ్డట్టుగా ఉంది శ్రీపతికి. బిక్కమొహం వేశాడు. తన మామూలు మజిలీకి వెళ్ళడమూ, మానడమా అనుకుంటున్నాడు. పూజారికి సంజాయిషీ చెప్పుకుని ఏదైనా బొమ్మల పుస్తకం పదిపైసలిచ్చి అక్కడే చూడవచ్చుననుకున్నాడు.

పూజారిని చూస్తూనే శ్రీపతి 'సారీ' అంటూ కథనం మొదలెట్టాడు.

“ఏం ఫర్వాలేదు. మీరు బాధ పడకండి. ఎవరికైనా దొరికితే ఇక్కడికే తీసికొచ్చి ఇస్తారు. దాంట్లో మనకొట్టు ముద్ర ఉందిగా' అన్నాడు.

శ్రీపతికి ధైర్యం వచ్చింది. ఆ సంతోషంలో పదిపైసలిచ్చి బొమ్మల పుస్తకం మీద కల్లెబడ్డాడు. ఆ రోజు కొట్లో శ్రీపతి చాలాసేపు ఉన్నాడు. ఒక్కొక్కరే వచ్చి వెళుతున్నారు. అంత రద్దీగా లేదు. శ్రీపతికి పూజారితో మాట్లాడుదామనిపించింది.

'మనకు పరిచయం ఉన్నా మనం ఎప్పుడూ తీరుబాటుగా మాట్లాడుకోలేదు. మీ పేరేవిటండీ'అన్నాడు శ్రీపతి.

'నన్ను శివయ్య అంటారు' అన్నాడు ముక్తసరిగా. శ్రీపతి ఎదురుగా ఉన్న చిన్న హోటల్లో ఇద్దరికీ కాఫీ తెప్పించాడు. సిగరెట్లతో ఇద్దరూ కొంచెం దగ్గరగా వచ్చారు.

'నా కంతగా అలవాటు లేదండీ' అంటూ శివయ్య సిగరెట్టు ముట్టించాడు'

పొగ పుస్తకాలమీద వదుల్తూ...

'లారెన్స్ కథను ఆలోచిస్తూ లారెన్స్‌ను బస్సులో వదిలేశారు' అన్నాడు శివయ్య.

శివయ్యలోకూడా హ్యూమర్ వుందే... అనుకున్నాడు శ్రీపతి.

'మీ పనే బావుంది. హాయిగా పుస్తకాలు ప్రసాదం అందరికీ పంచిపెడుతూ, కాలుమీద కాలువేసుకుని కూర్చుంటారు' అన్నాడు శ్రీపతి కొంచెం హ్యూమరస్‌గా మాట్లాడుదామని.

'మిమ్మల్ని చూస్తుంటే మీకింకా పెళ్ళి కాలేదనిపిస్తోంది అవునా?' అన్నాడు శివయ్య.

శివయ్య కేవలం పుస్తకాల మనిషే కాదు మామూలు మనిషి కూడా అనుకున్నాడు శ్రీపతి.

శ్రీపతికీ శివయ్యకూ సంభాషణ చాలా విషయాలమీదకు వెళ్ళింది. సంభాషణలో శివయ్య ఒకటి రెండుసార్లు పెద్దగా నవ్వాడు.

'అమ్మ బాబోయ్ శివయ్యకూడా నవ్వగలడు' అనుకున్నాడు శ్రీపతి.

శ్రీపతికి శివయ్యకూ స్నేహం చిగురించింది. రెండు రోజులకొకసారన్నా కలుసుకుంటుండేవాళ్ళు.

చిగురించిన తరువాత రెండోసారి కలుసుకున్నప్పుడే శ్రీపతికి బోలెడంత సంతోషం దొరికింది. త బస్సులో పారేసుకున్న పుస్తకం మళ్ళీ గుడికి చేరింది.

'ఎవరో పిల్లవాడు తెచ్చి ఇచ్చాడు ' అన్నాడు శివయ్య.

'ఆ పిల్లవాణ్ణి చూడాలి '.

'మీకు నిజంగా చూడాలనివుంటే చూపిస్తాను కొట్టుకట్టేసిన తరువాత నాతో రండి.'

పోయిన పుస్తకం దొరకడం, శివయ్య స్నేహం లభించడం, శివయ్య తనమీద జాలిపడడం ఇవన్నీ చూసి శ్రీపతికి ఏనుగును ఎక్కినంత పనయింది.
ఎవరో ఆప్తులు కన్పడ్డట్టే అయింది.

శివయ్య వాళ్ళింటికి తీసుకువెళ్తాడేమో ఆ పిల్లవాడు శివయ్య కొడుకేమో అని అనుకుంటున్నాడు శ్రీపతి.

శ్రీపతి, శివయ్య మాట్లాడుకుంటూ నడుస్తున్నారు.

ఎక్కువగా శ్రీపతే మాట్లాడుతున్నాడు.

శివయ్య వింటున్నాడు.

'మీరు పెళ్ళిచేసుకోరాదూ. కుర్రాళ్ళే గదా బావుంటుంది ' అన్నాడు శివయ్య.

'అవును పెళ్ళి కుదిర్తేగాని పిచ్చి కుదరదు. పెళ్ళి కుదరద్దూ'.

'మీ కెలాంటి పిల్ల కావాలి?'

'ఎవరైనా సరే... మూగ, చెవుడూ, గుడ్డీ కాకుండా ంటే ఫరవాలేదు'.

"నాకు మాట ఇస్తారా?'

' ఓ అంత అందంకూడా అక్కర్లేదు ఆరోగ్యంగా ఉంటే చాలు'

శివయ్య నవ్వుకున్నాడు.

శివయ్యకు కూతురుందేమో. నాకిచ్చి అంటకడతా ననడు కదా. చేసుకోక చేసుకోక పుస్తకాల మనిషి కూతురునా అనుకున్నాడు శ్రీపతి. తొందరపడి మాటకూడా

ఇచ్చాడు. మాట తీసుకోడం బావుండదు. ఎంత చిన్న ఉద్యోగం చేస్తున్నా ఇంతవరకూ నిజాయితీగానే బతుకుతున్నాడు. ఒక్కసారి శ్రీపతికెందుకో భయం వేసింది.

శ్రీపతి శివయ్య నడుస్తున్నారు. చాలా దూరం నడిచారు. కొన్ని రోడ్లు మారేరు. అక్కడక్కడ కొంత ఖాళీస్థలం. దూరం దూరంగా మేడలు. మేడల నీడల్లో ఎదురు బదురుగా గుడిసెలు. గుడిసెల్లో చిన్న చిన్న బుడ్డి దీపాలు గాలికి రెపరెపలాడుతూ చీకటితో పెనుగులాడుతున్నాయి. ఒక గుడిసె దగ్గిరగా వెళ్ళేరు. గుడిసెలో ఓ పిల్లవాడు కనపడీ కనపడని వెలుతురులో ఏదో చదువుకుంటున్నాడు. ఎవరో ఆడమనిషి పక్కనే పడుకుని ఉంది.

శివయ్య నివాసం గుడిసెలోకాదు కదా! అనుకున్నాడు శ్రీపతి.

'అదుగో ఆ చదువుకుంటున్న పిల్లవాడే మీ పుస్తకం తీసుకుని ఇచ్చినవాడు. పక్కన పడుకున్న ఆమె తల్లి.'

వాళ్ళు మీ కేమవుతారు అని అడగడానికి సందేహిస్తున్నాడు. శివయ్య గతాన్ని అడగద్దని ఇదివరకే ఒకసారి హెచ్చరించాడు. ఇది వర్తమానమేమో! శ్రీపతికి అనుమానంగానూ ఆశ్చర్యంగానూ ఉంది.

ఇక వెడదామా అన్నాడు శివయ్య.

అడుగు వెనక్కు వేయడానికి సందేహిస్తూ శ్రీపతి ఆ పిల్లవాడు... ఆ పిల్లవాడు... అని గొణుక్కుంటున్నాడు.

'ఆ పిల్లవాడు ఆమె నాకేమీ కారు. బడికి జీతం కట్టడానికి డబ్బు లేదని నా కొట్టుకు ఓసారి వస్తే జాలేసి ఓ రూపాయి ఇచ్చాను. అప్పటి నుండీ స్నేహం అయింది. వాడితో అక్కడ అక్కడ కొట్లల్లో అడుక్కుని డబ్బులు పోగుచేసి చదువుకుండే వాడు. ఇప్పుడు నేనే చదివిస్తున్నాను. వాళ్ళమ్మ నాలుగు మేడల్లో పనిపాటా చేసుకుని అంట్లు తోముతూ సంపాయిస్తుంది. ఆ పిల్లవాడికి తండ్రి లేడు. అతడు పుట్టగానే పోయినాడు. నా భార్యకూడా బతికి ఉంటే ఆ పిల్లవాని తల్లి వయసే ఉండేది.

మేడల్లో వెలుగుతున్న బల్బుల కాంతికన్నా గుడిసెలో మిణుకు మిణుకు మంటున్న దీపమే ఎక్కువ కాంతిగా కన్పిస్తున్నది. చీకటిని బాణంతో ఛేదించినట్టుగా.

ఇద్దరూ తిరుగు ముఖం అయినారు.

శివయ్య ఏదో చెప్పాలనుకుంటున్నాడు.

శ్రీపతి ఏదో అడగాలనుకుంటున్నాడు.

'కొంత స్వార్థం కూడా ఉంది లెండి' అంటున్నాడు శివయ్య.

ఇది శరీరం కదు...

శ్రీపతీ శివయ్య చాలా దూరం నడచి కొట్టు దాకా వచ్చారు.

'నా నివాసం ఇక్కడ నుండి మరో మైలు పోవాలి...' అన్నాడు శివయ్య.

'హోటల్లో కొంచెం టీ తాగుదాం రండి' అన్నాడు శ్రీపతి.

టీ తాగుతూ శివయ్య అసలు సంగతికొచ్చి "ఆ అమ్మాయి తండ్రికి సహాయం చేస్తానని మాట ఇచ్చాను. ఎవరయినా బుద్ధిమంతుడు కన్పిస్తాడేమోనని వెతుకుతుంటే మీరు కన్పించారు" అన్నాడు శివయ్య.

'నేను మీకు కన్పించడం కాదు. మీరే నాకు కన్పించారు' అన్నాడు శ్రీపతి.

"వాళ్ళదీ ఒకప్పుడు మంచి కుటుంబమే ఓడలు బళ్ళయినై... బతుకును ఈడ్చుకు వస్తున్నాడు అతను" శివయ్య.

అయిపోయిన సిగరెట్టును యాష్ట్రేలో పడేసి మరోటి ముట్టించి ఒకటి శివయ్యకిచ్చాడు శ్రీపతి.

'ఇంకా వినండి. ఆ అమ్మాయికి పోలియో వచ్చి చిన్నప్పుడు రెండు కాళ్ళూ దెబ్బతిన్నై. కొంచెం కుంటుతూ నడుస్తుంది. మూగ, గుడ్డి, చెవుడు కాకుండా వుంటే ఫరవాలేదన్నారుగా. మీరు 'ఊ' అంటే ఆ అమ్మాయి తండ్రి మీకు ఋణపడి ఉంటాడు. నా మాట నిలబెట్టుకున్న వాణ్ణవుతాను. నాకూ తృప్తి' అన్నాడు శివయ్య శ్రీపతి భుజం మీద చెయివేస్తూ.

శ్రీపతి సిగరెట్టు పొగ వదుల్తూ. నేనూనూ... నేనూనూ... నాకూనూ... నాకూనూ... మాటలు తడబడుతున్నాయి. తృప్తే అన్నాడు. ఏదో మాట్లాడాలనుకున్నాడు. మాటలు రాలేదు శివయ్య బుజంమీద చేయివేశాడు!!

# 19

# మనిషి నీడ

గుర్రం రెండడుగులు ముందుకువేసి ఒక అడుగు పక్కకు వేసింది. ఏనుగు బరువైన తన శరీరాన్ని ఊపుకుంటూ నేరుగా వెళ్తున్నది. మంత్రి ఎటువైపు పడితే అటువైపు ఉరకడానికి సిద్ధంగా ఉన్నాడు. శత్రుసైన్యం అప్పటికే చాలా భాగం చెల్లాచెదరైంది.

సీతాపతి సిగరెట్టుమీద సిగరెట్టు ఊదేస్తున్నాడు. తన రాజును రక్షించుకోడానికి ప్రయత్నం చేస్తున్నాడు. యుద్ధరంగం బీభత్సంగా ఉంది.

గాజుల గల...

ఆ శబ్దం ప్రతిరోజూ వింటున్నదే; అయినా భయంకరంగా ఉంది. రాజు ఒక్కడుగు ముందుకు వేయలేకుండా ఉన్నాడు.

గాజుల గలగలలో మంత్రిని ఒక్క గడి ముందుకు జరిపి... 'ఇప్పుడు తప్పించుకోండి చూద్దాం... మరి దారిలేదు...' అన్నది లలిత సీతాపతి వైపు అదోలా చూస్తూ.

లలిత చెస్ బోర్డుమీదికి వంగి కళ్లన్నీ పెద్దవి చేసుకుని ముందుకు వెళ్తున్నది.

సీతాపతికి ఎటువైపు పోవడానికీ దారిలేదు; ముందుకుపోతే గొయ్యి వెనక్కువెళ్తే నుయ్యి...

జరిగిన పరాభవాన్ని మనసులో అణుచుకుంటూ 'నీవే గెల్చావు లలితా... కంగ్రాట్యులేషన్!...' అన్నాడు నీరసంగా సీతాపతి.

సీతాపతి ఓడిపోవడం ఇది మొదటి సారి కాదు.

లలిత కిలకిలానవ్వుతుంది– గెలిచినపుడల్లా. సీతాపతి కుంచించుకుపోతాడు.

కాలక్షేపానికి క్యారంబోర్డు ఆడినప్పుడూ లలితే గెలుస్తుంది.

ఓటమిని నిజంగా ఓటమిగా తీసుకుని బాధపడ్డాడు సీతాపతి. ఓడిపోయిన రోజు... లలిత అనాకారిగానూ, చేసిన వంట పదార్థాలు చేదుగానూ కన్పిస్తయి సీతాపతికి... ఆ రోజు నిద్రపట్టదు; లలితకు తాత్కాలికంగా దూరం అవుతాడు.

'మీరు మరీ అంత సెన్సిటివ్‌గా ఉంటే ఎలా?' అన్నది లలిత ఓ రోజు.

సీతాపతికి మింగుదామన్న కోపం వచ్చింది.

'అబ్బే... అదేంలేదు. నీవు గెలిస్తే నాకు సంతోషమే... నాకు గర్వం కాదూ మరి... నిన్ను చూస్తూ... నీ చేతిలో ఓడిపోవడమే సరదా...' అన్నాడు సీతాపతి.

  

'టివోలీలో మంచి పిక్చరుందివాళ. పెందరాడే రండి వెళ్దాం'– అంటూ ఆఫీసుకు సాగనంపింది లలిత.

సీతాపతి ఆలోచిస్తూ ఆఫీసుకు వెళ్ళాడు.

సీతాపతిని బాగా ఎరుగున్న వాళ్లు, స్నేహితులు, ఆఫీసులోవాళ్ళు – జీనియస్ అని అంటారు. సీతాపతికి ప్రపంచంలో చాలా విషయాలు తెలుసు. అవసరం వస్తే అనర్గళంగా మాట్లాడగలడు. నలుగురిలో సెభాష్ అనిపించుకుంటాడు. మంచి ఆలోచనాశక్తి ఉంది. ఎదుటివాళ్ళను ఆకట్టుకోగలడు. ఇతరులు తనను మెచ్చుకున్నా తనను తాను పొగుడుకోలేదు. ఎప్పుడూ మూడీగా ఉంటాడు. చెప్పుకోదగ్గ పర్సనాలిటీ లేకపోయినా అతని మెదడు రేజరు బ్లేడులాంటి పదును. ఆ బ్లేడు తనను తాను కోస్తూ ఉంటుంది అప్పుడప్పుడు.

సీతాపతికి చాలామంది స్నేహితులున్నా వాళ్ళను ఎప్పుడూ ఇంటికి తీసుకు వచ్చి ఓ కప్పు కాఫీ అయినా ఇవ్వలేదు.

ఆఫీసుపని కాగానే బయటపడి... రామారావుకోసం ఎదురు చూశాడు. పోర్టికోలో ఒక పక్కగా నిల్చుని. రామారావ్ వస్తూనే... 'ఏం భాయ్... ఇంకా ఇంటికి పోలేదా?...' అన్నాడు.

అలా సరదాగా... వెళ్ళి తాజ్‌లో కాఫీ తాగుదాం పద... అంటూ దారి తీశాడు సీతాపతి.

తాజ్‌లో కనీసం గంటయినా గడిపి ఉంటారు ఇద్దరూ లోకాభిరామాయణం మాట్లాడుతూ. రామారావు ఇంటికి వెళ్ళాలని తొందరపడుతున్నాడు. 'పోవచ్చులే... అంత తొందరేవింటి? త్వరగా వెళ్ళకపోతే మీ శ్రీమతి కోప్పడుతుందా!...' అన్నాడు సీతాపతి. రామారావు ఒక నవ్వు నవ్వి... 'త్వరగా గూటికి చేరుకోవద్దూ... మరి' అన్నాడు.

ఇద్దరూ నవ్వారు. హాయిగా నవ్వారు. సీతాపతి బిల్లు చెల్లించి, ఓ సిగరెట్టు ముట్టించి... రామారావును బస్‌స్టాండ్ దగ్గర విడిచిబెట్టి... టాటా చెప్పి నడక ప్రారంభించాడు. తన బస్‌స్టాప్ కూడా దగ్గర్లోనే ఉంది. అయినా అంత త్వరగా బస్ ఎక్కడానికి మనస్కరించలేదు. కొంతదూరం నడిచాడు, నడుస్తున్నాడు; రోడ్డుమీద జనం ఇంకా పల్చబడలేదు. బస్సులూ, కార్లూ, టాక్సీలు, స్కూటర్లూ దూసుకుపోతున్నై; స్కూటర్లమీద కొంతమంది ఆడవాళ్లు వెనకాల కూచుని ముందు కూచున్న మగవాళ్ళను గట్టిగా కావలించుకుని గాలిలో తేలిపోతున్నారు; రంగురంగుల చీరెలు గాలికి రెపరెపలాడుతున్నాయి. పేవ్‌మెంట్లమీద పూలమ్మే పిల్లవాడు, బండిమీద బనీన్లు, డ్రాయర్లు, సాక్సు అమ్మేవాడూ ఆ మూలలో కలాలూ బాల్ పాయింట్ పెన్స్... మరో మూల ప్లాస్టిక్ సామాన్లూ... ఒకచోట పరిచిన కటపీసెస్ అమ్మేవాడు... అందరూ సీతాపతివైపు చూస్తున్నట్టే ఉంది. కొనే ఉద్దేశ్యం లేకపోయినా అవన్నీ వరసగా చూసుకుంటూ... నెమ్మదిగా వెళ్తున్నాడు. బస్‌స్టాప్ వచ్చింది. యాంత్రికంగా బస్‌లో ఎక్కి కూచున్నాడు...

ఇంట్లోకి వస్తూనే... వెరీ సారీ... లలితా... ఆలస్యం అయిపోయింది. ఇవ్వాళ బెజవాడనుండి ఓ మిత్రుడు వచ్చాడు. అతనితో కొంతసేపు గడిపి రైలుకు పంపించి వస్తున్నాను... మరేమీ అనుకోనంటే నాకు తృప్తిగా ఉంటుంది... ఆకలేస్తోంది.. భోజనం చేద్దామా మరి?.... అన్నాడు ఆప్యాయంగా...

'ఏం ఫర్వాలేదు లెద్దురూ... సినిమాకు మరో రోజు పోవచ్చు... పోయి తీరాలని ఏం లేదుగా... అవకాశం ఉంటే వెళ్ళేవాళ్ళం.. దానికేం...' అన్నది లలిత. సీతాపతి భోజనానికి సిద్ధమైనాడు.

'వంటలో ఇవాళో స్పెషాలిటీ ఉంది. ఏవిఁటో కనుక్కోండి' సీతాపతి ఆలోచిస్తున్నాడు.

'ఈవేళ మీ ఫేవరిట్' చేశానండీ;... బెంగుళూరు మిరపకాయకూర సెనగపిండికూరి చేశాను. వండర్‌ఫుల్ క్రర్రీ... ఎలావుందో చెప్పండి...'.

మిరపకాయ కొరుకుతూ... బ్రహ్మాండంగా ఉంది; మరో రెండు కాయలు వెయ్యి అంటూ చకచకా భోజనం చేశాడు.

'భోజనం ఎప్పుడూ హడావిడిగా చేస్తారు. నెమ్మదిగా కూచుని తాపీగా మాట్లాడుతూ, కూరలూ, పప్పూ, పచ్చడీ, పెరుగు ఎంజాయ్ చేస్తూ, హాయిగా భోంచేయకూడదూ... అది మనసుకూ, వొంటికీ కూడా ఎంతో ఆరోగ్యం...

'నీవు ఎప్పుడూ చెప్తూనే ఉంటావు;... ఈ వెధవ అలవాటును మార్చుకోలేకుండా ఉన్నాను. ఏవిఁటో మరి నాలోని బలహీనత...' అన్నాడు.

'దీంట్లో బలహీనత ఏముందీ? అలవాటును నెమ్మదిగా మార్చుకునే ప్రయత్నం చెయ్యండి... ఏదైనా ఓ విషయాన్ని గురించి మాట్లాడుతూ భోజనం చెయ్యండి... మాట్లాడుతూ నేనూ మిమ్మల్ని ఎంగేజ్ చేస్తాను... ఎక్స్పరిమెంట్ ఎలా ఉంటుందో చూద్దాం...'

'ఆలోచిద్దాం...' అన్నాడు సీతాపతి ముభావంగా. భోజనం ముగించి సిగరెట్టు ముట్టించి... వరండాలో పచార్లు చేస్తున్నాడు సీతాపతి.

చిటికలో పన్లన్నీ ముగించుకుని వచ్చింది లలిత. సీతాపతి సిగరెట్టు ఊదేస్తున్నాడు.

'మీ ఆలోచనలకు సిగరెట్లకు పోటీపడినట్లుందే... ఏది ముందు! ఇదిగో చూడండీ... సిగరెట్లు ఆరోగ్యాన్ని పాడుచేస్తాయని మీకు తెలుసు;... నేను చెప్పవలసిన దాన్ని కాదు... పూర్తిగా మానేయడం ఇబ్బంది అయితే సంఖ్య కొంచెం తగ్గించండి...' అన్నది లలిత. 'ప్రయత్నం చేస్తున్నాను లలితా... ఎందుకో నెగ్గలేకుండా ఉన్నాను. ఓటమే ఎదురవుతున్నది...'

అసలే సన్నగా ఉంటారు, బలహీనంగా... ఈ సిరెట్లు మరీ బలహీనం చేస్తాయి; పొద్దునపూట ఆలస్యంగా నిద్రలేస్తారు. దానివల్ల బోలెడంత బద్ధకం... పెందలాడే

లేచి ఏదైనా ఎక్సర్‌సైజ్ చేస్తే బావుంటుంది. మొన్న రీడర్స్ డైజస్టులో చూశాను; ... కొన్ని సింపిల్ లెసన్స్ ఇచ్చాడు ఓ ఆర్టికల్‌లో... అవి చేయడం కూడా చాలా సులభం... గేమ్స్ ఆడడం మీకలవాటు లేకపోతే ఇవైనా బాగానే ఉంటయి. బ్రీతింగ్ ఎక్సర్ సైజ్ చాలా సులభం...'

'ఈ ప్రాణాయామం అంటే నాకు ప్రాణాంతకంగా ఉంటుంది'.

'మొదలు పెట్టి చూడండి... మీతో పాటు నేనూ ప్రారంభిస్తాను. కాలేజీలో ఉండగా బోలెడు గేమ్స్ ఆడేదాన్ని; అప్పుడు ఎంతో హాయిగా ఉండేది...'

'అవును లలితా అలా చేస్తే శారీరకంగానూ, మానసికంగానూ ఆరోగ్యంగా ఉంటుంది; మంచిరోజు చూసి ప్రారంభించాలి.'

లలిత ఆరోగ్యంగానూ అందంగానూ ఉంటుంది. తీయని కంఠం; చక్కగా పాడుతుంది... ముఖంలో మంచి తేజస్సు; స్వచ్ఛమైన నవ్వు; వయసుతోపాటు అందం పెరుగుతూ, ప్రతి కదలికలోనూ కొట్టవచ్చేట్టుగా అందం తొణికిసలాడుతూ ఉంటుంది. భారీమనిషి; ఇద్దర్నీ ఒకసారి చూస్తే లలితే పొడవేమో అనిపిస్తుంది, ఆమె శరీరం దృఢంగా ఉండటం మూలాన. కాలేజీలో గేమ్స్‌లోనూ, డిబేట్లలోనూ, కల్చరల్ ప్రోగ్రామ్స్‌లోనూ బోలెడు ప్రయిజులొచ్చాయి...

వైభవంగా పెళ్ళయింది.

సీతాపతి తనకు భర్తగా లభించడము తన అదృష్టం అనుకున్నది.

ఆమె ఏ పని చేసినా ఓ ప్రత్యేకత ఉట్టిపడుతూ ఉంటుంది. తనపై చూపే శ్రద్ధకు ఎప్పుడూ సీతాపతి కృతజ్ఞతలు చెప్పుకుంటూనే ఉంటాడు. సీతాపతి కన్న లలితలో ప్రతి విషయంలోనూ ఆధిక్యత కన్పిస్తూ ఉంటుంది.

వివాహం అయిన తొలిరోజు...

పూలపాన్పు...

అలంకరించుకుని హుందాగా సీతాపతివైపు రెండడుగులు వేసింది. లలితను ఆపాదమస్తకం ఓసారి చూసి ఇంత అందాన్ని భరించలేం అన్నట్టుగా కుంచించుకు పోయి మాటలు రాలేదు సీతాపతికి. ఆ రోజు సీతాపతికంటే లలితే ఎక్కువసేపు

మాట్లాడింది. మాటల్లో చురుకుదనం, మనిషిలో ఆకర్షణ, ఆమె నవ్వుల్లో గలగలలు, సీతాపతిని ఉక్కిరిబిక్కిరి చేసినై. గదిలో అనేక విషయాలపై సరదాగా మాట్లాడుకున్నారు. సీతాపతి ముభావంగానే ఉన్నాడు.

సీతాపతిని దగ్గరకు తీసుకుంది లలిత. ఆమె శరీరంలో ఇమిడిపోయాడు గువ్వలాగ.

మరీ మీరింత సన్నగా ఉంటే ఎలా? పూచిగపుల్లలాగ.... మాటల ధోరణిలో అనుకోకుండా అనేసింది... అరె! అని నాలిక కొరుక్కుంది.

సీతాపతికి కొరడాతో కొట్టినట్లయింది.

సీతాపతి ముఖకవళికల్లోని మార్పును గమనించింది లలిత...

సబ్జక్టు మార్చి మల్లెపూలను గురించి ప్రారంభించింది. మల్లెపూలలోని ప్రత్యేకత గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. సీతాపతి లలితను దగ్గరికి తీసుకున్నాడు. రెండు చేతులూ చాలవా అన్పించింది. తెల్లవారింది.

టూత్ బ్రష్... పళ్ళవరసను అంటిపెట్టుకుని... శబ్దం చేస్తూ పైకీ కిందకీ గిరగిరా తిరుగుతున్నది. సీతాపతి ఆలోచిస్తే అద్దంలో తనను తాను ఒకసారి చూసుకున్నాడు.

లలిత తనకన్నా దృఢమైనది. అందమైనది. తెలివైనది. చురుకైనది. వెన్నలాంటి మనసు. అయినా సీతాపతి గర్వపడలేదు.

  

ఆదివారం పొద్దున్నే అలవాటు ప్రకారం ఆలస్యంగా బద్ధకంగా లేచాడు సీతాపతి.

టూత్ బ్రష్మీద్ పేస్టు పులుముతూ అద్దంలో చూసుకున్నాడు. జుట్టు అక్కడక్కడ తెల్లబడుతోంది. ముఖంలో ముడతలు కనిపిస్తున్నయి.

సీతాపతి కార్యక్రమం పూర్తయ్యేసరికి కాఫీ రెడీ చేసి పేపరు చూస్తూ కుర్చీలో కూచున్నది లలిత.

'కాఫీ బ్రహ్మాండంగా ఉంది లలితా. చక్కటి కాఫీ!' అన్నాడు సీతాపతి.

"మీరు ఆదివారంనాడు, తీరుబాటుగా నెమ్మదిగా సిప్ చేస్తూ సిగరెట్టు కాలుస్తూ... కాఫీ... బాగా ఎంజాయ్ చేస్తారని స్పెషల్‌గా తయారు చేశాను" అన్నది పేపరు తిరగేస్తూ.

లలితవైపు చూస్తూ నెమ్మదిగా కాఫీ సిప్ చేస్తున్నాడు సీతాపతి.

'ఏవండీ... ఇవ్వాళ రవీంద్రభారతిలో మంచి ప్రోగ్రామ్ ఉంది. గోపీ కృష్ణ డ్యాన్స్... పోదాం, మీకేం ఎంగేజ్‌మెంట్స్ లేవుగా...'

'తప్పక వెళ్దాం... నేనూ మధ్యాహ్నం వెళ్ళి టికెట్స్ తీసుకు వస్తాను.'

అద్దంలో చూసుకుంటూ తల దువ్వుకుంటున్నాడు సీతాపతి. దువ్వుకుంటే జుట్టు సన్నసన్న పీచులాగా ఊడిపోతోంది. అక్కడక్కడ తెల్లగా మెరుస్తోంది.

చదువుతున్న పేపరు చటుక్కున మూసేసి... 'మీ జుట్టు అక్కడక్కడ తెల్లగా ఉంటే ఎంతో అందంగా ఉంది. మంచి గ్రేస్ ఉంది' అన్నది లలిత.

చురుక్‌మన్నది సీతాపతికి.

జుట్టు తెల్లపడేంత వయసు లేదు సీతాపతికి. ఇంకా ముప్పై అయిదు నిండలేదు. అప్పుడే తనెంతో ముసలివాడైనట్లూ... తననందరూ వెక్కిరిస్తున్నట్లు బాధపడ్డాడు.

"అవును లలితా... నీకు మంచి 'ఈస్తటిక్‌సెన్స్' ఉంది. ప్రతి చిన్న విషయంలోనూ అందం చూస్తావు. నీవు అందంగా ఉండడమే కాకుండా" అన్నాడు సీతాపతి.

లలితను చూసినప్పుడల్లా తనలోని బలహీన తనలోని లోపాలను, ఎవరో గుర్తుచేస్తున్నట్టే ఉంటుంది.

లలితతో ఎక్కడికన్నా బయటకు వెళ్ళడాన్ని సహించలేడు. ఏదో చెప్పలేని మానసికమైన బాధ. లలిత పక్కన నిల్చున్నప్పుడు తను ఓ కురూపిగానూ, కురచగానూ ఉన్నానని అనుకుంటాడు. కాకిముక్కుకు దొండపండు అని అనొచ్చు ఎవరైనా.

ఇది ఒకరితో చెప్పుకునే బాధ కాదు.

లలితను బాధ పెట్టడం ఇష్టంలేదు. లలితను భార్యగా గాక ఒక పరాయి వ్యక్తల్లే చూస్తూ భయపడుతూ...

ఎప్పుడూ ఒదిగిపోయి... కుంచించుకుపోతూ... గంభీరంగా ఉంటాడు. మానసికాందోళనతో చిక్కి సగమైనాడు. పెళ్ళి చేసుకున్నప్పుడు ఇలాంటి ఉపద్రవం వస్తుందని ఊహించలేదు. మానసికంగా తను పెరుగుతున్నకొద్దీ... బాధ ఎక్కువైంది. జుట్టు తెల్లబడడంతో తనమీద తనకే కోపం ఎక్కువైంది. భరించలేకుండా ఉన్నాడు.

లలిత నిజానికి తనకన్న పొడుగేం కాదు. మనిషి భారీగా ఉండి ధైర్యంగా నిటారుగా నిల్చోడంవల్ల అలా కన్పిస్తుంది. మంచి హుందాతనం ఉంది. తను వంగిపోయినట్లుగా ఉంటాడు.

ఏదో సాకు నచ్చేట్లుగా చెప్పి లలితను ఎక్కడికి తీసుకు వెళ్ళడంలేదు. ఆ రకంగా ఆమెను బాధపెడ్తూ తను నరకం అనుభవిస్తున్నాడు.

తనలోని ఈ రెస్ట్‌లెస్‌నెస్‌కు పరిష్కారం లేదు...

ఈసారి ధైర్యం చేసి రవీంద్రభారతికి తీసుకెళ్తే... ఎలా ఉంటుందో... లలిత చాలా సంతోషిస్తుంది... అసలే అల్పసంతోషి... ఏమీ లేకుండానే నిండుగా నవ్వుతుంది.

ఏ విషయానికీ నిర్ధారణకు రాలేకుండా ఉన్నాడు. భోజనం చేసి, లలిత విశ్రాంతి తీసుకుంటున్నది. నిద్రపోతున్న లలితను చూశాడు. ఆరోగ్యమైన శరీరం. అందమైన ముఖం నిర్మలంగా ఉంది. ఫ్యాన్‌గాలికి ముంగురులు అటూ ఇటూ కదుల్తున్నాయి. ఆమె చీరె కట్టడంలోనే ఓ ప్రత్యేకత ఉంది. ఏ చీరెకట్టినా చీరెకే అందం వచ్చిందా అన్నట్లుంటుంది. సీతాపతి కవికాదు. అయితే ఆమె నిద్రాసౌందర్యాన్ని గురించి ఒక కావ్యం రాసిపారేసేవాడే! సీతాపతి మానసిక బాధతో సతమతమవుతున్న తరి, మనిషి దృఢమైన శరీరం నిశ్చలమైన మనసుతో ప్రశాంతంగా నిద్రపోతున్న లలితను చూసి సీతాపతి ఓ విధమైన బాధకు గురైనాడు.

రవీంద్ర భారతిలో సాయంత్రం ప్రోగ్రామ్... దానికి తీసుకువెళ్తానని మాట ఇచ్చాడు. లలిత తనకన్న అందమైనది. చురుకైనది. అన్ని విషయాల్లోనూ ఆమెదే ఆధిక్యత కన్పిస్తుంది. ఆమె ముందు తను మరుగుజ్జులా ఉంటాడు. ఆ మాట తలుచుకుంటే భరింపరాని బాధ. తనో లిల్లీపుట్‌గా ఊహించుకుంటాడు.

ఆమెను తనతో తీసుకువెళ్ళటానికి మనస్కరించలేదు.

సన్నగా పాడుతున్న రేడియోను ఆపేశాడు.

మంచినీళ్ళు తాగితే రుచించలేదు. చేదుగా ఉన్నాయి.

సిగరెట్టుమీద సిగరెట్టు ఊదేస్తున్నాడు.

పెదిమలు కాలిపోయి నల్లగా ఉన్నయి. నోరు బెరడుకట్టి రుచీపచీ లేకుండా ఉంది.

కుర్చీలో కూర్చుని రెండుకళ్ళూ రెండు వేళ్ళతో మూసుకున్నాడు. మరో రెండు వేళ్ళమధ్య సిగరెట్టు, ముడుచుకొన్న కనుబొమలు, తలలోంచి పొగవస్తున్నది. తలలోంచి లేచిన పొగ గాలిలో వలయాకారంగా రింగు రింగులుగా వెళ్తోంది.

సీతాపతి కుర్చీకి కొంచెం వెనకాలగా మంచంమీద పడుకున్న లలిత కొద్దిగా కదిలింది. మెలకువ వచ్చిందల్లే ఉంది... గభాల్న లేచింది. ఏదో కలవచ్చినట్లుంది...

ఏవండీ... అయ్యయ్యో అదేవిటి, మీ తలలోంచి పొగవస్తున్నది?... గభాల్న లేచింది.

వేళ్ళమధ్య కాలుతున్న సిగరెట్టును చూసి 'అబ్బ... ఎంత కంగారుపడ్డానండీ... ఏదో కలవచ్చింది..' ఉండండి కాఫీ తీసుకొస్తాను అంటూ వంట ఇంటివైపు వెళ్లింది.

సీతాపతి మొహం అంతా సిగరెట్టు పొగ అలుముకుని అసలే నల్లగా ఉన్న చర్మం మాడిపోయినట్టుగా ఉంది.

సిగరెట్టులోని నన్నని రవ్వలు చొక్కాలేని తన శరీరం మీదపడి చురుక్కుమనే టప్పటికి సీతాపతి ఈ లోకంలోకి వచ్చేడు.

తలమీదనుండి చేతులు గుండెలమీదికి వచ్చినయి.

లలిత కాఫీ తీసుకువచ్చి బల్ల మీద పెట్టింది.

సీతాపతి సన్నగా మూలిగేడు.

'అదేవిటండీ! గుండెలలో చేతులు పెట్టుకున్నారు? కొంచెం నీరసంగా కనపడుతున్నారు?' లాలనగా అన్నది లలిత.

'గుండెలలో ఎందుకో బరువుగా ఉంది... అదే తగ్గిపోతుందిలే అనుకున్నాను. నిన్ను డిస్టర్బ్ చేయలేదు...' అన్నాడు నీరసంగా.

అలా మంచంమీద పడుకోండి... అమృతాంజనం తెచ్చి కొంచెం రుద్దుతాను... అంటూ లోపలికి వెళ్లి అమృతాంజనం తీసుకువచ్చి సీతాపతి పక్కన కూర్చున్నది.

'ఏంవండీ... రుద్దుతుంటే కొంచెం రిలీఫ్‌గా ఉందా?...' అని పదే పదే అడిగింది.

సీతాపతి కళ్లుమూసుకు పడుకున్నాడు. మధ్య మధ్య లలితవైపు చూస్తూ... చేతి కదలికకు వచ్చిన గాజుల గలగలను వింటూ...

'ఇవ్వాళంతా రెస్టు తీసుకోండి. అవసరమైతే రేపు శలవుపెట్టి, పూర్తిగా రెస్టు తీసుకోండి అన్నది' అమృతాంజనం రుద్దుతూ.

'ఓ గంట ఉంటే అదే తగ్గిపోతుంది. సాయంత్రం అలా రవీంద్రభారతికి వెళ్దాం. మంచి ప్రోగ్రామ్ ఉంది' అన్నాడు నీరసంగా.

'ప్రోగ్రామ్ వద్దూ ఏవీంవద్దూ మీ రెక్కడికీ కదలగూడదు.'

సీతాపతికి కొంచెం రిలీఫ్ ఇచ్చింది. అయినా సన్నగా మూలుగుతున్నాడు.

లలిత ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో బొమ్మలు చూస్తున్నది.

సీతాపతి మళ్ళీ సిగరెట్టు తీయబోతున్నాడు. లలిత సీతాపతి రెండు చేతులూ పట్టుకుని... 'మీకు పుణ్యం ఉంటుంది... ఇప్పుడైనా ఆ సిగరెట్టు మానేద్దురూ! నొప్పి కొంచెం తగ్గిన తరువాత. రెండురోజులు పోయాక మొదలెట్టచ్చు. అంతగా ఉండలేకపోతే' అన్నది.

సీతాపతికి లలితకూ మధ్య సిగరెట్టు నలిగిపోయింది. సీతాపతి సిగరెట్ ఎందుకు మానలేడో లలితకు తెలుసు. లలితకు తెలుసునని సీతాపతికి తెలియదు.

రవీంద్రభారతిలో ప్రోగ్రామ్ ప్రారంభం అయే టైమ్ అయింది.

సీతాపతి సన్నగా మూలుగుతున్నాడు.

లలిత సీతాపతివైపు చూస్తున్నది! ఆ చూపులో ఏ భావనాలేదు. లలిత చురుకైనది. తెలివైనది... అందమైనది... ఆమె శరీరం దృఢంగానూ... మనస్సు నిశ్చలంగానూ ఉంటుంది!! సీతాపతి అంతకంతకూ కురచై పోతున్నాడు.

# 20

# గ్రీటింగ్ కార్డ్

భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ ప్రదక్షిణం చేసేటప్పటికి ఒక సంవత్సరం పడుతుంది. ఈ తిరిగే సమయంలో పగలు, రాత్రి, వెన్నెల, చీకటి. చలికాలం, వానాకాలం, ఎండాకాలం... ఇలాంటివి ఎన్నో చూస్తాము.

మనిషి తనచుట్టూ తాను తిరుగుతూనే ఉంటాడు. రాత్రనక, పగలనక... ఎండనక... వాననక... పుట్టింది మొదలు పెరుగుతూనే ఉంటాడు. కొన్నాళ్లు శారీరకంగానూ, కొన్నాళ్ళు మానసికంగానూ ఈ పెరగడం తాను గమనించడు. తన చుట్టూ తాను ప్రదక్షిణం చేస్తూనే ఉంటాడు.

మిల్లులో పనిచేసే యంత్రానికీ మనిషికీ తేడా కన్పించదు. యంత్రానికి శక్తి ఉడిగిపోతే విరిగి ఊరుకుంటుంది. మరి మనిషో...!

అరవై సెకండ్లు ఒక నిమిషం. అరవై నిమిషాలు ఒక గంట. ఇరవై నాలుగు గంటలు ఒకరోజు. ముప్పై రోజులు ఒక నెల. పన్నెండు నెలలు ఒక సంవత్సరం. ఒక సంవత్సరం వెళ్ళి మరో సంవత్సరం వస్తుంది. మరో సంవత్సరం వచ్చే సమయంలో ఎరిగి ఉన్నవాళ్లు, మిత్రులు... బంధువులు... వ్యక్తులు... ఈ రాబోయే సంవత్సరం శుభదాయకంగా ఉండాలనీ, సుఖశాంతుల నివ్వాలనీ, ఆయురారోగ్య ఐశ్వర్యాలు ఇవ్వాలనీ... కోరుతూ శుభాకాంక్షలు కురిపిస్తారు. అందరూ జ్ఞాపకానికి వస్తారు.

  

ఆ రోజు ఒకటో తారీఖు... కొత్త సంవత్సరం ముసుగు తొలగించుకొని వెళ్ళిపోయింది.

పోస్టులో వచ్చిన గ్రీటింగ్ కార్డ్స్ అన్నీ ముందువేసుకు కూర్చున్నాను. రంగురంగుల రకరకాల కార్డులు... వాటిలో రకరకాల బొమ్మలు. కొన్ని చాలా ఖరీదైనవి. కొన్ని మామూలువి. ఉద్యోగరీత్యా చాలా ఊళ్ళలో పనిచేయడంచేత చాలామంది ఆఫీసుకు సంబంధించినవాళ్ళవే ఉన్నాయి. ఈ శుభాకాంక్షల వర్షానికి తట్టుకోలేపోతున్నాను. ఒక్కొక్క కార్డూ చూస్తుంటే ఉత్సాహం ఉరుకులెత్తుతున్నది. నేను ఇంతమందికి జ్ఞాపకం ఉన్నానా. నేనూ ఒక మనిషిగా గుర్తింపబడ్డానా అని గర్వపడ్డాను.

ఇంకా చిన్ననాటి స్నేహితులు... ఆప్తమిత్రులూ... ఎందరో పంపేరు. నా చుట్టూ నేను తిరుగుతూ.. ఆ మధుర స్మృతులచుట్టూ తిరుగుతున్నాను.

పోస్టులో శ్రీనివాసరావు కన్పించాడు. వాడిది అమృతహృదయం. వెన్నలాంటి మనసు. చీమకు కూడా చూస్తూ చూస్తూ అపకారం చేయలేడు. వాడి ఆప్తమిత్రులలో నేను ఒకణ్ణి. ఏ ఊళ్ళో ఉన్నా ఏం చేస్తున్నా నన్ను మరచిపోడు. అతడు కళారాధకుడు. కళా తపస్వి. తనచేత్తో స్వయంగా బొమ్మ వేసి ఆ బొమ్మద్వారా నాకు శుభాకాంక్షలు అందజేసేడు. మేమిద్దరం కాలేజీలో చదివే రోజుల్లో... మా శరీరాలు వేరైనా... ఆత్మ ఒకటిగా ఉండేది. ఇద్దరి మనసులూ ఒకేరకంగా పనిచేసేవి.

నాకోసారి జ్వరం వచ్చి పడుకుంటే ఎంతో బాధపడ్డాడు. జ్వరతీవ్రత ఎక్కువగా ఉన్నప్పుడు నన్ను కౌగలించుకుని కన్నీళ్ళతో తగ్గించేడు జ్వరాన్ని. నాకు ఎన్నో సేవలు చేశాడు. కన్న తల్లిని మరపించాడు. నేను బాగా కోలుకున్న తరువాత... నన్ను అమాంతం ఎత్తుకున్నాడు. విద్యార్థి ఉద్యమాలు ముమ్మరంగా ఉన్న రోజులు. కాలేజీ విద్యార్థులకూ పోలీసులకూ యుద్ధరంగంగా మారిపోయింది. నాకు లాఠీదెబ్బలు తగిలితే.. తనకే తగిలినట్లు అబ్బా అన్నాడు. ఇంక కొంచెం సేపట్లో తుపాకులు కాలుస్తారనగా... నన్ను అమాంతం ఎత్తుకుని ఒక్క పరుగులో తప్పించాడు. శ్రీనివాసరావు పరుగెత్తుతుంటే... పక్కనున్న వాడికి తుపాకిగుండు దూసుకుపోయింది. అందరూ చెల్లాచెదరుగా పరుగెత్తుతున్నారు. చాలాదూరం పోయిన తరువాత నన్ను దించి ఒరేయ్ బతికిబయట పడ్డాంరా అన్నాడు. నా తలలోంచి నెత్తురు ఉబికి వస్తూంది. తన చొక్కా రక్తపు ముద్ద అయింది. ఆ చొక్కా చింపి నా తలకు కట్టుకట్టాడు. గ్రీటింగ్ కార్డు చూస్తుంటే నా తలకు కట్టిన కట్టు అలాగే ఉందేమోనని ఒకసారి

తలను తడిమి చూసుకున్నాను. వాడివి చల్లటి అమృతంలాంటి చేతులు. ఆ కార్డును మరీ మరీ... ఒకటికి రెండుసార్లు చూసుకున్నాను.

తరువాత శర్మ కన్పించేడు. కాలేజీలో శర్మ నాకన్నా సీనియర్. తెలుగు ఆనర్స్ చదువుతుండేవాడు. కొద్దిగా కవిత్వధోరణి ఉండేది. మితభాషి. వయసులో మా అందరిలోకి కొంచెం పెద్దవాడు మాకు గార్డియన్‌లా ఉండేవాడు. సినిమాలకు వెళుతుంటే అప్పుడప్పుడు కోప్పడేవాడు. టైమ్ వేస్టు చేయడమంటే అతనికి చాలా కోపం. నా రూమ్‌మేట్ అవడంవల్ల నా మీద కొంచెం అజమాయిషీ చేసేవాడు. చౌకగా ఉంటుందని హోటలునుండి క్యారియర్ తెచ్చుకుని రూంలో భోంచేసే వాళ్ళం. ఒకరోజు క్యారియరు తను తెస్తే మరోరోజు నేను తేవాలి. ముఖ్యంగా పరీక్షలముందు. హోటలునుండి క్యారియర్ తెచ్చేటప్పుడు దిక్కులు చూస్తూ రాకుండా దోవలో చదివిన సబ్జక్ట్ మననం చేసుకోమనేవాడు. ఈ సలహా నాకు బాగా ఉపకరించింది. చదివినవన్నీ బాగా జ్ఞాపకం ఉండేవి.

ఆదివారం ఒకరోజున మధ్యాహ్నం శర్మ బయటకు ఎక్కడికో వెళ్లేడు. సపోటాకాయలు అమ్ముతూ కేకవేసుకుంటూ వయసులో ఉన్న ఆమె వెడుతుంటే పిల్చేను. ఆడవాళ్లన్నా, అందమన్నా బొత్తిగా తెలియని రోజులు. చిరునవ్వు నవ్వుతూ గదిలో అడుగు పెట్టింది. బుట్టదింపుకుంటూ... బుట్టదింపుతూ ఉంటే ఆమె శరీరాన్ని చూసి కొంచెం చలించిన మాట వాస్తవం. 'ఏందీ... అబ్బాయ్‌గోరు... ఒకరే ఉంటున్నారా... డజను తీసుకుంటారా చౌకగా ఇస్తాను...' అన్నది. నా దగ్గర రెండణా లున్నాయి. నాలుగిస్తానన్నది. ఆరు ఇమ్మన్నాను. కాయలు ఏరుతుంటే ఆమె చెయ్యి నా చేతికి తగిలింది. నాలో ఏదో విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆమె పమిట తొలగిపోవటం కూడా గమనించాను. నాకూ ఆమెకూ మధ్య బుట్ట మాత్రం అడ్డం ఉంది. ఆమె వైపే చూస్తూ కూర్చున్నాను. ఆమె ఆరుకాయలు తీసి ఎదుట ఉంచింది. 'అబ్బాయ్ గోరూ రేపు కొంటారా...' అన్నది. ప్రతిరోజు బేడ ఇచ్చి... నే నీ కాయలు కొనలేను అని అందామనుకున్నా ఆమెను చూస్తూంటే ఏమి మాట్లాడాలో తోచలేదు.

ఇంతలో శర్మ అమాంతం ఊడిపడ్డాడు. ఆమె వెళ్ళిపోయింది. నేనూ శర్మా సపోటాకాయలు తిన్నాం. తరువాత అతను చెప్పేడు. వంటరిగా ఉన్నప్పుడు ఎప్పుడూ ఇక ఆమెను పిలువవద్దని. 'సపోటాకాయల పేరుతో వచ్చి... వంటరిగా రూమ్స్‌లో

ఉండి చదువుకునే వాళ్ళని రొంపిలోకి దింపుతూ ఉంటారు' వీళ్ళు... చాలా జాగ్రత్తగా ఉండాలి... అని హెచ్చరించేదు.

దానివల్ల లాభనష్టాల జాబితావేసి... నష్టమే ఎక్కువ ఉంటుందని... మన జాగ్రత్తలో మనం ఉండాలనీ... ఉద్రేకంలో తప్పటడుగు వేస్తే బతికి ఉన్నంత కాలమూ బాధపడాలనీ... ఇంకా ఏమేమో చెప్పేదు. శర్మ నాకు గురువు. గురూపదేశం విన్నాను. ఆరోగ్యంగా బయటపడ్డాను. శర్మ ఎంత మంచివాదు... అన్పించింది... గ్రీటింగ్ కార్డు చూస్తూ శర్మ చుట్టూ తిరుగుతూనే ఉన్నాను. రంగుల రాట్నం ఆగిపోయేటప్పటికి నా కళ్ళు చెమ్మగిల్లినై...

ఇంతలో... మా శ్రీమతి వచ్చి... 'ఆ కార్డు చూస్తూ ఎంతసేపు కూర్చుంటారు... భోజనానికి లేవరా... అయ్యో... అయ్యో... ఎన్ని సిగరెట్టు పీకలు.... శలవురోజు అయితే మాత్రం... ఇన్ని సిగరెట్లు తగలేస్తే ఆరోగ్యం... ఏమన్నా ఉందీ... నా మాట విని భోజనానికి లెద్దురూ...' అని అన్నది.

అప్పటికిగాని నేనీలోకంలోకి రాలేదు. కార్డు చూడటం చాలా భాగం అయిపోయింది 'ఇదిగో వస్తున్నా... వడ్డించూ...' అంటూ మరో కార్డు తీసేను.

ఆ కార్డు చాలా సింపిల్‌గా ఉంది. తెల్లటి గ్లేజ్ కార్డుమీద.. నల్లటి అక్షరాలు.. చేత్తో వ్రాసినట్టుగానే ఉంది. ప్రింట్‌లా... పేరూ లేదూ, ఊరూ లేదు. మరోసారి చూశేను. అన్నిట్లోకి ఈ కార్డులో ఏదో ప్రత్యేకత ఉందేమో అన్పిస్తున్నది. ఎవరు పంపించేరో... ఊరూ పేరూ లేదు, నాక్కొంచెం ఆశ్చర్యం వేసింది. శుభాకాంక్షలు పంపే వారెవరూ తమపేరు వ్రాసుకోకుండా ఉండరు. కార్డు అవతల పడేయబోతూ.. వెనక వైపు చూసేను ముద్దులు మూటకడ్తున్న చిన్న అక్షరాలతో 'లలిత' నాగపూర్ అని ఉన్నది.

లలిత... లలిత... లలిత... లలిత చుట్టూ తిరుగుతున్నాను. ఎన్నాళ్ళయిందో ఈ లలితను చూసి... ఏం చేస్తున్నదో.... ఎక్కడ ఉన్నదో... లలిత... ఆ బారిష్టరు గారమ్మాయి... అందంగా నాజూకుగా ఉన్న అమ్మాయి చిన్నప్పటి నుండీ నాతో చదువుకున్న అమ్మాయి... పెరిగి పెద్దదై... కాలేజీలో కూడా నాతో చదువుకున్న అమ్మాయి. గొప్పింటి బిడ్డ.... చిన్నప్పటి నుండి ఇరుగు పొరుగున ఉన్నా.

దూరదూరంగా ఉండేవాణ్ణి, నేను మామూలువాణ్ణి. ఆమె బారిష్టరు కూతురు. అంతస్థులో ఎంతో తేడా... కేవలం ఒక పరిచితురాలుగానే మెలిగేది నా మనస్సులో. అంతకుమించి ఎప్పుడూ ఆమెను గురించి కలలోనైనా మరోవిధంగా అనుకోలేదు. పది సంవత్సరాలు ఆమె నన్ను చూస్తూనే కాలేజీకూడా గడిపేసింది. బి.ఏ. పరీక్షలయిన తరువాత ఒకరోజు తిరిగి వస్తుంటే నన్ను పలుకరించింది. నడుస్తూ చాలాసేపు మాట్లాడుకున్నాం. 'నేను సామాన్యుణ్ణి. నా మీద ఆశలు పెంచుకోకు... నిన్నెప్పుడూ ఆ ఉద్దేశంతో చూడలేదు ఇన్నాళ్ళ పరిచయం ఉన్నా' అన్నాను. తనకు ఊహ తెలిసినప్పటి నుండి నేనే తన భర్తగా ఊహించుకున్నానన్నది. నన్ను మరచి పొమ్మన్నాను. మరోసారి నెమ్మదిగా అన్నది. 'మీ అభిప్రాయం మార్చుకోరూ...' అని. లేదన్నాను. నేనామెను సావకాశంగా మర్చిపోయేను. నా చుట్టూ నేను తిరుగుతూ... ఓ చిన్న ఉద్యోగం సంపాయించేను... పెళ్ళిచేసుకున్నాను. పిల్లల్ని కన్నాను. ఉద్యోగ ధర్మంలో పొట్టపట్టుకుని ఊరూరూ తిరుగుతున్నాను. చాలా సంవత్సరాల వరకు లలిత వివరాలు తెలియలేదు లలితకు అన్యాయం చేశానేమోనని కొంచెం బాధపడ్డాను. ఆలోచించి చూస్తే నేను నిరపరాధినే అనిపిస్తుంది. నే నెప్పుడూ ఆమెను ఒక స్నేహితురాలిగానే చూసేను. స్నేహితులలోనూ నాకు శ్రీనివాసరావు, శర్మ చాలా ముఖ్యులు. లలితకు ఆ మాత్రం ప్రాముఖ్యత కూడా ఇవ్వలేదు నేను. ఆమె మనస్సులో నేనే తన భర్తను అని ఊహించుకుంటే అది నా తప్పు కాదు. మూర్ఖంగా... పట్టుదలగా... అలాగే పెళ్ళి చేసుకోకుండా బ్రహ్మచారిణిగా ఉండిపోయింది. ఎమ్మే... చదివి.. నాగపూర్‌లో లెక్చరరుగా ఉద్యోగం చేస్తున్నది. ఆమె జీవితం నాకోసం బలిచేసుకుంది. శ్రీనివాసరావు ఆ మధ్య ఉత్తరం వ్రాసేడు. నాకు లలితను గురించి. ఇప్పటికీ నేనే ఆమె భర్తనట.... ఆమె దృష్టిలో నాకు తెలీకుండా... నా ప్రమేయం లేకుండా నా భార్యగానే జీవితం గడుపుతోంది లలిత తన భర్త సజీవంగా ఎక్కడో ఉన్నాడనీ... తను మాత్రం వివాహితురాలనే నని చెప్పుకుంటూ ఉంటుంది. వింత మనిషి చెప్పుకున్నా వింత ప్రపంచం నమ్మదు. ఇంకా లలిత చుట్టూ తిరుగుతూనే ఉన్నాను. చాలా వేగంగాను. రంగుల రాట్నం ఆగడం లేదు. పోను పోను వేగం ఎక్కువవుతున్నది... నా చేతిలో కార్డు... ఎదురుగా లలిత కార్డులో... నాకు తెలీకుండానే... రెండు కన్నీటి చుక్కలు.. టప్.. మని కార్డుమీద పడి... 'లలిత'ను రాసుకుంటూ పులుముకుంటూ... అక్షరాలను

గజిబిజిగా తనలో ఇమిడ్చుకుంటూ లలిత నాచేతిలోంచి విడిపించుకుని ఒళ్ళో వాలిపోయింది బరువుగా.

ఇంతలో మళ్ళీ పిలుపు...

ఇదేం పిచ్చి మీకు... ఆ కార్డు తరువాత చూసుకోవచ్చు లెండి భోజనానికి లేవండి... అంటూ...

ఏ లోకంలోంచో ఈ లోకంలోకి వచ్చేను. లలితను నెమ్మదిగా వళ్ళోంచి లేవదీసి అవతల కూచోబెట్టి... నా చుట్టూ నేను తిరుగుతూ, శ్రీమతి చుట్టూ ప్రదక్షిణం చేస్తూ వంట ఇంట్లోకి పరుగెత్తేను. భోజనంతోపాటు నాకు వచ్చిన శుభాకాంక్షలను నెమరు వేసుకుంటూ...

# 21

# భోక్త

పరంధామయ్యకు పని దొరక్క ఎంగిలి పడి కూడా రెండు రోజులయింది. చిక్కడపల్లిలో వెంకటేశ్వరస్వామి గుడికి ఎదురుగా ఫుట్‌పాత్‌కు సమీపాన మామూలుగా కూచుండేచోటే కూర్చున్నాడు. ఆ రోజు శనివారం, గుడి అంతా హడావిడిగా ఉంది. వచ్చే జనం పోయే జనం. గుడి ముందు బోలెడు చెప్పుల జతలు. కాళ్ళు లేనివాళ్ళు, చేతులు లేనివాళ్ళు, కళ్ళు లేనివాళ్ళు, అనారోగ్యంగా ఉన్నవాళ్ళు, వైరాగ్యాన్ని కావలించుకొన్నవాళ్ళు బోలెడంతమంది బారులు తీర్చి కూర్చున్నారు. అమ్మా, అయ్యా, ధర్మం... అంటూ. ప్రతి వాళ్ళకూ అంతో ఇంతో చిల్లర డబ్బులు ముదుయానే ఉన్నాయి. పరంధామయ్యకు వాళ్ళల్లో వెళ్ళి కూర్చుంటే బావుండునేమోనని అన్పించింది. కాని అభిమానం అడ్డు వచ్చింది. గుడికి ఎదురుగా చిన్న హోటలుంది. ఆ హోటలు దగ్గర కూర్చుంటాడు. పరంధామయ్య లాంటి పేద బ్రాహ్మలు, వీళ్ళంతా చిన్న చిన్న వంటలు చేసేవాళ్ళు. మంత్రాలు చెప్పుకుని జీవితం గడిపేసేవాళ్ళు, పెళ్ళి పనులకు, ఇంకేదైనా శుభకార్యాలు జరిగేచోట్లకు వెళ్ళి అంతో ఇంతో పనిచేసి జీవితం వెళ్ళబుచ్చుకుండే వాళ్ళు. అందరికీ ఏవో పన్లు ఎప్పుడూ దొరుకుతూనే ఉంటయి. ఒక్కొక్కప్పుడు అపరకర్మలకు సంబంధించిన పనులు కూడా తగుల్తుంటయి.

అనంతరామయ్యగారితో జగడం పెట్టుకోకపోతే పరంధామయ్య కీగతి పట్టేది కాదు . పని ఒకరిది, మెప్పు ఒకరిదీ. చిన్న విషయంలో మాట పట్టింపు వచ్చింది. పరంధామయ్య అహం దెబ్బతిన్నాక అనంతరామయ్యతో తెగ తెంపులు చేసుకున్నాడు. అనంతరామయ్య పేరుమోసిన చెయి తిరిగిన వంటవాడు. వయసు దాదాపు అరవై ఏళ్ళు. హైదరాబాదులో స్థిరపడిపోయి చాలా సంవత్సరాలయింది. ఎక్కడ ఏ శుభకార్యం

జరిగినా ముఖ్యంగా పెద్దవారిళ్ళల్లో పెళ్ళిళ్ళకు అనంతరామయ్యను పిలుస్తారు. అనంతరామయ్య చిన్నప్పుడు ఘనాపాఠీల దగ్గర వేదం చదువుకున్నాడు. సంగీతంలో కొద్దిగా పరిచయం ఉంది. పౌరోహిత్యానికి సంబంధించిన మంత్రాలు, కర్మ కాండ మొదలైనవి కూడా వచ్చు. వంటలో సిద్ధహస్తుడు గనుక అవన్నీ వదిలేసి ఆ వృత్తినే చేపట్టేడు. ఇదీగాక నాలుగు డబ్బులు గిట్టే వృత్తి ఇది. పెళ్ళికి ఒప్పుకుంటే రెండు వందల యాభై నుండి మూడు వందల దాకా ఫీజు తీసుకుంటాడు. ఇంటి పెద్దలు అనుభవం లేని వారైతే వారికి అన్ని విధాలా సహాయపడుతూ సలహాలు ఇస్తాడు. అతనికి మేళం వాయించే వాళ్ళూ, కల్యాణ మండపం తయారు చేసేవాళ్ళు, పెళ్ళిపందిళ్ళు వేసేవారు, పెళ్ళికి కావాల్సిన వంట పాత్రలు, గ్లాసులు, షామియానా, కుర్చీలు, బల్లలు అద్దెకిచ్చేవాళ్ళు. స్పెషల్‌గా లైట్లు పెట్టి అలంకరణ చేసేవాళ్ళు అందరూ బాగా తెలుసు. అతనిక్కావాల్సిందల్లా పెళ్ళి ఎప్పుడు జరిగేదీ, ఎక్కడ జరిగేదీ, సుమారు పెళ్ళికి ఎంతమంది వచ్చేదీ, రిసెప్షన్ తాలూకు వివరాలు... ఇవన్నీ ముందుగా చెప్తే అన్ని ఏర్పాట్లు చేస్తాడు. పెళ్ళి సునాయాసంగా జరిగిపోతుంది. అనంతరామయ్యకు బోలెడంత లౌకికము, చాకచక్యం, అనుభవమూ ఉండడంవల్ల అతనికి బాగా డిమాండు పెరిగిపోయింది. అతనికి కనీసం ఒకనెల అడ్వాన్సు నోటీసు కావాలి. అందువల్ల అతన్ని గురించి విన్నవాళ్ళు, తెలిసినవాళ్ళు, పెళ్ళి నిశ్చితార్థం కాగానే అనంతరామయ్య కోసం ఎగపడ్తారు. ఒకప్పుడు అతను దొరుకుతాడు, దొరకడు. అతని దగ్గర తర్ఫీదు పొంది అనుభవం గడించి చిన్న చిన్న వంటలు చేసేవాళ్ళు కూడా ఉన్నారు. వీళ్ళంతా ఒకప్పుడు అతని దగ్గర అసిస్టెంట్లుగా పనిచేసిన వాళ్ళే. వీళ్ళంతా ఎప్పుడూ మారుతూ ఉంటారు. వంటే గాకుండా పిండివంటల్లో కూడా స్పెషలైజ్ చేశాడు అనంతరామయ్య. అన్ని పనులూ ఒక్కడే చేయలేడు గనుక, ఎప్పుడూ నలుగురు అసిస్టెంట్లు ఉంటారు అతనికి. చాలా భాగం పనివాళ్ళకే పురమాయిస్తాడు. వంటశాలలో ఓ అంగవస్త్రం చుట్టుకుని చేతిలో ఒక పెద్ద గరిట చేతపుచ్చుకుని నిల్చుంటే ఒక సేనా నాయకుడల్లే ఉంటాడు. అనంతరామయ్యను చూస్తే అసిస్టెంట్స్ గడగడలాడతారంటే ఆశ్చర్యం లేదు. ఉద్రేకంతో పెద్దగా అరుస్తాడు వాళ్ళమీద. కూరముక్కలు చిన్నవిగా తరిగి ఏడవ్వోయ్ అని ఒకనిమీద విరుచుకుపడ్తాడు. ఆ తిరగమూత అలాగానే వేసేది సరిగా అఘోరించు అంటాడు... పులుసులో ఉప్పుకూడా సరిగా వేయలేని దౌర్భాగ్యుడా అంటాడు. పిండి వంటలు చేసేటప్పుడు కొన్ని తనే స్వయంగా చేస్తాడు. లడ్లు కట్టడం

మొదలుపెడితే సుమారు రెండు వేల లడ్లు ఏకదమ్మున అతని మనసంతా దానిమీద కేంద్రీకరించి సామవేద గానం చేస్తూ హుషారుగా కట్టగలడు. ఏదైనా, అతనికి ఒక విధమైన గర్వం,అతిశయం ఉంది.

హైదరాబాదు వచ్చిన కొత్తల్లో అతికష్టంమీద, చాలా రికమెండేషన్స్‌తో అనంతరామయ్య దగ్గర అసిస్టెంటుగా చేరాడు పరంధామయ్య. అసిస్టెంట్‌గా చేరిన వాడికి నెలజీతం అంటూ ఏమీ ఉండదు. పనిపడ్డప్పుడల్లా పిలుస్తుంటాడు. తనకు సహాయం చేసినందుకు పనిని బట్టి అయిదో పదో ఇస్తుంటాడు. అనంతరామయ్యకు కోపం వస్తే మాత్రం వాళ్ళకు పుట్టగతుల్లేకుండా చేస్తాడు. ఎవరు తప్పుకోవాల్సి వచ్చినా మంచిగా తప్పుకోవాల్సిందే. ఈ కిటుకు పరంధామయ్యకు తెలియలేదు.

ఒకసారి ఒక పెళ్ళిలో అనంతరామయ్య వంట బ్రహ్మాండంగా ఉందన్నారు పెళ్ళి పెద్దలు. ఆ పెళ్ళిలోనే పరంధామయ్య చాలా కష్టపడి, వంట చేయడంలో ముఖ్యపాత్ర వహించాడు. పులుసు, కూరలు ముఖ్యంగా తన చేతి మీదుగానే కావించేడు. పదార్థాలన్నీ చాలా రుచికరంగా ఉన్నాయని భోజనాల దగ్గర అందరూ మెచ్చుకున్నారు. పరంధామయ్యకు చాలా సంతోషం కలిగింది. వడ్డనలో కూడా పాల్గొనటం వల్ల, ఉత్సాహంతో అందరినీ కనుక్కుని మరీ మరీ వడ్డించాడు. ప్రతివారి నోటా అనంతరామయ్య మాటే వియ్యాలవారు కూడా ఆయన్ని పొగిడారు. వాళ్ళనోళ్ళలో తన పేరు కూడా పడ్తే బావుండునినిపించింది పరంధామయ్యకు. పెళ్ళి అయిన తరువాత మామూలుగా ఒప్పుకున్న మూడు వందలు కాక చేనేత ధోవతులు కూడా ముట్టచెప్పేడు యజమాని. అనంతరామయ్య అవి అందుకుంటూ వాళ్ళని ఏదో చదివి ఆశీర్వదించాడు. సందడంతా సద్దుమణిగిన తరువాత అనంతరామయ్య మిగిలిన అసిస్టెంట్లు డ్రెస్ మార్చుకుని ఇంటికి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నారు. అనంతరామయ్య నోటినిండా తాంబూలం వేసుకుని అసిస్టెంట్లకు తను ఇవ్వవలసిన డబ్బు ఇచ్చేసి తను తెచ్చుకున్న పెద్దగరిట చేతపుచ్చుకుని పాత బట్టలు వంట డ్రెస్ సంచీలో వేసుకొని బయటపడే సమయంలో పరంధామయ్య అడ్డగించి 'నాకు మరో అయిదు రూపాయలు ఇప్పించండి చాలా కష్టపడ్డాను' అన్నాడు. ఆ మాటకు అనంతరామయ్యకు విపరీతమైన కోపం వచ్చింది... అయిదు రూపాయలు కాదు కదా అయిదు నయాపైసలివ్వను... నీ బాబుగాడితో చెప్పుకో అని కసిగా అన్నాడు... దాంతో మాటా మాటా పెరిగింది...

రెచ్చిపోయిన కోపంతో 'ఒరేయ్ నీకిక పుట్టగతులుండవురా, నీ ముఖం నాకిక చూపించకు పో...' అన్నాడు. విదిలించుకుని వెళ్ళిపోయాడు పరంధామయ్య. అంతటితో ఊరుకోలేదు అనంతరామయ్య. అతనికి తెలిసిన కొంతమంది పురోహితులకు కూడా చెప్పాడు పరంధామయ్యకు ఎట్టి పరిస్థితుల్లోనూ సహాయం చేయొద్దని.

  

అనంతరామయ్యతో తెగతెంపులు చేసుకున్న తరువాత పరంధామయ్యకు రోజులు గడవడం కష్టంగా ఉంది. చిక్కడపల్లి గుడిదగ్గర, అక్కడున్న చిన్న హోటలు.. ఆ ప్రాంతం... చిన్న చిన్న వంటవాళ్ళకు, జూనియర్ పురోహితులకు తత్సంబంధమైన పనులు చేసేవారికీ కేంద్రం. ఎవరైనా పనిబడి పిలుస్తారేమోనని అక్కడ చేరుతారు. పది పదిహేనుమంది. వీళ్ళకు పెద్ద పురోహితుల దగ్గరనుండి, పెద్ద వంటవాళ్ళనుండి పిలుపు వస్తూ ఉంటుంది. అప్పుడప్పుడు సన్నకారు కుటుంబాలవాళ్లు, చిన్న చిన్న శుభకార్యాలకు ఇక్కడకు వచ్చి వీళ్ళనే డైరెక్టుగా పిలుచుకుపోతారు. తద్దినాలకు కూడా వెళ్తూ ఉంటారు కొంతమంది. ముఖ్యంగా భోక్తలుగా. భోక్తలుగా వెళ్ళాలంటే ఒక పెద్ద పురోహితుడి యాజమాన్యంలో ఉండాలి. పరంధామయ్య ఈ కేంద్రంలో చేరిన తరువాత పెద్ద పురోహితుల్లో ఎవ్వరితోనూ ఎక్కువ పరిచయం కలగలేదు. అదీగాక "పొగరుమోతు" అనే పేరు పడిపోయింది. పెద్ద పురోహితుల్లో వెంకటేశ్వర సిద్ధాంతికి మంచి పేరుంది. ఆ వృత్తిలోనే చాలా డబ్బు గడించేడు. కొడుకులు పెద్దవాళ్ళయ్యేరు. వాళ్ళచేత ఓ బియ్యం కొట్టు పెట్టించి వ్యాపారం చేస్తున్నాడు. బాగా ఎరుగున్న వాళ్ళు పిలిస్తే అదీ తప్పనిసరి అయి మీరే రావాలి అని పట్టుబడితే వెళ్తాడు.

పట్టుమని పాతికేళ్లయినా నిండని పరంధామయ్యకు, ఈ వాతావరణం అంతా విచిత్రంగా ఉంది. చెప్పుడు మాటలు విని స్వంత ఊరు వదిలి హైదరాబాదు వచ్చాడు, ఇక్కడేదో బావుకుందామని. అక్కడా అక్కడా వంటలు చేసుకుని స్వంత ఊళ్ళో ఉంటేనే బావుండునేమో ననిపించింది. కాని స్వంతవూళ్ళో ఉండటానికి మనస్కరించలేదు. భార్య తనను వదిలేస్తుందని ఎన్నడూ ఊహించలేదు. భార్యను పోషించలేని నీవేం మగాడివి అని నిలదీసి అడుగుతుందని అనుకోలేదు. భార్యాభర్తలకు మాటా మాటా పెరిగి విడిపోయారు. భార్య ఎవరో పెద్ద లాయరుగారింట్లో వంట మనిషిగా కుదిరి జీవితం వెళ్ళబుచ్చుతున్నది. ఇంక ఆ ఊళ్ళో ఉండి తన ముఖం ఎవ్వరికీ

చూపించదల్చుకోలేదు. ఆ కోపంలో ఓ విధమైన ఆశతో హైదరాబాదు వచ్చాడు.

ఆ శనివారం గుడికి వచ్చే పోయేవాళ్ళను ఆశగా చూస్తున్నాడు పని ఏదైనా దొరుకుతుందేమోనని. క్రితం రాత్రి ఒక బన్ను టీ తాగి తెల్లవారితే ఏదో పని దొరుకుతుందనే ఆశతో ముడుచుకు పడుకున్నాడు. సూర్యుడు నడినెత్తిమీదికి వస్తున్నాడు. బాగా ఆకలి వేస్తున్నది. చేతిలో డబ్బేమీ లేదు. ఎదురుగా ఉన్న బిక్షుకుల్లో వెళ్ళి కూర్చుందామా అనుకున్నాడు. ఇంత బతుకూ బతికి చివరకు అడుక్కోడమా అనిపించింది. మనసు ఒప్పలేదు. ఒకరిద్దరిని పలుకరించి చూశాడు. వాళ్ళు కళ్ళతోనే జవాబు చెప్పేరు. అయనకు బియ్యం కొట్టు ఉంది. కొంచెం బియ్యం అప్పుగా తీసుకుని ఏ పంచలోనో వండుకుంటే సరి అన్నారు. ఈ సలహా బాగానే ఉంది పరంధామయ్యకు. ప్రయత్నం చేశాడు.

వెంకటేశ్వర సిద్ధాంతి బియ్యం అప్పుగా ఇవ్వనన్నాడు. డబ్బు కూడా ఇవ్వనన్నాడు. కాని ఓ సహాయం చేశాడు. ఆనందనగర్ కాలనీలో ఆదివారం ఓ ఇంజినీరు గారింట్లో తద్దినం ఉంది. దానికి భోక్తగా రమ్మన్నాడు. మంత్రానికి అతి కష్టంమీద ఒప్పుకున్నాడు సిద్ధాంతి. ఇటీవల తద్దినాలకు వెళ్ళడం మానుకున్నాడు. ఇంజినీరుగారు పెద్ద పొజిషన్‌లో ఉండటంచేత, ఆయన మీరే రావాలి అని బలవంతం చేయడంవల్ల ఒప్పుకున్నాడు వెంకటేశ్వర సిద్ధాంతి. తద్దినం కాకుండా ఆ రోజు ఉదయం ఇంకా రెండు ఎంగేజ్‌మెంట్లు ఉన్నాయి అయనకు. 'తొమ్మిది గంటలకు కొత్తగా ఏదో పెద్దకొట్టు ఓపెన్ చేస్తున్నాడు ఓ ప్రముఖ వ్యాపారవేత్త. తరువాత జడ్జిగారింట్లో బారసాల ఉన్నది. ఈ రెండు పన్లు చూసుకుని నేను వస్తాను. నీవు ముందుగా వెళ్లు'అని అడ్రెసు ఇచ్చి పరంధామయ్యను పురమాయించాడు. ఆదివారం నాడు భోక్తగా బాగా భోంచేయవచ్చునని తాత్కాలికంగా తన ఆకలిని మరిచిపోయినాడు పరంధామయ్య. తనింకా శనివారంలోనే ఉన్నాననే విషయం జ్ఞప్తికి రాలేదు.

  

అనుకున్నట్లుగా ఇంజినీరు గారింటికి కొంచెం ముందుగానే వెళ్ళేడు. ఇంకా రాలేదే.... ఇంకా రాలేదే... అని ఎదురు చూస్తున్న సమయంలో వెళ్ళేడు పరంధామయ్య. సిద్ధాంతిగారు త్వరలో వస్తారని, తనను ముందు పంపించారనీ, తన పేరు

పరంధామయ్య అనీ, తను భోక్తగా వచ్చానని తనను తాను పరిచయం చేసుకున్నాడు. పరంధామయ్యను స్నానం చేసి, మడిబట్టలు కట్టుకోమని చెప్పిందా ఇంటావిడ. తను కట్టుకున్న దోవతి తడిపి స్నానం చేసి ఓ అంగవస్త్రం కట్టుకుని ఆ మడి ధోవతి ఆరేసి వచ్చి లోపల కూర్చున్నాడు. తద్దినానికి కావాల్సిన సరంజామా అంతా ఉంది అక్కడ. అరిటాకులతో కావలసిన దొన్నెలు, దర్భలతో కావలసిన పవిత్రాలు... చేస్తూ కూచున్నాడు. ఆకలితో పొట్టవీపుకు అతుక్కుపోయింది. వంట ఇంట్లోంచి కమ్మటి వంట పదార్థాల గుమగుమను పీలుస్తున్నాడు. కొంచెంసేపు కళ్ళల్లో అనంతరామయ్య కన్పించాడు. వర్థి దౌర్భాగ్యుడు అనుకున్నాడు. కొంచెంసేపు ఎక్కడో లాయర్‌గారింట్లో వంటచేస్తూ స్థిరపడిపోయిన భార్య కనిపించింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. కిటికీలోంచి దణ్ణెంమీద ఆరేసిన తన దోవతి గాలికి ఆరుతూ అటూ ఇటూ హాయిగా ఊగుతున్నది. తను తద్దినాలు పెట్టాడుగాని, తద్దినానికి భోక్తగా వెళ్ళడం ఇదే మొదటిసారి. తనతండ్రికీ, తల్లికీ తద్దినాలు పెడ్తూనే ఉన్నాడు. తను ఇప్పటి పరిస్థితి నిస్సహాయత, నిస్పృహ, దారిద్ర్యం ఇవన్నీ వరసగా వచ్చి ఆ నిశ్శబ్దంలో పలుకరించి వెళ్తున్నాయి. "మనుషుల్ని తినే భోక్తలు" కళ్ళల్లో మెదిలేరు. దేశంలో ఇంత దారిద్ర్యం ఉంది. దీనికెప్పుడు పెడ్తామో తద్దినం అనుకున్నాడు పరంధామయ్య. ఇంత చిన్నవాడు భోక్తగా రావడమేమిటా అని పేపరు లోంచి అప్పుడప్పుడు తొంగి చూస్తున్నారు ఇంజినీరుగారు పరంధామయ్యవైపు. ఇంత చిన్నవాడు ఏం భోంచేయగలడు అని అనుకుంటోంది ఆయన శ్రీమతి. అన్ని పదార్థాలు వేయించుకుని కడుపునిండా తృప్తిగా భోంచేస్తే ఇంటివారికి బోలెడంత తృప్తి. గాలికి ధోవతి బాగా ఆరిపోయింది. వెళ్ళి ధోవతి కట్టుకుని వచ్చి, ఏదో ధ్యాననిష్ఠలో ఉన్నట్టుగా కూర్చుని పెదిమలు కదిలిస్తూ వినపడి, వినపడనట్లు గొణుక్కుంటున్నాడు.

ఇంతలో... బాబూ క్షమించాలి... ఓ క్షణం ఆలస్యం అయిపోయింది... అంతా సిద్ధమే గదా... అనుకుంటూ వెంకటేశ్వర సిద్ధాంతి ప్రవేశించాడు. అప్పటికే కావలసినవన్నీ సిద్ధం చేశాడు పరంధామయ్య. ఇంజినీరుగారు స్నానం చేసి మడిగట్టుకుని తయారైనారు.

తతంగం అంతా ముప్పావు గంటలో అయిపోయింది.

'అమ్మా ఇక వడ్డించవచ్చు' అని అతి వినయంగా పురమాయించాడు వెంకటేశ్వర సిద్ధాంతి.

వడ్డన ప్రారంభం అయింది.

తనకు వేసిన పెద్ద అరిటాకు శుభ్రంగా నీళ్ళతో కడిగి, పక్కన ఉంచిన మంచి నీళ్ళ గ్లాసును ఒకసారి కదిలించి పీటమీద భద్రంగా స్థిమితంగా కూర్చున్నాడు. వడ్డనంతా పూర్తయింది. విస్తరాకు పదార్థాలతో నిండిపోయింది.

ఆకు పక్కగా ఉన్న దొన్నె నిండా కమ్మటి నెయ్యి తొంగి చూస్తోంది. నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్ళు, పప్పు, పులుసు, వడలు... ఒక మూల కొద్దిగా ఉప్పు.... విస్తరాకును చుట్టూ ఆవరించి ఉన్నాయి. మధ్యలో మల్లెపూల కుప్పలా, వరంగల్ సన్న బియ్యం అన్నం చిన్న రాసిగా ఉంది. భోజనానికి ముందు తతంగం పూర్తయింది.

కావలసిన పదార్థాలన్నీ వేయించుకుని తృప్తిగా భోజనం చేయండి... అని వారిద్దరిని ఉద్దేశించి, ఇంజినీరుగారూ, ఆయన శ్రీమతీ అన్నారు.

పరంధామయ్య చాలా హాయిగా భోంచేస్తున్నాడు. క్రమంలో ఒక్కొక్కటే కలుపుకుని, దొన్నెలోని నెయ్యి తగినంతగా వంచుకుంటూ... నిదానంగా భోజనం ఎక్కడ అయిపోతుందో అనే భయంతో... తాపీగా భోంచేస్తున్నాడు.... అప్పుడప్పుడు మంచినీళ్లు తాగుతున్నాడు. వద్దంటున్నా మరో నాలుగు వడలు వడ్డించింది ఆవిడ... వంట ఇంట్లోకి వెళ్ళిపోతూ ఆవిడ ఇంజినీరుగారిని వంట ఇంట్లోకి రమ్మని సైగ చేసింది కళ్ళతో.... ఆయన రాగానే... రహస్యంగా... అబ్బ... ఆయన తృప్తిగా భోంచేస్తున్నాడండీ... మనం నిజంగా తరించాం... మీరు చేసుకున్న పుణ్యం... అన్నది. లాలనగా నవ్వేడాయన. తోడువేసిన గడ్డపెరుగుతో భోజనం పూర్తయింది. ఇంజినీరుగారు ఓ పళ్ళెంలో తమలపాకులూ, సున్నం, వక్కపొడి సిద్ధంగా ఉంచి వరండాలో చిన్న బల్లమీద ఉంచారు. అన్నదాత సుఖీభవ అంటూ త్రేన్చుకుంటూ పరంధామయ్య వరండాలో కుర్చీలో కూర్చున్నాడు. ఆయన కెదురుగా వెంకటేశ్వర సిద్ధాంతి. కొంచెంసేపు విశ్రమించండి అని అన్నారు ఇంజినీరుగారు.

"దక్షిణ ఇప్పిస్తే వెళ్ళిపోతాం... కొంచెం పనులున్నాయి... క్షమించాలి..." అన్నాడు. వెంకటేశ్వర సిద్ధాంతి తాంబూలం వేసుకుంటూ...

ఇంజనీరుగారు లోపలికి వెళ్ళి రెండు తాంబూలాల్లో దక్షిణ పెట్టి తీసుకు వచ్చి ఇద్దరికీ ఇచ్చి నమస్కారం చేశారు.

'మాకిక శెలవు ఇప్పించండి' అంటూ ఇద్దరూ బయటకు వచ్చారు. పరంధామయ్య తాంబూలంలో మూడు రూపాయి నోట్లున్నాయి.

పరంధామయ్య నన్ను మరిచిపోకు సుమా... అన్నట్టుగా తాంబూలం వైపు చూసి ఒక నవ్వు నవ్వాడు వెంకటేశ్వర సిద్ధాంతి. పరంధామయ్యకు అర్థం అయింది. తాంబూలంలోంచి ఒక రూపాయి తీసి వెంకటేవ్వర సిద్ధాంతికి ఇచ్చాడు. ఒక్క రూపాయితో తృప్తి పడనట్టుగా చూశాడు సిద్ధాంతి. సగభాగం ఇవ్వాలి కాబోలు అని అప్పుడర్థం అయింది పరంధామయ్యకు... తిన్న అన్నం అంతా వాంతి చేసుకుంటే బావుండుననిపించింది. వెంకటేశ్వర సిద్ధాంతి నవ్వుకుంటూ సైకిల్‌మీద వెళ్ళిపోయేడు. రెండడుగులు వేసిన తరువాత పరంధామయ్యకు కడుపులో నిజంగా తిప్పినట్లయింది! తిప్పింది.

*ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 19 ఏప్రిల్ 1974*

# 22

# మిగిలిన మనిషి

ట్రాఫిక్ సిగ్నల్ ఎర్రలైటు రాగానే వేగంగా వస్తున్న కారు టక్కుమని ఆగిపోయింది. ఆ కారులో నేనున్నాను. స్టీరింగుమీద చేతులు నావే... దారీ తెన్నూలేకుండా పైపైకి పెరిగిపోతున్న మనిషి తలమీద బలమైన మేకు కొట్టినట్లయింది. గ్రీన్‌లైటుకోసం ఎదురు చూస్తున్నాను. ఆ క్షణంలో బోలెడు ఆలోచనలు... వద్దనుకున్నా వస్తాయి... ఆ ఆలోచనల అర్థంపర్థం ఉండదు. కొన్ని ఆలోచనలు మనసులోని మారుమూలల్ని తాకి మరీ వెళ్తాయి... ఆకుపచ్చలైటు రాగానే మళ్ళీ కారు దూసుకుపోతుంది. ఈ శరీరాన్ని ఆఫీసులో చేర్చేవరకు.

ఎర్రలైటుకూ, ఆకుపచ్చలైటుకూ మధ్య విరామం. కారులోంచి కళ్లు ఎడంవైపుకూ, కుడివైపుకూ తిరుగుతాయి. అప్రయత్నంగా ఏదో చూస్తాను. ఏదో వింటాను.

ఎడంవైపు చూసే సమయంలో ఫుట్‌పాత్‌మీద నుంచుని నావైపు ఎవరో చూశారు. నన్ను ఎరుగున్నట్టుగా... ఒక్కసారి చూసి కళ్ళు మరోవైపుకు తిప్పేడు... ఎవరబ్బా, ఇతను... ఎక్కడో చూసినట్టుందే... ఎవరు ఎవరు అని ప్రశ్నించుకునే లోపల నిల్చున్న వాడు వీపు నా వైపుకుతిప్పి ముందుకు సాగిపోయాడు పక్కరోడ్డుమీదుగా... చిరిగిన చొక్కాలోంచి చెమటోడుతున్న వీపు కన్పిస్తోంది... జుట్టంతా చిందర వందరగా ఉండి సగం ముఖాన్ని కప్పేసింది. లోతైన కళ్ళల్లోంచి ఓరకమైన కాంతి కన్పించింది మొదట చూసినప్పుడు. చిరిగి మాసి ఉన్న ధోవతిలోంచి పుల్లల్లా ఉన్న కాళ్లు వేగంగా వెళ్ళినై... ఎవరు? ఎవరితను? ఈ ప్రశ్న నన్ను వేధిస్తూనే ఉంది... ఆఫీసులో పనిచేస్తున్నా కూడా ఏదో నేరం చేసినవాడి మాదిరి

బాధపడ్తున్నాను... అతనెవరో నన్ను బాగా ఎరిగి ఉన్నవాడల్లే ఉండి ఉండాలి. లేకపోతే ఆ మొదటి చూపులో అంత ఆప్యాయత కన్పించదు. మనిషి భావాలన్నీ కళ్ళల్లోనే కన్పిస్తాయి... వృద్ధాప్యంవల్లనో, మరీ దీనరికంవల్లనో, శరీరం శివధనుస్సులా వంగి ఏ క్షణంలోనైనా, ఏ శ్రీరాముడి ప్రమేయం లేకుండా ఫళ్ళున తెల్లవారినట్లు, విరిగేట్టుగా ఉంది.

ఆ ముఖ కవళికలు, కళ్ళల్లోని కాంతి చూస్తే... నాకు చాలా ఆప్తుడే అయి ఉండాలని అనిపిస్తోంది. కొంపతీసి అతను రామరాజ భూషణ త్రివిక్రమ వర్మ (పెదబాబుగారు) కాదు కదా... అతనే అయితే, ఆ స్థితిలో చూడడానికి నాకళ్ళు రెండూ పోతే ఎంతో సంతోషించేవాణ్ణి... ఎట్టి పరిస్థితుల్లోనూ నేను చూసిన వ్యక్తి అతను కాకూడదు... కాకూడదు... అని సంబాళించుకున్నాను. అతనే అయితే మరీ మరీ చూడాలని మనసు తహతహ లాడుతోంది.... అతన్ని చూడాలి.., అతను కాకూడదు... అతను కాకుండా ఉంటే మనసుకు ఎంతో హాయి... పెద్ద రిలీఫ్...

ఓ ఆదివారం అతను మొదట కన్పించిన ప్రదేశానికి వెళ్ళాను. అది లక్డీకాపూల్ ట్రాఫిక్ జంక్షన్... అక్కడ సుమారు రెండు గంటలు ఎదురుచూశాను. కొందరు 'భిక్షాందేహాలు' కన్పిస్తే వాళ్ళల్లో ఇతనికోసం వెతికాను. సిటీలో ఇలాంటి జంక్షన్లు చాలా ఉన్నాయి. ఆ ప్రదేశాలన్నీ వెదికేను; కనపడలేదు కదా అని చాలా సంతోషించాను. కాని అతని దర్శనం మళ్ళీ కాలేదని ఏదో అసంతృప్తి నన్ను వేధిస్తోంది. వేధిస్తూనే ఉంది.., ఈ వేదన ఒకరితో చెప్పుకునేది కాదు. ఒకవేళ చెప్పుకున్నా శ్రీమతికి అసలు చెప్పకూడదు. ఆవిడ కొంచెం హైబ్రో మనిషి.. కాళ్ళు భూమ్మీద ఆనవు... తన భర్త పుట్టడమే ఓ పెద్ద ఐ.ఏ.ఎస్. ఆఫీసరుగా పుట్టాడని తన తండ్రి హైకోర్టు జడ్జీగానే పుట్టాడని అనుకుంటూ ఉంటుంది. పూర్వాపరాలు బొత్తిగా తెలియవు. నా ఆదర్శంకోసం కట్నంపుచ్చుకోకుండా పెళ్ళి చేసుకున్నమాట నిజమే. దీనివల్ల నేను ఓ రకంగా చులకనైపోతానని నాకు తెలియదు. అందుకే నా అభిప్రాయాలతో పిల్లలు కూడా ఒక్కొక్కప్పుడు ఏకీభవించరు. సలహాలు సరేసరి... పాటించడానికి బదులు ఓ వెకిలి నవ్వు నవ్వుతారు. లలిత వాళ్ళను సపోర్టు చేయకపోతే మరోవిధంగా ఉండేదేమో... పిల్లల్లో పెద్దవాడు 'ఫారిన్'లో ఉన్నాడు. హార్వర్డ్‌లో బిజినెస్ మేనేజ్‌మెంటు కోర్సు చదువుతున్నాడు.

వాడు అప్పుడప్పుడు స్టైలిష్‌గా ఉత్తరాలు వ్రాయడం తప్ప... పెద్దగా వాడిలో ఆప్యాయత కన్పించదు. రెండో వాడు పబ్లిక్ స్కూల్లో 'టెన్త్' చదువుతున్నాడు. వాడు ఇప్పట్లో రేవ్ హిప్పీల్లో దూరేట్టున్నాడు, వాలకంచూస్తే. పాప్ మ్యూజిక్ 'మూడ్' డ్రెస్... గర్ల్ ఫ్రెండ్స్... క్రికెట్ పిచ్చి... నరుడు వానరుడుగా మారేదా అన్నట్టుగా పెంచుకున్న జుట్టు... సోడాబుడ్డి మందాన బండి చక్రాల్లాంటి కళ్ళజోడు... ఇంకా ఇద్దరు పిల్లలు పన్నెండేళ్ళ లోపువాళ్ళు... వాళ్ళ కింకా ఈ అవతారం రాలేదు. లలిత తన రెండో కొడుకు ఎంతో అందంగా ఉన్నాడని మురిసిపోతుంది... మిస్టర్ ఇండియా అంటూ ఉంటుంది అప్పుడప్పుడు. వాడు తొడుక్కున్న పులిచారల చొక్కా, జింకచర్మం డిజైన్‌లాగూ చూస్తే మాత్రం నాకు వచ్చేంత భయం!

  

మరో ఆదివారం ఉదయం "బ్రేక్ ఫాస్ట్" టైమ్‌లో వేడి వేడి ఇడ్లీలు తింటుండగా 'ఆరు తాళంచేతులు కావాలండీ' అంటూ లలిత హెచ్చరించింది... వాళ్ళ ఫ్రెండ్స్ అంతా కలిసి గండిపేట పిక్నిక్ వెళ్తున్నారట... రెండో పుత్రరత్నం తెల్లవారుతూనే తనకేవో చాలా ఎంగేజ్‌మెంట్సు ఉన్నాయని హడావిడిగా ఉన్నాడు. ఆ రోజే వాడికి క్రికెట్ మ్యాచ్, సినిమా వగైరా వగైరా... అందంగా రుచికరంగా ఇడ్లీలను తయారు చేసిన నాయరు ఆ రోజు తనకేదో ముఖ్యమైన పనులున్నాయని "ఆఫ్" తీసుకున్నాడు ఇంట్లో పనులు అన్నీ అయిన తరువాత. ఇక మిగిలింది నేనూ ఇద్దరు పిల్లలూ. ఇలాంటి ఏకాంతం ఒక్కొక్కప్పుడు నాకు చాలా బావుంటుంది. తీరుబాటుగా కూచుని ఆలోచించుకోవచ్చు... మనసుకు ఒక విధమైన ప్రశాంతత చిక్కుతుంది. అలాంటప్పుడు రామరాజభూషణ త్రివిక్రమవర్మ (పెదబాబుగారు) తప్పక జ్ఞాపకం వస్తారు. ఇటీవల అనుకోకుండా ఆయన్ని చూసినప్పటినుండీ మరీ మరీ మనసులో మెదుల్తున్నాడు. నేను చూసిన అతనూ-అతను కాదేమో... కాకపోతే బావుండును. గతంలోని స్మృతులు మీదిమీదికి వస్తున్నాయి... ఇద్దరు పిల్లలు చెస్ ఆడుకుంటున్నారు.

వాళ్ళను పిలిచి ఏదన్నా కబుర్లు చెప్పుకుంటే బావుండుననిపించింది. లలితకు నా పూర్వాశ్రమంలోని జీవితం వివరాలు తెలియవు. నాకూ ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది, ఒకదానికి మరోదానికీ సంబంధం లేదని. మనిషి తెలివితేటలకీ చదువులో పైకి ఎగబాకటానికీ చేసే ఉద్యోగానికీ సంబంధం లేదు. ఉద్యోగానికీ – తద్వారా

వచ్చే జీతానికి సంబంధం లేదు. జీతానికీ డాబుతో సుఖానికీ సంబంధం లేదు. సుఖానికీ మానవత్వపు విలువలకూ సంబంధం లేదు. మానవత్వపు విలువలకూ మనస్సుకూ సంబంధం లేదు. ఈ సంబంధాల వలయంలో చిక్కుకుంటే ఊబిలో పడ్డట్టే - ఈ ఊబిలోంచి బయటపడటం అలివికాని పని. ఊబిలో ఉంటే ప్రాణసంకటం... మీకో కథ చెప్పనా అంటూ పిల్లల్ని పిలిచేను. టార్జాన్ కథ లేవన్నా చెప్తానేమోనని కుతూహలంగా వచ్చేరు. ఆ ఇద్దరిలో పెద్దవాడు మంచికథైతే "టేప్" చేస్తానంటాడు. టేప్ రికార్డరు తీసికొచ్చి ముందుంచాడు. టేప్ ఎందుకోయ్... అన్నాను. తమాషాగా ఉంటుంది 'డాడీ' అన్నాడు వాడు. ఇలాంటి కథలు మమ్మీకి ఇష్టం ఉండవు. ఇప్పుడు కావాలంటే పెట్టుకుని తరువాత "ఇరేజ్" చేసుకోండి అన్నాను. ఓకే! అంటూ ఇద్దరూ నా దగ్గర కూర్చున్నారు. గొంతు సవరించుకున్నాను. ఓ సిగరెట్టు ముట్టించి... 'ఓ పల్లెటూరులో పదేళ్ళ వయసులోనివాడు ఉన్నాడు. పేరు ఏదైతేనేం... ఏదో ఒకటి. మీ ఇష్టం వచ్చినపేరు పెట్టుకోండి... వాళ్ళ నాన్న ఎలిమెంటరీ స్కూలు టీచరుగా ఉద్యోగం చేస్తూ చచ్చిపోయాడు. వాళ్ళు చాలా బీదవాళ్ళు... వాళ్ళ అమ్మ ఎప్పుడూ జబ్బుగా ఉండేది. అతను స్కూల్లో చదువుకునే రోజుల్లో, ప్రతి ఉదయం భుజానికి జోలె తగిలించుకుని భవతీ భిక్షాందేహి అనుకుంటూ కొందరిళ్ళల్లో అన్నం సేకరించి, ఇంటికివచ్చి తల్లికి అన్నం పెట్టి తనుకూడా తిని కాలక్షేపం చేసేవాడు.. ఆ ఊరు పెద్ద అగ్రహారం. ఆ ఊళ్ళో పెద్దబాబుగారని ఒక జమీందారు గారుండేవారు. ఆయనకు చదువుకునే పిల్లలంటే చాలా సరదా...

'భుజాన జోలె తగిలించుకున్న ఆ అబ్బాయిని చూసి ఓ రోజు, కేకవేసి చేతిలో కొన్ని వందరూపాయల నోట్లు పెట్టి... బాగా చదువుకోవోయ్...' అంటూ భుజం తట్టేడు. పాపం ఆ అబ్బాయి అలాగే చదువుకుంటుండేవాడు. జోలె మానేసి వారాలు చేసుకున్నాడు. వారాలంటే వారానికి ఒక్కొక్కరింట్లో గౌరవంగా భోజనం చేయడం అన్నమాట. పెదబాబుగారింట్లో వారానికి మూడురోజులు. ఇలా అలాంటి వాళ్ళు చాలామంది వారింట్లో భోజనం చేసేవారు. వారికి పెద్ద పెద్ద మేడలు మూడుండేవి. కొన్ని వందల ఎకరాల పొలం ఉండేది.

'డాడీ... ఆ చదువుకుందు అబ్బాయి పేరేమిటి?' అన్నాడు మా మూడోవాడు.

'ఏ పేరైతే ఏంలే... ఏదో పేరు. నీ ఇష్టం వచ్చిన పేరు పెట్టుకో... పోనీ మోహన్ అనుకో...' అన్నాను.

ఆ పేరు బాగానేవుంది కానివ్వండి అన్నాడు వాడు.

మళ్ళీ అందుకున్నాను.

'పెదబాబుగారికి ఎవ్వరికీలేని ధైర్య సాహసాలున్నాయి. ఆయన ఏం అనుకుంటే, తనకేది తోస్తే అది చేసేవాడు. ఇతరులు ఏమన్నా అనుకుంటారనే భయం అసలు లేదు. అలాంటివాళ్ళు ప్రపంచంలో చాలా అరుదు. పెదబాబుగారి తాతగారు గొప్ప పండితులు. సంగీత సాహిత్యప్రియులు. వసుచరిత్ర అని ఒక కావ్య ముందిలే. ఆ వసుచరిత్ర ఒక మహాకవి వ్రాసేడు. ఆ కావ్యం ఎప్పుడూ గానం చేస్తూ ఉండేవారు ఈ తాతగారు. ఆ కవిమీద ఉండే గౌరవం చేత పెదబాబుగారికి రామరాజభూషణ త్రివిక్రమవర్మ అని పేరు పెట్టుకున్నారు. పెదబాబుగారికి కూడా సంగీత సాహిత్యాలంటే ఎంతో అభిమానం. పెదబాబుగారు ఎక్కువగా చదువుకోలేదు. జీవితమే ఒక చదువు. పరోపకరికి సహాయం చేయడమే జీవితాదర్శం... అంటూంటారు. ఆయనకు దురలవాట్లు కూడా ఉన్నాయి... గుర్రప్పందేలు, మద్యపానం మొదలైనవి. అవి ఆయన దృష్టిలో 'చెడు' కావు ఎప్పుడూ బొంబాయి. కలకత్తా, పూనా వెళ్తుండేవారు. ఎన్ని లక్షలో ఖర్చుపెట్టేరు వాటికోసం. ఆయనది ఖరీదైన జీవితం. ఆయనకున్న డబ్బంతా మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుచేసిన తరువాత, ఉన్న ఆస్తి అంతా ఎప్పుడు డబ్బు కావాలంటే అప్పుడు అమ్మేవాడు. అయిదువేలు చేసే పొలం అయిదువందలకు అమ్మేవాడు. డబ్బు అవసరం అలాంటిది... ఎంతకో అంతకు తెగనమ్మటం...

'ఆయన పొలం అమ్ముతున్నారంటే ఎందరో ఎగిరిగంతేసి ముందుకు వచ్చేవారు. ఈ ఆస్తంతా ఆయన తండ్రి, తాతలు సంపాయించారు. పెదబాబుగారి తండ్రి వడ్డీ వ్యాపారం చేసి బోలెడు సంపాయించేడు. వడ్డీలకు వడ్డీలతో, ఆ అప్పు తీసుకున్నవాళ్ళను దివాలా తీయించి వాళ్ళను పీల్చి పిప్పిచేసేవాడు. మా నాన్న అంత సంపాయించేడు. పోయేటప్పుడు ఇదంతా కట్టుకుపోయినాడా? ఆయన చస్తే శవాన్ని మోయడానికి ఎవరూ రాలేదు అని ఓ రకంగా నవ్వుతుండేవారు.

'కులం, గోత్రం కాని ఎవరో స్త్రీని ఆయన పెళ్ళిచేసుకున్నారు. ఇందులో ధైర్యం సాహసం చూపించేడు. పెళ్ళి చేసుకున్న భార్యగాక ఇంకా ఇద్దరు స్త్రీలతో పరిచయం ఉండేది. వాళ్ళు ఆ ఊరువాళ్ళు కాదు. ఒకరు సంగీతంలోనూ ఒకరు నృత్యంలోనూ సిద్ధహస్తులు. పరిచయం, స్నేహం ఉందిగాని వాళ్ళకెప్పుడూ తన

శరీరాన్ని అర్పించలేడు. ఆ రెండు మేడలూ అమ్మేసి ఆ డబ్బుతో వాళ్ళకు, వాళ్ళ ఊళ్ళోనే రెండు మేడలు కట్టించి ఇచ్చేడు. తూర్పు గోదావరిలో పొలం అంతా అయిపోయిన తరువాత నాకేమీ మిగల్లేదు... నాలో ఏమీ మిగల్లేదు... అంటుండేవారు. మోహన్‌లాంటి పిల్లలకు చాలామందికి చదువు చెప్పించేడు. మోహన్ అంటే ఎందుకో చాలా ఇష్టం. బి.ఏ., ఎం.ఏ. కూడా చదివించేడు. తరువాత ఐ.ఏ.ఎస్.కు కూర్చుని సెలెక్టయ్యాడు మోహన్. పెదబాబుగారికి భార్య అంటే అమితప్రాణం. ఆవిడ ఏదో జబ్బుచేసి చచ్చిపోయింది. తమ ఇంటి ఆవరణలోనే భూస్థాపితం చేసి అక్కడ చిన్న గుడి కట్టించేడు. మనిషికి గుడి కావాలి కాని, దేవుడికి గుడెందు కంటాడాయన. సాయంత్రంపూట ఆ గుళ్ళో కూర్చుండేవాడు. ఊళ్ళకు వెళ్ళినప్పుడు, వర్షాకుండే రోజుల్లో అక్కడ చూసేవాణ్ణి. ఆ గుడిని తనే తన చేతుల్తో శుభ్రం చేసేవాడు. పెదబాబుగారి మేడలో ఖరీదైన ఫర్నిచరూ, బోలెడంత సామానూ ఉండేవి. అదంతా అమ్మేసిన తరువాత వట్టి మేడ మిగిలింది. తలుపులు, కిటికీలు కూడా లాగేసి వాటిని చెక్కసామానుకింద అమ్మేసేడు. కొన్నాళ్ళకు, డబ్బు అవసరం వచ్చినప్పుడల్లా, ఇల్లంతా అక్కడక్కడ పగలకొట్టి ఖరీదైన మార్బుల్ శ్లాబ్స్, ఇంకా అలాంటివి ఇంటికి సంబంధించినవన్నీ అమ్మేసేడు. కొన్నాళ్ళకు ఆ ఊరు వదిలేసి వెళ్ళేడు. ఏమైనాడో ఎక్కడున్నాడో తెలియదు...' అని ముగించేను. కుష్ఠువాడిలా మిగిలిపోయింది ఆ శిథిలమైన మేడ...

మా వాడు చప్పట్లు కొట్టి 'great guy, really great guy' అన్నాడు... టేప్ రికార్డరు ఆఫ్ చేస్తూ...

  

తరువాత కొన్నాళ్ళకు ఓ పదిహేను రోజులయిందేమో – ఓ విచిత్ర సంఘటన జరిగింది... ఇన్నాళ్ళూ నేను పెదబాబుగారిని జ్ఞాపకం చేసుకుంటూనే ఉన్నాను. ఆయన కనపడితే బావుండునని అనిపిస్తూ ఉంటుంది. ఓ రోజు ఆఫీసునుంచి రాగానే 'వండర్‌ఫుల్... వండర్‌ఫుల్... ఆడవాళ్ల ధైర్యసాహసాలు... ఆడవాళ్ళంటే అలా ఉండాలి...' అంటూ ఉంటే నే నాశ్చర్యపోయి ఆమె కళ్ళల్లోకి చూస్తున్నాను... ఆమె చెప్తోంది.. ఆమె చెప్పిన కథ: కథగాదు ఆ మధ్యాహ్నం జరిగింది. మా ఇంటి వెనకాల దక్షిణంగా పెద్ద బంగళా ఉంది. ఆ బంగళాకు కాపలా రెండు పోతు కుక్కలు.

ఇంటిముందు అందమైన తోట. పిచ్చివాడిలా ఉన్న ఒకతను ఆ ఇంటి గేటుముందు నిల్చుని ఆకలిగా ఉంది కొంచెం అన్నం పెడతావా తల్లీ... అని హెచ్చరించాడు ఆ ఇంటి ఇల్లాలిని. చిందరవందరగా ఉన్న జుట్టు... చిరిగిన చొక్కా పుల్లల్లాంటి కాళ్ళు... లోతుకుపోయిన కళ్ళు... చిరిగిన చొక్కాలోంచి శివధనుస్సులా వంగిన వీపు... ఆ ఇల్లాలు వరండాలో కూర్చుని ఏదో పత్రిక చదువుకుంటోంది. మొదటిసారి వినిపించుకోలేదు. ఈ డబ్బున్న వాళ్ళ కిదే రోగం... అన్నాట్ట పెద్దగా ఆమెకు వినిపించేట్టు... ఆవిడ ఆ మాటకు కోపాన్నంతా పుంచుకుని ఒక్క ఉరుకున గేటు దగ్గరకు వచ్చింది. అతనికీ కోపం వచ్చింది (పిచ్చివాడా?). ఈ ఆస్తంతా పోయేటప్పుడు కట్టుకు పోతావా నీ బొందమీదికి... అన్నాడు. పైగా... నాకూ ఉంది ఇంతకు పదిరెట్ల ఆస్తి ఏం లాభం. అంతా పోయింది. ఎప్పుడో పోయింది కాని పెద్దగా నవ్వేట్ట. ఇంతలో ఆమె ఇంట్లోని నౌకర్లను పిలిచి 'ఆ వెధవను లోపలకు తీసుకురండి' అని గదమాయించింది. ఆ ఇద్దరు నౌకర్లు అతన్ని పట్టుకుని లోపలకు తీసుకువస్తే ఆమె ముందుకువచ్చి ఆ చెంపా... ఈ చెంపా ఫెడీ, ఫెడీమని వాయించేసింది. ఆ కోపం అంతటితో ఆగక కుక్కను కట్టేసిన గొలుసు తీసుకుని దాంతో తన బలం అంతా ఉపయోగించి గొడ్డును బాదినట్టు బాదింది.. అన్ని దెబ్బలూ తిని... ఏమీ మాట్లాడకుండా... పడుతూ లేస్తూ, పడుతూ లేస్తూ... పక్కసందులోంచి... పలాయనం చిత్తగించేడు. ఈ జరిగిన సంఘటన అంతా విని... 'మీ ఫ్రెండ్ చాలా ఘనకార్యం చేసిందిలే' అన్నాను. లలిత మామూలుగా ఉండే కోపమే ప్రదర్శించింది. ఈవెనింగ్ వాక్ నెపంతో నేనలా బయటకువెళ్ళేను. సుమారు రెండు మైళ్ళు పరిసర ప్రాంతాలన్నీ నడిచేను. అతను కనిపిస్తాడేమోనని. కన్పించలేదు. జేబులో రెండు వందలున్నాయి. అతను కనిపిస్తే ఇచ్చుందును. కనిపించినా అతను పెదబాబుగారు కాకూడదు.. అందుకనే అతను కనిపించలేదు.

# 23

# మనిషి ఖరీదు

వయసుకు మించిన వృద్ధాప్యం వచ్చినప్పటినుండీ... ఒంటరితనం ముల్లులా గుచ్చుకుని వేధిస్తున్నది. ఎక్కడ చూసినా జన సమూహమే. ఈ గుంపుల్ని చూస్తే నాకు మహామంట. ముల్లు బాధవేరు మంటబాధవేరు. రెండూ బాధలే. సినిమా జనం, స్టేషన్‌లో జనం... హోటళ్ళల్లో జనం, ఆస్పత్రులలో జనం, రోడ్లమీద జనం, బస్సుల్లో జనం... జనంలేంది ఎక్కడ? అని అనిపిస్తది.

కాలక్షేపానికి క్యూలో నిల్చున్నాను. ఒంటరితనాన్ని ఊద్చుకుంటూ వచ్చి నిల్చున్నాను మెడికల్ కాలేజీ ఎగ్జిబిషన్ చూద్దామని. గాంధీ హాస్పిటల్ అంతా సందడిగా ఉంది. పెళ్ళివారిల్లల్లే... తోరణాలు... జనం... మైకులో హిందీ రికార్డు హాస్పటల్ ముందు రోడ్డుమీద కార్ల వరసలు. సైకిల్ స్టాండ్లు... స్కూటర్ స్టాండ్లు... మరికొంచెం అవతల రిక్షాలు... రోడ్డు మధ్యన ట్రాఫిక్ పోలీసు.... కార్లను పొమ్మనీ, నిలవమనీ.... చేతులను భరతనాట్య భంగిమలో పెడ్తున్నాడు.

టిక్కెట్లకోసం - క్యూ వేరుగా ఉన్నాయి. హైస్కూళ్ళలో చదివే ఆడపిల్లలు రంగు రంగుల యూనిఫామ్స్‌తో స్పెషల్ బస్సుల్లోంచి దిగుతున్నారు. స్కూటర్లలోంచి కొన్ని జంటలు దిగుతున్నాయి. రిక్షాల్లోంచి కొంతమంది దిగుతున్నారు. తరువాత కాలేజీలవాళ్ళు.. వాళ్ళల్లో గొట్టం ప్యాంట్లవారూ, గురుషర్టు, చెంపలమీద జుట్టువాళ్ళు, ఆడలాల్చీలు, ఆడలుంగీలు, బెల్‌బాటమ్స్, హిప్పీ స్టైల్ వాళ్ళు... స్లీవ్‌లెస్ వాళ్ళు, మినీస్కర్టువాళ్ళు, మినీ జాకెట్‌వాళ్ళు, బొడ్డుకింది చీరెలవాళ్ళు... పచ్చని పొట్టలూ, వీపూ ముడతలుపడ్డవాళ్ళూ... ఒలిపిరి చీరెలవాళ్ళూ... పసిపిల్లల తల్లులూ... భుజాన

ట్రాన్సిస్టర్ తగిలించుకున్నవాళ్ళూ, సిగరెట్లు ఊది పారేస్తున్నవాళ్ళూ, నాగరికతంతా కుంచించుకుపోయి అక్కడే ముద్దగట్టి నట్లుగా ఉంది.

టిక్కెట్లు తీసుకొని లోపలకు వెళ్ళాను జనంలోంచి. లోపల చాలా విభాగాలున్నాయి. ప్రతి భాగంలోనూ జనం. కొన్నిచోట్ల క్యూలు. కొన్ని చోట్ల టిక్కెట్లు. పాథాలజీ, ఫిసియాలజీ, బయాలజీ ఇంకా ఇలాంటి విభాగాలెన్నో. ప్రతిచోటా గుమిగూడిన జనానికి మెడికల్ కాలేజీ విద్యార్థులు ఇద్దరు ముగ్గురుండి ఉపన్యాస ధోరణిలో చెప్పుకుపోతున్నారు. ఒకచోట శరీరంలో భాగాలన్నీ పెద్ద పెద్ద సీసాల్లో ద్రావకంలో ఉంచారు. వెళ్ళగానే అస్థిపంజరం ఒకటి స్వాగతం పలికింది.

ఫ్యామిలీ ప్లానింగ్ సెక్షన్ ఒకచోట. మరోచోట ఒక రూపాయికి నెత్తురు పరీక్ష చేస్తున్నారు. అక్కడ క్యూ పెద్దది. సూదితో బొటనవేలు మీద పొడిచి, వచ్చిన రక్తపు బిందువులను ఒక గ్లాసు ప్లేటు మీద వేసుకుని మైక్రో ఏలో చూసి.. ఒక కాగితం మీద ఏదో వ్రాసి అప్పటి కప్పుడే రిజల్టు చెప్తున్నారు. నేను క్యూలో జొరబడ్డాను. అటూ ఇటూ ఆడపిల్లలు. క్యూ పెద్దదవుతోంది. జనం తోసుకుంటున్నారు. నా శరీరానికి ఇతర శరీరాలు వంపులు తాకుతున్నయి. మనసుకు ఏదో హాయిగా ఉన్నా తప్పు చేసినవాడి మాదిరి లోపల కుంచించుకు పోయి... కొంత బాధగానే ఉంది. నేను జరిగినా అవతల వాళ్ళు జరిగేట్టు లేరు. నెత్తురు క్యూలో నిల్చున్నాను. నా బొటన వేలును తన చేతుల్లోకి తీసుకుని సూదితో పొడిచింది. అమ్మో... అని చేయి వెనక్కు లాక్కున్నాను. నా చెయ్యి, వెనకాల ఉన్న అమ్మాయికి తగిలింది. సూదితో పొడిచిన అమ్మాయి నన్ను చూసి నవ్వుతోంది. పచ్చని శరీరం. తెల్లటి కోటు... ఇంకా కాలేజీలో చదువుతున్న ంది. ప్రతి సెక్షన్‌లోనూ మెడికల్ కాలేజీ విద్యార్థులు ఎంతో శ్రద్ధగా వచ్చిన వాళ్ళందరికీ వివరంగా విశదీకరిస్తూ చెప్తున్నారు. వీళ్ళందర్నీ చూస్తే నాకెంతో ముచ్చటేసింది.

వీళ్ళంతా కాబోయే పెద్ద పెద్ద డాక్టర్లు. ఈ డాక్టర్లంతా ప్రజలకు సేవ చేస్తే అందరికీ హాయిగా ఉంటుంది. వీళ్ళు యువకులు. బాధ్యతలు తెలిసినవారు. తప్పక చేస్తారు. కాని ఎంతమంది డాక్టర్లయినా మన దేశానికి సరిపోరు. ఎన్ని ఆస్పత్రులయినా సరిపోవు. రోగులు, రోగాలతో ఊగాలు తీస్తూనే ఉంటారు. కాని కొంతమంది డాక్టర్లు డబ్బుతో మనిషి ఖరీదు కడ్తారు. రోగంతో తీసుకుంటున్న వాడికి ఆస్పత్రిలో ఒక

పట్నాన బెడ్ దొరకదు. అప్పటి దాకా ఖాళీ లేని బెడ్... డబ్బు ఎర చూపించగానే బెడ్ దొరుకుతుంది. ప్రైవేటు డాక్టర్ల దగ్గరకు వెళ్తే ముడుపు చెల్లిస్తే గాని తీసికోపు గుండెలమీద పెట్టడు. ఎంత మంది పెద్ద పెద్ద ముడుపులు చెల్లించుకోగలరు చెల్లించుకోలేని వారు, బెడ్‌లు దొరకని వాళ్ళు.... రోగాలతో తీసుకుని తీసుకుని ఏ రోడ్డుమీదనో... ఏ చెట్టు కిం కనికొద్ది ప్రాణాలను వదిలి మరీ పోతారు. నన్ను సూదితో పొడిచేసరికి ఇన్ని ఆలోచనలు వచ్చినయి... ఆలోచనలకు వ్యవధి లేదు. ఉత్సాహంగా అందరూ ఎగ్జిబిషన్ చూస్తున్నారు. నా మటుకు నేను... కాస్తో కూస్తో ఉన్నవాణ్ణి. ఈ మధ్య ఆస్పత్రి చుట్టూ, డాక్టర్ల చుట్టూ తిరగలేక విసుగు పుట్టింది.

నెత్తురు క్యూలోంచి పాముల దగ్గరకు వెళ్లాను. రకరకాల పాములు బుట్టలో ఉన్నాయి. పామును చేతుల్లోకి తీసుకుని దానిమెడ ఒడుపుగా పట్టుకుని గాజు జాడీలోకి విషం పిండుతున్నాడు. పాముల్ని గురించీ, పాము విషాన్ని గురించీ అందరికీ వివరంగా చెప్తున్నాడు. గోధుమ వన్నె నాగుపాముని చూసేటప్పటికి నా వళ్ళు గగుర్పాటు చెందింది. ఈ పాములతో నా కెందుకని గుండె జబ్బు, కేన్సరు సెక్షన్‌లకు వెళ్ళాను. సిగరెట్టు తాగినందువల్లే వచ్చే నష్టాలు వివరించి చెప్తున్నాడు అతను. ఎక్సరే ఫోటోలు ఒక అద్దాల ఫ్రేములో పెట్టి కేన్సరు వ్యాధి ఎంత భయంకరమైనదో... ఆ ఫోటోల ద్వారా వివరిస్తున్నాడు. నా జేబులో సిగరెట్టు ప్యాకెట్టు బరువుగా మూలుగుతోంది... నాక్కూడా కేన్సర్ ఉందేమో అని అనిపించింది.... సిగరెట్టు ప్యాకెట్ బయటకు గిరాటు వేద్దామా అనుకున్నాను... తరువాత ఎముకలు.. రకరకాల ఎముకల వ్యాధులు... క్రీస్తును శిలువ వేసినట్టుగా... విరిగిపోయిన ఎముకలకు తెల్లటి ఇనుప మేకులు బిగించి సరిచేసే విధానం చెప్తున్నారు. మనషుల్లో ఎన్నిరకాల వాళ్ళున్నారో అన్ని రకాల వ్యాధులున్నయి. ఈ వ్యాధులన్నీ దాటి అస్థిపంజరం దగ్గరకు వెళ్ళాను. అక్కడ విపరీతమైన జనం. క్యూ పెరిగిపోయింది. ఎవరయినా ప్రశ్నలు వేస్తే అస్థిపంజరం జవాబు చెప్తోంది. నేనూ గుంపులో దూరవద్దాను... ఒత్తిడిగా ఉంది... వంపులు... సొంపులు... శరీరాలు... నన్ను తాకుతున్నాయి... ఆడ మగ విచక్షణ లేదు అక్కడ... అందరికీ అదేదో వింత చూద్దామనే. అక్కడ నిల్చున్న ఆ పంజరం నాలాగే ఉంది. ముడతలుపడ్డ చర్మం నేను కప్పుకున్నాను. అస్థిపంజరానికి అది లేదు. అదే తేడా.... అస్థిపంజరం మాట్లాడుతుంటే అందరూ నవ్వుతున్నారు. అదో పెద్ద జోక్

అయిపోయింది. రెండు కళ్ళల్లోనూ రెండు ఎర్రటి బల్బులు పెట్టారు. నోట్లో ఏదో చిన్న యంత్రంలా ఉంది. ఎవరో భావి డాక్టరు అస్థిపంజరం వెనకాల అజ్ఞాతంగా తెరలో ఉండి... దాని నోట్లోంచి మాట్లాడుతున్నాడు. ఓ ప్రశ్న అడిగితే బావుండుననిపించింది...

'ఏమయ్యా అస్థిపంజరం!.. మీరంతా ఇంత శ్రద్ధ తీసుకొని ఉత్సాహంగా అందరికీ తెలిసేట్టు బోలెడు విషయాలు వివరించి చెప్తున్నారు. ఒక్కడికి వచ్చిన వాళ్ళందర్నీ గౌరవిస్తున్నారు. ఇక్కడకు వచ్చిన వాళ్ళలో... పాపాలు చేయని వాళెవరూ ఉండరన్నట్టుగా... రోగాలు లేనివాళ్ళు ఉండరు. కొద్దో గొప్పో రోగాలున్న వాళ్ళే. మీరంతా డాక్టరు వృత్తిలో ప్రవేశించాక వీళ్ళంతా మీ దగ్గరకు వస్తే ఇంత శ్రద్ధ, ఉత్సాహం ఆదరణ చూపిస్తారా? చూపిస్తారని నాకు నమ్మకం లేదు. చూపిస్తే ఇంతమంది దిక్కులేని చావులు ఎందుకు చస్తారు' అన్నాను. నేను వేసిన ప్రశ్నకి అస్థి పంజరం నాలిక కొరుక్కున్నది... శ్రద్ధ చూపించడానికి శాయశక్తులా ప్రయత్నం చేస్తాం అన్నది అస్థిపంజరం.

'మనిషి ఖరీదెంత?' అని మరొకరు ప్రశ్న వేశారు. మనిషి శరీరంలో విలువైన ఖనిజ సంపద ఉంది. రకరకాల ద్రవపదార్థాలున్నై... బోలెడంత నెత్తురుంది, చీముంది... ప్రాణవాయువు, బొగ్గుపులుసు వాయువు శరీరం గుండా ప్రయాణం చేస్తయి.. పెద్ద పెద్ద పాముల్లాంటి పెద్దప్రేవులు, చిన్న ప్రేవులు... కొన్ని మైళ్ళు పొడుగున్న రక్త నాళాలు, ముడుచుకుపోయిన మాంసపు ముద్దలు, జల్లెడలాంటి ఊపిరితిత్తులు... తెల్లగా నిగనిగలాడుతున్న ఎముకలు... మైనపు ముద్దలాంటి ముడతలు ముడతలుగా ఉన్న మెదడు... ఇలా కవిత్వ ధోరణిలో చెప్పుకుపోతున్నది అస్థిపంజరం. 'ఖరీదెంతో చెప్పవయ్యా!' అన్నది మరోగొంతు.

'విలువైన పదార్థాలన్నీ కలిపితే దాదాపు ముప్పై రూపాయలు' అన్నది అస్థిపంజరం. ఇంతేనా? అని పెదవి విరిచారందరూ... అస్థిపంజరాన్ని తప్పించుకుని మరో విభాగానికి వెళ్ళాను. అది పిల్లలు పుట్టే విధానం. గర్భంలో పిండోత్పత్తి ఎలా జరిగేదీ... ఏ నెలలో పిండం ఏ విధంగా ఉండేదీ... గర్భంలో ఉన్న శిశువు, ఊపిరాడక, ముడుచుకుపోయి... చీము నెత్తురులో ఎలా గిజగిజ కొట్టుకునేదీ చెప్తున్నది ఆ అమ్మాయి. లేత తమలపాకులా ఉంది. సీసాలలో ద్రావకంలో ఉంచారు పుట్టీపుట్టని

శిశుపిండాలను... పిండాలు కాదు అవి మాంసపు ముద్దలు. ఆపరేషన్ చేసి శిశువును బయటకు ఎలా తీస్తారో... ప్లాస్టర్ ఆఫ్ పారిస్ బొమ్మల సహాయంతో చెప్తున్నారు

ఈ గర్భ నరకంకంటే మామూలు నరకమే హాయిగా ఉండేట్టుగా ఉంది నా ప్రాణానికి. ఇక ఛస్తే మళ్ళీ పుట్టకూడదు అనుకున్నాను. ఇన్ని బాధలుపడి ఎవరు పుడ్తారు? పుట్టకపోతే ఏ కొంపా మునగదు... పుట్టినా ఈ వైద్యుల చేతిలో పడకూడదు. ఆకలి వేస్తున్నది. ఆకలైనా, దాహమైనా, లఘుశంక తీర్చుకోవాలన్నా అన్నిటికీ నడువాయాలున్నాయి.

కాలేజీ క్యాంపస్‌లో క్యాంటీన్ ఉంది. దాంట్లో వెళ్ళి కూర్చున్నాను. ఎగ్జిబిషన్ చూస్తున్నవాళ్ళలో కొంతమంది అలసి సొలసినవాళ్ళు ఉసూరోమంటూ అక్కడికి చేరుకున్నారు. గంటల తరబడి నిల్చుని కాళ్ళు లాగుతున్నాయి. టిఫిన్ తిని కాఫీ తాగిన తరువాత ఇంటికి పోదామా అనుకున్నాను. ఇంకా చూడవలసింది బోలెడుంది అనుకుంటున్నారు అక్కడ కూచున్నవాళ్ళు కొందరు. ఆ బోలెడు ఏమిటో నాకర్థం కాలేదు. నా ఎదురుగా టేబిల్ దగ్గర నలుగురు ఆడపిల్లలు కూచుని నవ్వుకుంటూ... గోల చేస్తూ టిఫిన్ తింటున్నారు. వాళ్ళందరూ నవ్వుతుంటే ముత్యాల వర్షం కురిసినట్టుగా ఉంది. మొగ్గతొడిగిన గులాబీ పువ్వుల్లా ఉన్నారు. వాళ్ళతో పరిచయం చేసుకుంటే బావుండును. వాళ్ళ పెదిమల కదలిక, కళ్ళల్లోని చిలిపితనం చూసేవాళ్ళకు ఎంతో హాయిగా ఉంది.

'ఇంకా ఏమున్నాయమ్మా అక్కడ విశేషాలు చూడడానికి?' అన్నాను నలుగురిని ఉద్దేశించి. నా ముసలి ప్రశ్నకు వెటకారంగా ఒక నవ్వు నవ్వారు. "శవం శవం" అంటూ నలుగురూ లేచారు.

వాళ్ళ వెనకాలే నేనూ వెళ్ళాను. ఇదొక్కటే చూసి ఇంటికి వెళ్దామని. అప్పటికే రాత్రి ఎనిమిది దాటుతోంది. అది ఎనాటమీ సెక్షన్. అక్కడ చాలా జనం ఉన్నారు. క్యూ ఎప్పుడో తెగిపోయింది. శవాన్ని దగ్గరగా ఎప్పుడూ నేను చూడలేదు. అసలు కనపడని చావే భయంకరం. చనిపోయిన మనిషి శవాన్ని చూడడం ఎలా? ఆడపిల్లలే ఇంతమంది గుంపులు గుంపులుగా వెళ్ళి చూస్తుంటే నాకేమిటి అనుకున్నాను. ఆడవాళ్ళమీద మగవాళ్ళు, మగవాళ్ళ మీద ఆడవాళ్ళు పడి మరీ చూస్తున్నారు ఆ శవాన్ని. శవం దగ్గరగా తెల్లకోటులో ఉన్న ఒక భావి డాక్టరు వివరించి చెప్తున్నాడు.

నాకు క్యూరియాసిటీ ఎక్కువైంది. ఆ వ్యూహాన్ని ఛేదించుకుని, నెమ్మదిగా జరిగి ముందుకు వెళ్ళి శవం పక్కగా నిల్చున్నాను. అది మగ శవం. ఏదో మందు వాసన కొడుతున్నది. పొడుగాటి బల్లమీద దిగంబరంగా పడుకుని ఉన్నది ఆ శవం అందరివైపూ చూస్తూ. కుడికాలిమీద ఒక కత్తి కోత ఉన్నది. చర్మాన్ని కొద్దిగా బయటికి తీసి... నరాలు రక్తనాళాలు.. కనపడుతున్నాయి. బొడ్డు దగ్గర నుండి మెడవరకూ చర్మాన్ని మధ్యకు కోసి లోపల ఉన్న అన్ని భాగాలూ కనపడేట్టు చేశాడు. ఊపిరితిత్తులు, వాటిమధ్యన గుండెకాయ! అటువైపుగా లివర్, పెద్ద ప్రేవులు, చిన్నప్రేవులు... ఒక్కొక్క భాగాన్ని గ్లోవ్స్ తొడుక్కున్న చేత్తో బయటికి తీసి చూపిస్తూ వివరిస్తున్నాడు తెల్లకోటు వ్యక్తి. లోపలి అన్ని అవయవాలు ఇరుక్కుని ఒకదానిమీద మరొకటి పడిగి జరిగి చీమదూరను సందులేకుండా ఉన్నాయి. కొంతమంది అమ్మాయిలు ఆ శవాన్ని అతిశ్రద్ధగా చూస్తున్నారు... వాళ్ళు ఏం చూస్తున్నారో అర్థం కాలేదు. చూసినవాళ్ళు వెంటనే పోవడం లేదు. అందుచేత గుంపు ఎక్కువవుతోంది. నా ముందు, నా వెనుక, రెండుపక్కలా జనం... చెమటవాసన, మందువాసన, శవంవాసన భరించలేనంత దుర్భరంగా ఉన్నది. కళ్ళు, ముక్కు, నోరు, చెవులు... ఏవీ కోయలేదు. లోపలి మెదడు కనపడేట్టుగా తలను అంటే పుర్రెను రెండు భాగాలుగా చేశారు. మెదడు, మెదడు పనిచేసే విధానం వివరిస్తున్నాడు. పక్కనే మరో మెదడు బల్లమీద ఉన్నది. దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. క్లాసు పిల్లలకు పాఠాలు చెప్తున్నట్టుగా అన్నీ వివరంగా చెప్తున్నాడు.

శవం ముఖాన్ని పరిశీలనగా చూస్తున్నాను. ఎక్కడో చూసిన ముఖం. బాగా పరిచయం ఉన్న ముఖం. ఎన్నేళ్ళ కిందటో ఎరిగిన ముఖం. కొంపతీసి మావూరి చెన్న కేశవులు కాదు కదా అనుకున్నాను. పరీక్షగా చూశాను. చెన్నకేశవులు!... మా ఊళ్ళో... అదో పల్లెటూరు... పాలేరుగా ఉండేవాడు. పేదవాడు. నిజాయితీగలవాడు. నా అన్న వాళ్ళెవరూ లేరు. చచ్చిపోయి ఈ బల్లమీద ఎందుకు పడుకున్నాడో తెలియడం లేదు. అతని కుడిచెవి పరీక్షగా చూశాను. చిన్నప్పుడు చెన్నకేశవుల్ని ఎవరో గొడవలితో చెవి దగ్గర కోశారు ఒక సంఘర్షణలో. ఆ పెద్ద మచ్చ కన్పిస్తున్నది. ఈ శవం చెన్నకేశవులదే. జబ్బుగా ఉండి పట్నం వచ్చి... అందరిచుట్టూ తిరిగి దిక్కులేని చావు చచ్చేడేమో పాపం... అనుకున్నాను. తెల్లకోటు వ్యక్తితో నెమ్మదిగా సంభాషణ ప్రారంభించాను.

"ఈ శవాలు మీకు ఎక్కడ దొరుకుతై?" అన్నాను.

'మా చదువుకు బోలెడు శవాలు అవసరం. బీదవాళ్ళు... దహనానికి కూడా డబ్బులేక వదిలేసినవాళ్ళు... ఇంకా దిక్కులేక చనిపోయినవాళ్ళు... ఎవరికీ అక్కరలేని శవాలు... సేకరిస్తాం. శవం తాలూకు బంధువులు ఎవరైనా ఉంటే కొంతమంది మాకు ఇచ్చేస్తారు పరిస్థితులు బాగుండక. అలాంటివి యాభై రూపాయలకు కొంటాం....' అన్నాడు తెల్లకోటు. 'పైగా పుస్తకాల్లో చదివేవాటి కంటే శవాన్ని చూస్తే చాలా నేర్చుకొంటాం' అన్నాడు అతను. శవం కుళ్ళిపోకుండా ఏదో ద్రావకంలో పెట్టి కొన్నాళ్ళు భద్రంగా ఉంచుతారట... దీనికి ఖర్చు పెట్టే డబ్బు బతికున్నప్పుడు మందులకు వైద్యానికి ఖర్చుపెడితే శవంగా మారకపోవునేమో చెన్న కేశవులు... శవాన్ని చూడడానికి ఇరవై ఐదు పైసలు టిక్కెట్టు... జనం విపరీతంగా చూస్తున్నారు. ఎగ్జిబిషన్‌లో ఇది చాలా ముఖ్యమైన అంశం. కొన్ని లక్షల మంది చూశారు. చూస్తున్నారు. చెన్నకేశవులు చచ్చిపోయి కొన్నివేల రూపాయలు హాస్పిటల్ వాళ్లకు సమకూర్చాడు. చెన్నకేశవుల్ని ఖరీదు కట్టడం కష్టం... బతికి ఉన్నప్పుడు లేని ఆదరణ, చచ్చి సాధించాడు చెన్న కేశవులు. అందరికళ్ళూ అతనిమీదే ఉన్నాయి... పక్కన పెట్టి ఉన్న మెదడును చేత్తో పట్టుకుని చూశాను. మృదువుగా మెత్తగా చేతికి తగిలింది... గుంపులోంచి బయటపడ్డాను ఎగ్జిట్ గేటుగుండా!!

# 24

# అంతర్ముఖి సమారాధ్య

నాకు శ్రీమతికీ కొన్ని విషయాల్లో అభిప్రాయ భేదాలు రావటం కద్దు. సామాన్యంగా ఆవిడ అవునన్నదానికి నేను కాదనడం పరిపాటి. దానికి ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు. కాని నా విషయంలో మాత్రం ఆవిడ వైఖరి వేరు. నేను అవునన్న దానికి ఆమె కాదనడం చాలా అరుదు. అది నా మీద ఉండే ప్రేమవల్ల కావచ్చు. తను పూర్వోత్తర సంప్రదాయానికి చెందినదవడం వల్లనూ కావచ్చు. తన కంటే పెద్దవాణ్ణి అని గౌరవం వల్లనూ కావచ్చు. దీనివల్లను అని ఇదమిత్థంగా చెప్పలేను. కాని ఎంతో అవసరం ఉండి ప్రత్యేకమయిన కారణాలుంటే తప్ప నా మాటకు తిరుగులేదు. అలాంటి పరిస్థితుల్లో కూడా నేను సామాన్యంగా ఓటమిని అంగీకరించను. కనీసం అంగీకరించినట్లు కనపడను. దీనికి నేను అప్పుడప్పుడు గర్విస్తుంటాను. నన్ను నేను మెచ్చుకుంటుంటాను. కాని ఒక్కొక్కప్పుడు నేను సాధించిన విజయానికి కారణము నాలోని మానసిక దౌర్బల్యమేమో ననిపిస్తుంది. ఉభయులం చిన్న చిన్న విషయాల్లో కీచులాడుకున్నా, నా విజయగర్వానికి ఆమెకూడా తన సంతోషాన్ని వివిధవిధాలుగా ప్రదర్శిస్తూ ఉంటుంది. అందులో ముఖ్యమైనది 'నేను మీ దాన్ని, మీ లలితను, అంతకన్నా నా కేం కావాలి' అంటూ ఉంటుంది. లలిత అని ఆమెను సంబోధించినప్పుడల్లా ఆమె పరవశమైపోతూ ఉంటుంది. మరీ పరవశమెక్కువైపోతే, మళ్ళీ మళ్ళీ పిలవమంటూ ఉంటుంది. ఆ పేరులోనూ, ఆ పిలిచే వైఖరిలోనూ తియ్యదనం ఉంటుందని అంటుంది. ఆమెను సంతోషపెట్టడానికి అవసరమున్నా లేకపోయినా ప్రతి చిన్న విషయానికీ లలితా! లలితా! అని పిలుస్తూనే ఉంటాను. ఒక్కొక్కప్పుడు కోపంగా, ఒక్కొక్కప్పుడు ఆప్యాయంగా, మరో సమయంలో లాలసగా నవరసాల్లోనూ ఆ పిలుపు ధ్వనిపడుతూ ఉంటుంది.

ఉదయం లేచింది మొదలు ఆఫీసుకు వెళ్ళేవరకూ--

లలితా - టూత్ పేస్ట్;

లలితా - కాఫీ;

లలితా - స్నానం;

లలితా - టపల్;

లలితా - భోజనం;

లలితా - లైమయిపోయింది;

లలితా - పేపర్;

లలితా - సిగరెట్టు.

ఆఫీసుకు డ్రెస్ చేసుకుని కారులో కూర్చుని బయలుదేరే వరకూ, ఆఖరుసాగి 'లలితా - నే వెళ్తున్నాను' ఈ కేకతో నా ఉదయం కార్యక్రమం పూర్తవుతుంది. లలిత చిరునవ్వుతో నాకు వీడ్కోలు చెప్పి లోపలకు వెళ్తుంది.

  

మా మేనకోడలు పెళ్ళి నిశ్చయమైనదనీ మేమంతా తప్పక పెళ్ళికి రావాలనీ మా అక్కయ్య ఉత్తరం వ్రాసింది. పెళ్ళికి తప్పక వెళ్ళాలని సంబరపడుతూ ఇంటికి వస్తూనే లలితా అని కేకవేస్తూ, శుభవార్త అందచేశాను. తప్పక పెళ్ళికి వెళ్ళాలని లలిత మురిసి పోయింది. నేను నాలుగు రోజులు ఆఫీసుకు శలవు పెట్టాను. రైల్లో ఆ ఊరు పెళ్ళికి వెళ్ళి తిరిగివచ్చే టైముకేదు. సగంకాలం రైలు ప్రయాణంలో వృధా అయిపోతుంది. మనం కారులో బయలుదేరి పోదాం లలితా' అన్నాను. శనివారం మధ్యాహ్నం ఆఫీసు కాగానే బయలుదేరితే, రాత్రి ఏదో టైములో ఎంత ఆలస్యమైనా ఆ ఊరు చేరుకోవచ్చు. ఆదివారం కలసివస్తుంది. సరదాగా బంధువుల్తోనూ స్నేహితుల్తోనూ గడిపెయ్యవచ్చు; పెళ్ళి సావకాశంగా చూడవచ్చు; చేయించవచ్చు; పెళ్ళి భోజనాలకు తీరుబాటుగా వడ్డనలో పాల్గొనవచ్చు; అక్కా చెల్లెళ్ళతో అనురాగాలు ఒలకబోసుకోవచ్చు; బావగార్లతో సరాగాలాడొచ్చు; వియ్యాలవారిని విందుకు పిలవడానికి ధీమాగా వెళ్ళవచ్చు; వెళ్ళిన రోజు సినిమా చూడవచ్చు; లలితా! లలితా! అని తీరుబాటుగా కేక వెయ్యొచ్చు. నా ఆనందానికి అంతులేదు.

శనివారం వచ్చింది.

ఆఫీసునుండి రాగానే. 'లలితా బయలుదేరుదాం. త్వరగా రెడీ అవాలి' అన్నాను.

'ఆహారం తినయనే తెల్లవారుజామున బయలుదేరుదాం. సాయంత్రం చీకటిపడేలోగా ఆ ఊరు ఎంత నెమ్మదిగా వెళ్ళినా చేరుకోవచ్చు' అని సలహా ఇచ్చింది లలిత.

నేను 'లలితా' అని ఒక్క కేక వేసి, నాటకంలోని డైలాగులా ఇప్పుడే బయలుదేరాలి. నే నననన్నదానికి నీవు కాదనకు' అన్నాను.

'ఈ ఒక్క విషయంలో నా మాట వినండి; నేను మీ లలితను కాదా' అంది.

'నీ కవిత్వధోరణి ఇక చాలు గాని, త్వరగా బయలుదేరు' అన్నాను.

'నా మాట కాదనకండి' అని ప్రాధేయపడ్డది.

నేను కాదనే అన్నాను. పోయితీరాలి అని వక్కాణించాను. బయలుదేరాం. బయలుదేరేముందు ఆమె వంట ఇంట్లోకి వెళ్ళి. ఏదో పటందగ్గర కొంచెం సేపు గాబక్కుని. తన పుస్తకం ఒకటి చిన్నది పుచ్చుకుని కారులో కూర్చుంది.

'లలితా! నేనే గెల్చాను' అంటూ కారు స్టార్టు చేశాను. మేం పోవాల్సిన దూరం చాలా ఉంది. దారిలోకి కావాల్సిన టిఫిన్ వగైరాలు హోటల్లో పార్సిల్ చేయించి ధుమాగా సిగరెట్టు ముట్టించి, కారు నడుపుతున్నాను. లలిత మౌనంగా ఉండటం గమనించాను. కారు పోతూనే ఉంది. ఊరి పొలిమేరలు దాటింది. మంచిరోడ్డు, చక్కని గాలి, కొంచెం స్పీడ్ ఎక్కువ చేశాను. కారు దూసుకుపోతున్నది. లలిత వైపు చూశాను. ఆమె నిద్రపోతున్నదో మేల్కొని ఉన్నదో తెలియటం లేదు. అప్పుడప్పుడు గాలికి రెపరెపలాడే కేశాలు ఆమె విశాలమైన నుదురును కప్పివేస్తూ ఆమెకు జోలపాట పాడుతున్నవేమో అని అనిపిస్తున్నాయి. ఆమె నిమీలిత నేత్రాలు చూసి నేను తన్మయుణ్ణి అయినాను. 'లలితా' అని పిల్చాను. ఆమె పలుకలేదు. యోగసమాధిలో ఉన్నదేమో అనిపించింది. కారు వేగంగా పోతూ ఉంది. చీకటి పడుతూ పడుతూ ఉంది. ఎందుకో ఆమె బుగ్గ గిల్లి ఆమెను లేపుదామా అనిపించింది. బుగ్గ గిల్లాను. ఆమె ఉలిక్కిపడి లేచింది.

చిరునవ్వు నవ్వుతూ, "కారులో కూడా మీ సరాగాలేనా! స్టీరింగ్ జాగ్రత్త" అన్నది.

'లలితా! నీవు నిద్రపోతుంటే ఏమిటోగా ఉంది. ఏమైనా కబుర్లు చెప్తుంటే సరదాగా డ్రైవ్ చేస్తుంటాను' అన్నాను. కారుతోపాటే చీకటి పడేకొద్దీ నిశ్శబ్దం ఎక్కువైంది. దాంతో కారు వేగం కూడా ఎక్కువైంది. తొమ్మిది గంటలు కూడా దాటింది.

రోడ్డుకు ఇరువైపులా ఉన్న అడవిని చూస్తూ ఈ 'అడవిలో పులులూ, సింహాలూ ఉంటాయా' అని అమాయకంగా అన్నది.

'ఉంటే మన కేం భయం. మనం కారులో పోతున్నాం. ఇప్పటికి మనం వెళ్ళవలసిన దూరంలో సగానికి పైగా వచ్చేశాం. ఈ అడవి దాటేముందే ఏదైనా చిన్న ఊరు వస్తే, అక్కడ కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ బయలుదేరవచ్చు' అన్నాను.

చుట్టూ చిక్కటి చీకటి. కీచురాళ్ళ ధ్వని జోరుగా వినిపిస్తున్నది. పదిగంటలు కూడా కావస్తున్నది. కారు వెల్తుర్లో కొంచెం దూరంలో ఎవరో వ్యక్తి కారుకు ఎదురుగా వస్తున్నట్లు కన్పించింది నాకు. లలితను చూడమంటే తన కెవ్వరూ కనపడలేదన్నది. కారు కొంచెం 'స్లో' చేశాను. ఆ వ్యక్తి పెద్ద పెద్ద చేతుల్తో ఎదురుగా వస్తున్నాడు. ముఖం సరిగా కన్పించడం లేదు. మనిషి చాలా పొడుగ్గా ఉన్నాడు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ రాక్షసుణ్ణి జ్ఞాపకం తెస్తూ, భయంకరంగా నడుస్తున్నాడు. అతని పాదాలు సరిగా కన్పడడంలేదు. నాకు చిన్నప్పుడు చదువుకున్న కబంధుడు జ్ఞాపకం వచ్చాడు. నాకు భయం వేసిన మాట వాస్తవం. కారు ఆపడానికి బుద్ధిపుట్టలేదు. ఆపకపోతే ఎదురుగా వచ్చే వ్యక్తి కారుక్రింద పడిపోవడం తథ్యం. కారు అతన్ని సమీపించేకొద్దీ అతను వేగంగా కారుకు ఎదురుగా వస్తున్నాడు.

'కారు ఇంత నెమ్మదిగా పోనిస్తున్నారేమిటి?' అన్నది లలిత.

'ఎవరో మనిషి ఎదురుగా వస్తున్నట్లున్నాడు చూడు' అన్నాను.

'నా కెవరూ కన్పించడంలే' దన్నది లలిత. అంటూ ఉండగానే నా కారు ఆగిపోయింది. ఎవరో బలంగా కారుకు ఎదురు నిలబడి రెండు చేతుల్తోనూ కారు ఆపుతున్నట్లనిపించింది. కారు ముందుకు పోలేదు. కారు స్టార్టు చేసి ఎంతగానో ప్రయత్నించాను. కదల్లేదు కారు. కారు లైట్లు వెలగడం లేదు. ఆ వ్యక్తి ఇంకా

కారును బలంగా నొక్కిపట్టినట్లుగా ఉంది. కారులోంచి దిగే ప్రయత్నంలో ఉన్నాను. కాని భయంగానే ఉంది. ఆ మనిషి బందిపోటు దొంగ కావచ్చు. ఇంకెవరైనా కావచ్చు. లలిత మెడలోని నగలకోసం వాడు ముందుకు రావచ్చు. వాడు వస్తే ఆమెకూ నాకూ ప్రమాదం. ఇద్దరి ప్రాణాలూ దక్కవు. వాడిని ఎదుర్కొనడానికి నా దగ్గర ఏ ఆయుధాలూ లేవు. ఇంత బతుకూ బతికి వీడి చేతిలో చావడం ఇష్టంలేదు నాకు. కారు డిక్కీలో కొన్ని ఇనుప పనిముట్లు ఉన్నాయి. వాటిలో ఏదైనా పెద్దది ఉపయోగించి వాడిమీదికి ఉరకవచ్చు. కారు దిగి వెనక్కు వెళ్తేగాని అవి రావు. కారు దిగితే నిరాయుధుణ్ణి. దిగగానే క్షణంలో వాడు నా మీద కలియబడొచ్చు. వాడు నన్ను పిచ్చికను పిసికినట్లు పిసికిపారెయ్యొచ్చు. వాణ్ణి బాగా చూద్దామంటే కారులైట్లు వెలగడం లేదు. వాడు ఏ పక్కనైనా దాక్కున్నాడేమో, 'బానెట్' తీసి, కారు ఎందువల్ల ఆగిపోయిందో చూద్దామంటే... కారు దిగలేను. పైగా చీకటి... లలిత ఏమీ మాట్లాడ్డంలేదు. ప్రార్థిస్తుందా... అన్నట్లుగా ఉంది. 'లలితా!' అన్నాను.

'మీరు మాత్రం కారు దిగవద్దు... ఏమీ ఫర్వాలేదు. కారు అద్దాలు వేసి నా వైపు చూడండి' అన్నది.

లలితను చూసి కౌగిలించుకున్నాను. చాలాసేపామె కౌగిలిలో ఉండిపోయాను. కారు అద్దాలు పగులగొట్టినా కొట్టగలడు వాడు ఒకచేత్తో... ఆమె నా వీపుమీద చేయివేసి బుజ్జగిస్తున్నదా అన్నట్లుగా ఉన్నది. ఆమె కౌగిలిలో ఇంత     నేను ఎప్పుడూ పొందలేదు. ఆమె నన్ను కౌగిలించుకుని ఉన్నా నోట్లో ఏదో గొణుగుతుండడం గమనించాను.

'అక్కడ ఎవ్వరూ లేరు... నాకు కన్పడనివాడు మీ కెలా కన్పించాడు' అంటున్నది లలిత.

'ఇక్కడ కూడా నే చూస్తున్న దానికి నీవు కాదనడమేనా' అన్నాను. నేను ఆమె కౌగిలిమాత్రం వదల్లేదు. అరగంట అయింది.... గంట అయింది. ఇంతసేపటికీ వాడు రాకపోయేటప్పటికి... నాకు కొంచెం ధైర్యం చిక్కింది. కారు మళ్ళీ స్టార్ట్ చేయడానికి ప్రయత్నించాను. కారు కదల్లేదు.

ఎదురుగా మినుకు మినుకు మంటూ ఉన్న చిన్న దీపపువెల్తుర్లో ఎవరో వస్తున్నారు అని అనుకున్నాను... ఆ చిన్నదీపం ఇంకా దగ్గరకు వస్తున్నది. ఆ దీపంవైపే

చూడసాగాను ఆమె కౌగిలి వదిలి. ఆవైపే తీక్షణంగా చూస్తున్నాను. ఆ చిన్న దీపం ఇంకా దగ్గరకు వస్తోన్నది.

'ఇక మన కేం ఫర్వాలేదు. ఎవరో ఆడమనిషి వస్తున్నది' అన్నది లలిత.

నా సంతోషానికి మేరలేదు. కాని నాకో మూల భయంగానే ఉన్నది. ఈమె ఇందాక కారుకు అడ్డంగా వచ్చినదాని తాలూకేమోనని. లలితమాత్రం ధైర్యంగా ఉంది. ఆ దీపం, ఆ మనిషి మా కారు దగ్గరకు వచ్చింది. మా ఇద్దర్నీ చూసింది.., ఏం మాట్లాడకుండా ఓ చిరునవ్వు నవ్వింది. ఆమె చాలా వృద్ధురాలు. ఒక చేతిలో కర్ర ఉన్నది. ఒక చేతిలో దీపం ఉన్నది. ఆమె చేతిలోని కర్రను అవసరమైతే నేను ఉపయోగించవచ్చునని ధైర్యం తెచ్చుకున్నాను. కారు తలుపు తీసి బయటకు వచ్చాను.

'కారు ఆగిపోయింది. నట్టడవిలో ఇద్దరం దిగబడిపోయినాం ముసలమ్మా' అన్నాను.

'ఏం ఫర్వాలేదు నాయనా!... ఇక్కడకు కొంచెం దూరంలో మా ఇల్లు ఉంది. మీ కభ్యంతరం లేకపోతే మా ఇంటికి రండి.. తెల్లవారిన తరువాత మీరు ప్రయాణం సాగించవచ్చు...' అన్నది ముసలమ్మ.

ముక్కూ మొగమూ తెలియని ముసలమ్మ ఇంటికి అర్ధరాత్రి పోవడం ప్రమాదకరమేమో! ఆ ముసలమ్మ ఇంట్లో ఎవరైనా దారి దొంగలు మకాం వేయచ్చు. సామాన్యంగా ఇలాంటి అడవుల్లోనే వాళ్ళు మకాం వేస్తూ ఉంటారు. ముసలమ్మ మాట విని వెళ్తే, మా ఇద్దరి ప్రాణాలూ గుప్పెట్లో పెట్టుకుని వెళ్ళాలి. కీడెంచి మేలెంచమన్నారు. ఈ అడవిలో ఇల్లుందంటే నమ్మకం చిక్కడం లేదు. మేం ఇద్దరం కారు దిగిన తరువాత మమ్మల్ని చుట్టుముడితే కష్టం. నిరాయుధులం. ఇద్దరి ప్రాణాలూ ఒకసారే తీసేస్తే ఫరవాలేదు. ఒకర్ని ఒకరు చూసుకుంటూ ప్రాణాలు వదుల్తాము. నన్ను ముందు చంపి... లలితను వాళ్ళు ఏమైనా చేస్తే... నేను చనిపోయి కూడా భరించలేను. నేను బతికి ఉండిగూడా చేసేదేమీ లేదు. ముసలమ్మ దగ్గర ఉన్న కర్ర పనికిరాదు. వాళ్ళకున్న కత్తులమధ్య... ఒక్కొక్కప్పుడు వాళ్ళ దగ్గర తుపాకులు కూడా ఉంటవి. కేవలం లలిత దగ్గర ఉన్న సొమ్ముకోసం ఆశపడితే ఫరవాలేదు. ధైర్యంగా ఇచ్చేయవచ్చు. ఒంటరిగా ఉన్న స్త్రీ లలిత... ఆమెను ఏమైనా చెయ్యవచ్చును. వాళ్ళు

చాలామంది ఉంటారు. నేను ఒక్కణ్ణి... పైగా నిరాయుధుణ్ణి. కాసి ముసలమ్మమాట వినకుండా కారులో కూర్చున్నా, అపాయం తప్పుతుందని హామీలేదు.

రోడ్డు కెదురుగా లారీ ఒకటి వస్తున్నది. చెయ్యియెత్తి ఆపడానికి ప్రయత్నించాను. వాడాపలేదు. ఈ లారీ వాళ్ళు మన లోకంలో ఉండరు. వాళ్ళు పగటిమానవులు, రాత్రి దానవులు. ఒక్కొక్కపుడు లారీవాళ్ళను ఆ పరిస్థితుల్లో ఆపడం కూడా శ్రేయస్కరం కాదు. ఈ లారీవాడు ఒకవేళ ఆపి మమ్మల్నిద్దర్నీ లారీలో ఎక్కించుకున్నా... తర్వాత నన్ను ఈ అడవిలో కిందికి తోసెయ్యొచ్చు.

ఇలా అనుకుంటూ ఉండగా ముసలమ్మ... 'మీరేం సందేహపడవద్దు నాయనా... నే చెప్పినట్లు మా ఇంటికి రండి. మీ కే ఆపదా రాదు...' అని ప్రాధేయపడ్డది.

లలిత కూడా... 'ముసలమ్మ అంతగా అడుగుతున్నది... అక్కడికే పోదాం... ఏం జరిగినా.. ఆ అమ్మవారిదే దయ. ఆమెమీద భారం వేసిపోదాం. అంతకంటే గత్యంతరంలేదు... ' అన్నది.

మంచికో చెడుకో ఒక నిర్ణయానికి వచ్చాము. కారు లాక్ చేసి, ముసలమ్మ దీపం ముందు చూపిస్తుంటే వెనకాల నెమ్మదిగా వెళ్తున్నాము. అడవిలో డొంకలలోంచి. ఒక అరఫర్లాంగు దూరం వెళ్ళిన తరువాత చిన్న పాక కన్పించింది. 'ఆ కన్పించేదే మా ఇల్లు నాయనా' అన్నాది ముసలమ్మ. ధైర్యంగా మొండిధైర్యంగా లోపల ప్రవేశించాము. ముసలమ్మ మాకు ఒక చాప ఇచ్చింది. తినడానికి రెండు పండ్లు ఇచ్చింది. కొంచెం మంచినీళ్ళు తాగాం.

'ఇక మీరు విశ్రాంతిగా పడుకోండి. ఏం భయంలేదు' అన్నది ముసలమ్మ.

ప్రయాణంవల్ల, భయంవల్ల బాగా అలసి ఉన్నామేమో... మాకు బాగా నిద్ర పట్టేసింది... గాఢనిద్ర.

సూర్యోదయం అయిన తరువాత చాలా సేపటికి మెలకువ వచ్చింది. కళ్ళు నులుముకుంటూ ఆర్థకంగా లేచాను. లలిత ఇంకా నిద్రలో చిరునవ్వు నవ్వుకుంటూ ఉన్నది. వెంటనే లలితను లేపాను.

లలిత కళ్ళు తెరిచింది. మే మిద్దరమే మిగిలాం... అక్కడ పూరిపాకలేదు. ముసలమ్మ అంతకన్నా లేదు. మేం అడవిలో ముళ్ళపొదల మధ్యగా పడుకుని ఉన్నాము.

పక్కగా నాగుపాము మెలికలు చుట్టుకుని పడగ విప్పింది కేవలం కాపాడుతూ ఉన్నదా అన్నట్లు... లలిత చేయెత్తి నమస్కరించింది. నేను భయపడుతూ... నెమ్మదిగా లేచాను. ఆ పాము వెళ్ళిపోయింది. లలితకు కొండంత ధైర్యం వచ్చింది.

'ఏమండీ... మనల్ని రాత్రి అమ్మవారు కాపాడింది... కారులో ఎక్కింది మొదలు ఆమెను ధ్యానం చేస్తూనే ఉన్నాను. రాత్రి కన్పించిన ఆ ముసలమ్మ ఎవరనుకున్నారూ?' అని అన్నదాకా... నేను ఈ లోకంలోకి రాలేదు.

'మనం ఇంటిదగ్గర బయలుదేరినప్పుడే... నా కెందుకో కన్ను అదిరింది. అప్పుడు బయలుదేరడం నా కిష్టంలేదు. ఎంత చెప్పినా మీరు వినలేదు. కారులో కూర్చున్నానన్నమాటే గాని నా మనసు నాలో లేదు... అంతా మన మంచికే లెండి' అన్నది నవ్వుతూ...

'మరి మన కారు ఆపిన పెద్దపెద్ద అంగలమనిషి ఎవరో నా కర్థం కాలేదు'

'కన్పడనివాళ్ళ గురించి ఆలోచించడమెందుకు... అది కేవలం మీ భ్రమ కావచ్చు' అన్నది లలిత.

'నీవు నిజంగా లలితాదేవివి లలితా' అన్నాను ఆమెను దగ్గరికి తీసుకుంటూ...

'ప్రేమ రూపా ప్రియంకరీ! నామపారాయణప్రీతా నందివిద్యా నటేశ్వరీ!' అని మళ్ళీ ధ్యానం చేస్తూ నన్ను కౌగిలించుకున్నది లలిత. ఆ ముసలమ్మ ఎవరు? అనే సందేహం నాకున్నా... దానిని గురించిన తర్కం అనవసరం... బతికి బయటపడ్డాము. బయటపడి బట్టకట్టేము. నేను నా లలితను ఇక సహస్రనామాలుగా పిలవవచ్చు. ప్రతి నామానికి పలుకుతూ ఉంటుంది. లలిత ఎప్పుడూ నాదే... 'నేను మీదాన్నేగా' అంటూ ఉంటుంది లలిత! అందుకే 'లలితా!' అని పిల్చినప్పుడల్లా పరవశమయ్యేది ఎప్పుడూ!

# 25

# సుందరం శివం సత్యం

నాకు మా బావంటే ఇష్టం. ఎందుకు? ఎంత? అంటే నేనేం చెప్పలేను. ఒకర్ని చూస్తే ఒకరికి ఎందుకో తెలియదుగాని ఇష్టం. అలాగే మా బావంటే నాకు విపరీతమైన లైకింగ్... ఇదే ఏ మరదలుపిల్లో అంటే ఇంకేముంది. అమాంతం బావను ప్రేమించేసిందంటారు. అదృష్టవశాత్తు మగవాణ్ణి గనుక ఎవరూ చెప్పుకోరు. ఇదోరకమైన మగ ప్రేమేమో అని అనుకోవచ్చు. మా బావ మాటలు శిలల కన్నా కఠినంగా ఉంటాయి. మొహం కూడా కఠినంగానే కనిపిస్తుంది. మనసులో బోలెడు మార్దవం ఉంది. అప్పుడప్పుడు చిన్న పిల్లాడిలా ప్రవర్తిస్తుంటాడు. ప్రస్తుతం ధనవంతుల బిడ్డ. దానికితోడు వ్యాపారంలో రెండు చేతులా గడిస్తున్నాడు. ఓసారి బెజవాడ బంధువుల ఇంటికి పెళ్ళికి వెళ్ళాను. మా బావ కూడా వచ్చాడు. ఆయనకు దగ్గర బంధువులు వాళ్ళు. పెళ్ళికివచ్చిన పెద్దల్లో ఈయన వి.ఐ.పి. అందరూ ఆయన్ని వి.ఐ.పి.లాగానే చూస్తున్నారు. పెళ్ళివారింటికి పక్కనున్న ఇల్లు కూడా – వాళ్ళెవరో మంచివాళ్ళు పాపం ఖాళీచేసి పెళ్ళికి వచ్చిన బంధువులకిచ్చారు. భోజనాలయిన తరువాత రాత్రి పడుకోడానికి స్థలం కోసం వెతుక్కుంటున్నాను. పక్క ఇంట్లో బోలెడంత ఆవరణ ఉంది. దాంట్లో చాలా వేపచెట్లున్నాయి. ఒక మూల నులకమంచం ఎవరికీ కనపడకుండా నిల్చుని ఉంది. మరీ ఒదిగి. కొంతమంది బెడ్డింగులు, జంపఖానాలు పరచి ఎక్కడి వాళ్ళక్కడ పడుకు వాలుస్తున్నారు. నేనా నులకమంచం తీసుకువచ్చి దూరంగా ఓ మూల వేపచెట్టుకిందవేసి దానిమీద పడుకున్నాను. ఎండాకాలం, చిటచిటలాడుతున్నది. చొక్కా బనీను కూడా తీసి పడుకున్నాను. నులకమంచంలో నులక గరుగ్గా పదునుగా ఉంది. వీపు నులకకేసి రుద్దుతూ అటూ ఇటూ కదులుతుంటే చాలా హాయిగా ఉంది. నులక బిగింపు సరిగాలేదు. ఉయ్యాల్లో పడుకున్నట్టుగా

ఉంది. ఓ సిగరెట్టు ముట్టించి నులకమంచం సుఖాన్ని అనుభవిస్తూ ఆకాశంలోకి చూస్తున్నాను. వేపచెట్టు మీంచి వచ్చే గాలికూడా వేడిగా ఉంది. ఇంతలో మా బావ నన్ను పనికట్టి ఎక్కడ నుండి వచ్చాడో అమాంతం ప్రత్యక్షం అయి 'ఏంరా నీ కోసం వెదుకుతుంటే ఇక్కడపడుకున్నావా?' అన్నాడు చాలా కఠినంగా... ఇక్కడ హాయిగా ఉంది బావా అన్నాను. అయితే జరుగు, అంటూ నా పక్కన చేరాడు. ఆ మంచం చిన్నది. ఇద్దరికీ సరిపోదు. మరీ అంత దగ్గరకు రాకు బావా అన్నాను. అనేకొద్దీ పక్కకు జరుగుతున్నాడు. ఒరేయ్... పూర్వజన్మలో నీవు నా పెళ్ళానివిరా అన్నాడు. నాకు నిజానికి సిగ్గేసింది.

ఎప్పుడన్నా బీడీ కాల్చేవురా? అన్నాడు. ఛ... అదేమిటి బావా! మన్వా నేనూ బీడీలు కాలుస్తామా! రైల్వేపోర్టర్లూ, రిక్షావాళ్ళూ కాలుస్తారుగాని అని అన్నాను. దాంట్లో ఏమున్నా మజావుంటదేమో చూడాలి అంటూ రెండు బీడీలు తీసి నాకొకటి ఇచ్చాడు. నాకాశ్చర్యం వేసింది. గోల్డ్‌ఫ్లేక్, స్పెన్సర్ సిగార్లూ తప్ప ఎప్పుడూ మరోటి కాల్చని బావ బీడీ ఎందుకు ముట్టించాడో తెలియదు. బీడీ ముట్టించి దట్టంగా నా మీదికి పొగవదిలాడు. గుర్రబ్బండీ వాసనవచ్చింది. రెండు దమ్ములు లాగి భలేఘాటురా .. అన్నాడు. కంపెనీ కోసం నేనూ ముట్టించాను. ఆ ఘాటుకు తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరి అయ్యాను. అవతల పారేశాను. ఆయన నవ్వాడు. నేనూ నవ్వాను. ఇద్దరం నవ్వుకున్నాం. ఈ వేళ భోజనం చాలా హెవీగా ఉందిరా. గోంగూరపచ్చడి బ్రహ్మాండంగా ఉందిరా అన్నాడు. ఆయనకు ప్రతి దాంట్లోనూ ఆనందం కన్పిస్తుంది. మాట్లాడుతూ మాట్లాడుతూ నిద్ర కుపక్రమించాడు. ఆయనకు కళ్ళు మూసుకుంటే వెంటనే నిద్రపడుతుంది. గురకలుగూడా పెడుతున్నాడు. నిద్రలో నా మీద చేయివేశాడు. మా బావనుగురించి ఆలోచిస్తూ పడుకున్నాను. ఇలాంటి బావ నాకు లభించడం నా అదృష్టమే అనుకున్నాను.

వ్యాపారనిమిత్తం హైదరాబాదు అప్పుడప్పుడు వస్తుంటాడు బావ. వచ్చేటప్పుడు ఏదో మునిగిపోయినట్టుగా టెలిగ్రాం ఇస్తాడు. నాకసలు ఎక్కడనుండయినా టెలిగ్రాం వస్తే విపరీతమైన భయం, ఎక్కడ ఎవరికి ఏం కొంప మునిగిందేమోనని. ఆయన నాతో చాలాసార్లు అన్నాడు. హైదరాబాదులో అడుగుపెడుతూనే నీవే ముందు కన్పించాలిరా... అని. ఒకసారి ఏదో అర్జంటు పని ఉండి స్టేషనుకు వెళ్ళలేదు.

టాక్సీ దిగుతూనే ఏంరా... కళ్ళు నెత్తిమీదికి వచ్చాయా... అపుడే పెద్ద ఆఫీసరువైగదూ నీకంటికి మేం కన్పిస్తామా? అన్నాడు. ఆ మాటలు కఠినంగానూ ఓ విధమయిన విసురుగా ఉన్నాయి. అలాంటప్పుడు నేనేం సమాధానం చెప్పకుండా నవ్వుతాను. అంతకన్న పెద్దగా ఆయన నవ్వుతాడు. భుజంమీద గట్టిగా చరుస్తాడు పెద్దగా. ఆయనవి బలమైన చేతులు, పొడవైన వేళ్ళు. వీపుమీద అయిదువేళ్ళు అచ్చు పడవలసిందే. కొంచెం బాధ కలిగినా ఎందుకో హాయిగా ఉంటుంది. భోజనానికి లే బావా అంటే కందిపచ్చడి చేశారా లేదా? అంటాడు. బావగారు వస్తే అది లేకుండానా... అంటాను. ఆయనకప్పుడు ఎంత సంతోషమో చెప్పలేం. ప్రతి చిన్న విషయానికి ఆనందిస్తాడు. అది నాకెంతో తృప్తినిస్తుంది. ఇతరులను కూడా అలాగే ఆనందపరుస్తాడు. మా బావ వస్తే నాకు పండగలాగే ఉంటుంది. మా బావను తల్చుకున్నప్పుడల్లా మా అక్క ఎంత అదృష్టవంతురాలో అనుకుంటూ ఉంటాను. మా అక్కపేరు సుందరి. ఆమెను సురీ అనీ దరీ అని చిలిపిగా పిలుస్తుంటాడు. ఆయన నోటికి ఏదొస్తే ఆ పేరుతో పిలుస్తుంటాడు. నన్నోసారి ఒరేయ్ చతుర్భుజం.... అన్నాడు. ఏమిటి బావా ఈ పేర్లు. నీకొచ్చిన జామెట్రీ అంతా చూపించేస్తున్నావ్... అన్నాను.

నీ పేరు శివరామారావు కాదుటోయ్... అన్నాడు. అవును నా పేరు అదే. నన్ను శివం అంటాడు బావ. ఆ పేరుతో పిలిస్తే నాకెంతో బావుంటుంది. మా బావను గురించిన సంఘటనలు చెప్పుకుపోతే ఎంతైనా ఉన్నాయి. నాకో చెల్లెలుంది. ఆమె పేరు సత్యవతి. ఎమ్మే ప్యాసయి కాలేజీలో ఉద్యోగం చేస్తున్నది. ఆమెను సత్యం అని పిలుస్తాడు బావ. చిన్నప్పుడు మహా ఏడ్పించేవాడు ఆమెను. ఆమె పియుసి చదువుతున్నప్పుడు ఓసారి బావతో అన్నది "నీకంత పలుకుబడి ఉన్నది గదా నాకో చిన్న ఉద్యోగం ఇప్పించగూడదూ" అని. మా బావ నవ్వుతూ 'అక్కడా అక్కడా ఉద్యోగం ఎందుకూ... నా దగ్గరే నాకు పి.ఏ.గా ఉండు. 'ఫే' మాత్రం ఏమీ ఉండదు' అన్నాడు. సత్యవతి నవ్వింది. నేనూ నవ్వేను. అందరం నవ్వేం... అందరి నవ్వూ అయిన తరువాత 'పిచ్చిపిల్లా.. నీకు ఉద్యోగం ఎందుకమ్మా. నీకో మంచి సంబంధం చూసి వైభవంగా పెళ్ళిచేస్తాం అందరం కలిసి' అని అన్నాడు. ఫో... బావా... అంటూ సత్యవతి పరుగెత్తింది. అదా మగా విచక్షణలేకుండా అందర్నీ నవ్విస్తుంటాడు బావ. జీవితంలో ఆనందం తప్ప మరోటి ఎరుగని వ్యక్తి. మా లలిత (నా శ్రీమతి) కూడా

అన్నయ్యగారు వచ్చారని అంటూ నోరంతా తెరచుకుని కళ్ళు పెద్దవిచేస్తూ గెంతినంతపని చేస్తుంది. మా బావ ఎప్పుడైనా మా ఇంటికి వచ్చినప్పుడు. సత్యవతి ఇప్పుడు గుంటూరులో పని చేస్తున్నది.

నాకు మరో చెల్లెలుంది. మాపింతల్లిగారమ్మాయి పుత్తడిబొమ్మ... పేరు అన్నపూర్ణ. ఆమె పెళ్ళికి వెళ్ళినప్పుడు నేనూ, బావా, ఎంత అల్లరి చేశామో! ఎంతో సరదాగా గడిపేం. అన్నపూర్ణకు బోలెడు ప్రజెంట్సు తీసుకొచ్చాడు బావ. ఆ రోజు రాత్రి ఊళ్ళో ఎక్కడో హరికథ చెప్తున్నారని తెలిసి నన్ను లాక్కెళ్ళాడు. హరికథ వింటూ బ్రహ్మానందంగా ఉన్నాడు. ఇంటికివచ్చి హరిదాసు ఎగిరి చిందులు వేసినట్టే తనూ ఎగిరి చిందులు వేసాడు. ఏమిటి బావా మరీ చిన్నపిల్లాడి వయిపోతున్నావ్ అంటే నా మీద ఇంతెత్తున ఎగిరేడు. నేను కాలికి గజ్జెకట్టి చేతికి చిరుతలు తీసుకుంటే ఎలా ఉంటుందో తెలుసా... అంటూ ఒక పద్యం ఎత్తుకున్నాడు. బావంటే ఆయనే బావ. అన్నపూర్ణ పెళ్ళి అలా జరిగిపోయింది. పెళ్ళి మొన్న మొన్న అయినట్టుగా ఉంది. మూడేళ్ళయినా. మా బావ వాళ్ళను ఆశీర్వదిస్తూ చిలకా గోరింకల్లాగ అన్యోన్య దాంపత్య సుఖంతో కలకాలం పండంటి పిల్లల్ని కని హాయిగా వర్ధిల్లండి అని దీవించాడు. నేనూ దీవించాను. అందరూ దీవించారు. పదే పదే పేర్లు చెప్పించారు. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ భోజనాల దగ్గర కూర్చున్నప్పుడు మా బావ నానా హడావిడి చేశాడు. వాళ్ళచేత ఒకరి ఎంగిలి ఒకరికి తినిపించాడు. అన్నపూర్ణ మొగుణ్ణి అమాంతం కావలించు కున్నాడు బావ. కావలించుకుని అతణ్ణి ఊపేస్తూ నీవు చాలా లకీఫెలో వోయ్... నీకు బంగారుబొమ్మ దొరికింది అన్నాడు. మా బావ ఆప్యాయతను చూస్తుంటే నాకు కళ్ళు చెమర్చినయి.

ఆ దృశ్యం ఇంకా నా కళ్ళల్లో మెదులుతూనే ఉంది. పుత్తడిబొమ్మ... అన్నపూర్ణకు ఇంతలో ఇంత అవాంతరం వస్తుందనుకోలేదు.

పెళ్ళయిన సంవత్సరానికే అన్నపూర్ణ మొగుడు జీప్ యాక్సిడెంటులో... అన్నపూర్ణ గాజులు పగలగొట్టి స్టీరింగ్ బలంగా గుండెలకు అదుముకుని పోతూపోతూ ఆమె నుదుటి కుంకుమ బలంగా చెరిపేసి ఆమెను పేలవం చేసి మరీ వెళ్ళిపోయాడు నిర్దాక్షిణ్యంగా.

అన్నపూర్ణకు ఇప్పుడు ఇరవై ఏళ్ళు. ఈ విషాదవార్త విన్నప్పుడు మా బావ ఎంతగానో ఏడ్చాడు. ఆ విషయం తలపు వచ్చినా దుఃఖం కట్టలు త్రెంచుకుని వచ్చేది. చిన్నపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చేవాడు. సంవత్సరం దాటింది. గాయం క్రమంగా మానుతున్నది. అన్నపూర్ణ ఇప్పుడు అత్తవారింట్లోనే అత్తమామలకు సపర్యలు చేస్తూ ఉంది. వాళ్ళది గోదావరి జిల్లాలో ఓ పల్లెటూరు. లలిత ఎప్పుడూ అంటుంది ఆమెను తీసుకురమ్మనమని. ఆ పల్లెటూర్లో బొట్టన్నా పెట్టుకోనివ్వరు. అందరూ కాకులు పొడిచినట్లు పొడుస్తారు. అదీ ఆమె బాధ. ఇక్కడకు తీసుకువస్తే ఏదో చిన్న ఉద్యోగంలో చేర్పించవచ్చునని లలిత అనుకుంటూ ఉంటుంది. లలితకు ఎన్నో కోరికలున్నాయి అన్నపూర్ణను మనిషిని చెయ్యాలని. ఇంటికి రాగానే ముందు చేసేపని లలిత ఆమెకు బొట్టు పెడుతుందట. లలిత ఎంత అమాయకురాలూ అనుకున్నాను.

  

ఎప్పుడూ అన్నపూర్ణే నా కళ్ళల్లో ఉంటుంది. అన్నపూర్ణను గురించి ఆలోచిస్తున్నాను. ఇంతలో లలిత టెలిగ్రాం వచ్చిందండీ... అన్నది. టెలిగ్రాం మా బావ దగ్గరనుండి. ఎప్పుడూ తను వస్తున్నాని ఇచ్చేవాడు. ఇప్పుడు నన్ను రమ్మన్నాడు. పైగా అర్జంటట.... నాకు కాళ్ళూ, చేతులూ ఆడలేదు.

'ఏమండీ నేనూ వస్తాను పదండి... అన్నయ్యగారు టెలిగ్రాం ఎందుకిచ్చారో అని నాకూ అదుర్దాగా ఉంది. మీరు ఒక్కరూ వెళ్తే నేనిక్కడ ఒక్కదాననీ బిక్కుబిక్కు మంటూ కూచుంటే మరీ ఆందోళనగా ఉంటుంది...' అన్నది లలిత. అన్నయ్యగారికి ఏ ఆపదా రాకూడదని వేయి దేవుళ్ళకు మొక్కుకున్నది లలిత.

అన్నపూర్ణకు అన్యాయం జరిగినప్పటి నుండీ మా ఇద్దరికీ మనసు ఎప్పుడూ ఆందోళనకరంగా ఉంటోంది. ఎప్పుడు ఏది వినవలసి వస్తుందో అని. అయినా మా బావకు బోలెడు బలగం ఉంది. కో అంటే కోటి మంది వచ్చి వాల్తారు. ఆదుకుంటారు. ఎంత వద్దనుకున్నా ఎప్పుడూ మనసు కీడే ఊహిస్తుంది. అందుకేనేమో కీడెంచి మేలెంచమన్నారు. అయినా మా బావను చూసి చాలా రోజులయింది. ఆయనో గమ్మత్తుమనిషి. నన్ను ఊరికే చూద్దామని అలా అంటే గాని రానని టెలిగ్రాం ఇచ్చాడేమో. ఇన్ని ఆలోచనలెందుకు ఒకసారి వెళ్తే సరిపోదూ అనుకున్నాను. మా బాస్‌కు ఫోను చేసి చెప్పి నేనూ లలితా బయలుదేరాం. రైలులో కూచున్నంత సేపూ

లలిత మౌనంగా, కిటికీ దగ్గర కూర్చుని కిటికీలోంచి ఆకాశాన్ని, భూమిని, కూడా పరుగెత్తుకొస్తున్న చెట్లనీ తదేకదీక్షతో చూస్తున్నది. నేను సిగరెట్లు ఊదేస్తున్నాను.

మా బావ ఇల్లు చాలా పెద్దది. దగ్గర ఉండీ మరీ మోడరన్‌గా కట్టించుకున్నాడు. ఇంటిముందు రకరకాల క్రోటన్స్... పూలమొక్కలు. ఆయనకు బోగిన్‌విలా అంటే చాలా ఇష్టం. రంగు రంగుల బోగిన్‌విలా నాలుగువైపులా ఇంటిని అంటిపెట్టుకుని ఉంటాయి. ఇంట్లో నౌకర్లకేం కొదవలేదు. రెండు జాతికుక్కలున్నాయి. హైదరాబాదు వచ్చినప్పుడల్లా వాటికోసం ఖరీదైన బిస్కెట్లు తీసికెళ్తుంటాడు. ముగ్గురు పిల్లలు బావకు. పెద్దది ఉమ పన్నెండేళ్ళుంటాయి. తరువాత రమ, మూడోవాడు రవి. అయిదేళ్ళుంటాయి. బడికి వెళ్తున్నాడు. మామూలుగా పెద్దవాళ్ళ ఇళ్ళల్లో ఉండే ఆధునిక పరికరాలన్నీ ఉన్నాయి. రేడియోగ్రామ్ మొదలుకుని రిఫ్రిజిరేటర్ దాకా. రిఫ్రిజిరేటర్‌లో దోసావకాయ పెట్టించాడు సుందరక్కతో పోట్లాడి. దాంట్లో పచ్చళ్ళూ, ఊరగాయలూ పెట్టుకుంటారటండీ అని నవ్వింది ఓసారి మా సుందరక్క.

రైలు దిగి భయపడుతూ భయపడుతూ, నేనూ లలితా ఇంట్లో అడుగు పెట్టాం. వెంటనే మా బావ కన్పడలేదు. ఇల్లంతా బంధువులతో సందడిగా ఉంది.

ఒక గదిలో సుందరక్క పడుకుని ఉంది. పక్కనే బావ కూచుని ఉన్నాడు. నన్ను చూస్తూనే, ఒరేయ్... మీ అక్క దగ్గర కూచో అన్నాడు. నేను అటువైపుగా వెళ్ళి అక్కపక్కన కూచున్నాను. సుందరక్క రెండు రోజులనుండి కోమాలో ఉందట. డాక్టరు అది డయాబెటిక్ కోమా అన్నాడు. మందులూ ఇంజక్షన్లు ఇస్తున్నారు. మరో ఇరవై నాలుగు గంటల్లో తెలివి రావచ్చు అంటున్నాడట డాక్టరు. ఎంతకీ తెలివిరాదేం అని డాక్టరు హోరా హోరీగా పోట్లాడుతున్నాడు. బెజవాడ పెళ్ళిలో గోంగూర పచ్చడి తిని టీడీకాల్చిన బావ నాకెదురుగా కూర్చుని ఉన్నాడు. ఈ బావే అన్నపూర్ణ పెళ్ళిలో హరికథ విని వచ్చి ఇల్లంతా చిందులు వేశాడు. ఇప్పుడు చలనరహితంగా భయంకర నిశ్శబ్దంలో కూచుని ఉన్నాడు. ఇల్లంతా బంధువులతో సందడిగా ఉన్నా బావురుమంటోంది. సుందరక్క ఆ ఇంటికి దీపం. ఆమె అటూ ఇటూ కదుల్తుంటేనే ఆ ఇంటికి వెలుతురు. ఆ వెలుతురుముందు ఏ ట్యూబ్‌లైట్లూ పనికిరావు.

సాయంత్రం మళ్ళీ డాక్టరు వచ్చాడు. కోమాలో కొన్ని కాంప్లికేషన్స్ కూడా వచ్చాయి అన్నాడు. కిడ్నీస్ ఎఫెక్ట్ అయినయి. బ్లడ్ సర్క్యులేషన్ మామూలుగా లేదు.

ఇంజక్షన్స్ ఇస్తూనే ఉన్నాడు. సుందరక్క కళ్ళు మూసుకునే మా అందరివైపు చూస్తున్నది. సత్యవతి కూడా వచ్చినట్లుంది. పిల్లల్ని సముదాయిస్తున్నది. మరో గదిలో కూర్చున్న వాళ్ళతో ఏదో కబుర్లు చెప్తున్నది. దపని ఆపడం కష్టం. పప్పి అమ్మ దగ్గర పడుకుంటా నంటున్నాడు.

గది గుమ్మంలో నిల్చుని 'అన్నాయ్. ఓసారి రారా...' అని నన్ను పిల్చింది. 'బావగారు మరీ బావైపోతున్నారు. అలా వసారాలోకి తీసికెళ్ళి ఆయనతో ఏదైనా మాట్లాడుతూ ధైర్యం చెప్పు' అని అన్నది. నాకాసమయంలో బావతో మాట్లాడాలంటే భయంగానూ దిగులుగానూ ఉన్నది.

సత్య కాఫీ తెచ్చి ముందు గదిలో ఉంచింది.

బావను నెమ్మదిగా చేయిపుచ్చుకుని లేవదీశాను. యాంత్రికంగా నాతో వచ్చి కాఫీ తీసుకుంటున్నాడు. కాఫీ తాగుతూ బావే సంభాషణ కుపక్రమించాడు. 'ఒరేయ్... ఆడవాళ్ళకు డయాబిటీస్ వస్తుందిరా... నేనెప్పుడూ అనుకోలేదు. అది లోపల దాక్కుని ఇప్పుడు బయటపడ్డది. సుందరి ఎప్పుడూ నాతో అననేలేదు దీన్ని గురించి...' అంటూ.

'అవును బావా... ఆ జబ్బు లక్షణమే అంత. మొదట్లో ఏమీ తెలియదు. ఆరోగ్యంగా మిసమిసలాడుతూనే కన్పిస్తారు. అయినా మూడు నాల్గేళ్ళ నుంచి... నెమ్మదిగా ఇప్పుడు బయట కొచ్చింటుంది' అన్నాను.

'ఈ కోమా చూస్తుంటే నాకు భయంగా ఉందిరా' అన్నాడు.

'ఈ రాత్రికి తెలివి వస్తుందిలే బావా... డాక్టరు ధైర్యం చెప్పేడుగా' అన్నాను.

ఇద్దరు డాక్టర్లు ఒకరిని ఒకరు సంప్రదించుకుని వైద్యం చేస్తున్నారు. శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నారు. ఈ రాత్రి గడిస్తే ఫరవాలేదన్నాడు డాక్టరు.

ఆ రాత్రి గడియారం వైపే చూస్తూ కూచున్నాను. బలవంతాన చేతుల్తో నెట్టిన ఆ ముళ్ళు కదలడంలేదు. మా బావా నా భుజంమీద చేయివేసి నన్నంటి పెట్టుకునే కూర్చున్నాడు.

సుందరక్క ఆ ఇంటికి దీపం. మిణుకు మిణుకుమంటూ ఉంటే, ఆ జ్యోతి గాలికి అటూ ఇటూ పాము పడగలా కదులుతున్నది. మేం చూస్తుండగానే ఎవరో గట్టిగా ఊదేశారు దాన్ని. అటూ ఇటూ వేగంగా కదులుతూ ఒక్కసారి ఆరిపోయింది.

మా బావ నన్ను కావలించుకుని ఘొల్లుమన్నాడు. గుండెలు బద్దలయ్యేట్టు ఏడ్చాడు. ఫెడీ ఫెడీ గుండెలు బాదుకున్నాడు. ఆ ఇంట్లో చీకటి చిందులు తొక్కింది. ఇంతకన్నా జరిగిన ఘోరాన్ని వర్ణించలేను. రాస్తుంటేనే నాకు ఏడుపు వస్తున్నది. ఏ ప్రేమ సంఘటనో అయితే అందరికీ సంతోషాన్ని గలిగించేట్టుగా వర్ణిద్దును.

మర్నాడు జరగవలసిన కర్మకాండలన్నీ యథావిధిగా జరిగినై. ఏదీ ఆగదు.

రోజా సుందరక్కకు పూలు ఇచ్చే మనిషి ఎంతగానో ఏడ్చింది. సిరిగలతల్లీ సుందరమ్మా... అప్పుడే నీకు నూరేళ్ళు నిండేయా... అంటూ భోరు భోరున ఏడ్చింది. మహాదొడ్డ ఇల్లాలు... అన్నది. శ్మశానానికి వచ్చి బుట్టెడుపూలు శవంమీద కుమ్మరించింది. సుందరక్కకు మల్లెపూలంటే ఇష్టం. ఆ బజారువాళ్ళంతా సుందరక్కను తల్చుకుని కంటతడి పెడుతూనే ఉన్నారు.

ఎన్నాళ్ళుండగలను బావ దగ్గర! బావను ఎవరు ఓదార్చగలరు! అక్కడ ఉన్నన్నాళ్ళూ ఉండి నేను లలితా బయలుదేరేం. మా సుందరక్క పోయిందన్న దుఃఖంకన్నా, మా బావకు ఇలాంటి ఆపత్తు వచ్చిందని రైల్లోకూడా నాకేడుపు వచ్చింది. రైలు కూడా మాతోపాటు రొదపెడుతూనే మమ్మల్ని తీసుకువచ్చి హైదరాబాద్‌లో పారేసింది.

  

రోజులు గడుస్తున్నాయి. కాలం పరుగెత్తుతూనే ఉంటుంది. అన్నపూర్ణ మొగుడుపోయి రెండేళ్లు దాటింది. ఇప్పుడు సుందరక్క, తగిలిన వేలుకే తగులుతుంది దెబ్బ. రెండోసారి తగిలిన దెబ్బ మరీ బాధగా ఉంటుంది. మొదటిది పూర్తిగా నయం కాదు గనుక, మా బావకు బోలెడు ఆస్తి ఉంది కనుక, బెల్లం చుట్టూ చీమలు మూగాయి. ఆయన బంధువులెవరో ఒకళ్ళిద్దరు, ఇప్పుడు ఆయన దగ్గర ఉంటున్నారు. ఒకాయన వేలువిడిచిన మేనమామ. రెండో ఆయన ఆ మేనమామకు దగ్గర చుట్టం. వ్యాపారంలో సహాయం చేద్దామని వచ్చారు. బావకిప్పుడు నలభై ఏళ్ళు. ఈ వయసులో అలాంటి పరిస్థితుల్లో ఏ వ్యసనానికైనా బానిస కావడానికి అవకాశాలున్నాయి... కొన్ని దుఃఖం మరచిపోవడానికి, కొన్ని వయసు మరచిపోవడానికి ఎవరైనా వ్యసనాలను అలవాటు చేసుకుంటారు. మా బావను గురించి నాకూ లలితకూ ఇదే భయం పట్టుకుంది. ఒక భయం తరువాత మరో భయం.

లలిత ఓ రోజు బావను గురించి ప్రస్తావన తెచ్చింది. ఏమండీ చాలా రోజుల్నుండి మిమ్మల్నో మాట అడగాలనుకుంటున్నానని...

'అన్నపూర్ణకు పెళ్ళి చేస్తే బావుంటుందండీ... అన్నయ్యగారు చేసుకోవచ్చు. ఈ పని మీరు పూనుకుంటే అవుతుంది' అన్నది. 'ఆ పని మహానుభావుడు వీరేశలింగానికే చెల్లింది. నేనేం చేయగలను' అన్నాను.

ఇలాంటి వివాహాల్ని గురించి చాలా సేపు మాట్లాడుకున్నాం నేనూ లలితా.

'దీంట్లో తప్పేముంది? భర్తపోయిన అన్నపూర్ణ, భార్యపోయిన అన్నయ్యగారూ... ఇద్దరూ ఒకే పరిస్థితిలో ఉన్నారు గదా. ఆయన పెళ్ళిచేసుకోకుండా ఉండేవయసు కాదు. మగవాడన్న తరువాత తప్పక చేసుకొని తీరుతాడు. ఏ చిన్న పిల్లగొంతో కోయడం కన్నా అన్నపూర్ణలాంటి దాన్ని చేసుకుంటే?' అన్నది లలిత.

'బాగానే ఉంది కానీ... మా బావ ఒప్పుకోవద్దూ. అయినా అందరూ ముక్కుమీద వేలువేసుకుంటారు. ఇది జరిగితే...' అన్నాను.

'అన్నపూర్ణ కుంకుమకైనా నోచుకోలేదు. ఎలా ఉందోపాపం... ఓసారి చూసి రావాలి.' అన్నది లలిత.

అన్నపూర్ణ మామగారికి దాదాపు యాభై ఏళ్ళుంటాయి. ఆయన తల్లి రాంబాయమ్మగారు వృద్ధాప్యంలో ఆయన దగ్గరే ఉంటున్నారు. ఆయనకంత వయసు ఉన్నా చిన్నవాడుగా కన్పిస్తాడు. అన్నపూర్ణ అత్తగారు గూడా చలాకీ అయిన మనిషే ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉంటుంది. వాళ్ళ ముగ్గురి మధ్య అన్నపూర్ణ ఎలా ఉందో ఏమిటో? ఒకసారి చూసి రావాలి.

నేనోసారి కాకినాడ క్యాంపుకు వెళ్ళాల్సివచ్చింది. అన్నపూర్ణ అత్తవారి ఊరు అక్కడకు దగ్గరే. ఓ ఆదివారం వెళ్ళి రావచ్చు.

లలితకూడా నాతో బయలుదేరింది.

రైల్లో పోతున్నామన్న మాటేగాని అన్నపూర్ణే కళ్ళల్లో మెదుల్తున్నది. తెల్లచీర... నుదుటిమీద కుంకుమలేని చిన్న ఖాళీనున్నా, తైలసంస్కారం లేని జుట్టూ... పాలిపోయిన ముఖం... గాజులు లేని బోసి చేతులు.. ముసలివాళ్ళలా నిండుగా కప్పుకున్న పమిట...

పొద్దున్నే ఎవరన్నా నిద్రనుండి లేస్తే ఎవరికంటా పడకుండా పక్కకు పక్కకు తప్పుకు తిరుగుతున్న అన్నపూర్ణ...

ఈ కళ్ళతో అన్నపూర్ణను చూడలేనండీ... అన్నది లలిత.

ఆదివారంనాడు ఆ ఊరు చేరుకుని భయం భయంగా వాళ్ళ ఇంట్లో అడుగు పెట్టాం నేనూ లలిత.

మా ఇద్దరి కళ్ళూ అన్నపూర్ణకోసం వెతుక్కుంటున్నాయి. ఆమె కన్పించలేదు. పరంధామయ్యగారు నోటినిండా పలుకరించాడు. ఆయన భార్యకూడా చిరునవ్వుతో పలుకరించింది... నేనింకా అటూ ఇటూ చూస్తూనే ఉన్నాను అన్నపూర్ణ కోసం.

'అమ్మాయి ఇంతకుముందే మా అమ్మగారితో వెళ్ళింది. వేణుగోపాలస్వామి ఆలయంలో పురాణం చెప్తున్నారు. వచ్చేస్తుందిలెండి...' అన్నారు పరంధామయ్యగారు.

ఇప్పటినుండీ పురాణాలకూ, హరికథలకూ పెళ్ళడం తర్ఫీదు చేస్తున్నారన్న మాట! అని అనుకున్నాను.

ముసి ముసి నవ్వు నవ్వుకుంటూ పరంధామయ్యగారి భార్య మాకు కాఫీ తెచ్చి ఇచ్చింది. నేను కాఫీ తాగుతూ అటూ ఇటూ చూస్తున్నాను. అటువైపు గదిలో పాతకాలపు ఎత్తైన పందిరిమంచం. దానిమీద రంగు రంగుల దుప్పటి. ఆ గది అధునాతనంగా లేకపోయినా... ఓ చక్కటి బెడ్‌రూమ్ అని తెలియచేస్తున్నది. గోడలకేవో పటాలున్నాయి. ఆ పటాల్లో ఊడొత్తులుంచిన గుర్తులు తెలుస్తున్నాయి నల్లగా నిలువు గీతలు. మరెక్కడా ఆ ఇంట్లో కనీసం నులకమంచమైనా కన్పించలేదు. చిరిగిపోయిన చాపలు రెండు మూలగా గోడకు ఆనించి ఉన్నాయి. అందులో ఒకటి అన్నపూర్ణది అయి ఉండాలి. నా మనసు చివుక్కు మన్నది.

పరంధామయ్యగారి భార్య మా మీద సానుభూతి చూపిస్తూ ఏదో మాట్లాడుతున్నది. మా సుందరక్కను గురించి. మా బావకు కొండంత కష్టం వచ్చిందన్నది. ఆ మాటా ఈమాటా మాట్లాడి ఏదో సంబంధం సంగతి చెప్పింది. అదీ మా బావకు. ఎవరో వాళ్ళ బంధువుల అమ్మాయిట. 'చిన్నవాడేగా మీ బావ పాపం. ఇంతా చేస్తే నలభైఏళ్లు. ఆ అమ్మాయి అందచందాలకి లోటు లేదు' అంటూ చెప్పుకుపోయింది ఆవిడ.

మధ్యలో పరంధామయ్యగారందుకుని 'అదేవిటే.. ఆ మెల్లకన్ను అమ్మాయి సంబంధమా నీవు చెప్పేదీ' అంటున్నారు.

'అయితే ఏమండీ... సలక్షణంగా ఉంటుంది. పెళ్ళికొడుకు మాత్రం రెండో పెళ్ళివాడు కాదూ? కళ్లు కొంచెం మెల్ల అయితే ఏం... కళ్లు కొరుక్కుతింటామా ఏవిటి?' అన్నది ఆవిడ.

నాకూ లలితకూ నవ్వాలో ఏడవాలో తెలియలేదు. ఇద్దరి మాటలకూ నేను సన్నగా నవ్వి ఊరుకున్నాను.

ఎవరూ అన్నపూర్ణ సంగతి అనుకోరు. ప్రాణం ఉన్న మనిషిగా ఎవరూ గుర్తించడం లేదు. ఓ కుర్చీని గురించి, ఓ గోడను గురించి... ఇంకా ఇలాంటి ప్రాణం లేని వస్తువులు ఎవరిదృష్టిలోకి రావు. ఎవరూ అనుకోరు. అన్నపూర్ణ సంగతీ అంతేనేమో! ఆమె ఊపిరిపీలుస్తున్న ప్రాణంలేని బొమ్మ. ఓ వెలిసిపోయిన గోడ. చిరిగిపోయిన చాప. మంగళసూత్రం తెగిపోయేసరికి అన్నపూర్ణ అందరిదృష్టిలో చైతన్యం లేని రాయి...

నేను ఆలోచిస్తూనే ఉన్నాను. లలిత నావైపే జాలిగా చూస్తున్నది. వీళ్ళమీద కసితీర్చుకుని ఎప్పుడో అన్నపూర్ణకు తన చేతుల్తో కుంకుమ పెట్టాలని ఆమె కోరిక. ఆమె కళ్ళల్లో ఆ కోరిక కన్పిస్తున్నది. ఇంతలో రాంబాయమ్మగారూ, అన్నపూర్ణ వచ్చారు. అన్నపూర్ణ తలవంచుకుని శూన్యాన్ని పులుముకుంటూ నెమ్మదిగా నడుస్తున్నది. వెనకాలే రాంబాయమ్మగారు. అన్నపూర్ణ మేం వచ్చినట్లు వెంటనే గమనించలేదు. అన్నపూర్ణ చిక్కి సగమైంది. పెళ్ళయిన కొత్తల్లో మిసమిసలాడుతూ బంగారు బొమ్మలా ఉండేది. భగవంతుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని బంగారుమూసలో పోశాడేమో అనిపించేది. కనుముక్కుతీరులో శిల్పం ఉట్టిపడుతుండేది ఆ అన్నపూర్ణేనా ఈమె.. కాదు. ఈమె కళ్లు బాగా లోతుకు పోయి... ఎముకలేగాని కళ్ళు కన్పించడంలేదు...

నేనే పలుకరించాను, 'ఏమ్మా... అన్నపూర్ణా కులాసాగా ఉన్నావా?' అని. ఆమె ముఖంలో కాంతి చిమ్మినట్లే చిమ్మి ఆగిపోయింది. నవ్వు వచ్చినట్టే వచ్చి ఆగిపోయింది.

'అన్నయ్యా...' అంది నెమ్మదిగా... 'ఎంతసేపయింది వచ్చి' అన్నది. ఆ రెండు మాటలకే దుఃఖం కట్టలు తెంచుకుని వస్తున్నది ఆమెకు. మరోక్షణంలో

బావురుమనేట్లుంది. లలిత అన్నపూర్ణ పరిస్థితి గ్రహించి, చప్పున వచ్చి తన చేతుల్లోకి తీసుకుంది. నెమ్మదిగా లోపలకు తీసుకువెళ్ళింది. నేనూ లలితా అన్నపూర్ణతో ఎంతో మాట్లాడుదామనుకున్నాం. మాకు మాట రాలేదు. పరంధామయ్యగారు నన్ను పక్కకు పిలిచారు.

'అమ్మాయికి ఈ మధ్య వంట్లో బాగుండటంలేదు. ఉన్నట్టుండి పెద్దగా అరిచినట్టుగా భయపడుతుంది. ఎక్కడ కారు, జీపు చప్పుడు విన్నా ఏడ్వకపెడుతుంది. ఒక్కొక్కప్పుడు వళ్ళు తెలీకుండా పడిపోతుంది. మా టౌన్లో ఆచారిగారికి చూపిస్తే హిస్టీరియా అన్నాడు. పూలచెట్లను చూసినా బెదిరిపోతుంది' అన్నారు. నేనెక్కడో ఆలోచిస్తున్నాను. నెమ్మదిగా తల ఊపుతున్నాను. కాస్సేపు అన్నపూర్ణ సంగతి చెప్పి తన భార్య ఆరోగ్యాన్ని గురించిన వివరాలు చెప్పారు. ఆమెకు కీళ్ళనొప్పులు. కూచుంటే లేవలేదు. లేస్తే కూచోలేదు. కొంచెం పనిచేస్తే ఆయాసం. పరంధామయ్యగారు చాలా తెలివైనమనిషి. నేనెక్కడ అన్నపూర్ణను హైదరాబాదు పంపించమని అడుగుతానేమోనని... వీలుపడదని చెప్పడానికి అనుకూలమైన వాతావరణం సృష్టించుకుంటున్నారు. మాట్లాడుతున్న వారల్లా మధ్యలో ఆపి 'మా అమ్మగారిని చూశారుగా... కళ్ళు సరిగా కనిపించవు. ఎప్పుడూ ఎవరో ఒకరు ఆమెను అంటిపెట్టుకునే ఉండాలి' అన్నారు.

ఇంక నేనేం మాట్లాడేది...

కాసేపు కూచుని అలా బయటకు వెళ్ళొస్తానని ఊళ్ళోకి వెళ్ళాను. ఓ అరగంట తిరిగి ఇంటికి వచ్చాను. చీకటి పడుతున్నది. ఇంటికి వచ్చేటప్పటికి ఇంట్లో అన్నపూర్ణ వంటచేస్తున్నది. పరంధామయ్యగారు నశ్యం తయారు చేసుకుంటున్నారు. కాల్చిన పొగాకును ఏదో ఆయుధంతో రుద్దుతూ దాన్ని పొడరు చేస్తున్నారు. ఆయన భార్య కాళ్ళకు ఏదో తైలం పట్టిస్తున్నది. రాంబాయమ్మగారు కునికిపాట్లు పడుతున్నది. లలిత వంట ఇంట్లో అన్నపూర్ణదగ్గరే కూర్చున్నది. ఆ ఇంట్లో ఎవరూ ఎవరితోనూ మాట్లాడుతున్నట్లు కన్పించలేదు. లలిత తాను కూడా సహాయం చేస్తానంటున్నది వంటలో. నీవు వద్దులే వదినా... అంటున్నది అన్నపూర్ణ. ఈ రెండు మాటలే విన్పించినయి నాకు. రాత్రి భోజనాలయినాయి. అన్నపూర్ణ మా అందరికీ వరండాలో పక్కలు వేసింది. గదిలో పందిరిమంచం మీద దుప్పటి విదిలించి వేసింది. వరండాలో ఓ మూలగా రెండు చాపలు పరిచింది. రాంబాయమ్మగారు నడుం వాల్చారు.

పరంధామయ్యగారు మాతో కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుతూ ఢిల్లీ రాజకీయాల్ని గురించి వివరిస్తూ ఆవులిస్తున్నారు. కాలుస్తున్నచుట్ట సగం అయిపోయింది. చిటికెలు వేస్తూ లేచి రెండు అడుగులు వేశారు. ఆయన్ని పందిరి మంచం పిలుస్తోంది...

'పరంధామయ్యగారూ ఇక పడుకుందామా' అన్నాను ఆయన ఇబ్బందిని గుర్తించి.

'వేళకు నిద్రపోకపోతే... తెల్లారేటప్పటికి కొంచెం చికాకువేస్తుంది' అని తన సంగతి చెప్పుకున్నారు.

రాంబాయమ్మగారి పక్కనే అన్నపూర్ణ ఒదిగి పడుకున్నది.

  

తెల్లవారి నేనూ లలితా తిరుగు ప్రయాణం అయినాం. అన్నపూర్ణ మా ఇద్దరివైపు జాలిగా చూసింది. కళ్ళతోనే మాట్లాడింది. బయలుదేరి వెళ్ళేటప్పుడు నా కళ్ళు చెమర్చినయి. రైల్లో అన్నపూర్ణ సంగతే మాట్లాడుకున్నాం. అన్నపూర్ణకు పెళ్ళిచేయాలని మా ఇద్దరి సంకల్పం. మా ఆలోచనలు తెగడంలేదు. 'ముందు మీ బావగారి దగ్గరికి వెళ్ళి మీరు ఒప్పించండి. ఆ తరువాత అన్నపూర్ణ విషయం నేను చూస్తాను' అన్నది లలిత. లలితకు ఇంత ధైర్యం ఎక్కడినుండి వచ్చిందో తెలియదు. ఏదో ప్లాను వేసింది. 'అనుకున్నంత సులభంకాదు లలితా' అన్నాను.

రోజులు గడుస్తున్నాయి... తగిలిన వేలికే మళ్ళీ దెబ్బ... ఇది మూడోది... పెద్దషాక్... తేరుకునేటప్పటికి నాకు చెమటలు పోసినయి....

అది సత్యవతి దగ్గరనుండి వచ్చిన ఉత్తరం. సత్యవతి యమ్మే ప్యాసయింది. ఆమె రాసిన ఉత్తరం. అది ఉత్తరమో కత్తి పోటో తెలియలేదు. ఇది త్యాగమో, సాహసమో, మొండితనమో నా కర్థం కాలేదు. ఉత్తరం చదివేను.

*"ఈ ఉత్తరం మీకు ఆశ్చర్యాన్ని కలుగజేయవచ్చు. ఎందుకంటే ఇలా జరుగుతుందని మీరు ఊహించి ఉండరు. బావను పెళ్ళిచేసుకోవడానికి నిశ్చయించుకున్నాను. బావకూడా అంగీకరించారు. నాకూ బావకూ వయసులో పదిహేనేళ్ళ తేడా ఉంది. నేనూ చదువుకున్నదాన్ని. అన్ని విషయాలు ఆలోచించే ఈ*

*నిర్ణయానికి వచ్చాను. ఆయన ఆస్తికోసం ఇలా చేశానని ఎవరైనా అనుకోవచ్చు. ఒకరు అనుకోవడంతో నాకు నిమిత్తం లేదు. రమ, ఉమ, రవి... వీళ్ళు ముగ్గురే నా కళ్ళల్లో మెదిలేరు. బావను సుందరక్క సుఖపెట్టినట్లుగా నేను సుఖపెట్టకపోవచ్చు. సుందరక్క దేవత. అయినా బావ దుఃఖాన్ని మరిచిపోయేందుకే ప్రయత్నిస్తాను. ఒక మనిషిలేని లోటు మరొకరు తీరుస్తారంటే అది జరిగేది కాదు.ఎప్పుడొక్కప్పుడు పెళ్ళి చేసుకోవాలి గదా. ఎవరో తెలియనివాడ్ని పెళ్ళిచేసుకునేకంటే బావనే చేసుకుంటే నాకోవిధమైన తృప్తినిస్తుందని నా ఆశ. నీకు బావంటే ఎంతో ఇష్టం. నాకూ అంతే. వచ్చే నెలలో ముహూర్త నిశ్చయం తరువాత మళ్ళీ రాస్తాను. నీవూ, వదినా పెళ్ళికి వచ్చి నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తూ...*

*ఉంటాను.*

*నీ చెల్లి సత్యం"*

ఉత్తరం చదివి... ఎంతపనిచేశావ్ సత్యా అనుకున్నాను. అన్నపూర్ణ జాలిగా మావైపు చూస్తూ కళ్ళల్లో మెదులుతూనే ఉంది! ఇలా జరుగుతుందని నేను ఊహించలేదన్నది లలిత.

# 26

# పుత్రభేదం

రాత్రి ఎనిమిది - భోజనాలవేళ, ఆకలి అవుతోంది. మా వాడింకా ఊడిపడలేదు. మిగతా పిల్లలందరూ రుసరుసలాడుతున్నారు. మా అమ్మాయి బి.ఏ. చదువుతోంది. అన్నగారింకా రాలేదని ఆగ్రహపడుతోంది. 'ఎంత తను ఉద్యోగంలో చేరితేమాత్రం... నాన్నగారు కనిపెట్టుకుని ఉంటారు,పెందలాడే ఇంటికి చేరుకోవాల్సని తెలియక్కర్లే' అని అంటున్నది.

'అమ్మాయీ ఉద్యోగం ఉద్యోగం అంటున్నావ్. వాడు ఉద్యోగంలో చేరి ఒక నెలేగా అయింది. ఇవ్వాళ జీతం అందుకున్నాడేమో, వస్తాడు మరి. స్నేహితులతో ఎక్కడికన్నా వెళ్ళి ఉంటాడు' అని సమాధాన పరుస్తున్నది మా శ్రీమతి. మిగతా ముగ్గురు పిల్లలూ చిన్నవాళ్ళు. ఆ సమయంలో వాళ్ళకు ఆకలితప్ప మరోటి తెలియడం లేదు. గిలగిల్లాడుతున్నారు. శ్రీమతి భోజనాలకు అంతా సిద్ధం చేసింది.

నాకూ ఆకలి అవుతున్నది కాని ఆలోచిస్తున్నాను. మొన్న మొన్న పెళ్ళి అయినట్లున్నది. పాతికేళ్ళయినా పెళ్ళి హడావుడి, శోభనంనాటి రాత్రి, ఆ తర్వాత సంవత్సరంలోపల దీపావళి పండక్కు అత్తవారింటికి ప్రయాణం. పండగభోజనం, పండగ సరదా, టపాకాయల వెలుగు, విష్ణుచక్రం, వెలుతురు సున్నాలు. ఆ సున్నాల్లో కిలకిలా నవ్వుతున్న లలిత. ఆ మరుసటి సంవత్సరం దీపావళికి... గోపి మరీ పసివాడు. నెలన్నా నిండలేదు. లలిత బాలింత. అసలే పచ్చటి శరీరం. ఆ రోజు మధ్యాహ్నం భోజనాలయిన తరువాత, తమలపాకు చిలకలు నాకిచ్చి తను వేసుకున్నది. చెవుల్లో దూది, ఎఱ్ఱటి పెదిమలు, నుదుట పావలా అంత కుంకుమ, రెపరెపలాడుతున్న కెంపురంగు కొత్తచీరె, లేత తమలపాకులా ఉంది లలిత.

ఇల్లంతా సందడిగా ఉంది. ఇంట్లో అత్తగారూ బావమరదులు మరదళ్ళు ఒకరకంగా కోలాహలంగానే ఉంది. లలితకు దగ్గరగా వెళ్ళి కూర్చుందామనిపించింది. వీలుపడలేదు. దూరంగా కుర్చీలో కూర్చుని లలితను చూస్తున్నాను.

అనాటికి నెలన్నా నిండని గోపీ ఇప్పుడు పెద్దవాడయ్యాడు. బీకామ్ ప్యాసయినాడు. ప్యాసయ్యిన ఆర్నెల్లకు ఓ ఉద్యోగం దొరికింది. జీతం మూడువందలని మురిసిపోయింది లలిత. గోపీ తరువాత గౌరి, గౌరి తరువాత హరి, తరువాత రవి, ఉమ. ఈ అయిదుగురూ నాకూ లలితకూ పంచప్రాణాలు. కాలం కదంతొక్కినట్లే ఉంది. కళ్ళు మూసి కళ్ళు తెరిచినట్టుగా ఉంది.

విష్ణుచక్రం వెలుతురు సున్నాలలోంచి ఇంకా బయటపడలేదు నేను.

"గోపీకి నూరేళ్ళు" అంటున్నది లలిత.

గోపి బాణంలా ఇంట్లోకి దూసుకువచ్చేడు. వస్తూనే 'సారీ... నాన్నగారూ! నా కోసం అంతా కనిపెట్టుకుని ఉన్నారు. కొంచెం ఆలస్యం అయిపోయింది. ఆఫీసులో స్నేహితులు కొంతమంది పార్టీ ఇవ్వాలని గోల చేసేరు' అన్నాడు.

అంటూనే గబగబా పెరట్లోకి వెళ్ళేడు కాళ్ళు కడుక్కుని రావడానికి.

లలితను పక్కకు పిల్చేను. మరీ దగ్గరగా వచ్చింది ఏదో రహస్యం చెప్తాననుకుని.

'గోపీని జీతం విషయం ఏమీ అడగద్దు' అన్నాను.

'నేనంత తెలివితక్కువదాన్ననుకున్నారా?' అన్నది లలిత తృప్తిగా నవ్వుతూ.

అందరం భోజనాలకు కూర్చున్నాం. మా అందరి భోజనాలు వడి వడిగా సాగుతున్నాయి. గోపీమాత్రం నెమ్మదిగా కొంచెం కొంచెం తింటూ నెమరు వేస్తున్నాడు.

'అన్నాయ్‌కి ఇంటి భోజనం సహించలేదు. పెద్ద ఉద్యోగస్తుడు కదూ...' అంటున్నది గౌరి.

గోపీ చిరాకుతో, 'నే ఉద్యోగం చేస్తున్నానని అంత కుళ్లెందుకూ నీకు' అన్నాడు.

'మహా వెలగబెట్టావులే....' అన్నది గౌరి.

'మీరిద్దరూ పెద్ద వాళ్లవుతున్నారు. ఇంకా చిన్నపిల్లల్లా కీచులాడుకుంటే ఎలా...' అని ఇద్దర్నీ సమాధానపర్చింది లలిత.

గోపీకి గౌరికీ వయస్సులో తేడా రెండు సంవత్సరాలు. ఇద్దరూ చిన్నప్పటి నుండి కీచులాడుకోవడం పరిపాటి. గోపీకి గౌరి అంటే ప్రాణం... గౌరికీ గోపీ అంటే ప్రాణం. ఇట్టే పోట్లాడుకుంటారు. ఇట్టే కలుస్తారు మళ్ళీ... ఒకసారి గౌరికి జ్వరం వచ్చినప్పుడు... అప్పుడు గౌరికి పదేళ్లు. మూలుగుతూ పడుకున్నది. వళ్లు సలసల కాగిపోతున్నది. గోపి బిక్కమొగం వేసుకుని మాటి మాటికి గౌరిని వచ్చి చూస్తూ, అమ్మా, ఇంకా గౌరికి జ్వరం తగ్గలేదమ్మా అని ఏడుస్తూ కూచున్నాడు. ఆ ఏడుపు బయటకు వినిపించడం లేదు. లోపల ఇముడ్చుకోలేకపోతున్నాడు. నాకు వాణ్ణి చూస్తే జాలేసింది. పిల్లలకు జ్వరాలు వస్తుంటయి, తగ్గుతుంటయి... ఇవి అందరి ఇళ్ళల్లోనూ సహజం. కాని గౌరికి జ్వరం వస్తే గోపి గిజగిజ తన్నుకున్నాడు. కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరిగాడు.

ఆడుకుంటూ పోట్లాడుకుంటారు... పోట్లాడుకుంటూ ఆడుకుంటారు... ఆడుకుంటూ పోట్లాడుకుంటూ మాట్లాడుకుంటారు.

నూనూగుమీసాలు, పిల్లిగడ్డం...

వాడు కాలేజీలో చేరినప్పుడు-

"వాడికో 'సేవింగ్ సెట్' తెచ్చి పెడ్దురూ..." అని లలిత నాకు జ్ఞాపకం చేసిందాకా, వాడు పెద్దవాడవుతున్నాడని నేను గమనించలేదు.

ఎప్పుడు పెరిగేడో, ఎట్లా పెరిగేడో, అప్పుడే నా అంత అయినాడు... ఉద్యోగం చేస్తున్నాడు.

ఉంగరాల జుట్టూ, పసిడిశరీరం, బొద్దుగా ఉన్న గోపీ, మొలకు వాళ్ళమ్మమ్మ చేయించిన బంగారు మొలతాడు, మెళ్లో ఒంటిపేట బంగారు గొలుసు వాడి బోసినవ్వులూ, ఉయ్యాలలో పడుకుని చేతులు అటూ ఇటూ తిప్పుతూ వాడు చేస్తున్న భరతనాట్యం... ఇంకా నా కళ్ళల్లో మెదుల్తూనే ఉన్నాయి. భోజనాలయినాయి. అలవాటు చొప్పున వరండాలో సిగరెట్టు కాలుస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాను.

మరో ఏడెనిమిదేళ్ళల్లో రిటైరవచ్చు. ఉద్యోగంలో చేరి చాకిరి చెయ్యంగా చెయ్యంగా, మెదడంతా అరగిపోయి, చిన్న చిన్న ప్రమోషన్లు, తర్వాత ఆఫీసరు ప్రమోషను... ఆఫీసరు హోదాకోసం తప్పనిసరిగా అప్పు చేసి కారు కొనడం అందరూ

నేను సుఖంగా ఉన్నాననుకోవడం, సంసారం బరువుగా లాక్కొస్తూనే ఉన్నాను... నెమ్మదిగా. అయితే గమ్యం ఏవిటో తెలియడం లేదు. గానుగెద్దు జీవితంలా ఉంది.

గౌరి ఎదుగుతోంది. పెళ్ళి చేయాలి. వరుణ్ణి వెదకాలి. మామగార్నవుతాను. అల్లుడికి భయపడతాను. ఆ అల్లుడు గౌరిని సరిగా చూస్తాడో చూడడో! చూసినా చూడకపోయినా పెళ్ళయిన తరువాత సంసారం నెట్టుకు పోతారు. పిల్లలు పుడతారు. నేను తాతనవుతాను. ఇంత త్వరగా తాతనవడం ఇష్టం లేదు.

నే నింకా అటూ ఇటూ తిరుగుతున్నాను. గోపీ నా దగ్గరకు వచ్చి ఏదో మాట్లాడాలనే ప్రయత్నంలో ఉన్నాడు. మాట్లాడడానికి సందేహిస్తున్నాడల్లే ఉంది.

'నాన్నగారు!' అన్నాడు నెమ్మదిగా.

'ఏవిటి విశేషం. ఉద్యోగం ఎలా ఉంది' అన్నాను.

'బాగానే ఉంది. కాని మా బాస్ వట్టి చాదస్తం మనిషి. చాలాసేపటి వరకు ఆఫీసులో కూర్చుంటాడు. బజార్లో ఓ కొట్లో టెర్లిన్ సూటింగ్ క్లాత్ చూసేను. చాలా బావుంది. లేటెస్ట్ డిసైనట...' అని నీళ్లు నములుతున్నాడు.

'వరలక్ష్మి శుక్రవారం వస్తోంది రెండు రోజుల్లో... అమ్మ సంగతి చూడు' అన్నాను.

వాడు గ్రహించుకున్నట్టు లేదు. విడమరచి పెద్దగా చెప్తే లలిత వినేట్టుగా ఉంది. దగ్గరకు పిలిచి చెవిలో ఊదాను.

  

శుక్రవారం వస్తోంది.

ఒక బంగారు కాసు, ఒక పట్టుచీరె తెచ్చి వాళ్ళమ్మ కిచ్చేడు గోపీ.

ఇవన్నీ ఎందుకురా అన్నది లలిత. గోపీలో ఏ భావమూ లేదు. నా మాట కాదనలేక తప్పనిసరిగా కొన్నట్టుగా ఉన్నాడు.

లలిత తలకు స్నానం చేసి పట్టుచీరె కట్టుకుని మడితో పూజ ప్రారంభిస్తోంది.

పచ్చటి శరీరం. పట్టుచీరె నుదుటిమీద పావలా అంత జపాకుసుమంలా మెరుస్తున్న కుంకుమ. అయిదుగురు పిల్లల తల్లిలా కన్పించడం లేదు. నా కళ్ళకింకా

పెళ్ళికూతురులాగే ఉంది. ఆమెలోని ఆకర్షణకు తట్టుకోలేక పోతున్నాను. కాశపోసి పట్టుచీరె కట్టింది. ఆ చీరకట్టే విధానంలో పిక్కలు కన్పిస్తున్నాయి. చూడగానే పార్వతి దేవిలా కన్పించింది. ఆ దేవతకు దణ్ణం పెట్టాలనిపించింది. నా మనసుకు మనస్కరించలేదు. అమాంతం దగ్గరకు తీసుకోవాలనిపించింది. ఆమె మడి. భక్తితో పూజచేస్తున్నది. ఇంట్లో పిల్లలు... సందడి... నా కోర్కెను చంపుకున్నాను.

'ఒరే గోపీ అమ్మకు దణ్ణం పెట్రా' అన్నాను.

లలిత గోపీని దీవించింది.

ఆ రోజు మధ్యాహ్నం ఆఫీసుకు భోజనం క్యారియర్లో పంపించింది లలిత. వడలు, పులిహోర, పాయసం వీటన్నిటితో తృప్తిగా భోజనం చేశాను.

సాయంత్రం కొంచెం ఆలస్యం అయింది ఇంటికి వచ్చేటప్పటికి.

ఇంట్లో ఏదో పెద్దగా మాట్లాడుతున్నాడు గోపీ.

'అంత ఖరీదు పెట్టి పట్టుచీరె తెస్తే పూజ పూజ అని దాన్ని నానా రకాలుగా నలిపేసి అప్పుడే మాసిపోయేట్లు చేశారు. దాన్నిండా కుంకుమ, గంధం మరకలూ. పాతగుడ్డలా దాన్ని ఓ మూల స్టాండ్‌మీద పడేశారు. ఆ చీరె సినిమాకో, ఏదన్నా ఫంక్షన్‌కో నాజూకుగా కట్టుకుని వాడుకుంటే బాగుంటుంది. ఎంతవయసు వస్తే ఏం బొత్తిగా డబ్బు విలువ తెలియదు. కల్చర్ అంటూ అసలే లేదు' అంటున్నాడు గోపీ.

నేను రావడం గమనించి లలిత నా వైపు అదోలా చూస్తున్నది. ఆ చూపులోని భావం నే గ్రహించాను.

గౌరి గోపీవైపు కోపంగా చూస్తున్నది.

'కల్చర్... కల్చర్ అంటున్నావ్. నీ కున్నదిలే బోడి కల్చర్. అమ్మను అనటానికి నీకు నోరు ఎలా వచ్చిందిరా' అంటున్నది గౌరి. గోపీ రెచ్చిపోయాడు.

'ఈ ఆడవాళ్ళు ఎప్పుడూ ఇంతే. వినరు ఒకరు చెప్తే... తమకు తోచదు. అసలు బుర్ర ఉంటేగా'.

'ఒరేయ్ గోపీ! మాటలు తిన్నగా రానీ. హద్దులు మీరుతున్నావ్' గౌరి కళ్ళు ఎర్రజేసింది. గోపీ ఇంకా కారాలు మిరియాలు నూరుతున్నాడు. మాటా మాటా పెరిగింది. చేతుల్దాకా వచ్చేట్టుగా ఉంది.

లలిత నా వైపు చూస్తూనే ఉంది.

రవి, హరి అక్కపక్షం అన్నట్టుగా గౌరి వెనకాలే నిల్చుని గోపీని ఉరిమి ఉరిమి చూస్తున్నారు. ఆ సమయంలో ఏం మాట్లాడాలో తోచడంలేదు. తెలియడం లేదు.

'నీకు బుద్ధిలేదురా గోపీ' అంటున్నది గౌరి. అవునవును అంటున్నారు రవి, హరి బుద్ధి ఉండడం, బుద్ధిలేకపోవడం అంటే ఏమిటో వాళ్లకు బాగా తెలిసినట్టుగా.

గోపీకి రోషం, క్రోధం ఎక్కువైంది.

'పోండర్రా మీతో నాకేవిటి... మీరంతా ఇడియట్స్' అన్నాడు.

'మేం ఇడియట్స్ అయితే నీవో గొప్ప ఫూల్‌వి' అన్నది గౌరి, రవి, హరి చప్పట్లు కొట్టారు.

గోపీ గౌరిమీదికి ఉరుకుదామా అన్నట్లుగా ఉన్నాడు. మీ వీపులు కాచుకోండి అని చెయ్యి ఎత్తేడు.

ఒరేయ్ గోపీ అని గదమాయించాను. లలిత అక్కడ నిల్చున్నదన్న మాటేగాని ఎక్కడో చూస్తున్నది.

ఆమెకు డొక్కలో మోకాళ్ళతో పొడిచినట్లయింది.

పురిటి మంచం. గోపీ పుట్టినప్పుడు తను బాగా నీరసించిపోయింది మూలుగు. పుడుతూనే బొద్దుగా ఉన్న గోపీ మామూలు పిల్లలకంటే తూకం ఎక్కువే. చాలా ఆరోగ్యంగా ఉన్నాడన్నాడు డాక్టరు. చారడేసికళ్లు, ఆకలయితే ఇల్లంతా దద్దరిల్లిపోయేట్లు ఏడ్చేవాడు. వచ్చడి మెతుకులూ పప్పు కూరా తింటున్నా లలితది సహజంగా ఆరోగ్యకరమైన శరీరం. గోపీ పుట్టిన తరువాత ఆమెకు అందం, ఆరోగ్యం మరీ ఎక్కువైనట్టుగా ఉండేది. గోపీని దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుని వాడిమీద చీరెకొంగు కప్పి వాడిమీద చేయివేసి వాడి కళ్ళల్లోకి చూస్తూ పాలిస్తుంటే, అవురావురుమని చుబుక్ చుబుక్ అని చప్పుడు చేస్తూ చేతుల్తో ఆడుకుంటూ లలితకు

చక్కిలిగింతలు పెడుతూ పాలు తాగేవాడు గోపి. పాలు తాగుతుంటే నరాలన్నీ తోడేసినట్టుగా ఉండేది. ఆ చిన్న చిన్న కాళ్ళతో పొట్టలో తన్నేవాడు.
తీయగా హాయిగా ఉండేదా బాధ. నా తండ్రే నా బంగారుపంటే అని మరీ దగ్గరకు తీసుకుని ఆ బాధలో వాడి బుగ్గలమీద ముద్దులవర్షం కురిపించేది లలిత. గోపీ పాలు తాగుతున్నప్పుడు ఎప్పుడన్నా హఠాత్తుగా నేను చూసినప్పుడు లలిత సిగ్గుతో కుంచించుకు పోయేది. పమిట బుజానికంతకూ కప్పుకుని నావైపు చూసి ఆ తన్మయత్వంతో నిండుగా నవ్వేది. ఆ నవ్వుల్లో ముత్యాలవర్షం. ఆ కళ్ళల్లో అంతులేని ఆప్యాయత. నా కెందుకో ఆకూ అలమూ గడ్డీ తిని కమ్మని పాలిచ్చే ఆవు; ఆ ఆవుపాలు తాగి కోరల్లో విషం పెంచుకున్న పాము కళ్ళల్లో మెదిలినై.

ఛ, ఇదేం పోలిక. ఇలాంటి ఆలోచన్లు నాకు రాకూడదు. మా గోపీ బంగారు తండ్రి. చిన్నతనం... తెలియక ఏదో అంటున్నాడు అని సమాధాన పరచుకున్నాను.

లలిత కళ్ళెందుకో చెమర్చటం చూశాను. 'ఒరేయ్ గోపీ, గౌరీ, హరీ... భోజనాలకు వేళవుతున్నది. రెడీ అవ్వండి' అంటున్నది లలిత.

ఇల్లంత నిశ్శబ్దంగా ఉంది.

  

ఆ రోజు రాత్రి లలిత నా చెంతన చేరినప్పుడు హాయిగా దగ్గరకు తీసుకున్నాను... 'ఏమండోయ్ చూశారా, వీడికి అప్పుడే నా డబ్బు, నా వస్తువులు అనే భావం వచ్చేసింది' అన్నది నవ్వుతూ.

'ఉద్యోగం వెలగబెడుతున్నాడుగా. అయినా వాడి డబ్బు మనకెందుకే. వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేశాం. ఇప్పుడు రెక్కలు వచ్చినయి. రేపో మాపో ఆ కోడలు పిల్ల వస్తే... ఎగిరి పోనేపోతాడు' అన్నాను.

'బాగా చెప్పారు' అంటూ ఇంకా దగ్గరగా వచ్చింది. గువ్వలా నాలో ఒదిగిపోయింది.

'ఆ పట్టుచీరె బిల్లు... డ్రాయర్లో ఉందా?' అన్నాను.

  

- ఆ నెలాఖరున జీతం రాగానే ఆ చీరె ఖరీదుకు ఓ మంచి టెర్లిన్ సూట్ గుడ్డ బజార్లో కొని ఇంటికి తెచ్చాను.

గౌరి చూసింది దాన్ని.

'ఈ సూటు గుడ్డ చాలా బావుంది. మీరు కుట్టించుకోండి నాన్నగారూ' అన్నది గౌరి.

'నా కెందుకమ్మా ఇంకా సూట్లు, ఉన్నవి చాల్లే' అన్నాను.

ఎక్కడ ఆడుకుంటున్నారో రవి, హరి పరుగెత్తుకుంటూ లోపలకు వచ్చేరు. వాళ్ళ దృష్టి అంతా దానిమీదే ఉంది. ఆదుర్దాగా ఆ సూటుగుడ్డవైపు చూస్తున్నారు. 'పండగలొస్తున్నాయి. మా కోసమేనేమో అది తెచ్చింది. చక్కగా నిక్కర్లు కుట్టించుకోవచ్చు' అనుకుంటున్నారు. మరి రవి చెవిలో ఏదో చెప్తున్నాడు. గుసగుసలు... 'మనకేలేరా' అంటున్నాడు రవి వినపడీ వినపడనట్లు, వాళ్ళిద్దరి ముఖాలు విప్పారినయి వాళ్ళ కళ్ళల్లో బోలెడంత సంతోషం తొంగిచూస్తున్నది.

ఇంతలో గోపీ ఎక్కడనుండో అమాంతం వచ్చేడు.

"ఒరేయ్ గోపీ ఇలారా" అన్నాను. వాడు నెమ్మదిగా వచ్చేడు దగ్గరకు.

'గోపీ! నీకో ప్రజంటు తెచ్చాన్రా... చూడు'... అని ఆ సూటు గుడ్డను వాడి చేతుల్లో ఉంచుతూ... 'నీకు ఉద్యోగం వచ్చిన శుభసమయాన... నీకీ ప్రజంట్... బెస్ట్ ఆఫ్ లక్...' అంటూ వాడిచేతిని నా చేతిలోకి తీసుకున్నాను.

అది చూసుకుంటూ... వాడు.. 'వండర్‌ఫుల్... చాలా బాగుంది ఇది. థ్యాంక్యూ... నాన్నగారూ..' అన్నాడు.

ఆనందబాష్పాలో.. మరేమిటో... అవి... లలిత కళ్ళు వత్తుకుంటూ...

'గోపీ... నాన్నగారికి నమస్కారం చెయ్యి...' అన్నది.

వాడు వంగి నా కాళ్లను తాకేడు.

'ఆల్ ది బెస్ట్' అని దీవించాను.

గౌరి నా వైపు చూస్తున్నది...

రవి, హరి, ఉమ... బిక్కమొహాలత్తో చప్పట్లు కొట్టేరు!!...

# 27

# హత్య

శ్రీపతి ఆఫీసునుండి రాగానే కారు 'గరాజ్'లో ఆపి, అక్కడే బరువుగా ఉదయం నుండి తనను అంటిపెట్టుకున్న కోటునూ, శివుని మెళ్ళో వేళ్లాడుతున్న పాములాంటి తన 'టై'ని తీసేసి భుజాన వేసుకుని తేలిగ్గా ఇంట్లో అడుగుపెట్టేడు. ఇంట్లోని వాతావరణం 'చంచల' చాలా బిజీగా ఉన్నట్లు కన్పిస్తోంది. విడిచిన చీరె, జాకెట్టూ ఒక మూలగా విసిరేసి ఉన్నయి. డ్రాయింగ్ రూములో పత్రికలు, పుస్తకాలు చిందరవందరగా పడేసి ఉన్నాయి. సోఫా సెట్టూ కుర్చీలు మామూలు స్థానాల్లో లేవు. డ్రెస్సింగ్ టేబిల్ యుద్ధరంగంగా ఉంది. నెయిల్ పాలిషూ, క్యుటెక్స్, డ్రీమ్‌లాండ్ పౌడరు డబ్బా, దువ్వెనా, హేరాయిలు, బ్రష్, హెర్‌పిన్నూ ఇంకా అనేకం సౌందర్యోపాసనకు సంబంధించిన వస్తువులు యుద్ధంలో దెబ్బతిన్న సైనికుల్లా 'టేబిల్' నిండా ఆవరించి ఉన్నాయి. 'షూ రేక్' అంతా చెల్లాచెదరుగా ఉంది. రంగురంగుల 'హైహీల్స్ షూస్' ఒకటి కిందా, ఒకటి వెనకాల వాటి ఇష్టమొచ్చిన స్థానాల్లో అవి ఉన్నాయి. 'రేడియోగ్రామ్' అంతవరకూ అరచి అరచి సొమ్మసిల్లినట్లుగా ఉంది. రికార్డులన్నీ పక్కనే పడి ఉన్నాయి.

శ్రీపతికి ఇదేం కొత్తగాదు. చంచల ఎక్కడికన్నా ప్రయాణ సన్నాహంలో ఉన్నప్పుడు మామూలుగా ఉన్న హంగామా ఇది. వంట ఇంట్లో 'నాయర్'తో ఏదో పెద్దగా కేకలు వేస్తోంది.

శ్రీపతిని చూడగానే 'హలో హనీ! అనుకుంటుండగానే వచ్చేశారు. హండ్రెడ్ ఇయర్స్! మీకు' అంటూ పలుకరించింది. శ్రీపతి కొంచెం సేపు మౌనం.

“ఈ రోజు పెర్సీస్‌లో రిపబ్లిక్ డే డ్యాన్స్ ఉంది. మేజర్ కపాడియా ఫోన్ చేసేడు. టేబిల్ రిజర్వేషన్ కూడా చేసేడట. కలకటా నుండి రీటా వస్తోంది డ్యాన్స్‌కు. జాజ్... ఇంకా ఎన్నో 'ఇంటరెస్టింగ్' ఐటెమ్స్ ఉన్నాయి. త్వరగా రెడీ అవండి... ఆ అన్నట్లు.. మీకు కపాడియా రెండుసార్లు ఫోన్ చేస్తే మీరు దొరకలేదట... లైన్ ఎంగేజ్‌డ్ అన్నాడు... ఇవ్వాళ 'రెడ్డీస్' కూడా వస్తున్నారు” ఇలా చంచల చెప్పుకు పోతోంది.

శ్రీపతి మళ్ళీ కొంచెం మౌనం... “ఈ రోజు ఎందుకో రావాలని 'మూడ్'లేదు. ఈ మధ్య మొదలెట్టిన నవల నాలుగో అధ్యాయంలో ఉండిపోయింది. ఈ రోజు మళ్ళీ రాద్దామనుకుంటున్నాను” అన్నాడు నెమ్మదిగా శ్రీపతి.

'అస్తమానమూ ఆలోచిస్తూ ఈ రచనలు చేసి ఎందుకు బుర్ర పాడుచేసు కుంటారు... అలా బయటకు వెళ్ళి కొంచెం రిలాక్స్ అవుతే బావుంటుంది. మీకు మెంటల్ స్ట్రెయిన్ బాగా ఎక్కువైపోయింది. నా మాట కాదనక త్వరగా 'డ్రెస్' అవండి '.

ఇంతలో నాయరు 'టీ' ట్రేలో తెచ్చి ఉంచాడు. శ్రీపతి సిగరెట్టు వెలిగించి 'టీ' నెమ్మదిగా సిప్ చేస్తూ... 'స్సరే'... అన్నాడు పొడిగా. చంచల అప్పటికే 'డ్రెస్' అయి రెడీగా ఉంది.

'పెర్సీస్'లో రెడ్డి దంపతులూ, మేజర్ కపాడియా, శ్రీపతీ, చంచలా కలుసుకున్నారు.

'లాన్'లో మూలగా మంచి స్థానంలో టేబిల్ రిజర్వ్ చేయించుకున్నారు. బేరర్ ఎటెన్షన్‌లో నుంచుని కపాడియా వైపు చూస్తున్నాడు.

'శ్రీపతీ... అలా మౌనంగా ఉన్నారు... ఏం కావాలో శలవియ్యండి ' అన్నాడు కపాడియా.

'బీర్.. త్రీ ఈగిల్స్'

'నోనో... బీరేమిటి... పరమాన్నంలా కడుపులో బరువుగా ఉంటుంది... మజాలేదు...' అని కపాడియా అంటూండగానే 'వైనాట్ విస్కీ' అన్నాడు రెడ్డి. విస్కీ అయితే 'స్కాచ్ ' కావాలి అన్నాడు కపాడియా.

'మరి లేడీస్‌కో' అన్నాడు రెడ్డి.

'మాకు మామూలు జిమ్‌లెట్ ఉందిగా' అన్నది చంచల. మిసెస్ రెడ్డి నవ్వింది. ఈ రోజు మనం మానేయగూడదూ? అంటూ అందరూ నవ్వేరు. ఇది మామూలే. ఒకరు కావాలనటం మరొకరు వద్దనటం అందరూ నవ్వటం చివరకు అందరూ గ్లాసులు కలపడం.

"ఐస్ క్యూబ్స్" అందరి గ్లాసుల్లోనూ వేస్తూ చంచల, కపాడియా వైపు చూస్తూ మరో రెండు క్యూబ్‌లు ఎక్కువ వేసింది అతని గ్లాసులో. కపాడియా రిస్ట్ వాచి తళతళ మెరుస్తూ చంచల దృష్టిని ఆకర్షించింది. 'ఇది బావుంది అన్నట్టు ఈ వాచ్ మొన్ననే తెప్పించాను. జపాన్ ది, ఆటోమెటిక్, స్మగుల్డ్ సరుకు. కలకత్తా నుండి ఎవడో పట్టుకొచ్చాడు' అన్నాడు కపాడియా. ఆ వాచ్‌ని చేత్తో ఒకసారి చూసి లవ్‌లీ వాచ్ అన్నది చంచల.

త్రీ చియర్స్... అని అందరూ గ్లాసులు ఎత్తేరు. కపాడియా గ్లాసు చంచల గ్లాసుకు అంటించేడు. బేరర్ చిప్సు, కాష్యూనట్సూ తెచ్చి బల్లమీద ఉంచేడు. రెడ్డి సిగరెట్టు ముట్టించేడు... అతని 'బ్రేండ్' పెనామా.

'రెడ్డీ... మీరు మా సిగరెట్ రుచి చూడాలి అంటూ కపాడియా... 'త్రీ ఫైవ్స్' కింగ్ సైజ్... ఒకటి ఆఫర్ చేసేడు. శ్రీపతికి కూడా ఒకటి అందించి తను వెలిగించుకుని అందరి సిగరెట్సూ వెలిగించేడు. చంచల చిప్స్ చిటచిట లాడిస్తూ... 'త్రీ ఫైవ్స్' పెట్టి చాలా అందంగా ఉంది సిగరెట్టులాగే' అంది. కపాడియా డ్రెస్‌లోనూ, హెయిర్ స్టైయిల్‌లోనూ... సిగరెట్లలోనూ... సాక్స్‌లోనూ, టైలోనూ, బూటులోనూ చాలా అప్టుడేట్‌గా ఉంటాడు. నీట్‌నెస్ అతని ప్రత్యేకత. 'స్మార్ట్' అనే పదానికి అతనే నిర్వచనం. అతను 'సాక్స్' గురించి చెప్పడం మొదలుపెడితే చిన్న ఉపన్యాసం అవుతుంది. ఫారిన్ సాక్సుకూ, ఇండియన్ సాక్సుకూ తేడా టెక్నికల్‌గా విడమరచి ఒక 'థీసిస్'లాగా చెప్పుకుపోతాడు. రంగునిబట్టి ఏ బ్రాండు విస్కీ అయిందీ ఇట్టే చెప్తాడు. దేశదేశాల 'బీర్స్'ను గురించి క్షుణ్ణంగా తెలుసు. జపనీస్ బీర్ అంటే అతనికి చాలా ఇష్టం. అది సూర్యుడి మార్కుది దాంట్లో బోలెడంత ప్రత్యేకత ఉంది అంటాడు.

విస్కీ రెండో రౌండ్ నడుస్తున్నది. సంభాషణ ఇటీవల జరిగిన బ్యూటీ కంటెస్ట్‌ను గురించి జరుగుతోంది. పోటీకి వచ్చిన పంథొమ్మిదేళ్ళ అమ్మాయి నళినిని గురించి వర్ణిస్తున్నాడు కపాడియా. ఆమె కొలతలు స్టాండర్డ్స్‌లో ఉన్నాయనీ... ముఖంలో

చాలా గ్రేస్ ఉందనీ... ఇలా చెప్పుకు పోతున్నాడు. చంచల వైపు చూసి... మీరు కొంచెం ఓవర్ వెయిట్.. మీరు తగ్గాలి... అన్నాడు. శ్రీపతి చంచలవైపు చలం శ్రీపతివైపూ... చూసుకున్నారు.

'తిండి తగ్గిస్తే బావుంటుందేమో' అని అన్నాడు శ్రీపతి.

'నేనేం తిండిపోతునా'... అని కోపంగా చూసింది చంచల.

'కొంచెం రిస్ట్రిక్ట్ చేసి... కొవ్వు పదార్థాలు తినడం మానేస్తే బావుంటుంది' అన్నాడు రెడ్డి.

'దేశంలో పస్తులుంటున్నవాళ్ళు చాలామంది ఉన్నారు మనకేం ఖర్మ' అంది చంచల.

కపాడియాకు విస్కీ రుచించలేదు. 'ఇది స్కాచ్ కాదు... నాకనుమానంగా ఉంది' అన్నాడు.

'నోనో ఇది స్కాచే... నేను పైన లేబిల్ 'సీల్డ్ క్యేర్' అన్నీ చూశాను' అన్నాడు రెడ్డి.

'బ్రదర్... నీకు తెలీదు. లేబిల్ అలాగా ఉంటుంది. సీలు అలాగే ఉంటుంది. సీసాకు అడుగున ఇంజక్షన్ ఇచ్చి అసలు విస్కీ లాగేసి కల్తీ సరుకు ఎక్కిస్తారు. ఇదో పెద్ద ఉద్యమం నీకు తెలీదు. కాళీ క్యాప్స్‌కు ఎంత డిమేండో తెలుసా వైజాగ్ నుండి దిగుమతి అవుతయి, కాళీసీసాలూ... కాళీ క్యాప్స్... ఇదో పెద్ద పరిశ్రమ" ఇలాంటి విషయాల్లో కపాడియాకు బోలెడంత విజ్ఞానం ఉంది. ఇతడు చేసిన రీసెర్చ్‌కి డాక్టరేట్ ఇవ్వచ్చు... అన్నాడు.

'దురదృష్టవశాత్తు మనదేశంలో అలాంటి యూనివర్సిటీలు లేవు' అన్నాడు శ్రీపతి. చంచలా, మిసెస్ రెడ్డీ 'జిన్' నెమ్మదిగా సిప్ చేస్తున్నారు. విస్కీ మూడో రౌండ్ అయి నాలుగులోకి ప్రవేశించారు.

ఆరు అంకాలయినా అయితేగాని తెర పడదేమో ఇవ్వాళ... అన్నాడు శ్రీపతి.

శ్రీపతి ఇవ్వాళ మూడ్‌లో లేడు. జ్వరం వచ్చినవాడు చేదుమందు తాగినట్లుగా... ముఖం పెట్టేడు. అతన్ని ఇంటి దగ్గర గాలికి రెపరెపలాడుతున్న సగం రాసిన కాగితాలు

పిలుస్తున్నాయి. కథ మంచి పట్టులో ఉంది. ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. చంచల కపాడియాలోని ప్రత్యేకతను ఎప్రీషియేట్ చేస్తోంది. ఆమె దృష్టిలో కపాడియా అభ్యుదయమైన మనిషి. వ్యక్తిత్వం కలవాడు. అతని బూట్సు ఎప్పుడూ పాలిష్‌తో నిగనిగలాడుతూ ఉంటయి. ముడిగూడా చాలా ముచ్చటగా ఆర్టిస్టిక్‌గా వేస్తాడు. అతని కాళ్ళకు బూటు ఏదో ఆభరణంలా ఉంటుంది. 'టై' నాట్ గూడా ఎంతో నాజూకుగా ఉంటుంది. కొంచెంసేపు 'టై నాట్ వైపూ, కొంచెం సేపు అతని వాచ్‌నీ... అతని మీసకట్టునీ... పరీక్షగా చూస్తోంది. కపాడియా 'డ్యాన్సు' బాగా చేయగలడు. ఇంగ్లీషు పాటలు పాడగలడు. ఒకరోజు 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్'లో పాట పాడితే చంచల పరవశమై పోయింది.

హాల్లో రీటా డ్యాన్స్ ప్రారంభం అయింది. మైక్ దగ్గర 'కుంబో' పాట బ్యాండ్ కూడా జతగూడినయి. కపాడియా ఆనందిస్తూ మెరుస్తున్న బూట్లతో తాళం వేస్తున్నాడు. చంచల బల్లమీద దరువు వేస్తోంది. రెడ్డి సిగరెట్టు పీలుస్తూ కళ్ళతో ఆనందిస్తున్నాడు. కూచున్న వాళ్ళలో ఒక్కొక్కరూ వెళ్ళి డ్యాన్స్‌లో పాల్గొంటున్నారు.

శ్రీపతీ, చంచల – మీరిద్దరూ కూడా 'డ్యాన్స్'లో జాయిన్ అవండి... అని హెచ్చరించాడు కపాడియా. చంచల ముఖం ప్రసన్నమయింది. శ్రీపతివైపు చూసింది. శ్రీపతి నవల వైపు చూశాడు. కపాడియా టై సవరించుకున్నాడు. రెడ్డి, రీటా వైపు చూస్తున్నాడు. మిసెస్ రెడ్డి చంచలవైపు చూస్తోంది. విస్కీ అయిపోయింది.

వాట్ నెక్స్ట్ అన్నాడు కపాడియా.

అందరూ మౌనం... బేరర్ నిరీక్షిస్తున్నాడు.

'రమ్' అన్నాడు కపాడియా. అన్ని రౌండ్లు విస్కీ అయినా 'కిక్' రాలేదు కపాడియాకు. బాగా కిక్ రావడానికి ఫార్ములా తెలుసు అతనికి. మరో జిన్‌కు ఆర్డరిచ్చాడు. జిన్‌లో రమ్ కలిపితే రుచి కపాడియా కొక్కడికే తెలుసు. ఎంత ఎంత పాళ్ళల్లో కలపాలో తెలుసు. దీనిని గురించి ఒక అరగంట ఉపన్యాసం ఇచ్చాడు. కపాడియాకున్న విజ్ఞానానికి 'హేట్స్ ఆఫ్' అన్నది చంచల. 'రమ్ పంచ్' కపాడియాకు అభిమాన 'టానిక్'. అది రెండు రౌండ్లు అయిన తరువాత అతన్ని చూడాలి. చైనా సరిహద్దుల్లో ఉంటాడు. యుద్ధరంగంలో అభిమన్యుడిలా ఉంటాడు. అతన్ని గెలవడానికి ఏ పద్మవ్యూహాలూ పనికి రావు.

'రమ్‌పంచ్' అయిపోతుందేమోనని అమృతంలా కొంచెం కొంచెం చిప్ చేస్తున్నాడు కపాడియా. కూర్చునే అతని బూట్లు నాట్యం చేస్తున్నయి.

'స్వర్గానికి బెత్తెడు... నిచ్చెన అక్కర్లేదు' అంటున్నాడు కపాడియా రెండో రౌండు పూర్తి చేస్తూ. అతని గొంతులో ఒక విధమైన మాధుర్యం ఉంది. ఎక్కువ నిషాలో ఉన్నప్పుడు ఆరితేరిన వైణికుని వీణాతంత్రుల తరంగాలలా ఉంటుంది అతని కంఠధ్వని. రీటా డ్యాన్స్... జోరుగా సాగుతోంది. కపాడియాకు రెండు చంచలలు కన్పిస్తున్నారు.

'హనీ! వై నాట్ వుయ్ డ్యాన్స్' అన్నది చంచల శ్రీపతిని చూస్తూ.

"నాకు కడుపులో తిప్పుతోంది" అన్నాడు శ్రీపతి.

చంచల కపాడియావైపు చూసింది. "గో ఎ హెడ్" అన్నాడు శ్రీపతి.

కపాడియా చంచలా ఒకరిని రాసుకుంటూ ఒకరు డ్యాన్స్‌లో కలిసారు.

చంచల నడుముమీద చెయ్యివేసి కొంచెం దగ్గరగా తీసుకుంటూ స్టెప్స్ వేస్తున్నాడు కపాడియా, మైక్ దగ్గర మ్యూజిక్‌తో తాళం వేస్తున్నారు కొంచెం సేపు ముందుకూ... కొంచెం సేపూ వెనక్కూ... వస్తున్నారు. కపాడియాకు అడుగులు తడబడుతూ చంచల మీదకు ఒరుగుతున్నాడు. చంచల సన్నగా నవ్వుతోంది. 'మీ హనీ... మూడ్‌లో లేడేం... ఇవ్వాళ' అన్నాడు ఆమె నడుమును దగ్గరగా లాక్కుంటూ, 'సొసైటీ అంటే గిట్టదు. ఎప్పుడూ రచనల్లో పడి బుర్రచెడగొట్టుకుంటుంటారు. అయన్ని మార్చడం కష్టం' అన్నది అతని భుజం మీద చేతిని బలంగా నొక్కుతూ.

"యూ ఆర్ ఎన్ ఏంజల్" అన్నాడు కపాడియా.

డ్యాన్స్ ముగిసింది. రీటా కూడా అలసిపోయి రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

రిపబ్లిక్ డే హాపీగా గడచి పోయిందన్నాడు రెడ్డి. శ్రీపతి కూడా వండర్‌ఫుల్ అన్నాడు. అందరూ టాటా చెప్పుకుని కాందిశీకుల్లా తిరుగు ప్రయాణం అయినారు. ఆ రోజు ఇంటికి వచ్చేటప్పటికి ఒంటిగంటయింది. కారులో దగ్గరిగా జరిగి హనీ... ఆరోగ్యం బాగులేదా... అంటూ పరామర్శించింది చంచల.

'అదేంలేదు... విస్కీ కొంచెం డోసు ఎక్కువైంది' మూడో రౌండుతో ఆపేయవల్సింది అన్నాడు ముభావంగా శ్రీపతి.

'ఆ నవల రాయడం మానేయండి హనీ! మీకు స్ట్రెయిన్ ఎక్కువ. పైగా అదేం బావులేదు. నేను కొంచెం చదివాను'.

'పూర్తి అయిన తరువాత అనాల ఆ మాట'.

'అసలు మీరు తీసుకున్న సబ్జక్టు నాకేం నచ్చలేదు'.

'నేను నీతో ఏకీభవించను'.

'మీరెప్పుడూ నాతో ఏకీభవించరు - నా మాటకు విలువే లేదు'

'కపాడియా వాచ్ చాలా విలువైంది'

"సంభాషణ ఈ రకంగా పొడి పొడిగా సాగింది.

'మరి మీ నవలో?' అంది నవ్వుతూ చంచల.

"అది వట్టి చెత్త" అన్నాడు శ్రీపతి.

మరెందుకు రాయడం... అది రాయడానికి వీలు లేదు అని శాసించినట్టుగా అన్నది.

పూర్తి చేసి ప్రయత్నిస్తానన్నాడు శ్రీపతి.

ఇంటికి వెళ్ళిన తరువాత చెరొక మంచంమీద పడుకున్నారు పక్క పక్కనే శ్రీపతి నిద్రపోతున్నట్టుగా ఆలోచిస్తున్నాడు. చంచల నిద్రపట్టక అటూ ఇటూ పొర్లుతోంది. రాజకీయవేత్త పార్టీలు మార్చినట్టుగా గడియారం ఆగలేదు. వీధిలో గూర్ఖా కర్ర చప్పుడు చేసుకుంటూ నడుస్తున్న బూట్ల ధ్వని వినిపిస్తోంది. వాణ్ణి చూసి గొలుసుల్లోంచి 'స్మోకీ' అల్సేషియన్ అరుస్తోంది. చంచల లేచి కూర్చుంది. డ్రాయింగ్ రూమ్‌లో టేబిల్ సొరుగులో నవలకు సంబంధించిన కాగితాలు రెపరెపలాడుతున్నాయి. కాగితాలలో తన ప్రతిబింబం, తనను హేళన చేస్తున్నట్లు, తనను చూసి పరిహసిస్తున్నట్లు తనను సూదితో పొడిచినట్లు చేతులు చాపుతూ ముందుకు వస్తున్నాయి. చంచల అమాంతం లేచింది. సొరుగులో చెయ్యి పెట్టింది. కాగితాలు తేళ్ళూ, పాముల్లా... తగిలినై విదిలించుకున్నది. మళ్ళీ చెయ్యి... ఈసారి కాగితాలు వేడిగా.. కొరవి దయ్యం చింత నిప్పుల కళ్ళలా మెరిసినై. రెండు చేతుల్తోనూ కాగితాలను తీసుకుంది. పసిపిల్ల వాడి పీక నులిమేసినట్లు... పిప్పి పిప్పి చేసింది. హత్య చేస్తే రాలిన ప్రతి రక్తపు

చుక్కకూ ప్రాణం వచ్చి లేచి రూపం పెంచుకుని ఎంత మందిగానో కన్పడ్డారు చంచలకు. కాగితం ముక్కలు చెల్లా చెదరై ఇంటినిండా తెల్లరక్తం చుక్కలల్లే వ్యాపించినై. కాగితాల రక్తపు మడుగులోంచి బయటపడి... తన చీర మీద అంటుకున్న కొన్ని ముక్కలను విదిలించి వేసి... తన పక్కమీద వాలింది. బరువైన శరీరంతో తేలికైన మనసుతో.

నిద్రపోతూ ఇదంతా గమనిస్తున్న శ్రీపతి... నన్ను చంపినా బావుణ్ణు అనుకున్నాడు!!

దగ్గరకు జరిగి.. చంచలా నీకిప్పుడు హాయిగా ఉందా... అన్నాడు.

# 28

# అపస్వరాలు

"మీ దగ్గరనుండి ఉత్తరం వచ్చి చాలా రోజులైంది. మీరెందుచేతో బొత్తిగా ఒక్క ఉత్తరం ముక్కైనా వ్రాయడం మానేశారు. మీకు తీరిక లేకుండా ఉందని నాకు తెలుసు. ఎంత తీరికలేకపోయినా... ఇన్నాళ్ళయి ఒక్క ఉత్తరం ముక్క రాయచ్చు. నా ఉత్తరానికి జవాబసలే రాయరు. ఏం... ఉద్యోగం చేయటం అంత కష్టంగా ఉందా? మీకు ఉద్యోగంలో ప్రమోషను వచ్చిందని మా నాన్నగారు చెప్పారు. చాలా సంతోషమయింది. మీరు శలవురోజుల్లోనైనా ఒకసారి వచ్చి చూసిపోకూడదా అని ఎప్పుడూ అనుకుంటుంటారు మా నాన్నగారు. మా చెల్లెలి పెళ్ళికూడా చేద్దామని సంబంధంకోసం వెతుకుతున్నారు. మీ రెప్పుడో ఒకసారి చెప్పారు... మీ స్నేహితు డొకడున్నాడు చాలా తెలివైనవాడని – ఆ విషయం మా నాన్నగారికి చెప్పాను. అన్ని వివరాలూ ఆస్తిపాస్తులు విచారించి మిమ్మల్ని ఉత్తరం రాయమన్నారు.

ఇది చాలా ముఖ్యమని అనుకుంటున్నారు. నా విషయంలో త్వరలోనే కాపురం పెట్తే బావుంటుదంటున్నారు. ఉన్నట్టుండి మా నాన్నగారికి దిగుళ్లెక్కువైనయి. తమ్ముడు పరీక్షకూడా తప్పాడు. వాడికి చదువుచెప్పే ప్రైవేటు మాస్టరు... తప్పకుండా ప్యాసవుతాడండీ... అన్ని పేపర్లూ బాగా రాశాడు... అని చెప్పి పాతికరూపాయలూ చేతిలో నేయించుకుని వెళ్లాడు. పదిరోజులబట్టీ మా అమ్మకు చలిజ్వరం వస్తున్నది. చక్కగా పాడుతున్న రేడియో కాస్తా చెడిపోయింది. బాగు చేయించటానికి ఇచ్చారు. మళ్ళీ ఇంతవరకు తిరిగి రాలేదు.

నాలుగురోజులక్రితం... పాపం మా ఇంటి పక్కనవుండే విమల టైఫాయిడ్ జ్వరం వచ్చి పోయింది. ఎంతో స్నేహంగా ఉండేవాళ్ళం ఇద్దరం కూడా. ప్రతిరోజూ

రేడియో వింటానికి మనింటికి వచ్చేది. నా దగ్గర కొన్ని పాటలు కూడా నేర్చుకుంది. పెళ్ళి అయి నాలుగు నెలలు కూడా కాలేదు. వాళ్ళ తల్లిదండ్రులూ చాలా దుఃఖిస్తున్నారు. ఆ అమ్మాయి భర్త చెన్నపట్నంలో బి.యస్సి. చదువుతున్నాట్ట. వచ్చి చూసి కూడా పోయినాడు. అతనికిద్దామనే ఉద్దేశ్యం కూడా ఉంది మా నాన్నగారికి. మనింటికి కూడా ఒకసారి వచ్చి చూసిపోయినాడు. ఎట్లాగైనా వచ్చే మాఘమాసంలోపల మా చెల్లికి పెళ్లి చేసేయాలని చాలా పట్టుదలగా ఉంది మా నాన్నగారికి. పొలంమీద డబ్బు కూడా మొన్ననే వచ్చింది. ఆ సమయానికి దొరుకుతయో దొరకవో అని పెళ్ళి సామగ్రి కూడా ఇప్పటినుండే కొంటున్నారు.

ఏమీ పొద్దుబోకపోతే మా తమ్ముడు తీసుకొచ్చిన పత్రికలేవో తిరగేస్తున్నాను. మా తమ్ముడికి ఈ పత్రికలంటే మహాసరదా. అక్కా, దీంట్లో బావ కథ రాశాడు చూడవే అంటూ నా దగ్గర పడేశాడు. ఎగతాళికి అట్లా అంటున్నాడేమోనని పత్రిక తిరగేశాను. మీ పేరు కనపడ్డది. మీరు కథలు రాస్తారని నా కసలే తెలీదు. నాకొకసారైనా చెప్పలేదు. ఆ కథ చదివినప్పటినుండి మీ దగ్గరకు వచ్చి అసలు విషయం హృదయం విప్పి మాట్లాడుదామనుకున్నాను. ఇక్కడి పరిస్థితులవల్ల వీలు కాలేదు. ఏది ఎట్లావున్నా మీ మనసు ఆ విధంగా ఉంటుందని నేనెప్పుడూ ఊహించనైనా లేదు. అయితే మీరూ బాధపడుతున్నారన్నమాట. మనసులో ఒక ఉద్దేశ్యం బయట ఒక ఉద్దేశ్యం పెట్టుకుని ఉన్నారన్నమాట.

పోనీ ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకుంటే మీరు సుఖపడేవాళ్లు కాదా! మీరా అమ్మాయిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానని... ఇంకా ఏమేమో రాశారు కథలో. ఆమెను ప్రేమిస్తే నన్ను ఎందుకు పెళ్ళిచేసుకున్నారు. నేనిట్లా రాస్తున్నానని మీకు కోపం వస్తుందేమో... నా మనసుకు నిజంగా కష్టంగా ఉంది. మీరిన్నాళ్లూ ఏ సంగతి చెప్పినా మనస్ఫూర్తిగా చెప్తున్నారనీ... మీ హృదయం నిష్కల్మషమైనదనీ అనుకుంటూ ఉన్నాను. కథలో. కాఫీ తాగేటప్పుడు కూడా ఆవిడే జ్ఞాపకం వస్తుందనీ, మరచిపోదామన్నా మరపుకురాని దివ్యరూపం అనీ రాసుకున్నారు. అటువంటి దివ్యస్వరూపాన్ని వదిలిపెట్టుకుని ఆ బాధపడటం నాకేమీ బాగాలేదు. నా పెళ్ళి కాబోయే ముందు మీరు నన్ను ప్రేమించాననీ... నేను చాలా బావుంటాననీ చెప్పిన మాటలన్నీ వట్టిబూటకం అన్నమాట. ఆవిడనే మీరు ఈ క్షణం పెళ్ళిచేసుకున్నా నా అంతరాత్మ

సంతోషిస్తుంది. నేనీవిధంగా రాస్తున్నానని మీకు కోపం వస్తుంది. నేనేవచ్చి స్వయంగా అన్ని మాట్లాడిపోదామనుకున్నాను. పోనీ ఆదివారం నాడు శలవు. ఆ రోజైనా రాకూడదూ? ఏం రాసింది... పిచ్చి... సీత... ఉత్తరం అని మొదలవకుండా ఊరుకుంటే నేను నిలవలేను. మరు జవాబు రాయటమో... ఇక్కడకు బయలుదేరి రావటమో... ఈ రెండూ జరగకపోతే నేనే బయలుదేరివస్తున్నాను. సీతకేమీ తెలియదు, అమాయకురాలు అనుకుంటున్నారేమో. ఇటువంటి మనుషుల్ని చూస్తే ఎవరికైనను కోపం వస్తుంది. తొందరలో ఏం రాశానో ఏవైనా తప్పులుంటే క్షమించండి

జవాబు కోసం నిరీక్షిస్తున్న

మీ

సీత"

ఎవరి దగ్గరనుండో ఉత్తరం వచ్చింది కదా అని చదివి చూస్తే... "ఈ భారతం అంతా ఉంది. ఇంకోసారి చదివాను. పక్కనున్న అరవ అతను అడగనే అడిగాడు పసికట్టి... ఏం ఎక్కడనుండి ఉత్తరం? అన్నిసార్లు చదువుతున్నావ్ అని. నాకు వళ్ళు మండిపోయింది. తంతానన్నట్లుగా వాడివైపు చూశాను. కళ్ళజోడులోంచి... కవరు మడిచి జేబులోపెట్టి పనిచేయటం ప్రారంభించాను. అయిదుగంటలు కాగానే ఆఫీసులోంచి బయటపడి... దోవలో కాఫీహోటల్లో ఒక్క మజిలీతో రూముకు చేరుకున్నాను.

రూమంతా నానాచండాలంగా వుంది. ఎక్కడ వస్తువులక్కడ చిందర వందరగా పడేసి ఉన్నయి. చల్లటినీళ్ళు తాగుదాం కదా అని కూజాను ముట్టుకోబోతే అది కాస్త పగిలి ఊరుకుంది. కిరసనాయిలు రేషన్‌కార్డు కోసం వెదికితే అది కనపడదూ.

ఎదురుగా వున్న చెట్టియార్ దగ్గర రైల్వే గైడు తీసిచూస్తే ఏదో సనలభైకి ఒక బండి వుంది. ఉత్తరం మళ్ళీ చదువుకున్నాను... ఈ రెండింట్లో ఏదీ జరక్కపోయినా నేనే బయలుదేరి వస్తున్నాను... తనెట్లా బయలుదేరి వస్తుంది నా దగ్గరకు. అసలు నలుగురూ ఏమంటారు. అప్పుడే అనుకుంటున్నారు కొంతమంది... ఇదేవిటి చోద్యం... పెళ్ళయి ఉనప్పటినుంచే మాట్లాడుకుంటున్నారని.... సీత ఇక్కడికి బయలుదేరి వస్తే ఏమన్నా ఉందీ ఇహ... అన్యాయమయిపోతుంది నా పని. ఏం చెయ్యాలో

నాకేమీ తోచలేదు... ఒకవేళ నేనే బయల్దేరి వెళ్ళానా అంటే.. ఇప్పుడెందుకు వచ్చాడు అల్లుడు... కారణం ఏమిటి అని వాళ్ళు అనుకుంటారేమో... చాలా చిక్కుగా వుంది. అయినా వర్థి పుణ్యానికి సీత ఈ విధంగా దురభిప్రాయపడటం ఏమీ బాగాలేదు. నేను ఒకవేళ వెళ్ళి అన్ని విషయాలు సవిస్తరంగా చెప్పినా... నా మాటలు నమ్ముతుందా... తన మనసు ఎంతగా చిన్నపడ్డదో... లేకపోతే ఆ విధంగా ఉత్తరం రాస్తారా ఎవరన్నా... రూములో గోడకు తగిలించిన "సీత" ఫోటోవైపు ఒకసారి చూశాను. నా వైపుచూసి నవ్వుతున్నట్లనిపించింది. పెళ్ళి కాకముందు వాళ్ళ మేడమీద నుంచుని నావైపు చూస్తుంటే... కెమెరాతో తీసిన ఫోటో అది.

మర్నాడు ఆదివారం అవటంచేత ఆ బండికే ప్రయాణం అయినాను.

  

నేను వెళ్ళేటప్పటికి మామగారు... ఒక విధంగా చూశారు నా వైపు... ఆరోగ్యం బావుంటున్నదా నాయినా అంది అత్తగారు. ఇద్దరూ మాట్లాడుతుంటే ఇద్దరి మధ్యకూ వచ్చి సీత... పదిగంటలబండికి వచ్చారా... కాళ్ళు కడుక్కోండి... అని నీళ్ల తెచ్చి ఇచ్చింది. భోజనం చేసిన తరువాత సీత చీల్చి ఇచ్చిన తమలపాకులు చుట్టలు నమిలి ఆరుబయట ఈజీఛైర్‌లో కూర్చున్నాను. ఇవ్వాళ పౌర్ణమి ఏమిటి? ఇంత వెన్నెలగా ఉంది అన్నాను. కాదు ద్వాదశి అని మామగారన్నారు. అల్లుడికి మేడమీద పక్క వెయ్యవే పడుకుంటాడు... రైలు.. బడలిక... వేధవది... ఈ రోజుల్లో ప్రయాణాలంటే బహు కష్టమయిపోయింది అన్నాడు మామగారు.

నేను మేడమీదకు వెళ్ళి పడుకున్న తరువాత మరచెంబుతో నీళ్ళు పట్టుకుని సీత వచ్చింది పైకి... అది అక్కడపెట్టి దగ్గరగా వచ్చి కూచుంది.

"నే రాసిన ఉత్తరం చేరిందా? అని అడిగింది సీత. "ఉ" అన్నా మాటల్లో రేషనింగ్ పెట్టినట్లు... 'ఏమన్నా కోపం వచ్చిందా...?

"ఇంకా రాలేదు...'

'మరి ఏం మాట్లాడరేం....

"ఏం మాటలు?

"కబుర్లు

# 29

# లోకం కళ్లు

హనుమంతరావుకు తన బంధుకోటి మీద విపరీతమైన కోపం వచ్చింది. ప్రతివాళ్ళకీ తనసంగతీ తన భార్య సంగతే కావాలి. హనుమంతరావు మీద సూటీలు పోటీలు మాటలనడం... హనుమంతరావును గురించి చాలా తేలికగా అనుకోవటం అతనిమీద ఏవిధమైన గౌరవమూ వుంచకుండా ప్రవర్తిస్తున్నారు. తన మేనమామలు, తన అన్నలు, తన అక్కల, మేనత్తలే తనను హేళన చేస్తున్నప్పుడు ఇతరుల సంగతి చెప్పనే అక్కర్లేదు.

రెండు సంవత్సరాలు చూశాడు. పద్ధతులు ఏమైనా మార్చుకుంటారేమో వాళ్ళు అని. మరీ ఎక్కువకావడం మొదలుపెట్టింది. ఇప్పుడిప్పుడు వాళ్ళనే మాటలూ, వీళ్ళనే మాటలూ తన భార్యదాకా వచ్చినయి. అపరిస్థితుల్లో తన భార్య ఏం బాధపడుతుందో అని చాలా నొచ్చుకున్నాడు హనుమంతరావు.

తనలో ఉన్న ఓర్పూ, సహనమూ ఇన్నాళ్లూ తనను మాట్లాడకుండా ండనిచ్చినయి.

"మరీ అధ్వాన్నంగా ఉంది వాడి కాపురం... ఆ పెళ్ళాన్ని వాడు, ఎట్లా ఏలుకుంటాడో గాని..." అని తన మేనత్త తన దుట అంటుంటే విన్నాడు. విని ఏమీ చేయలేక ఊరుకున్నాడు. తనను గురించి ఆ విధంగా రిమార్కు చేసేవాళ్లు వట్టి అమాయకులు అని అనుకున్నాడు.

ఏది ఎట్లావున్నా హనుమంతరావు తన బంధువుల దృష్టిలో ఒక అసమర్థుడు, ఒక తెలివితక్కువవాడుగా కన్పడుతున్నాడు.

ఇదివరకు ఎవరన్నా దగ్గర బంధువులు ఉత్తరాలు రాసేవారు. ఇప్పుడు అదీ మానుకున్నారు.

పెళ్ళికాకముందు తను బియ్యే చదివే రోజుల్లో ప్రతివాళ్లూ మెచ్చుకున్నేవాళ్లు తనను. హనుమంతరావంత తెలివిగలవాళ్ళు ఇంకోరుండరు ఆ చదువుకునేవాళ్ళలో అని తన మేనమామ అనేకసార్లు గర్వపడ్డాడు. బియ్యే ప్యాసయి.. ఏ కలెక్టరుగానో వస్తాడు... అద్భుతమైన తెలివిగలవాడు. వాడికేం... వాడికి అదృష్ట జాతకమని ఎరిగి ఉన్నవాళ్లూ బంధువులుకూడా తనను గురించి చాలా ఎక్కువగా చెప్పుకున్నారు.

వాళ్ళనుకున్నట్టుగానే బియ్యే ఫస్టుక్లాసులో ప్యాసయినాడు. ఆ పరిస్థితుల్లో ఆంధ్రదేశంలో నాయకుడంత గొప్పవాణ్ణి చేశారు అతన్ని. ఆకాశానికి ఎత్తారు. ఏ పదివేలో తీసుకోంది పెళ్ళి చేసుకోవాకు అని సలహా చెప్పేవాళ్ళూ న్నారు అప్పట్లో...

చుట్టూ ఈ విధంగా ఉన్న వాతావరణం చూసి తనూ ఉబ్బిపోయినాడు.

అతని మట్టుకు అతనికి తెలీకుండా తనలో మార్పు వచ్చింది.

బియ్యే ప్యాసయిన సంవత్సరానికే ఏదో అరవైరూపాయల ఉద్యోగం చేరిన తరువాత పెళ్ళిచేసుకున్నాడు. ఆ రోజు నుండీ అతని చక్రం అటుగా తిరగటానికి అవకాశం దొరికింది.

ఎవరు ఎన్ని మాటలు చెప్పినా వినకుండా, ఎవరు ఏమాట అన్నా మెదలకుండా ఊరుకోవడం ద్వారా తను ప్రతీవాళ్లకూ 'వ్యతిరేకుడు' అయినాడు.

ఒక్కొక్కప్పుడు బంధువులంతా కలిసి తనమీద తిరుగుబాటు చేస్తారేమో అనిపిస్తుంది.

సిగ్గా శరమా ఎన్ని అన్నా అంతే వాడు. ఇప్పటికైనా మాటలు విని రెండో పెళ్ళి అయినా చేసుకుంటే హనుమంతరావు బాగుపడ్తాడు అని ఒకరు... ఏమీ లాభంలేదు... దున్నపోతుమీద వానకురిసినట్లే... మన మాటలు లక్ష్యం చేస్తాడు?... అని ముసలమ్మలూ వయసమ్మలూ తనను గురించి ఆక్షేపణలు చేస్తున్నారు.

తన స్వవిషయాల్ని గురించి ఇతర్లు ఇంతగా ఎందుకు బాధపడ్తున్నారో అర్థం కాలేదు హనుమంతరావుకు.

ఆ భార్యను చేసుకున్న తర్వాత తను ఏవిధంగాను బాధపడటం లేదు. చక్కగా కాపురం చెయ్యటం నేర్చుకున్నాడు. అనుభవిస్తున్నాడు. తనకేవిధమైన లోటులేదన్నట్లుగా కాలం గడుపుతున్నాడు. నిజానికి అట్లాగే ఉన్నది కూడా...

ఈ బంధువులు నలుగురిమధ్యా, అసలు ఈ దేశమధ్యంలో లేకుండా ఉంటే బావుంటుందనుకున్నాడు హనుమంతరావు. ఏ జబ్బల్‌పూరో వెళ్ళి నాలుగు సంవత్సరాల పాటు వీళ్ళకంటికి కనపడకుండా ఉంటే హాయిగా ఉంటుందనిపించింది అతనికి...

దీని విషయమై చాలాసేపు ఆలోచనలు చేసేవాడు. ఒక్కొక్కరోజు రాత్రిళ్ళపూట నిద్రకూడా పోవటం లేదు. ఆఫీసులో కూచుని పనిచేస్తున్నా అవే ఆలోచనలు... అతని కేమాత్రమూ మనశ్శాంతి లేనట్లుగా కన్పించింది...

ఆఫీసులో తను చేసేపని తెమలక చాలా విసుక్కుంటున్నాడు.

ఒకరోజు సీతతో సినిమాకు వెళ్ళి వచ్చి భోజనం చేస్తూ ఈ విషయమై హెచ్చరించాడు. తన బంధువర్గంలో ప్రస్తుతం జరుగుతున్న విషయాలన్నీ గుర్తులతో చెప్పాడు. అన్ని సంగతులూ విని... మీకేమీ ఫరవాలేదు... నేనుండగా.. ఒకళ్ళకోసం మనం లేచిపోతామా... ఈ కాస్తకూ ఈ ఉద్యోగం వదిలిపెట్టి ఎక్కడికోపోవటం ఎందుకు... అని అనీ వాళ్ళ నోర్లే మూతలుపడుతాయి... అని తన మూగి భాషలో అంతా ధైర్యం చెప్పింది. సీతకు మాట్లాట్టం రాకపోయినా తన మూగిభాషతోనే అన్ని విషయాలు మాట్లాడుతుంది హనుమంతరావుతో. ఆరోజు చెప్పిన మాటలకు... హనుమంతరావుకు ఆవేశం వచ్చింది. తనను అంటూన్న బంధువుల దగ్గరకు వెళ్ళి చెప్పుతీసుకుని తందామా అనిపించింది.

సీతా... నిన్నూ నన్నూ కూడా అర్థం జేసుకోకుండా... వాళ్ళు అట్లా అంటున్నారు. దానికి మనమెట్లా బాధ్యులమవుతాము. సీతా... ఏం చెయ్యమంటావు చెప్పవూ? అని సీతను కౌగిలించుకుని వలవల ఏడ్చాడు హనుమంతరావు. సీతకు పొర్లుకువస్తూన్న దుఃఖం ఆగలేదు. ఆ మూగిలోనే ఏడుస్తూ ఏవేవో చెప్పింది. తన కళ్ళతో హనుమంతరావుకు ఎన్నో సంగతులు అందచేసింది.

పెళ్ళి అయిన కొత్తల్లో అందరూ నన్ను మూగి సీత, మూగిసీత అనేవాళ్ళు అని చెప్పుకుంది. హనుమంతరావు కౌగిలిలో అమాయకంగా చూస్తూ...

హనుమంతరావు నిద్రలేవగానే సీత కాఫీ తెచ్చి ఇస్తుంది.... అతనికేవేవి కావాలో అన్నీ తెలుసుకుని, అతను అడగకమునుపే అన్నీ అమరుస్తుంది.

కూరా, పప్పూ పచ్చడీ చేసి... చక్కగా వంటచేస్తుంది... భోజనం చేసిన తరువాత పెట్టెతీసి... ఇవిగో ఈ గుడ్డలు వేసుకుపోండి ఆఫీసుకు... ఈ సూటు బావుంది... అని వాటికి గుండీలు అవీ అన్నీ అమర్చి భోజనం అయ్యేసరికి... బల్లమీద పెడుతుంది.

ఎంతో పరిశుభ్రంగా అట్టేపెడుతుంది. ఇల్లు మధ్యలో అద్దమూ, దానిపక్కనే, పెళ్ళిలో తీయించుకున్న ఫోటో. ఇటు పక్కగా కళ కళలాడుతున్న గాంధీగారి ఫోటో... ఇంకా మంచి మంచి ఫోటోలన్నీ శుభ్రంగా గోడకు తగిలించింది. ఆల్మైరాలో ఒకచోట పుస్తకాలూ, రెండోచోట సబ్బు పెట్టా, హేరాయిలూ దువ్వెనా... ఇటువంటివన్నీ అమర్చింది.

ఆ చిన్న వంటయింట్లోనే గిన్నెలూ అవీ బాగా అట్టేపెట్టుకుంటుంది.

హనుమంతరావు నెలకు నాలుగు రూపాయలు అల్లిక దారాలకు ఖర్చుపెడతాడు. హనుమంతరావు ఆఫీసుకు వెళ్ళగానే కొంచెం సేపు ఏదో పుస్తకం చదువుకుంటూ కూచుంటుంది. మిగతా సమయాల్లో అంతా ఏవో రంగు రంగుల బొమ్మలు, గుడ్డలమీద అల్లుతూ వుంటుంది.

చేరుమాళ్లు, డోర్ కర్టెన్సు అన్నీ తయారు చేస్తుంది...

తొమ్మిది రూపాయలకు అద్దెకుంటున్న ఇల్లయినా ఎంతో శుభ్రంగా అట్టే పెడుతుంది ఇల్లు.. ఇంట్లో పాలుపోసి మళ్ళీ ఎత్తవచ్చు హనుమంతరావు ఆఫీసునుండి రాగానే ఏదో ఫలహారం చేసి "టీ" పెట్టి ఇస్తుంది. సినిమాకు వెళ్దామని ఎప్పుడు సరదా కలిగితే అప్పుడు రావటానికీ ఏమీ అభ్యంతరం చెప్పదు సీత. మార్కెట్లోకి మంచి చీర వచ్చినప్పుడు సీతకు నచ్చిన చీర తెచ్చి ఇస్తాడు. సీతమీద కోపం రానే రాదు. ఒకవేళ వచ్చినా ఏదో విధంగా సర్దుకుపోతాడు. సీతకు కష్టం కలిగేట్టుగా ఒక్కమాట కూడా అనడు.

దిగులూ విచారమూ అంటూ ఏమీ లేకుండా సీతతో కాపురం చేస్తున్నాడు హనుమంతరావు. తను తెచ్చిన జీతంలో డబ్బు చాలా క్లుప్తంగా వాడుతుంది. ఇంట్లో అని నసపెట్టదు.

ఇన్ని లక్షణాలూ, ఇంత తెలివితేటలూ పెట్టి.. ఆ భగవంతుడు ఆవిడకి నోరు పెట్టలేదు... ఇది నిజంగా క్రూరత్వం... ఆవిడకే ఆ నోరు ఉండి మాట్లాట్టం చేతయి ఉంటే... ఇంత సాదాగా కాపురం జరిగిపోతుందా పోదా అని చెప్పలేం. సీత "మూగి" అవాలని భగవన్నిర్ణయమే.

దానివల్లే హనుమంతరావుకు చాలా చిక్కులు వస్తున్నయి. ఊళ్లో ఉండటమా, ఎక్కడికన్నా వెళ్ళటమా అనేది ఒక తీవ్ర సమస్య అయి కూచుంది హనుమంతరావుకు. దీనికి మాత్రం సీత ససేమిరా ఇష్టపడలేదు. సీత చెప్పినట్లుగానే ఉన్నచోటే ఉండటానికి నిశ్చయించుకున్నాడు.

మిగతావాళ్ళు తనని గురించి ఏమన్నా అనుకోనీ... ఊరికే ఉండటమే ఉత్తమం అనుకున్నాడు.

తనకు కొడుకు పుట్టబోతున్నాడనే విషయం విన్నప్పటినుండీ హనుమంతరావు చాలా సంతోషంగా ఉన్నాడు. ఇహ బంధువులంటే అసలే లెక్కచేయ తల్చుకోలేదు.

సీతకు నెల తప్పిందటగా... అని ప్రతివాళ్లు ముక్కుమీద వేలువేసుకుంటున్నారు.

సీతకు వందంటి కొడుకుపుట్టాడు... బారసాల చేసుకున్నాడు. తన బంధువర్గంలో ఒక్కర్నీ పిలవలేదు. ఆ రోజు రాత్రి ఆఫీసులో గుమాస్తాలందర్నీ పిలిచి డిన్నర్ ఏర్పాటు చేశాడు. ఆ రోజు వాటికైతేనేం వీటికైతేనేం యాభైరూపాయలు ఖర్చుపెట్టాడు. బారసాల పీటలమీద హనుమంతరావూ, సీతా కూచుంటే చాలా ముచ్చటగా వుంది.

పిల్లవాడు పుట్టిన తరువాత బారసాల చేసుకుని ఒకర్నీ పిలవలేదే అని బంధువులందరూ గింజుకున్నారు. మనమణ్ణి చూసిపోదామని తన తల్లి మాత్రం వచ్చింది. సీతమ్మ కోడల్ని చూసి మురిసిపోయింది అత్తగారు. పిల్లవాడికి నాలుగో నెల వెళ్ళిందాకా తల్లి తన దగ్గరే ఉంది. ఉన్న నాలుగు నెల్లలోను హనుమంతరావూ సీత కాపురాన్ని చూచి చాలా సంతోషించింది. తన కొడుకుని అపార్థం చేసుకుని ఆక్షేపించినవాళ్ళందర్నీ దుమ్మెత్తిపోసింది.

హనుమంతరావుకు పుట్టిన పిల్లవాణ్ణి చూద్దామని ఎవళ్ళ మనస్సులలో వాళ్ళకు ఉంది బంధువులకు. కాని రావటానికి ఒక్కరికీ మనస్కరించలేదు. అయినా ఏ మొగం

పెట్టుకుని వస్తారు తన ఇంటికి... హనుమంతరావు మీద ఇప్పుడు ప్రతివాడికీ 'జెలసీ' ఏర్పడింది. కారణం ఏమిటంటే హనుమంతరావు మూగి సీతతో ముచ్చటగా కాపురం చేస్తున్నాడు.

సీతకు ఇప్పటికైనా మాట్లాట్టం వచ్చేట్టు చేస్తే బావుండు ఆ భగవంతుడు అనిపిస్తుంది.

# 30

# కరుణమ్మ పట్టు

శ్రీ భగవానువాచ:

*దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం*
*శౌచమార్జవమ్!*
*బ్రహ్మచర్య మహింసాచ*
*శారీరం తప ఉచ్యతే॥*

దేవతలను, బ్రాహ్మణులను, తత్వోపదేశకుడగు గురువును, సామాన్యముగా జ్ఞానులందరిని పూజించుటయు, శరీర పరిశుద్ధత్వము కలిగియుండుటయును, ఋజుత్వంబును, బ్రహ్మచర్య వ్రతంబును, తనకుగాని పరులకుగాని హింసను కలుగచేయక యుండుటయును, శరీరముచేత చేయదగిన తపస్సని చెప్పబడుచున్నది.

  

మా ఇద్దరికీ మధ్య సరికొత్త అయిదురూపాయిల నోటు రెపరెప లాడింది.

"మీరు నాకు చాలా సహాయము చేశారు..."

"..........."

"మీరు తప్పక రావాలి; శలవిప్పించండి మరి నేను వెళ్ళి వస్తాను... నమ... స్తే".

కరుణమ్మ వెళ్ళిపోయింది. చూస్తూ నిల్చున్నాను. ఆవిడ నన్ను ఎందుకో ఆకర్షించింది... అవుననుకుంటాను...

  

'నాటకానికి వస్తానని రాలేదే... మీకోసం చాలాసేపు ఎదురు చూశాను... కలెక్టరు దొరవారు కూడా వచ్చారు... భరతనాట్యం కూడా జరిగింది... మీ కోసం వసతి గృహం కట్టించడానికి త్వరలో ఏర్పాట్లు చేస్తామని అమ్మగారు వాగ్దానం చేశారు...'

'చాలా సంతోషము... నాటకానికి రావడానికి వీలుపడలేదు... ఆఫీసునుండి వచ్చేటప్పటికే రాత్రి తొమ్మిది దాటిపోయింది...'

"మీరు చెప్పిన మాటవల్లనే వారెంతో సహాయం చేశారు. మీకు నా కృతజ్ఞత..."

"మరో విషయం చెప్దామనుకుంటున్నాను. ఆ రాట్నాల విషయం ఏం చేశారు? ప్రస్తుతం పన్నెండు మాత్రమే వీలవుతయి... రేపే తెప్పించండి అవి..."

"మీకు నమస్కారం చేస్తాను. నన్ను మీరు అని సంబోధించకండి... మీరు ఉత్తమకులంలో చేరినవారు. చదువుకున్నవారు. ఉద్యోగం చేస్తున్నారు. నేను... నా సంగతి మీకు తెలిసే ఉంది..."

కరుణమ్మ స్వరం కంపించింది.

"ఇటువంటి విషయాలు ఆలోచించటం మానేయాలి కరుణా...! భగవంతునిలో విశ్వాసం ఉంచు."

కరుణమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

"నాకోసారి అమ్మగారిని చూడాలి అని ఉన్నది. మీరు అంగీకరిస్తే మీ ఇంటికి వస్తాను..."

"అదుగో మళ్ళీ ఆ మాటే మాట్లాడుతున్నావు. ఆవిణ్ణి అమ్మగారు అని సంబోధించకూడదు. ఆవిడపేరు సీత. సీతమ్మ. లేకపోతే సీతమ్మగారు అను. నీవు వచ్చి మాట్లాడితే నా భార్య చాలా సంతోషిస్తుంది".

  

"భగవద్గీత ఎంతవరకు పూర్తి అయింది... శ్రద్ధగా చదువుతున్నా రనుకుంటాను..."

'ఉదయం ప్రార్థనలయిన తరువాత కొంతవరకు గీత మొదలు పెట్టాము... చదువుకూడా ఇదివరకుకంటే బాగానే జరుగుతుంది... మరేమైనా 'పుస్తకాలు' చెప్తే అవి తెప్పించుకుంటాము...

'పుస్తకాల లిస్టుకోసం రాశాను. రేవు వస్తుంది... పుస్తకాల విషయం కాదుగాని... కాగితం తయారు చేయడం, అ సబ్బులు తయారు చేయడం... త్వరగా పూర్తి చెయ్యండి... ఎంతమంది నేర్చుకుంటున్నారు కాగితం తయారు చేయడం...?'

"ఇప్పటికి అయిదుగురు నేర్చుకుంటున్నారు. ఇంకా కొంతమంది వస్తారని నమ్మకం ఉంది... ఈ నాలుగు నెలలూ అయిన తరువాత మీరేం చేయమంటారో చెప్పండి..."

"ఈ నాలుగు నెలలై జరిగిన తరువాత ఆలోచిద్దాం... ముందర ఇది జయప్రదం అయితే... మరో వారం రోజుల్లో నాటకం వేయాలి. కనీసం మరో రెండు వందలయినా ఉంటేనే కాని మనం అనుకున్నట్టు జరగదు..."

"ఈ ఊరుకాకుండా మరో దగ్గర ఊళ్ళో వేస్తే బావుంటుంది. మాతో కూడా మీరు రావాలి..."

"నా సంగతి తెలిసే మళ్ళీ అడుగుతున్నావ్. ఆ ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నంత కాలం నేను ఎక్కడికీ కదలడానికి వీలులేదు. నేనీవిధంగా తిరుగుతుంటే, అది అధికారులకు తెలిస్తే ఇంకా ఏమన్నా ఉందీ?..."

కరుణమ్మ ఎప్పుడూ నేను అక్కడే ఉండాలని అంటుంది. వాళ్ళని ఇంకా వృద్ధిలోకి తీసుకురమ్మంటుంది. నేను బాగా పనిచేయగలనని నమ్మకం ఉంది.

నేను రెండురోజులు అక్కడకు పోకుండావుంటే సరాసరి మా ఇంటికి వచ్చేస్తుంది. రమ్మని బతిమిలాడుతుంది. నన్ను ఏమో చెప్పమంటుంది. నేను ఏది చెప్పినా అది వేదవాక్యమే.

  

మళ్ళీ మా ఇంటికి కరుణమ్మ వచ్చింది. ఎంత బలవంతం చేసినా కుర్చీ మీద కూర్చోలేదు. చాపమీద కూర్చుంది. సీతకు నమస్కారం చేసింది...

"ఆ గుడిలో మాకు ప్రవేశం వచ్చే వరకూ ఏదో విధమైన అలజడి తీసుకు రావలసిందే... ప్రతిరోజూ ప్రార్థనలు గుడిలోనే చేయవచ్చు..."

"ఎప్పుడూ తొందరపడకూడదు... తాపీగా అధికారులను అడిగి చూడాలి. ఒప్పుకోకపోతే బతిమిలాడుకోవాలి... అప్పటికీ మన మొర వాళ్ళు వినకపోతే ఆలోచించి ఏమైనా చేద్దాం... అధికారుల మనసుకు ఎప్పుడూ కష్టం కలిగించ కూడదు. వాళ్ళకు నచ్చచెప్పాలి. వాళ్ళ హృదయం కొన్నాళ్ళకు కరుగుతుంది. ఎప్పటికైనా మీరందరు పట్టుదలగా ఉంటే జయం మనకు తప్పదు".

"మీరేం చేయమంటే అదే చేస్తాము... సత్యము తప్పక జయిస్తుందని నాకూ ధైర్యం ఉన్నది... అన్యాయం అక్రమం జరగకుండా ఉండటానికి... మా ప్రాణాలైనా అడ్డుతాము..."

"అసలు ఆ పరిస్థితుల్లో ధైర్యంగా ప్రాణాలు వదులుకోవడమే మీ గుండె నిబ్బరాన్ని నిష్కల్మష హృదయాన్ని తెలియజేస్తుంది. తప్పు మీయందు లేనప్పుడు చచ్చిపోతే మాత్రం ఏం?.... మీ శరీరాలు పోయినా... మీ మాట, మీ హృదయం శాశ్వతంగా వుంటుంది...."

  

[కరుణమ్మను గురించి కొంత చెప్పవలసిన అవసరం ఉంది... కరుణమ్మ ఫోర్తుఫారం చదివింది. వయస్సు పదిహేడు. హరిజనకన్య. ఆ అమ్మాయి తండ్రి ఫ్యాక్టరీలో కూలిపని చేస్తాడు. తను సంపాయిస్తున్న కూలి తిండికే సరిగా సరిపోదు. పిల్లకు చదువు చెప్పించలేదు. ఆ కులం వారందరూ కలసి ఆ రోడ్డుపక్కనే గుడిశలు వేసుకుని ఉంటున్నారు. సరిగ్గా మా ఆఫీసుకు వెళ్ళే రోడ్డుపక్కనున్న పెద్ద మైదానంలో వీళ్ళ గుడిశలు కరుణమ్మ వాళ్ళ గుడిశె అందులో మొదటిది. ఆ అమ్మాయి సెకండు ఫారం చదువుతున్నప్పటి నుండీ నాకు తెలుసు. ప్రతిరోజూ ఉదయం తొమ్మిది పది గంటలమధ్య (అంటే ఆఫీసుకు పోయేవేళ) బయట ఒక బండమీద బట్టలు ఉతుకుతూ ఉండేది. ముఖ కవళికలను బట్టి చూస్తే కొంచెం ఇంగ్లీషు చదువు చదువుకున్నట్లుగానే ఉండేది. కారణం ఏమిటంటే ఆ క్లాసులోనే నాజూకుగా ఉండేది. అవిడ ప్రతి రోజూ బట్టలు ఉతుకుతూ ఆ విధంగా ఉండటం నాకు ఇష్టంలేదు. చదువుకోమని చెప్పాను.

నాకు తెలిసిన నలుగురు స్నేహితుల దగ్గరకు వెళ్ళి ఆ అమ్మాయి సంగతి చెప్పాను. నేను మాత్రం ఆ సంవత్సరంలో రెండు నెలల జీతం కడ్తానన్నాను. మిగతావాళ్ళు తలా ఒక నెల పంచుకున్నారు... నాకు తెలిసిన సంగతులు కరుణమ్మకు చెప్పేవాణ్ణి... అవిట్టి చూసినప్పుడు నాకు కలిగిన జాలి నన్నింత పనిచేయించింది. అట్లాగే ఫోర్తు ఫారం వరకూ వచ్చింది..ఆ అమ్మాలోఉద్దేశాలూ, ఆదర్శాలూ కొండంత...]

నేను కరుణమ్మతో మాట్లాడుతాననీ కరుణమ్మ అప్పుడప్పుడు మా ఇంటికి వస్తుందనీ కొంతమందికి తెలుసు. వాళ్లు ఎందుకో అసూయపడ్డారు. వాళ్ళని నేను దూషించను. అమాయకులంటాను. కొంతమంది... 'ఏంరోయి... దానివెంట పడ్డావేం... విశేషం?' అన్నారు నన్ను. నేను వాళ్ళను ఏ విధంగాను ఎదుర్కోలేక పోయినప్పటికీ వాళ్ళ అజ్ఞానాన్ని తలుచుకుని నేను ఏడ్చాను వలవల. భగవంతుడు, వీళ్ళకు జ్ఞానాన్ని ఇవ్వాలని కోరుకున్నాను. ఎప్పుడూ భగవంతుడు నాకు సహాయం చేస్తాడనీ తెలుసు.

కరుణమ్మ భవిష్యత్తును గురించి ఆలోచించే వాణ్ణి... కరుణమ్మ చాలా తెలివైన పిల్ల అనీ, అభివృద్ధిలోకి వస్తుందనీ నాకు విశ్వాసం ఉంది. అవిడ బుద్ధి పరిశుద్ధమైనది నన్ను ద్వేషించినవాళ్ళు ఉన్నారు. అందుకని వాళ్ళని నేను ద్వేషించలేదు... వాళ్లు అర్థం చేసుకోలేక పోతున్నారు అనుకున్నాను. అంతకన్న నేనేం చేయలేను.

  

దేవాలయంలో ప్రవేశార్హతకోసం చాలా పట్టుదలగా ఉంది కరుణమ్మ. నే చెప్పిన మాటలన్నీ జ్ఞాపకం ఉంచుకుని తీవ్రంగా ఉంటానన్నది. ఇంతవరకు అధికారులకు ఆ మాత్రం కనికరం కలగలేదు. నాకు భయంగానే అందరూ తొందర పడి ఏమన్నా చేస్తారేమో అని.

మిగతావాళ్ళు తొందరపడ్డా కరుణమ్మ మాత్రం వారిని అడ్డుతున్నది. వారికి నచ్చచెప్తుంది. వాళ్ళను సరియైన మార్గంలో నడిపించగల శక్తి ఆ అమ్మాయిలో ఉన్నది..

అనుకున్నంత పనీ జరిగింది. కరుణమ్మ పట్టుదల తీవ్రరూపం దాల్చింది.

కరుణ ఉపవాసం మొదలుపెట్టింది అని నాకు కబురు వచ్చింది. నేను ఆఫీసులో ఉండగా నాకు ఒకవైపు సంతోషమూ, రెండో వైపు దుఃఖమూ కలిగినై. కరుణమ్మ

ఆరోగ్యం చెడిపోతుందేమో అని నాకు భయం కలిగింది. ఆ సాయంత్రం వెళ్ళి చూసివచ్చాను. కులాసాగానే ఉంది.

  

రెండు మూడు రోజులు గడిచినయి.

కరుణమ్మ తన పట్టుదల వదలలేదు. ఇంకా ఉపవాసం చేస్తూనే వుంది. జనం తండోపతండాలుగా వచ్చి చూసి పోతున్నారు. మరో రోజు గడిచింది.

కరుణమ్మ నీరసంగా ఉంది.

మాట్లాడడము కూడా లేదు.

నేను మాత్రం ఆఫీసుకు వెళ్తున్నాను. అది తప్పేదేముంది. ఆఫీసులో నాకు మాత్రం పనిచేయ బుద్ధిపుట్టడంలేదు. కరుణమ్మ భోజనం చేసి ఇప్పటికి నాలుగు రోజులు అయింది. ఆ అమ్మాయి ఆరగ్యం ఎట్లా ఉందో... నాకు ఆదుర్దా చాలా ఎక్కువగా ఉంది...

పరుగెత్తుకుంటూ ఒక కుర్రవాడు నా దగ్గరకు వచ్చాడు. 'కరుణమ్మకు చాలా ఎక్కువగా ఉంది. మిమ్మల్ని ఒకసారి చూడాల్ననుకుంటున్నది' అని చెప్పాడు...

సైకిలు తీసుకుని ఒక్క పరుగులో వెళ్ళాను... జనం గుమిగూడి ఉన్నారు. వాళ్ళను తోసుకుని లోపలికి వెళ్ళాను. చుట్టూ ఉన్నవాళ్ళందరూ బిక్క మొగాలు వేశారు...

'ప్చ్...' అన్నారు..

పాపం ఆ అమ్మాయి చచ్చిపోయింది. అన్నారు. నేనే ఆవిణ్ణి హత్య చేసినట్లనిపించింది !!!

# 31

# మిషన్ చక్రాలు

మిషన్ చక్రంలాగ పనిచేస్తున్నాడు... అతని తల మిషను చక్రంలో పడి కొట్టుకోదేమో... పాపం...

ప్రతివాడూ అనేవాడే... ఆ రామారావుతో నీవెందుకు స్నేహం చేస్తావోయ్ అని. కొన్నాళ్ళు నేనేవీ మాట్లాడేవాణ్ణికాదు... మరీ అడగటం మొదలు పెట్టారు. నే నెవళ్ళతో స్నేహం చేస్తే మీకేం అని కొందరెరుగున్నవాళ్ళతో అనగల్గాను. కొందరు హేమాహేమీలు ఎగతాళి చెయ్యటం కూడా మొదలు పెట్టారు. వీళ్ళమొగాలు... వీళ్ళు ఎగతాళీ చేస్తే నాకేం అనుకున్నాను. రామారావు మనస్తత్వం తెలిసి ఉన్నవాడు ఒక్కడు లేడు. కొన్నాళ్ళ పరిచయం కొండంత స్నేహంగా మారింది రామారావుకూ నాకూ...

నాలుగు రోజుల క్రితం పదిరూపాయలిచ్చాను. వాడి మొగాన డబ్బుకూడా తగలేస్తున్నావన్నమాట అన్నారు కొందరు. రామారావు నీకు చేసిన హాని ఏవిటి కొంచెం చెప్పు అని అడిగాను అతన్ని. ఏవీ మాట్లాడలేక... వాడు వట్టి దరిద్రుడు అన్నాడు. మనం నిర్భాగ్య దామోదరులం అన్నాను నేను. వళ్ళు మండిపోయింది అతనికి... ఏమో నీ ఇష్టం కాదూ నీ వెవళ్ళతో స్నేహం చేస్తే ఏం... నాకేమీ వొరిగింది లేదు కదా. అ ొకని ఉంటాడు. ఎక్కు ంటికి కనపడలేదు.

రామారావు షాపుకు వెళ్ళాను.

కొత్త పెళ్ళికూతురు లాగా ముస్తాబు చేశాడు మిషన్ని. 'ఏవిటి కారణం అన్నాను...

'కారణం ఏమీలేదు... ఒక్కోరోజు సరదా....' అని నవ్వాడు రామారావు...

'శాస్త్రిగారూ... సినిమాకు వెళ్దాం ఇవ్వాళ' అన్నాడు. ఆ రామారావుతో నీవెందుకు స్నేహం చేస్తావోయ్. అని నన్నెవరో అడుగుతున్నట్లనిపించింది.

మిషనుచక్రం వడివడిగా తిరుగుతున్నది.. ఆ గరగర శబ్దం వింటూ... కూచున్నాను. ఫోర్తుఫారం దాకా చదువుకుని, రామారావు ఈ వృత్తిలోకి దిగాడా అనే ఆలోచన పట్టుకుంది. చక్రం రయ్‌మని తిరుగుతున్నది. కొంచెం సేపటికి చక్రాన్ని ఆపాడు. నాకు జడివాన కురిసి వెలిసినట్టుగా ఉంది...

'రామారావూ... ఈ వృత్తి మానేసి ఏవైనా ఉద్యోగం చేయకూడదూ....' అన్నాను.

రామారావుకు కళ్ళనీళ్ళు గిర్రున తిరిగినై. ఏమీ మాట్లాడలేక కూచున్నాడు. రామారావును ఆ ప్రశ్న అడిగినందుకు అతని మనసుకేమైనా కష్టం కలిగిందేమో అనుకున్నాను.

ఒక విషయం చెప్తాను మీరేమీ అనుకోకుండా ఉండాలి. మిమ్మల్ని చూస్తుంటే మా అన్నయ్య జ్ఞాపకానికి వస్తాడు. మా అన్నయ్య చచ్చిపోయినాడు... నాకేడుపు వస్తున్నది..." అన్నాడు.

నాకు నిజంగా కోపం రావాలా? అని తర్కించుకున్నాను.

'మీ అన్నయ్య బతికిఉన్నప్పుడు కూడా ఈ వృత్తిలోనే వున్నాడా...?'

'మా అన్నయ్యకు ఎంతోమంది స్నేహితులుండేవాళ్ళు. ఎప్పుడు ఎవరో ఒకరు వస్తూ పోతూ ఉండేవాళ్ళు. డబ్బు బాగా సంపాయించేవాడు. బాగా ఖర్చుపెట్టేవాడు. ఆఫీసర్లు కూడా 'సూట్లు' మా అన్నయ్యకే ఇచ్చేవాళ్ళు" ఈ విధంగా చెప్పటం మొదలు పెట్టాడు...

"మీ అన్నయ్య ఎన్నాళ్ళయింది చనిపోయి?"

"పోయిన సంవత్సరం... రేపు దీపావళీ అనంగా... మిషను కొన్నాడు... ఇంకా అప్పు తీరలేదు... నెలకు పదిహేను రూపాయల చొప్పున కొన్నాళ్ళు సింగర్ సూయింగ్ కంపెనీకి డబ్బు కట్టేవాడు. హిందూ ముస్లిం కొట్లాటల్లో అతన్ని చంపేశారు... కత్తి పోట్లతో బాధపడి నాల్గోరోజు హాస్పిటల్‌లో ప్రాణం వదిలాడు" అని చెప్పాడు.

రామారావుని చూస్తే జాలివేసింది నాకు.

ఆ నెలలో తనకు డబ్బు బాగా రాలేదని కంపెనీకి డబ్బు పంపించలేనని దిగులుపడితే... పదిరూపాయలిచ్చాను... దానికీ... వాడిమొగాన... డబ్బుకూడా తగలేస్తున్నావు అన్నారు మిత్రులు... ఆ రోజు సినిమాకు వెళ్ళాం ఇద్దరం కలిసి.

ప్రతివాడు నావైపు వేలుపెట్టి చూపించేవాడే. అదుగో శాస్త్రి, రామారావుతో సినిమాకు వెళ్తున్నాడని.

నేను కొంచెం గౌరవంగల ఉద్యోగం చేస్తున్నమాట నిజమే. కానీ దర్జీ రామారావుతో స్నేహం చెయ్యవద్దని నా మొఖాన బోర్డు కట్టలేదు. స్నేహానికి మినిమమ్ క్వాలిఫికేషన్సు ఉన్నాయన్నమాట... రామారావు స్నేహం చేయతగినవాడు... రౌడీ కాదే పాపం... చెడుగా తిరిగే రకం అసలే కాదే... మామూలుగా నాతో వాదించే ప్రముఖులకన్న అన్ని విషయాలూ అతనికే బాగా తెలుసు. పేపరు చదివి... గాంధీగారు ఉపోష్యాలుంటున్నాడని తెలిసి తనూ ఒకరోజు చేశానన్నాడు. "సిన్సియర్‌గా చెప్పాడు... శాస్త్రిగారూ 'అమెరీ' అటో ఇటో అవుతేగాని ఇండియాకు స్వరాజ్యం రాదు అంటుంటాడు అప్పుడప్పుడు. ఎక్కడ ఏ మీటింగ్‌నైనా హాజరవుతాడు. ఆఖరుకు 'గుమస్తాల మహాసభకు' కూడా హాజరయ్యేవాడు. పోనీ సినిమాల విషయం తీసుకుందామా... ప్రతి సినిమా ఓపికతో చూస్తాడు. సినిమాస్టార్ల పేర్లన్నీ తెలుసు.

హంటర్ డాన్సు బావుంటుందంటాడు. 'దేవికారాణి! యూరప్ సంచారానికి బయలుదేర్తుందట నిజమేనా' అన్నాడు నాతో. ఎవరెవరు గుడ్డలు ఏ విధంగా కుట్టించారు. అనే విషయాన్ని Observe చేస్తుంటాడు. ఒక కొత్త రకం ఫ్యాషన్‌గల జాకెట్ ఎవరో సినిమాస్టార్ ధరిస్తే... ఆ సినిమా అరుసార్లు చూశానని చెప్పాడు. అనేక "ఏంగిల్స్"లో చూస్తే ఏ విధంగా ఉంటుందో ఆ జాకెట్టు... మర్నాడు అదే విధంగా కుట్టిచ్చాడు ఎవరికో. కొత్తరకం సూట్లు ఏవిధంగా కుడితే ఎట్లా ఉంటుందో అన్నీ తెలుసు... ప్రతి శనివారం గుడికి వెళ్తాడు. సిగరెట్లు అసలే తాగడు.

ఇటువంటి రామారావుతో స్నేహం చేస్తే నా పరువుపోయిందా... ఆ దర్జీ రామారావుతో నీకెందుకోయ్ స్నేహం అనేవాళ్ళే ప్రతివాడూ.

'మా అన్నయ్య చచ్చిపోయినాడనే దిగుల్తో మా అమ్మ మరీ క్రుంగిపోయింది... ఎప్పుడూ దగ్గుతుంటుంది. పెద్దదైపోయింది. ఆ కాస్త ప్రాణంకూడా ఎక్కడ పోతుందో అని భయంగా వుందండీ, అన్నాడు నాతో సినిమానించి వస్తుంటే రామారావు.

మా ఆఫీసులో జవానుపని ఒకటి ఖాళీగా వుంది. ముప్పై రూపాయలిస్తారు. దాంట్లో చేరుద్దామని మనస్సులో అనుకున్నాను. ఛీ... గౌరవంగా బతుకుతున్నవాణ్ణి తీసుకవెళ్ళి... ఆ జవాను పనిలో ఇరికించటం ఎందుకు? అని తర్కించుకున్నాను. ఆ వృత్తి మానేయకుండా ఉంటేనే బావుంటుందని అభిప్రాయపడ్డాను.

నాకు ట్రా  ఫరయి ఆరునెలలయింది. ఇంకో ఊళ్ళో ఉంటున్నాను. ఎప్పుడూ రామారావు జ్ఞాపకం వస్తాడు. ఎంత అమాయకుడు రామారావు పాపం... అనుకుండే వాణ్ణి.

ఏదో ఇంటి పనిమీద మా ఊరు వచ్చాను. నేను అద్దెకిచ్చాను నేనుంటున్న ఇల్లు. మూడు నెలల అద్దె బకాయి పెట్టి అద్దెకున్నవాడు చివరకు నన్ను రప్పించుకున్నాడు. రెండు నెలల అద్దె మాత్రం ఇచ్చి మూడో నెలది తరవాత... అని నన్ను సాగనంపాడు. "మా ఇంట్లో పురుడు వచ్చిందండీ. ఈ నెల చాలా డబ్బు ఖర్చు అయింది. ఈ నెల ఇవ్వలేనండి... మీరు కొంచెం కటాక్షించాలి" అన్నాడు పాపం... సరేలెండి... కష్టాలు మహామహులకే తప్పలేదు. మన కేవిటి... నిజమేనండి... పాపం... మీ దగ్గర ఉన్నప్పుడే ఇద్దురులేండి, అన్నాను.

హోటల్లో భోజనం చేశాక రామారావుని చూడాలనిపించింది. రామారావు షాపుకు వెళ్ళాను. తలుపుకు, కప్పతాళం వేసివుంది.

'న్యూ బాంబే టైలరింగ్ హోమ్' అన్న బోర్డు లేదు. నాకాశ్చర్యం వేసింది. రామారావు ఏమైనాడా అని పక్కన గడియారం షాపువాణ్ణి అడిగాను. 'రామారావు కొట్టు ఎత్తేశాడండీ' అన్నాడు. కొన్ని గడియారాలు అలారాలు కొట్టున్నాయి. కొన్ని పన్నెండు, మూడు, ఏడు గంటలు చూపిస్తున్నాయి. "చౌ" రస్తాపక్కన పెద్దమేడ ఒకటి ఉంటుంది. ఆ మేడలో పనిచేస్తుంటాడని చెప్పాడు.

ఆ మూడంతస్తుల మేడను చూస్తేనే భయమేసింది. లోపలికి వెళ్ళాను. లెక్కలేనంత దర్జీవాళ్ళు. అందరూ మిషన్ చక్రాలను నడుపుతున్నారు. కిందంతా

గుడ్డ పీలికలు అయోమయంగా ఉంది. ఆ శబ్దానికి తట్టుకోలేనేమో అనిపించిరిది. ధైర్యం చేసి "రామారావు ఎక్కడ ఉంటాడని అడిగాను ఒకతన్ని. మిషన్‌చక్రం ఆపి... పక్కగదిలోకి వెళ్ళి, ఏయ్ 71. ఎవరో వచ్చారోయ్! అన్నాడు ఈ నంబర్లేవిటి, ఈ పిలవడమేమిటి? అనుకున్నాను. రామారావు బయటకు వచ్చాడు. నన్ను చూసి ముఖం ఇంతది చేసుకున్నాడు. చాలా సంతోషంగా ఉంది ఇన్నాళ్లకు మిమ్మల్ని చూడగలిగాను అన్నాడు. చుట్టూ ఉన్న వందలాది మిషన్ చక్రాల శబ్దంలో సరిగా వినపట్టలేదు మా అ-మ్మ-చ-చ్చి-పో-యిం-ది... అన్నాడు... మిషను చక్రాలు హోరుమంటున్నాయి. ఇదేవిటి ఇక్కడ చేరావ్ అన్నాను. 'ముప్పైరూపాయలిస్తారు...' అన్నాడు. మిషను అప్పు తీర్చావా? అన్నాను. అది అమ్మేశానని దిగులుగా చెప్పాడు. ఈ ఉద్యోగంలో ఎందుకు చేరానా అని పశ్చాత్తాప పడ్తున్నట్లుగా ఉన్నయి అతని ముఖ కవళికలు.

"పొద్దున్నుంచీ విధి విరామం లేకుండా కుట్తున్నాను. ఇంకా చూడండీ ఎన్ని లాగులూ... ఎన్ని చొక్కాలూ కుట్టాలో" అని చెమట తుడుచుకుంటూ చెప్పాడు.

ఆ క్రింద కుప్పగా పడేసిన చొక్కాలవైపు చూసి నాకే ఆశ్చర్యం వేసింది.

"ఇవన్ని యుద్ధానికి పోవలసిందేనా?" అని అడిగాను.

"ఇక్కడినుంచి రాజీనామా పెట్టి రావటానికి వీలులేదట" అన్నాడు జాలిగా. చుట్టూ అందరూ పనిచేసుకుంటున్నారు ఒకరి మొగం ఒకరు చూసుకోకుండా-

మిషను చక్రంలాగా పనిచేస్తున్నాడు... అతని తల... ఆ గరగర శబ్దంలో - మిషను చక్రాలలో నలిగిపోతున్నదేమో!!!

# 32

# సమర్థుని తీర్థయాత్ర

అన్ని బాధలు పడుతూ అతనెందుకు బతుకుతున్నాడో నా కర్థం కావటం లేదు.

ప్రతివాళ్ళూ అసహ్యించుకుండేవాళ్లే....

దూరదూరంగా తొలగిపోతారు...

ఆస్పత్రిలో నర్సులూ అతన్ని చూస్తే అంతే... ఎక్కడో విసిరేసినట్లుగా ఒక మూల, చిన్న గదిలో తనూ తన చింకి గుడ్డలూ...... పాడుతూ అతన్ని పులుముకుని చురుక్కుమనిపిస్తున్న ఈగల గుంపుల మధ్య... నారాయణ నామం ఉచ్చరిస్తూ కూచుంటాడు.

ఇరవై నాలుగు గంటలూ ఏకాకిగా కూచుని ఏం ఆలోచనలు చేస్తాడో ఆ భగవంతుడికే తెలియాలి. అతనట్లా బాధలు పడ్తుంటే చూస్తూ భగవంతుడనేవాడు ఎక్కడైనా ఉంటే!

ఆ దోవనపోతూ అతన్ని రెండు మూడుసార్లు చూశాను.

ముఖంలో వర్చస్సు ఉంది. కళ్లల్లో కళాకాంతులున్నవి. అతని కంటి పాపలు అందర్నీ ఆకర్షించేట్టుగా ఉన్నాయి. మరీ దగ్గరకు వెళ్తే మిదుమిట్లు గొలిపేటట్లుగా ఉన్నాడు. నన్ను చూసినప్పుడల్లా చిరునవ్వు మొగం పెట్టి అదో విధంగా నవ్వుతాడు.

అతని పక్కన కూచుని, అతని ముఖంలోకి తొంగిచూసి,అతనితో పరిచయం చేసుకుందామని నాకు కుతూహలం ఎక్కువయింది.

పిల్లనిచ్చిన మామగారు కూడా అంత మర్యాదగా మాట్లాడరు.

మాట్లాడుతూ... మీకా కురుపువల్ల బాధగా లేదా అన్నాను.

చినిగిపోతూ పీలికలైన అతని ఉత్తరీయం తీసి చూపించాడు. నాకు గగుర్పొడిచి... చాలా భయం వేసి రూపాయి వెడల్పున గాయం. దాని చుట్టూ ఈగలు మధ్య చీమూ రక్తం నన్ను చూసి వెకిలిగా నవ్వాడు. భయపడద్దులే, నే పిచ్చివాణ్ణి కాదులే అని అన్నాడు.

వెళ్ళి వస్తానంటే కొంచెం పని ఉన్నది నాకు అని వస్తుంటే నమస్కారం పెట్టాడు. ఒక సిగరెట్టు ఇవ్వబోతే నా కక్కరలేదు అన్నాడు.

బాగా గడ్డం పెరిగిపోయింది... జుట్టు నెరవలేదు...

కుష్టువాళ్లని చెప్పుకోంగా వినటమేగాని చూడటం ఇదే మొదటిసారి.

నాకు పేపరు తెచ్చిపెట్టండి చదువుకోటానికి అని అడిగాడు ఒకసారి. ఇంగ్లీషు పేపరే తీసుకువెళ్ళి ఇచ్చాను. మీరు చాలా మంచివారండీ అన్నాడు. మిమ్మల్ని నేను పొగడటం లేదు. అందరూ నా మాట వినరు కాని మీరు విన్నారు. అడిగింది తీసుకు వచ్చారు. అసలు నేను మనిషినని ఎవ్వరూ లెక్క చెయ్యరు అన్నాడు.

మా ఇద్దరికీ కలిగిన పరిచయం స్నేహంగా మారింది.

నేనుండగానే ఒక నర్సు వచ్చి కొంచెం దూరంగా కూచోండని నన్ను హెచ్చరించి వెళ్లింది.

మీకిది త్వరలో నయం కాదా అని అడిగాను.

చాలా అసంభవం అన్నాడు. ప్రాణం పోయేదాకా ఇట్లాగే బాధ పడమని నా గీతలో ఉంది అన్నాడు.

అతడు మాట్లాడకుండా ఉన్నంత సేపు ఏదో దేవుని పేరులో లోపల వుచ్చరిస్తున్నట్లుగా కన్పడుతున్నది.

అతని దగ్గర చిన్న సంచీ ఉంది.

సంచీలో ఏముున్నాయి. అని కుతూహలం కొద్దీ అడిగాను.

భగవద్గీత, ఇంకా ఏదో ఒక పుస్తకం ఉన్నాయి. రెండో పుస్తకాన్ని నన్ను చూడనివ్వలేదు. చూడాలని నాకు ఉంది. మరోసారి అడిగాను చూడవోయ్ పిచ్చినాయినా అన్నాడు. పుస్తకం తీసుకుని చూస్తున్నాను.

1933–36

రామేశ్వరం... కంచి మధుర అరుణాచలం – శ్రీరంగం చిదంబరం.

ఏమిటేమిటో రాసుకున్నాడు. ఆడవాళ్ళ పేర్లు రెండు మూడు వున్నాయి. చదువుకున్న కొద్దీ చాలా ఉత్సాహంగా వుంది నాకు. 'ఉదక మండలంలో కొన్నాళ్ళు' అన్న శీర్షిక కింద ఇరవై మూడు పేజీలు రాసుకొన్నాడు. అన్నీ చదివాను.

తను చూసిన తాజ్ మహల్‌ను గురించి వంద పేజీలు రాశాడు.

మధ్య మధ్య పద్యాలు రాసుకున్నాడు.

తన జీవితంలో అప్పటివరకూ అనుభవించిన ఆడవాళ్ళ పేర్లనీ, వాటిని గురించి రాసుకున్నాడు. కానీ సీతనూ, లక్ష్మినీ మరచిపోలేనన్నట్లుగా మరీ మరీ రాసుకున్నాడు కొన్నిచోట్ల. నాకు తెలీని ఎన్నెన్ని విషయాలో ఉన్నాయి.

కాశీలో 'ఘట్టాల'ను గురించి చాలా ఉంది.

కాశీ విశ్వనాథుని స్తుతిస్తూ ఏవో రాసుకున్నాడు.

1937

కలకత్తా, నాగపూరు, రంగూన్, హరిద్వారం, చిట్టగాంగ్, అలహాబాద్ వంటి ముఖ్యపట్టణాలను గురించి వర్ణించాడు. నన్నా పుస్తకం ఇంటికి తీసుకు వెళ్ళనివ్వలేదు.

ఎక్కడో ఒక పేజీలో తను అప్పటి వరకూ ఖర్చుపెట్టిన డబ్బు మొత్తం వేసి ఉన్నాడు.

ఒక లక్షా ఇరవై తొమ్మిదివేలట.

ఒకప్పుడు ఈయన లక్షాధికారి కామోలు అనుకున్నాను.

నేను రాసిన అయిదు పుస్తకాలు తగలపెట్టానన్నాడు అప్పటికి. తనకు నా అన్నవాళ్ళెవరూ లేని రోజుల్లో... చేతిలో డబ్బు అంతా ఖర్చయిన తరువాత తాను ఆ డబ్బు చూసి ఎన్నో రోజులయింది అన్నాడు.

"బాగా డబ్బున్నప్పుడు దేశం చూడాలని ఉండేది. నాకు చేతనయినంత వరకూ అన్నీ చూశాను. నా దేహంలో శక్తి ఉన్నంతవరకూ అనుభవించాను. నా చేతిమీదుగా ఎన్నోవేలు ఖర్చు పెట్టాను. పెద్దలు సంపాయించి ఇచ్చిన ఆస్తి ఖర్చుపెట్టటానికి మనసు ఒప్పలేదు. అప్పట్లో ఉమర్ ఖయ్యామ్‌ని గురువుగా పెట్టుకున్నాను. కొన్నాళ్ళు ఆయన్ని పూజించాను.

"ఉమర్ ఖయామ్ చెప్పే ప్రతి అక్షరమూ స్మరించుకునేవాణ్ణి. అవే నాకు శాసనాలు. ఇప్పటికీ ఉమర్ చెప్పింది నేను కాదనటం లేదు. కుర్రవాడిని కుతూహలంతో అడుగుతున్నావు కాబట్టి చెప్తాను.

"ఈ దేహం చెడిపోయిన మాట నిజమే. పురుగులకు ఆస్కారం అయింది. ఇప్పుడు. కాని అప్పట్లో తెలుసుకోలేని సంగతులు ఇప్పుడు తెలుసుకున్నాను. నా మనసు నిర్మలంగా నిశ్చలంగా ఉంది. నాకిప్పుడు ఐహిక వాంఛలు లేవు. కోరిక లేదు. ఈ భూమ్మీద నాకనుభవించాలనీ, సంతోషించాలనీ లేదు. అసలెప్పుడూ వాటిని గురించి నేను అనుకోను. నా అంతట నేను తెచ్చుకున్నదే ఈ జబ్బు..." నాతో మాట్లాడుతున్నంతసేపూ అతని ముఖ కవళికలు అదోరకంగా ఉన్నయి.

ఆ తర్వాత నేను ఇంటికి వెళ్లాను.

దేశంలో కరువునుగురించి కొంచెం సేపు మాట్లాడాడు. ధోరణి మళ్ళితే స్వరాజ్యం గురించి లెక్చర్లిచ్చాడు. ప్రపంచంలో అతను చెప్పని సంగతిలేదు. ప్రతిదీ విచారిస్తాడు.

అతడు ఎక్కువ కాలం బతుకుతాడని నేననుకోను. బతికే అవకాశమూ లేదు. కారణం ఏమిటంటే అతనికి వచ్చిన ఆ వ్యాధి మనిషిని క్రుంగదీసి చంపి పారేస్తుందని నాకు నమ్మకం.

మనం బతకటం ప్రేమించటం కోసం కేవలం... అని అన్నాడు ఓసారి.

మన బానిసత్వం పోయే రోజులు వచ్చినయి ఏమీ ఫరవాలేదన్నాడు.

నాకు కుష్టు రోగిని చూస్తే జాలివేసింది. ఈ సంగతులు నాతో తప్ప ఇంకెవరితోనూ చెప్పలేదట. ఒక అణా ఇచ్చాను నేను.

నన్ను బతిమిలాడుకున్నాడు. రాబోయే ఎలక్షన్లలో కాంగ్రెసు ఎన్నికలకోసం... తను ఒక వోటు సంపాయించాలనీ అన్నాడు.

కుష్టువానికి ఓటు అంటే నాకాశ్చర్యం వేసింది.

కనుక్కుంటాను అన్నాను నేను.

కుష్టురోగి నా వైపు చూస్తున్నాడు!!

# 33

# వేదాంతి

నిద్రలో పొలికేక పెట్టాడు డేవిడ్. భార్య ఉలిక్కిపడి లేచింది. డేవిడ్ మంచంమీద పడుకుని ఊగుతున్నాడు.

"నేనీ శవాన్ని కోయను... ఊ..." అని అరుస్తున్నాడు గగ్గోలుగా.

భార్య దగ్గర చేరి డేవిడ్‌ని కౌగిలించుకుంది. డేవిడ్ కళ్ళు తెరిచాడు. భార్య తనను కౌగిలించుకోవడం చూసి మరి కొంచెం భయపడి... "ఏం... నా దగ్గరకు వచ్చావ్... ఎందుకా భయం..." అన్నాడు.

"మరేంలేదు డేవిడ్! నిద్రలో ఏదో నీవు కలవరిస్తున్నట్లు ఉంటే, దగ్గరకు వచ్చి కూర్చున్నాను. కొంచెం మంచి నీళ్ళు తాగి పడుకోగూడదూ?" అన్నది భార్య.

డేవిడ్ కొంచెం మంచినీళ్లు తాగి పడుకున్నాడు. నిద్రపట్టింది.

  

తెల్లవారింది.

మామూలుగా డేవిడ్ హాస్పిటల్‌కు వెళ్ళాడు.

భార్య వంటరిగా గుడిసెలో కూర్చుని ఉంది.

ఆలోచిస్తూనే ఉంది రాత్రి ఎందుకు ఆ విధంగా అరిచేడో!

డేవిడ్ మాత్రం ఆవిషయాన్ని ఎత్తుకోలేదు ఉదయం. తనకు తెలీకుండానే తను కలవరించాడు.

సాయంత్రం హాస్పిటలుకుపోయి అతడి దగ్గరగా వెళ్ళి కూర్చుండిపోయింది.

"ఇవ్వాళ మూడు...

ఒకటి విషం

ఒకటి ఖూనీ,

ఒకటి ఆత్మహత్య...."

అతనా విధంగా ఎందుకు చెప్పటం మొదలు పెట్టాడో ఆమెకు అర్థంకాలేదు. కారణం, ఈ విధంగా ఇంతకు ముందెప్పుడూ అతను చెప్పి ఉండలేదు. ఆవిడకి ఆశ్చర్యంగానే ఉంది.

డేవిడ్ మరింత దగ్గరగా వచ్చి "డాక్టర్లు ఎంతపనైనా చేయగలరు. డబ్బుకు ఆశపడి... " అంటున్నాడు.

"ఏం ఉపద్రవం వచ్చిందీ?" అన్నది ఆమె.

"ఏమీ లేదు... " అన్నాడు...

కొంచెంసేపు మాట్లాడకుండా డేవిడ్‌కి కోపం వచ్చిందేమో..... పడుతూ ఉంటుంది భార్య.

"ఆత్మహత్య చేసుకుందని గిలికిపారేసెయ్.. ఆవిడ నాకెందుకో కలలో కన్పించింది. అమాయకురాలు... ఈ పాపిష్ఠి చేతుల్తో ఆవిడ శవాన్ని కోశాను. నాకెందుకో ఆ రోజురాత్రి భయమేసి... అరిచి ఉంటాను..." అని చెప్తూతూ చంద్రుడివైపు చూశాడు డేవిడ్. ఆ అమ్మాయి శవం చంద్రుడిలో ఉయ్యాల లూగుతున్నట్టుగా కన్పించింది.

"వెధవ ఉద్యోగం..." అంది భార్య. "అయిదు సంవత్సరాలనుంచీ శవాలను కోస్తున్నాను. నేనెప్పుడూ భయపడలేదు. నా కెందుకో ఆ రాత్రి భయమేసింది" అన్నాడు.

"ఒక్కొక్కప్పుడైతే బిడ్డలు కొట్టేప్పటికి కనీసం ఒక్కగంటైనా పడుతుంది. దానికి తోడు వెధవ మోతకూడా...,

"ఇవ్వాళ ఒకణ్ణి బాకుతో పొడిచి చంపారు. ఆదాళ్ళ తగాదాలో అతన్ని చంపారట. శవం అక్కడకు రాగానే గుంపులు గుంపులుగా కూడి చెప్పుకుంటూ ఉంటారు. డాక్టరు విసుక్కుంటూనే ఉంటాడు. ఏదో రాసుకుంటూనే ఉంటాడు. నేను కోస్తూనే ఉంటాను. ఎవ్వరికీ ఇందులో అలసటలేదు. ఆ గదిలోంచి ఖంగ్ ఖంగ్‌మనే శబ్దం తప్ప మరోటి రాదు. ఆ శబ్దంతో చెవులు గింగురుమంటుంటాయి. మాట

పట్టింపులమీద మనుష్యులను చంపుకోవటం పరిపాటయిపోయింది. చచ్చిన మనుష్యులను కోయటం నాకలవాటయింది. అబద్ధాలు రాసి డబ్బు సంపాయించడం మా డాక్టరుకు వృత్తి అయింది....

"ఈ ముక్కలుగా కోసిన శవాన్ని అతుకులు పెట్టికుట్టడం..." అంటూ... చూశాడు.

తన ఉద్యోగంలోని కష్టసుఖాలను విపులంగా భార్యకు పూసగుచ్చినట్లు చెప్పడం డేవిడ్‌కు ఇదే మొదటిసారి.

"నా చేతిమీదుగా ఎన్ని వందల శవాలను కోశానో..." అన్నాడు. "అవును" అన్నది ఆమె.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ ఉన్నారు.

చంద్రుడు వాళ్లని కోప్పడుతున్నాడు. శవాల సంగతి మాట్లాడడం మానేయండని తనకూ కోపం వచ్చిన సూచనగా మబ్బుల్లో దాక్కున్నాడు.

"మనం ఇట్లామాట్లాడుకుంటూ కూర్చుంటే ఎంత పొద్దు బోయిందో చూశారా..." అన్నది ఆమె...

"మళ్ళీ రేపు మామూలుగానే... వెళ్ళవల్సిందే. వచ్చిన శవాలను కోయవల్సిందే... తప్పేముందీ?" అన్నాడు డేవిడ్...

కూర్చున్న రాతిమీదనుండి లేచి గుడిశలోకి వెళ్ళిపడుకున్నారు ఇద్దరూ.

  

డేవిడ్ వింతవైఖరి ఆమెకు ఏమీ అర్థం కావటం లేదు.

ఒకరోజున ఆమె అన్నది.

"ఈ హాస్పిటల్ ఉద్యోగాన్ని మానేయకూడదూ..." అని.

"నన్ను చూసి నా వికృతాకారం చూసి నాకెవ్వరూ, ఏ ఉద్యోగమూ ఇవ్వరు. శవాలే కోయమని నా ముఖాన్ని రాసి పెట్టి ఉన్నది" అన్నాడు.

ఈ మాటలన్న తరువాత ఒక మూల నున్న డేవిడ్ దగ్గరకు భార్య పోయింది. "డేవిడ్... బయట ఎంత వెన్నెలగా ఉందో... చూడు చంద్రుడు మనల్ని రమ్మంటున్నాడు...."

డేవిడ్ మనసు కనిపెట్టి పోతూ ఉంటుంది భార్య. అతడి మనసు బాగా లేనప్పుడు అతని సంతోష పెట్టడానికి ప్రయత్నిస్తుంది. అతడు సంతోషంగా ఉంటే ఆవిడకు మహదానందం.

డేవిడ్ గుడిసెలోంచి బయటకు వచ్చి మరోసారి చంద్రుడివైపు చూశాడు. వెంటనే ఆవిడ ఉంది. ఇద్దరూ కొంచెం దూరం వెళ్ళి ఒక చిన్న రాతిమీద కూర్చున్నారు. కూర్చుని డేవిడ్ చంద్రుడి వైపే చూస్తున్నాడు. ఏమీ తోచడం లేదు. ఆమె పాపం, పలుకరించటానికే భయపడుతున్నది.

కొంచెంసేపు ఆగి, అతడి భుజంమీదికి వొరిగి "నాకో సంగతి చెప్పవూ?..." అన్నది... అతడి ముఖంలోకి ముఖం పెట్టి.

మౌనంగా కూర్చున్నాడు డేవిడ్...

మళ్ళీ పలుకరించింది...

"ఆ రోజు నిద్రలో నీలో నీవు మాట్లాడుకున్నాక డేవిడ్... జ్ఞాపకం ఉందా?" అన్నది.

"...లేదు..." అని ముక్త సరిగా ........

"నేనీ శవాన్ని కోయను... అంటూ లేచి కూచున్నావ్" అన్నది.

"నిజంగా అన్నానా... నీవు విన్నావా... అబద్ధం..." అన్నాడు, "కాదు" అంటుంది ఆమె.

డేవిడ్కివెవరో జ్ఞాపకం చేసినట్టే అయింది... అసలు విషయం స్ఫురణకు వచ్చింది.

"ఎంత అందంగా ఉంది... ఆ అమ్మాయి శవం..." అన్నాడు. "ఆ శవాన్ని కోస్తుంటే పచ్చి నెత్తురు నా కళ్ళల్లోకి చిమ్మింది.... ఆరోగ్యమైన శరీరం..." అంటూ మొదలుపెట్టాడు.

ఆమెకు అసలు విషయం వినాలని ఆదుర్దాగా ఉంది. "ఆమె అందాన్ని చూసి, ఆ పుర్రె బద్దలు కొట్టలేకపోయినాను. మెదడు పరీక్ష చేయాల్సని దగ్గర నిల్చున్న డాక్టరు... త్వరగా... అని నన్ను కోపం చేశాడు కూడా... వెధవ డాక్టరు... బావిలోపడి చచ్చిందని అందరూ అనడం... పొట్టలో ఒక్క చుక్కైనా నీళ్ళు లేవు... శవాన్ని మాత్రం

బావిలోంచే తీశారు... ఆ మొగుడు ముండా కొడుకు వట్టి క్రూరుడు... వీపు మీద పధ్నాలుగు వాతలున్నయి... తాడుతో కొట్టిన దెబ్బలు... ముంచేతి ఎముక విరిగి కూడా ఉన్నది.... చచ్చిపోయే దాకా చితక కొట్టి... ఆ కాస్త ప్రాణం పోయిన తరువాత అర్ధరాత్రి దొడ్లో బావిలో పడేసి ఉంటాడు... తెల్లవారేటప్పటికి ఊరంతా అల్లుకుంది... ఆమె బావిలోపడి ఆత్మహత్య చేసుకుందని... పాపం ఆ శవాన్ని కోస్తున్నంత సేపూ నావైపే చూస్తున్నది అమాయకంగా... నేనేం తప్పు చేశాను అన్నట్టుగా... డబ్బున్న మహరాజులు... ఆ డాక్టరుకు ఎంతైనా లంచం ఇస్తారు.

చూడ్డానికి డేవిడ్ కురూపులలో కురూపి స్థూల కాయం. పెద్ద కళ్లు, తమాషాజుట్టూ... ఇవన్నీ అతనికి శాపం ఇచ్చినయి. చిన్నపిల్లలెవరైనా అతన్ని చూస్తే భయపడ్తారు. అందుకనే అతడు చీకటి పడ్తేగాని రోడ్డుమీదకు రాడు. మరీ, శవాలు కోసే ఉద్యోగంలో ప్రవేశించిన తరువాత అతనికి మరీ వికృతరూపం వచ్చింది. కొంచెం పెద్దగా నవ్వాడంటే వినేవాళ్లకు జలదరింపు కలుగుతుంది. ఉలిక్కిపడ్తారు. ఆకారం చూసి సామాన్యంగా అందరూ అతన్ని యమబంటుగా భావిస్తారు. ఎప్పుడూ చిన్న నిక్కరు తొడుక్కుని ఉంటాడు.

ఒక్క తన భార్యకు తప్ప ప్రపంచానికి తనకూ అతడు భయంకర స్వరూపే....

.... అతని స్నేహితులు... అతనెవ్వరితోను మాటలాడడు ఆ భార్యతో తప్ప వేరే ఎవరూ అతనితో మాట్లాడరు. అతణ్ణి చూడాలంటేనే భయం... మరి దగ్గరగా వెళ్లి మాట్లాడగలరా? హాస్పిటల్‌కు వెళ్తూనే చూడాలని రకరకాల శవాలు, మనుషులు, ఎందుకో డేవిడ్ శవాలను కోయలేకపోతున్నాడు. వాటి అవయవాలన్నీ కోసేముందు అతని చేయి ఆడనంటున్నది.

అత్తా కోడళ్ళ మనస్పర్థలతో బావిలో పడి ఆత్మహత్య చేసుకున్న ఆడ శవాలను చూస్తే కరిగిపోయేవాడు.

గంద్రగొడ్డళ్ళతో ప్రాణాలు తీసుకున్నవారి విషయం చెప్పనే అక్కర్లేదు.

విషం తాగి చచ్చిపోయినారన్న వాళ్ళ పొట్టలు కోసి, లోపలి భాగాలను బయటికి లాగి, కొన్నిటిని పరీక్ష చేయటం కొన్నిటిని తూకం వేయడం, అన్ని సంగతులూ డాక్టరుకు చెప్తుంటే రాసుకుంటూ మధ్య మధ్య తనూ ఒక చేయివేస్తూ ఉండటం... ఇవన్నీ డేవిడ్ మనసులో రంగుల రాట్నంలా తిరుగుతున్నయి...

ఛీ... వెధవ శవాలు... అనుకున్నాడు డేవిడ్. అనుకున్నాడన్నమాటే గాని ఉదయం చేస్తూనే వాటితోనే పని... ఎందుకూ ఒకర్ని ఒకరు చంపుకోవడం... దేవుడిచ్చిన ఆయుష్షు పోసుకుని బతికి సుఖించగూడదూ?... ప్రాణాలు పోగొట్టుకుని ఆసుపత్రి పాల్బడి... మా పాపిష్టి చేతుల్తో కోయించుకోవడమెందుకూ... ఈ హత్యలూ, ఈ చావులూ మనం తెచ్చి పెట్టుకున్నవే... ప్రతి ఊళ్ళోనూ ప్రతి ఆసుపత్రిలోనూ నా లాటి వాళ్లను పోషించేందుకేనేమో... దేవుడు చేసిన ఆలోచనే ఇది...

డేవిడ్ తనలో తను అనేక విధాలుగా అనుకుంటున్నాడు. ఉలి తీసుకుని ఖంగ్... ఖంగ్... అని ఒక శవానికి పుర్రె పగల గొడుతున్నాడు. పోస్టుమార్టమ్ గదిలో... గదిలో తను పనిచేస్తున్నంత సేపూ తను ఏ లోకంలోనో ఉన్నట్టుగానూ, బయట చీకట్లు కమ్మినట్టుగానూ ఉంది...

"మెదడు చూడాలి. తూకం వెయ్యాలి. త్వరగా కానీ డేవిడ్..." అంటున్నాడు. డాక్టరు. తన చేతిలోని ఇనుప ఆయుధం (సుత్తి) డాక్టరు తలమీద మోదితే? వణుకుతున్న చేతుల్తో పని చేస్తుంటే అప్రయత్నంగా తనకంటినించి రక్తం... కాదు... కన్నీరు ధారగా పడుతున్నది...

"డేవిడ్... డర్టీఫెలో వేగిరం!" అంటున్నాడు డాక్టరు...

ఉలితీసుకొని కొట్తూనే ఉన్నాడు డేవిడ్... బయట శవం తాలూకు మనుషులూ వింత చూడటానికి వచ్చిన మనుషులూ ఉన్నారు. దిగంబరంగా ఉన్న శవం వైపు ఒక్కసారి చూశాడు. డేవిడ్ చేతుల్లోని ఉలీ, సుత్తి కూడా చేతిలోంచి జారి కిందకూర్చున్నాయి. శిలాప్రతిమలాగా శూన్యంలోకి చూస్తూ నిల్చుండిపోయినాడు డేవిడ్.... బల్లమీద పడుకుని డేవిడ్వైపు చూసి... పాపం వద్దని వేడుకుంటున్నది... "యూ... కవర్డ్" అంటున్నాడు డాక్టరు. అవును నిజం అని మారు పలికింది పోస్టుమార్టమ్ గది...

పడుకున్న శవం లేచి కూర్చుని డాక్టరు గొంతుపిసికేస్తే బాగుండు. కానీ శవం కదలదు... డేవిడ్ కత్తితో కోస్తున్న వాడల్లా బయటకురికి జనంలో జొరబడి ఒక్క పరుగు తీశాడు. కూడా వెంట వస్తూన్న జనం అతని చేతిలోని కత్తిని చూసి టక్కున ఆగిపోయారు.

# 34

## గాజులూ - గొలుసులూ

రాజారావు ఆఫీసునుండి రాగానే లలిత ఒక్కగంతున వచ్చి కాళ్లకు చుట్టుకుంది. 'నాన్నా నేనొకటి అడుగుతా చెప్పవూ? అమ్మ నడుగుతే కోప్పడుతున్నది నాన్నా...' అని ముద్దుగా అడిగింది. రాజారావు కోటు విప్పి వంకెకు తగిలిస్తూ లలితను దగ్గరకు తీసుకున్నాడు.

"అడుగు... ఏమిటో అది..." అన్నాడు రాజారావు. "నేనో పుస్తకంలో దొంగలను గురించి చదివాను నాన్నా... వాళ్లు ఏ జాతికి చెందినవాళ్లో చెప్పవూ?"

ఇలాంటి ప్రశ్న వేస్తుందని రాజారావు అనుకోలేదు. లలిత తొమ్మిది లేక పదేళ్ళ ప్రాయంది. తన ఈడుగల మిగతా పిల్లలకంటే ఈమెలో ఓ ప్రత్యేకత ఉంది. అల్లరి చేయకపోవడం, ఎప్పుడూ ఇంట్లో కూర్చొని ఏవో పత్రికలూ, పుస్తకాలు చదువుకోవడం లలితకు ఇష్టం. ఇదేం మనస్తత్వం ఆడుకోడానికైనా బయటకు వెళ్ళదు... అని అనుకునేవాడు రాజారావు. దురదృష్టవశాత్తూ తనేదో పత్రికాఫీసులో పని చేయడం... ఆ కారణంగా తనకు వచ్చిన పత్రికలూ, పుస్తకాలూ ఇంటికి తీసుకు వస్తూండేవాడు రాజారావు. కొత్త కొత్త విషయాలంటే లలితకెంతో సరదా. బొమ్మల పత్రికలంటే మరీ ఇష్టం. వీటన్నిటికంటే మరో ప్రత్యేకత ఏమిటంటే తల్లి అంటే అమితమైన ప్రేమ తల్లిమీద ఈగ వాలనివ్వదు. ఎప్పుడైనా ఆమె నిద్రపోతుంటే, ఎవరైనా నిద్రాభంగం చేస్తారేమోనని కావలా కాసేది లలిత. దాసీదాన్ని దగ్గరగా మాట్లాడనిచ్చేది కాదు. నిద్రపోతూంటే మా అమ్మ చాలా అందంగా ఉంటుంది. సుఖంగా నిద్రపోతున్నది... అని అనుకుంటూ పరిసరాలు తానుకూడా నిశ్శబ్దంగా ఉండటానికి ప్రయత్నించేది. నాన్న ఆఫీసుకు వెళ్ళిపోయి, అమ్మ నిద్రపోతుంటే తను గదిలో కూర్చుని పుస్తకాలు తిరగేసేది.

లలిత వేసిన ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. రాజారావు "చిట్టితల్లి... అలాంటి విషయాలు ఆలోచించి బుర్ర చెడగొట్టుకోకమ్మా..." అంటూఉండగానే... రాజారావు భార్య ముసిముసి నవ్వులతో... "అస్తమానం వేధించుకు తింటోంది ఆ ప్రశ్నతో. జవాబు చెప్తేనేగా అన్నం తినటం" అన్నది భర్తవైపు చూస్తూ. ఇద్దరూ సగర్వంగా ఒకరికళ్ళల్లోకి ఒకరు చూసుకున్నారు.

"వాళ్ళూ మనలాగే మనుషులే నమ్మా..." అన్నాడు రాజారావు లలితను ముద్దాడుతూ "అయితే వాళ్ళకెవరూ దొంగతనం చేయకూడదని పాఠం చెప్పలేదా?" అంది లలిత రాజారావు వళ్ళో కూర్చుని.

ఈ ప్రశ్నకూ రాజారావు, భార్యా నవ్వుకున్నారు. లలితకు కోపంవచ్చినట్లు మూతి బిగించింది.

"దొంగలను గురించి ఆలోచించకు. కలలు వస్తాయి అది మరచిపో... మరేదైనా చదువుకో" అన్నాడు రాజారావు...

  

నాలుగు రోజులయిన తరువాత దాసీది... 'అమ్మగారూ! ఊళ్ళో దొంగల హడావుడిగా ఉంది... మొన్నటిరోజు సవరం వారి వీధిలో దొంగలుపడి నాలుగు వేల రూపాయల సొమ్ము ఎత్తుకుపోయారట... అదృష్టం... ఇంట్లోవాళ్ళ ప్రాణాలు దక్కినయి...' అని అన్నది అంట్లు తోముతూ... గదిలో చదువుకుంటున్న లలిత ఈ మాటలు విని ఉలిక్కిపడి ఒక్క గంతువేసింది అమ్మా... అని.

ఆ రాత్రంతా దొంగలను గురించి ఆలోచించింది లలిత. నిద్ర పట్టలేదు. గాఢ నిద్రపోతున్న తల్లివైపు అప్పుడప్పుడూ చూసి మళ్ళీ పడుక్కునేది. లలిత ఇంకా ఆ విషయమే ఆలోచిస్తున్నదని రాజారావు అనుకోలేదు... దాని విషయమై పట్టించుకోలేదు కూడా. దొంగవస్తే అమ్మకు నిద్రాభంగం కలుగుతుందని తప్ప మరో భయం లేదు లలితకు. ఏమాత్రం చప్పుడైనా చటుక్కున లేచి కూర్చుండేది ఎంత నిద్రలో ఉన్నా.

  

రాజారావు పనిమీద నాలుగు రోజులు ఊరు వెళ్ళాడు. లలిత మామూలుగానే పుస్తకాలు చదువుతూ కాలక్షేపం చేస్తున్నది. దొంగలను గురించి విన్నప్పటి నుండి భయంవల్ల కాకపోయినా ఎందుచేతనో సరిగా నిద్రపోవడం లేదు.

ఒక రోజు-

రాత్రి రెండు గంటలు కావస్తోంది. నాన్న ఊళ్లోలేడు. అమ్మ గదిలో నిద్రపోతున్నది. తాను పక్కనే పడుకుని ఉన్నది. అంతా నిశ్శబ్దం... ఉన్నట్లుండి... లలితకు మనిషి అలికిడి అయినట్లు వినిపించింది. క్రమంగా ధ్వనికూడా పెద్దది కావడం ప్రారంభించింది. అమ్మ వైపు చూసింది. అమ్మ సుఖంగా నిద్రపోతున్నది. దొంగే అయి ఉంటాడు లేకపోతే ఇంత అర్ధరాత్రి ఎవరు వస్తారు అని అనుకుంది లలిత. మంచం మీదనుండి కిందకుదిగి నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడు కాకుండా... (అలికిడి అయితే అమ్మకు నిద్రా భంగం కలుగుతుందేమో) ముందుకు వచ్చి నిల్చున్నది. క్రమంగా దొంగ తనను సమీపిస్తున్నాడు. దొంగను చూసింది లలిత. గబగబా ముందుకు వెళ్ళి అతని దగ్గరగా... ఏయ్.. నిన్నే ఇస్... చప్పుడు చేయవోకు... మా అమ్మ నిద్రపోతున్నది అని అన్నది. దొంగ లలితను చూశాడు. చప్పుడు చేయనంటేనే లోపలకు వెళ్ళనిస్తాను. లేకపోతే తిరిగి వెళ్ళ వలసిందే. దొంగ లలిత ఎదురుగా నిల్చుని ఉన్నాడు. "ఎక్కడ ఏమేం ఉన్నాయో చెప్తావా?" అన్నాడు.

'ఓ' అంటూ... రహస్యంగా ప్రారంభించింది. "పడమటి గదిలో మా అమ్మ నిద్రపోతున్నది. నీవు ఆవైపుకే పోవడానికి వీల్లేదు. వంట ఇంట్లో మూడు వెండికంచాలున్నాయి. అవతల గదిలో అల్మైరాలో మా నాన్న పుస్తకాలూ, బట్టలూ ఉన్నాయి... అవును గానీ నీవు మనిషివి బాగా ఉన్నావ్, దొంగతనం చెయ్యమని ఎవరు చెప్పారూ. ఎక్కడా ఉద్యోగం దొరకలా. నీవేమైనా చదువుకున్నావా, బాగా చదువుకుంటే మా నాన్నగారితో చెప్పి ఏమైనా ఉద్యోగం దొరుకుతుందేమో కనుక్కొంటాను. ఉద్యోగం చేస్తావా?..." అంటూ దొంగవైపు చూస్తున్నది.

దొంగ పెద్దగా ఏదో మాట్లాడపోయేటప్పటికి ఏయ్... ఇస్... నిశ్శబ్దం... మా అమ్మ నిద్రపోతున్నదని చెప్పలేదూ. అని గదమాయించింది. నేనిక్కడ నిల్చుంటాను లోపలకు వెళ్ళి ఉన్నవన్నీ తీసుకుని నాకియ్యి అన్నాడు దొంగ.

"మా అమ్మ నిద్రపోతున్నది. ఆమె మెడలో గొలుసు ఉన్నది. ఆమె పడుకున్న గదివైపు కూడా మనం వెళ్ళకూడదు. నేను వెళ్ళనూ అని వొట్టు వేసుకుంటే అవన్నీ తీసుకువస్తాను" అన్నది లలిత. సరే నన్నాడు దొంగ.

"ఆ వెండి కంచాలలో ఒకటి మా నాన్నది రెండోది మా అమ్మది. ఆ రెండూ తాకటానికి వీల్లేదు. ఆ పుస్తకాలు కూడా మా నాన్న ఎంతో కష్టపడి కొనుక్కున్నారు. అవికూడా ఏమీ ముట్టుకోవడానికి వీలులేదు" అని అన్నది లలిత.

"అన్నిటికీ అన్నీ చెప్తున్నావు ఏదో ఒకటి ఇస్తేగాని వీలులేదు" అన్నాడు దొంగ..

"... మా నాన్న నాకో గొలుసు చేయించాడు. నా చేతికి గాజులున్నాయి. నా దగ్గర కొన్ని బొమ్మలున్నాయి, కొన్ని చిన్న పుస్తకాలున్నాయి. కావలిస్తే ఇవన్నీ పట్టుకుపో, అంతే కాని, నాన్నవీ, అమ్మవీ ఒక్క వస్తువు తాకడానికి వీలులేదు. ఇవన్నీ తీసుకుని శబ్దం చెయ్యకుండా తిరిగి వెళ్లిపో..." అన్నది లలిత.

దొంగకు ఏం మాట్లాడాలో తోచలేదు. అలాగే నిల్చున్నాడు. ఇంతలో తన చేతులకు ఉన్న గాజులూ, గొలుసూ తీసి అతని చేతికిచ్చింది. దొంగ "నీ పేరేమిటి?" అన్నాడు. 'లలిత' అని ముద్దుగా చెప్పింది. అయితే వెళ్ళిపోతావన్నమాట అన్నది..." "వెళ్ళమన్నావుగా" అన్నాడు దొంగ. తరవాతయినా హాయిగా గౌరవంగా ఉద్యోగంలో చేరితే మంచిది... అన్నది లలిత. దొంగ ముందు వెళ్తున్నాడు. వెనక లలిత వస్తున్నది.

వాకిటిదాకా దొంగను సాగనంపి వచ్చి లలిత పడుకున్నది.

  

తరువాత రెండు రోజులకు రాజారావు వచ్చాడు. అప్పటి వరకూ ఈ విషయాన్ని ఎవరికీ చెప్పలేదు లలిత...

జరిగిన విషయమంతా చెప్పి... "వాడికెక్కడన్నా ఉద్యోగం చూసి పెట్టకూడదూ? పాపం దొంగతనం మానేస్తాట్ట" అన్నది.

"ఎంత దానివే లలితా నీవు!" అని తల్లిదండ్రులిద్దరూ లలితను కౌగిలించుకున్నారు. "కోప్పడకు నాన్నా నన్ను... గాజులూ గొలుసూ ఇచ్చేశాను..." అని ముద్దుగా అంటుంటే ఇద్దరు ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకున్నారు.

  

దొంగ తరువాత పట్టుబడటం జరిగింది. పోలీసు ఇన్స్‌పెక్టర్‌వచ్చి ఒకరోజు గొలుసూ గాజులూ రెండూ రాజారావు కిస్తూ "మీ అమ్మాయి చాలా అదృష్టవంతురాలు" అన్నాడు. దొంగ లలిత కివ్వమని ఒక ఉత్తరం కూడా పంపించాడు. "నీ వస్తువులు రెండూ నీకు పంపిస్తూ ఉన్నాను. నాకొకప్పుడు నీలాంటి 'పాప' ఉండేది. భార్యా పిల్లలూ అంతాపోయి ఒక్కణ్ణి మిగిలాను. ఏ కారణంవల్లనో దొంగతనం వృత్తిగా ఏర్పడ్డది నాకు. అది ఈ రోజుతో సరి అనుకుంటాను. భగవంతుడిలా నీవు నాకు దారి చూపించావు. ప్రస్తుతం జైల్లో ఉంటున్నాను. మీ నాన్నగారితోనూ అమ్మగారితోనూ ఒక్కసారి నన్ను చూడటానికి వస్తే సంతోషిస్తాను" ఉత్తరం బిగ్గరగా చదివి వినిపించింది లలిత.

రాజారావు భార్యా ఇల్లు ప్రతిధ్వనించేట్లు నవ్వారు. పోదాం నాన్నా... అని మాత్రం అనగలిగింది లలిత.

# 35

# వీలునామా

విషాదరావుకు ప్రతిరోజూ పదకొండు గంటలయిన తరువాత తన ఇల్లు వదలి ఊరంతా తిరిగి రావడం పరిపాటి. ఏ రెండో మూడో అయిన తర్వాతగాని ఇంటికి రాడు. ఈ లోగా కనీసం రెండు సిగరెట్టు పెట్టెలైనా కాలుస్తాడు.

ఇంటికి వచ్చి గదిలో లైటు వేసుకు కూర్చుంటే విసుగు విరామం లేకుండా ఆడుతున్న గడియారం తప్ప మరేమీ అతనికి కన్పించవు. గడియారం గుండె ఇప్పట్లో ఆగేట్టు లేదు అనుకుంటాడు... తన గుండెమాత్రం ఎప్పటికప్పుడు ఆగుతున్నట్లే అనిపిస్తుంది. ట్రంకుపెట్టె తెరిస్తే లెక్కలేనన్ని కరెన్సీనోట్లు... ఏం? వెధవ డబ్బు ఎవరిక్కావాలీ?... అనుకుంటాడు. అవి అక్కర్లేదు కాని ఏం కావాలో విషాదరావుకి తెలియడం లేదు. అన్నీ కావాలి అన్నీ అక్కర్లేదతనికి. అతని ముఖం చూస్తే ఎవరి మీదనో తీరని కసి ఉన్నవాడులా కన్పిస్తాడు.

విషాదరావుకు ఆ విధంగా ఉంటానికి గల కారణం ఏమిటో తెలియడం లేదు. విషాదరావుకు బోలెడు ఆస్తి ఉన్నది. పెద్ద ఇల్లు, రిటైరయి రెండేళ్ళయింది. నెలకు రెండువందలు పెన్షను తీసుకుంటున్నాడు. సుఖంగా కాలం గడిపేవాడికి ఇంతకన్నా ఏం కావాలీ?

విషాదరావుకు భార్యపోయి నాలుగేళ్ళయింది. పోనీ భార్యావియోగం వల్ల కలిగిన దుఃఖమేమో అనుకుంటే అదీ కాదు. పోవడమే మంచిదయింది. లేకపోతే బొత్తిగా మనశ్శాంతి ఉండేది కాదు అంటాడు. ఆమె పోయినప్పుడు అతను చలించలేదు. ఆమె చితిదగ్గర కూర్చున్నంత సేపు అతను శూన్యంలోకి చూస్తున్నాడేమో అనిపించింది. బంధువులెంతోమంది వచ్చారు తనను పరామర్శించడానికి. వాళ్ళందరినీ

అనహ్యించుకున్నాడు. పరామర్శించడం, లేని ఏడుపు తెప్పించుకోవడం ఇదంతా ఆఫీసు 'రొటీన్' వంటిది అతని దృష్టిలో... కొంతమంది బంధువులు రాసిన ఉత్తరాలకు విచిత్రంగా సమాధానం రాసేవాడు. "మీరూ, నేనూ కూడా ఒకప్పుడు చచ్చిపోయే వాళ్ళమే... మీ రనుకున్నంత దుఃఖంలో లేను నేను... నిజానికి మా ఆవిడ చచ్చిపోలేదు. మీరు ఉత్తరాలు రాయకండి" అని. బంధువులకు ఆశ్చర్యం వేసేది ఇతని వాలకం చూసి.

జరిగిన్న విషయాలను గురించి ఆలోచించడం దేనికి? అనుకుంటాడు. విపరీతాలేమీ జరగలేదు. అందరివలెనే అతనికీ జరిగింది. మరి విషాదరావులోని ఈ విషాదానికి కారణం కన్పించడం లేదు.

కొడుకులను తన దగ్గర ఉండొద్దని ముగ్గురినీ మూడు తోవల పంపించివేశాడు. ఒక కొడుకు మేనమామ దగ్గర ఉన్నాడు. ఒక కొడుకు తన చెల్లెలు దగ్గర, మరో కొడుకు వంటరిగా ఉండి చదువుకుంటున్నాడు. ముగ్గురికీ వాళ్ళడిగినంత ప్రతినెలా పంపిస్తుంటాడు. రాత్రిపూట తిరిగి రావడం అలవాటయిన తరువాత అతని మనసుకు శాంతి లభించడం లేదు. తిరిగి వచ్చిన తరువాత గడియారం ఎదురుగా గంటసేపు కూర్చుంటాడు.

విషాదరావు ఆ ఊళ్ళో ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. గడియారం ముందు కూర్చుంటే చిన్నముల్లూ, పెద్దముల్లూ రెండూ చిన్న పాముల్లాగా ఒకప్పుడు పెనవేసికుంటూ ఒకప్పుడు పెనవేసుకోకుండా తిరుగుతున్నట్లనిపిస్తుంది. ప్రతిరోజూ ఒక పువ్వు తీసుకొని వచ్చి గడియారంమీద ఉంచుతాడు. తెల్ల వారేటప్పటికి అది వాడిపోతుంది.

అతనితో పరిచయానుభవం కలిగిన తరువాత తక్షణం కథ రాద్దామనుకోవడం నాలోని బలహీనతేమో. ఎందుకంటే, అతన్ని పూర్తిగా అర్థం చేసుకోకుండానే రాయడం మొదలుపెట్టాను. ఏమయినా ఒకనాటితో అతని మనస్తత్వం అర్థం చేసుకునేంత శక్తి నాలో లేదు. కథ చదివితే మీరేమైనా రావులోని విషాదానికి కారణం గ్రహించగలరేమో.

సంభాషణనుబట్టి అతను 'మానవవాది' అని నిర్ధారణ చేయవచ్చును. ఏదైనా, కథకు సంబంధించినంతవరకు అతని గుణగణాలతోనూ, ఆశయాలతోనూ మనకు

సంబంధం లేదు. నిత్య జీవితంలో జరిగిన ఒక చిన్న సంఘటన కథకు కావాలి. ఆ సంఘటనే మీ ముందు ఉంచుతున్నాను. దాంతో కథకునిగా నా విధి నెరవేర్చుకున్నట్లే కొంతవరకూ. విషాదరావుని గురించిన విషయాలు నేనుఎక్కువ సేకరించలేకపోయినా కథకు కావాల్సినంత వరకు ఉన్నయి అని నా నమ్మకం. విషాదరావును చూడగానే ఎందుకో Charles Lamb జ్ఞాపకానికి వచ్చాడు. తరువాత అతనిలో వరుసగా Dickens ను, Hardy ని చూడగలిగాను.

నాకూ విషాదరావుకూ ఓ హోటల్లో పరిచయమైంది. ఆ రోజు ఇద్దరమూ భోజనం చేసిన తరువాత కిళ్ళీవేసుకుని నడుస్తున్నాం. విషాదరావు సిగరెట్టు ముట్టించాడు. సంభాషణ అంత చురుగ్గా నడవడం లేదు. చేతిలో సిగరెట్టు ఉన్నది. పొగవస్తున్నది, చూశారా నా వేళ్ళు ఎలా కాలిపోతున్నయో.... వేళ్ళలోంచి చూడండి పొగలేస్తున్నది... అని నవ్వాడు. ఇంటికి వచ్చి ఆలోచించడం మొదలు పెట్టాను - ఫ్రెంచి రచయిత 'Jean Paul Sartre' గూడా ఇలాంటి సంభాషణలే తను సృష్టించిన పాత్రలచేత పలికించినట్లు నాకు జ్ఞాపకం. కేవలం విషాదరావు ఎక్కడో చదివిన ఒక నవలలోని పాత్రలాగా కన్పించాడు. ఏదైనా విషాదరావు విషాదరావే. అతన్ని మరొకరితో పోల్చడం అంత సమంజసం కాదు. ఇవన్నీ వదిలేసి అసలు జరిగిన సంఘటనలోకి పోదాం.

విషాదరావుకు కొన్నాళ్ళు సుస్తీ చేసిన తరువాత ఇంట్లో ఒక వంటమనిషిని ఏర్పాటు చేసుకున్నాడు. ఆమె పాపం స్వంత మనిషిలాగా సపర్యలన్నీ చేసేది. నేను ఒకసారి కలుసుకున్నప్పుడు అతనన్నాడు... "చూడండి ఆమె పుట్టుపూర్వోత్తరాలు మనకు తెలియవు. కేవలం డబ్బుకోసం నాకు వంటచేసి పెడుతున్నది. నన్ను స్వంతమనిషిలాగా ఆప్యాయంగా చూస్తున్నది" అని ఆమె విషయంలోగల తన కృతజ్ఞతను వెల్లడించాడు.

  

అతను చనిపోయినాడని తెలియగానే చూడడానికి వెళ్ళాను. మొదట నేను చేసినపని బయట 'నిశ్చల విషాదరావు' అనే బోర్డు ఉండేది అది తీసివేశాను. ఇల్లంతా బంధువులతో నిండి ఉన్నది. వంటమనిషికూడా విషాదంగా ఒక మూల కూర్చున్నది.

జబ్బుగా ఉన్నానని కబురైనా చేయలేదు అని పెద్దకొడుకు నాతో అన్నాడు, నే నేమీ మాట్లాడలేదు.

తరువాత రెండుమూడు రోజులకు విషాదరావు రాసిన వీలునామా బయటపడ్డది. ఆయన దస్తూరిలోనే నాలుగు వాక్యాలకన్నా ఎక్కువ లేవు. "నా స్వార్జితం, ఇల్లూ, పొలమూ నా తదనంతరం అవసాన దశలో నన్ను కనిపెట్టుకుని ఉండి నాకు సపర్యలు చేసిన శ్రీ దేవమ్మకు (వంటమనిషి) చెందుతుందనీ, బ్యాంకులో నిల్వ ఉంచిన డబ్బు మాత్రం మూడో కొడుకు చదువు నిమిత్తం ఉపయోగించాలనీ, ఆ భారం పెద్ద కొడుకు వహించాలనీ" ఉంది –

వీలునామాను చూసి కొడుకులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. నలుగురూ నాలుగు అభాండాలు వేశారు ఆయనమీద. ఊళ్ళో అనేకులు అనేక విధంగా అనుకున్నారు. అనుకోవడం సమాజం గనుక ఎన్ని రకాలుగానో అనుకున్నారు. మీరూ అనుకుంటారు. నాకు మాత్రం ఒక గట్టి నమ్మకం ఉంది. విషాదరావు దయార్ద్ర హృదయుడనీ, నిష్కల్మషుడనీ. ఏమైనా ఎవరి అభిప్రాయాలు వారికి ఉంటాయి. అందరితోపాటూ నాకూ ఓ అభిప్రాయం ఉంది. మీరు ఏకీభవించక పోవచ్చు దాంతో విషాదరావు మాత్రం ఇక్కడ లేడు. కళ్ళు మూసుకుంటే ఎందుకో నిత్యమూ ఎదురౌతాడు.

# 36

# తిరుగుబాటు

పేస్తుపడుకోండి వెధవల్లారా అంటున్నాడు సుబ్రహ్మణ్యంగారు. గ్రామఫోను పెట్టూన్నవాడు ఆపేశాడు. ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్ రికార్డు ఒకవైపు అయిపోయింది. మిషను డబుల్ స్ప్రింగ్ అవటంచేత కీ ఇయ్యటం మానేసి కోరగా చూశాడు-

అంతకుముందే సుమారుగా దెబ్బలుతిన్న కృష్ణమూర్తి మరోమాట మాట్లాడకుండా - ఎడమ వైపు మొగంపెట్టి బోర్లా పడుకున్నాడు. వెంకటేశ్వర్లు శిలాప్రతిమలా స్తంభానికి ఆనుకుని నిల్చున్నాడు.

ఇంకా అంటూనే ఉన్నాడు సుబ్రహ్మణ్యంగారు. తను చెప్పిన రూల్సుకు వ్యతిరేకంగా నడిచి... డబ్బు పారేసుకునేందుకు కారకులయ్యేరు కొడుకులు ఇద్దరూ- అనే దిగులు పట్టుకుంది. సుబ్రహ్మణ్యంగారి తత్వం మరీ విచిత్రంగా ఉంటుంది. జీవితంలో చేసే ప్రతిపని నియమాలతో వుండాలి అంటాడు. తను ఏ విధంగా చెప్తే ఆ విధంగా కొడుకులు వినాలి అనే మొండిపట్టుదల. కొడుకులకు ఏ మాత్రం స్వేచ్ఛ ఇవ్వడు.

ఆయన చెప్పినట్టు ఎంతో జాగ్రత్తగా వున్నారు కొడుకులిద్దరు. కర్మవశాత్తు పోయినయి ఆ పాతిక రూపాయలూ. రూములో పెట్టెలో అట్టడుగున పర్సులో ఒకవైపుగా పెట్టి తాళం వేసి కాలేజికి వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి ఆ డబ్బు లేకపోతే... దానికి వాళ్ళిద్దరూ బాధ్యులు అని మనం అనలేం.

నాన్నకు ఉత్తరం రాశారు. మీరు పంపించిన అరవై రూపాయలలో ముప్పై అయిదు రూపాయలు హోటల్లో ఇచ్చాం... మిగతాది పెట్టెలో పెట్టి ఫలానారోజున

సాయంత్రం పెట్టెలో డబ్బు చూసుకుంటే లేదు. పరీక్షలు మాత్రం ఇంకా నాలుగు రోజుల్లో అయిపోతయి అని.

పరీక్షలు కాగానే ఇంటికి వచ్చారు. ప్రతి నెలా ఖర్చు పెట్టిన డబ్బుకు లెఖ్ఖ రాయటం పెద్దకొడుకు విధులలో ఒకటి. నెలాఖరుకు ఆ పుస్తకం ఆయనకు పంపిస్తే "ఆడిట్" చేస్తాడు. ఆ లెక్కలో అనవసరమైనది ఏదైనా వుంటే అది మాత్రం వచ్చే నెలనించి తీసివేయమంటాడు.

మొదటి టరమ్ పరీక్షలు అయిన తరువాత ఇద్దరూ వచ్చారు శలవులకు. ఆడిట్ చేస్తూన్న పుస్తకంలో ఎఱ్ర సిరాతో గీతపెడుతూ పెద్దకొడుకును పిల్చాడు.

ఒరేయ్ సినిమాకు ఇద్దరికీ కలిపి రెండున్నర రూపాయలు వేశావ్. అది టూ మచ్... అప్పటికీ నేను మిమ్మల్ని నాలుగు సినిమాలు చూడమన్నాను. నాన్నా కాలేజీ స్టూడెంట్లు అందరూ కుర్చీకి పోతుంటే మేము అప్పటికీ బెంచీకి పోతున్నాం అని ఏదో విధంగా సమాధానం చెప్పటం మొదలు పెట్టేటప్పటికి అడ్డుతగిలి... ఇహ వచ్చే నెలనించి రూపాయిపావలే... సినిమాకు... ఆ డబ్బులో సరిపెట్టుకోవాలి. నేలకన్నా పోండి... మీ ఇష్టం ఎవరన్నా గానీవండీ. అని కసిరాడు. వెంకటేశ్వర్లు ఎదురు మాట చెప్పటానికి భయపడతాడు. కృష్ణమూర్తి రోషం పట్టలేకుండా వున్నాడు. వాళ్ళు నాన్నవైపే చూడకుండా అటు మొగం పెట్టి పడుకున్నారు. ఇల్లంతా నిశ్శబ్దంగా వున్నది.

ఇటువంటి పరిస్థితుల్లో ఏం చేయాలో వెంకటేశ్వర్లుకు ఏమీ బోధపడలేదు. వెధవది డబ్బు... పొరపాటున పోయినందుకే ఇంత దాకా వచ్చింది. సినిమాకు పోవటానికే చాలా కట్టుదిట్టం చేస్తున్నాడు. వెంకటేశ్వర్లు మనసు చివుక్కుమన్నది.

# 37

# కాన్వకేషన్ గౌన్

మొల్లరామాయణం ఏం బావుందండీ... అన్నాడు నా ఎదుట ఆయన.

ఓహో అట్లాగేం—

దాంతో ప్రారంభమయింది తగాదా... ఏమీ మాట్లాడకుండా కూర్చున్న వాళ్ళల్లో నేనొకణ్ణి. అందరూ విస్తుపోయి చూస్తున్నారు. ప్రతిదానికీ పోటీలు పెట్టుకుని ముఖాముఖి నానామాటలు అనుకుంటున్నారట... నా పక్కనున్నాయన నా చెవిలో ఊదేసరికి... అమ్మబాబోయ్ అనుకున్నాను. ఎంత ధైర్యంగా మాట్లాడుతున్నదీ... అనుకున్నాను... వాదన అంతా అయిన తరువాత... మీ ఆర్గ్యుమెంటులో అర్థం లేదు... మీతో వాదించటం చాలా అనవసరం... అంటూ పక్కకు తిరిగి కూచుంది. ఎదుట ఉన్నాయన నోర్మూసుకు కూర్చున్నాడు... ఆవిడకీ ఆయనకూ ఏవిటి సంబంధం.. ఎంతో అప్తులులా మాట్లాడుకుంటున్నారు... అన్నది. నాకు నిజానికి సమస్య అయింది.

ఆ అమ్మాయితో మాట్లాడాలని ముచ్చటగా ఉంది నాకు... ఆ అమ్మాయి కళ్ళు... అందర్నీ ఆకర్షిస్తున్నాయి నన్నూ... బెదురులేకుండా... ఖచ్చితంగా మాట్లాడుతున్నది... నాకు విజయలక్ష్మిపండిట్ జ్ఞాపకానికి వచ్చింది... కనీసం కాలేజీ చదువైనా కొంత అబ్బిఉండాలి ఆవిడకి అనే నిశ్చయానికి వచ్చిన తరువాత... మీరే ఊరునుండి వస్తున్నారని అడిగాను... కాకినాడ అని చెప్పింది. ఆవిడతో రాజకీయాల్ని గురించి మాట్లాడితే ఎట్లా ఉంటుందో అని... బోసువీరుల విచారణ గురించి మీ అభిప్రాయమేమిటి అన్నాను. వాళ్ళు నిజమైన దేశభక్తులు అని అనటానికి నేను వెనుదీయను అన్నది... పత్రికల్లో ప్రకటించిన కెప్టెన్ లక్ష్మి... ఫోటో నా కళ్ళల్లో

మెదిలి ఆవిడ ఇట్లాగే ఉంటుందేమో అనిపించింది... కెప్టెన్ లక్ష్మి నా పక్కన కూచుని నాతో మాట్లాడుతున్నట్టుగా ఉంది... ఇది సైకాలజీో, ఫిలాసఫో, నాకర్థం కాలేదు... మేం ఇద్దరం మాట్లాడుకుంటుంటే మావైపు విరగబడి చూస్తున్నారు జనం... రైలు మాత్రం నాదోవ నాది అనుకుంటూ పోతున్నది.

మీరు ఎక్కడికి వెళ్తున్నారని నన్నడిగిన ప్రశ్నకు... గుంటూరు వరకే... కొంచెం అక్కడ పని ఉన్నది... అని చెప్పాను... నేనూ అక్కడికేనండోయ్ అని అన్నది నవ్వుతూ.... ఎంతో హాయిగా ఉంది ఆవిడ నవ్వుతుంటే... ఇంకా నవ్వుతుందేమో అని చూశాను. చప్పున ఆపేసింది సీరియస్‌గా... మీరు ఇందాక వాదిస్తున్నారే ఆయనెవరండీ అని అడిగాను. "ఆయన... ఒక ఉభయభాషా ప్రవీణ... కాన్వకేషన్‌కు వెళ్తున్నాట్ట ఒక్కటే మొండి వాదన..." అన్నది నెమ్మదిగా నాతో.

రైలు గుంటూరులో ఆగేంతవరకూ ఏదో లోకాభిరామాయణం మాట్లాడుతునే ఉన్నాం.

ఇంతకూ విచిత్రమైన విషయమేమిటంటే ఇద్దరమూ ఒక పనిమీద ఒకే చోటకు ఒకే రైలు పెట్టెలో ఎక్కి కలుసుకుని పోవటం తటస్థించింది. ఆ కాస్త పరిచయం స్నేహంగా మారటంలో విశేషం లేదు.

రైలు దిగిన తరువాత మీరెక్కడికి వెళ్తారు అని అడిగింది. నాకో స్నేహితుడు ఉన్నాడు. అతనింటికి వెళ్తాను. రమ్మని ఉత్తరం కూడా రాశాడు' అన్నాను నేను. నా స్నేహితురాలింటికి వెళ్తాను అన్నది. కాదు కూడదు మీరు నాతో రావాలి... అతిథులు మీరు అన్నాను సంతోష పూర్వకంగా తల ఊగించిన తరువాత... ఇద్దరమూ ఒక జట్కాబండి ఎక్కాం... అంత ఇరుకుగా కూర్చోనక్కరలేదు... ఫరవాలేదు జరగండి అన్నది... అబ్బో చాలా 'advanced' అని మనసులో అనుకుని... డిగ్రీపుచ్చుకున్నారు కదా... మీరేం చేస్తారన్నాను. అదే ఆలోచిస్తున్నానండీ అన్నది నవ్వుతూ- ఆవిడ నవ్వుతూంటే చూడటం ఇది రెండోసారి. నన్ను అదే ప్రశ్న అడుగుతుందనుకున్నాను... కాని ఆవిడ నన్ను వేసిన ప్రశ్నకు ఆశ్చర్యపోయినాను.

బండి దిగిన తరువాత మా సూరికి పరిచయం చేశాను ఆవిణ్ణి. ఇద్దరమూ వాడింట్లోనే భోజనం చేశాం... తరువాత సూరి పెళ్ళాంతో కబుర్లు పెట్టింది... ఏదో చెప్తున్నది. తను విన్నది. ఇద్దరూ నవ్వుకుంటున్నారు. సావిట్లో

కూచుని నేనూ సూరి మాట్లాడుకుంటున్నాం. 'ప్రాక్టీసు' అట్టే లేనపుడు కొంచెం తగ్గినట్లు కన్పిస్తున్నది అన్నాడు సూరి.

కాన్వకేషన్‌కు వెళ్ళటానికి అది తగిలించుకుని వెళ్ళాలి. ఆ గౌనుకోసం చాలామంది అవస్థలు పడుతున్నారు... అటూ ఇటు తిరుగుతున్నారు. కాస్త హడావిడిగానే ఉంది. నేను ఆ అవస్థలు పడక్కర్లేదు. మావాడి ప్లీడరు గౌను... వేసుకుంటాను... నాతో కూడా వచ్చిన అమ్మాయికి గౌను ఉందో లేదో... ఎక్కడైనా ఏర్పాటు చేద్దాం అనిపించింది.... అయినా ఆడవాళ్ళకు గౌను ఎందుకూ అనుకున్నాను.

కాన్వకేషన్ సరిగ్గా మూడుగంటలకు, అందరం రెండున్నరకే అక్కడకు తయారు కావాలని మాకిచ్చిన కార్డుల్లో అచ్చుకొట్టారు. అప్పుడే ఒకటిన్నర అయింది. మా సూరి, పెళ్ళాం చెవిలో ఏదో ఊది, ఫలహారాలు చేయించమన్నాడు... ఇదోటి ఎందుకండి ఇప్పుడు అంటే, ఊరుకోలేదు... గౌను సంగతి హెచ్చరించలేదు నేను... రెండు కొట్టిన తరువాత అన్నాను. నేను... టైము అయింది ఇహలేవాలి అని... చావు కబురు చల్లగా అప్పుడు చెప్పాడు. వాళ్ళ మేనల్లుడు (ఈ మధ్యన బియస్‌సి ప్యాసయిన వాడు) వచ్చి గౌను పొద్దునే పట్టుకు పోయాట్ట... నాకు విపరీతమైన కోపం వచ్చింది. సూరి అమాంతం నన్ను మోసం చేశాడు... నిజానికి తప్పునాది... కారణం ఏమిటంటే నాకు గౌను కావాలి అని ముందుగా తెలియపర్చలేదు. మనవాడిది ఉంది గదా వేసుకోవచ్చు కదా అనుకున్నాను... ఇంతలో సూరి పెళ్ళాం ఇవతలకు వచ్చి... ఈ అమ్మాయి మనకు చుట్టమండోయ్ అన్నది సూరితో... "ఆ అమ్మాయి మనకు చుట్టమయితే ఏం కాకపోతే ఏం... నాకిప్పుడు గౌను కావాలి... కాన్వకేషన్ గౌను... అది తగిలించుకుని పోయి ఆ బియ్యే డిగ్రీ తీసుకోవాలి..." అన్నాను. ఫరవాలేదు చిరాకు పడకు.. అన్నాడు సూరి. నాకు టైమయిపోతున్నది... చాల చికాకుగా ఉంది.... నేనిట్లు అవస్థపడుతుంటే వాళ్ళిద్దరూ, కాదు ముగ్గురు (ఆ అమ్మాయి కూడా) ఎక ఎకలు పకపకలూ... పళ్ళు పళ్ళు పటపట కొరికాను... ఇహ బజార్నపడితే... ఎక్కడన్నా దొరుకుతుందేమో... సంపాయించవచ్చు అనుకున్నాను.

పట్టుమని పదినిమిషాలన్నా టైము లేదు... ఈలోపల నాకు గౌను దొరకాలి... ఆ గౌను తగిలించుకుని... ఆ కాన్వకేషనుకు వెళ్ళి... డిగ్రీ తెచ్చుకోవాలి... ఇది చాలా చిక్కు సమస్య.

నల్లచీర తీసుకవెళ్ళండి అని సూరి పెళ్ళాం వాళ్ళూ వేళాకోళం చేయటం మొదలుపెట్టారు.

ఛీ అని ఛీదరించుకున్నాను.

అంతకన్నా చేయదగ్గది నాకేం కనిపించలేదు... అన్నాడు సూరి కూడా.

నేను కాన్వకేషన్‌కి పోవటం మానేస్తాను. వచ్చే సంవత్సరం తెచ్చుకుంటాను. బతికి బాగుంటే అన్నాను.

కాస్సేపటికి సూరి పెళ్ళాం బయటకు వచ్చి ముసిముసి నవ్వులు నవ్వుతూ ఆ బల్లమీద పెట్టిపోయింది గౌను. సూరి పక్కున నవ్వాడు.

ఇదంతా మీ స్నేహితురాలు ఆడిన నాటకంగా అన్నాడు. ఆవిడ దాచిపెట్టి (వంట ఇంట్లో చేరి) ఇట్లు చేసింది ఈ చిలిపి పనుల్లో సూరి పెళ్ళాం, ఈవిడా కలిశారు.

ఇట్లు చేసినందువల్ల మీకేం ఒరిగింది అన్నాను. అందరమూ నవ్వుకున్నాం.

గౌను తగిలించుకున్నాను.

ఆవిడకూడా వచ్చింది.

ఇద్దరమూ కలిసి కాన్వకేషన్‌కు వెళ్ళాం. దోవలో మొల్ల రామాయణం ఏం బావుందండీ, అని అన్నాను. ఉభయభాషా ప్రవీణకండి మీరు గూడా అని అన్నది. "నా స్నేహితురాలి దగ్గరికి వెళ్తున్నాను కాన్వకేషన్ నుండి వచ్చిన తరువాత మీకు కన్పించటానికి అవకాశం ఉండదు" అని నవ్వుతూ అనేటప్పటికి–

"అట్లా ఎన్నటికీ జరగటానికి వీలులేదు. రాత్రికి మనం అందరం సినిమాకు వెళ్ళాలి. సూరిపెళ్ళాం మిమ్మల్ని వదలిపెట్టదండోయ్" అన్నాను.

హాల్లో ప్రవేశించబోతూ "గౌను దాచిపెట్టి నన్ను చాలా అల్లరి పెట్టేశారే" అన్నాను.

కాన్వకేషన్‌నుంచి వచ్చిన తరువాత అందరము సినిమాకు వెళ్ళాం–

సినిమానుండి తిరిగి వస్తూంటే–

'ఒరే ఆవిడ మా పెదమామగారి అల్లుడి చెల్లెలు' అన్నాడు.

'అయితే ఆ అల్లుడు మా మేనత్త కొడుకేగా' అన్నాను.

మనం అందరం ఒకే బంధుకోటిలోని వాళ్ళం అన్నది ఆవిడ.

నేను ఇంటికి తిరిగి వెళ్ళిందాకా ఆవిడ నవ్విన నవ్వు – ఇంకా వినపడుతునే ఉంది. ఆవిడను పక్కనే ఉన్నట్టు 'ఫీ'లవుతున్నాను. చాలా తమాషాగా ఉంది!

# రాయబారాలు

"ఈ విషయంలో జోక్యం కలుగజేసుకోవడం చాలా అనవసరం... నే చేసేపని నాకు నచ్చబట్టేగా"

ఆ విధంగా పెరిగిపోయేటప్పటికి నేను బయటికి రావలసివచ్చింది. తలుపు ఫెడేలుమన్నది. ఛీ ఇంతకన్నా పరమ ఛండాలుడు ఇంకోడున్నాడా అనుకున్నాను.

రూములో వచ్చి కూచున్నాననే మాటేగాని స్థిమితం ఏదీ... ఒక్క ముక్క... చదువుతున్న పుస్తకం మూసేసి... బయటకు వచ్చాను...

"నిన్నట్లా చిత్రవధ చేయాల్సిందే... రాకాసీ!... లేకపోతే మాట వింటావా...."

చాలా కరుకుగా మాట్లాడుతున్నాడు. దెబ్బలు వినబడుతున్నాయి... ఆమెకున్న సహనం, ఓర్పు ఎదుట నిల్చి ఎదుర్కొన్నట్లుగా ఉంది. మరి చడీ చప్పుడు లేదు...

"ఇప్పుడు మీ నాన్న దిగివస్తాడేమో చూస్తా"...

ఉహుఁ అప్పటికీ నిశ్శబ్దం... దెబ్బలు మాత్రం వినబడుతున్నయి...

ఏమీ తోచలేదు... దగ్గరికి వెళ్ళి తలుపు తట్టాను.

"ఎవరువారు... ఇప్పుడే తలుపు తియ్యరు!"

'పోస్టుమేన్ సర్!' గొంతు మార్చాను.

ముఖాముఖీ ఎదుట నిల్చుని—

"నీ మతి ఇక్కడ ఉందా.. చేస్తున్న పనేమిటి... నీకు చెయ్యనొప్పి అనిపించలేదూ..." కొంచెం కసిరినట్టు మాట్లాడేటప్పటికి...

"జగ్గరాజుగారూ... ఈ విషయంలో మాత్రం..." కొంచెం దగ్గరికి వచ్చి సీదాగా అరంభించాడు.

ఒళ్ళు తెలీక కిందపడి ఉన్న ఆమెమీదకు ఉరికి ఇంకొక దెబ్బ–

అది నా మీదకు రావటం జరిగింది...

"జగ్గరాజుగారూ... మళ్ళీ చెప్తున్నాను, మీరు మటుకు ఈ విషయంలో..."

అఘోరించినట్లుంది... అని గుండెలదాకా చేయిపోనిచ్చి... ధడక్... ధడక్... మంటుంటే చొక్కా పట్టుకుని బయటకు లాక్కువచ్చాను.

భుజంమీద పొడిచిన ఒక్క పిడికిలి పోటుకే అ... మ్మా... అనుకుంటూ నీరసించి... నాలుగడుగులు పక్కకు తిరిగి... ఊగినవాడి మాదిరి తూలుతూ.. ఇంట్లో జొరబడ్డాడు. ముఖం అటువైపు తిప్పుకుని చెమట కారుతున్న కనుబొమలు ముడిచి మంచంమీద బరువుగా వాలాడు–

చీమ చిటుక్కుమన్లేదు.

ఇంత బలహీనుడేం?

చుట్టుపక్కలవాళ్ళు అటువైపు వచ్చి కన్నెత్తి చూడలేదు... ఆ... మనకెందుకు కోతిపుండు బ్ర...హ్మరాక్షసి, గప్... చిప్...!

నిద్రపోతున్న ఆమె కనురెప్పలు మూసి ఉన్న గొంతు చించుకుపోయి అది నిద్రేనంటావా... స్పృహ లేదు–

'అమ్మాయీ?' అని నింపాదిగా పిలిచాను.

జవాబు లేదు.

వాడు మాత్రం పెడమొగం పెట్టి కళ్ళు మూద్దామా వద్దా అనే పరిస్థితుల్లో ఉన్నాడు.

కా స్సేపటికి ఆమె కళ్ళు తెరిచి ఒక పొర్లు పొర్లి నరాలన్నీ తీసుకుని లేచి కూచుంది. తనను బాగా కొట్టాడని తెలుసునా?

మనిషి రెల్లుపుడకలాగ మరీ వంగిపోయి నన్ను చూసి సిగ్గునభినయించి ఇదేమిటి జగ్గరాజుగారు ఇక్కడికి వచ్చాడనుకుందేమో వంటయింటి గుమ్మంలోకి ఒక్క పరుగున వెళ్ళబోయి ముచ్చెమటలు పోసి కుప్పగా కూలిపోయింది.

దగ్గరికి వెళ్ళనిచ్చిన... పోస్ట్‌మేన్‌వలె జరిగిన సంగతి తెలుసుగా... అన్నాను.

మాట్లాడలేక నాలిక పీక్కుపోయి, దాహం అని సూచించేటప్పటికి–

వాడు మాత్రం పెడమొగం పెట్టి... ఆ మంచం మీదనే గుండె ఆగిపోయిన వాడి మాదిరి ...

నేను ఇంట్లోకి వెళ్ళి, కూజా, చిన్న గ్లాసూ తెచ్చి ఎదుట ఉంచాను. నాకింకా కోపం ఆగక ముచ్చుమాదిరి ముడుచుకు పడుకుంటే బహదూర్...

ఉహుంఁ అసలు ముఖం ఇటువైపు తిప్పందే.. ఇంకా ఉడుకుతునే ఉంది నా రక్తం...

యుద్ధభూమి మాదిరి చిందరవందరగా పడి న్న ఇల్లును కొంచెం ఓపికతో సర్ది... నెమరేస్తున్న ఖరాను మ్రింగకుండా...

అతని మంచం దగ్గరకు వెళ్లి "రామలింగం నేను వెళ్తున్నాను" అని చెప్పి...

'రా.. మ్మా...' చేయి ఊతం ఇచ్చి నిల్చుండేటట్టు చేసి... తీసుక వెళ్లాను.

ఇద్దరి ఇళ్లూ ఒకరికొకరు క్రీగంటితో చూసుకుంటయి...

తెల్లవారితేగాని వళ్ళు తేరుకోదు, మరి అంత పశుబలం అయితే ఎట్లా...

హోటలువాడు కారియరు తెచ్చి అక్కడ పెట్టి – అదాటే! అని... గడపదాటాడు.

ఏమీ పరవాలేదు... భోంచేయి తల్లీ... ఇదిగో జగ్గరాజు చెప్తున్నాడు తినమని... తినాలి... లేకపోతే బావుండదు... నాకు కొంచెం కోపం వచ్చినట్టు కనురుకున్నాను.

అన్నం తినేదాకా అక్కడే కూచుని తప్పనిసరిగా ఆమెచేత మాట్లాడిద్దామని మా హోటలు భోజనం ఎలా వుందీ బావుంది అనిపించుకుని...

అతనేదో చిన్నవాడు... ఇంకా కుర్రతనం ఆ బిగువు పోలేదు. కానీ... నస పెడుతుండటం వాస్తవమే మనం ఎంతోగుంభనంగా ఉండాలి, చలించకూడదన్నాను నవ్వుతో... మర్నాడు కూడా రామలింగంలో తేలికదనం కన్పించలేదు.

పోనీ అతనికి తిండి ఉందా రాత్రి... నీళ్లు తాగాడా... అనిగానీ అతన్ని గురించిన ప్రశ్నలు నాలో కలగలేదు అదేవిటో.

అదంతా అతనిమీద నాకున్న కోపమా అంటే నేనేం చెప్పలేను. ఆ మర్నాడు చెప్పాను దగ్గర కూచోపెట్టుకుని... నిన్ను పేరు పెట్టి పిలుస్తున్నాను. అమ్మాయీ జానకీ... ఇప్పుడు వెళ్ళి... కూరా... అన్నం వండి, నీళ్ళు కాగబెట్టి... అన్నీ అయిన తరువాత... కంచంలో అన్నం ఉంచి...

నీవు స్వయంగా వెళ్ళి... ఏవండీ... అని అతని వంటిమీద చేయివేసి... నిద్రలేపు... ఏమన్నా అవనీ... ఏం... వింటున్నావా...

........ ఆఫీసుకు వెళ్ళిపోయినాను... కాని రామలింగం మటుకు నామీద కోపంగా ఉన్నట్టు ప్రవర్తిస్తాడు... నేనేం చేశానో.

ఎప్పుడో నాల్గు నెల్లనాడు 'భార్య' అనే పదాన్ని అర్థం చేసుకోవాలోయ్... అన్నాను ముక్త సరిగా.

  

క్రిక్కిరిసి ఉన్న రైల్లో... అందులో దక్షిణ హిందూస్థానపు మూడో తరగతి రైలు–పెట్టె–గోల్డుఫ్లేకు సిగరెట్టు పెదిమలకు అంటీ అంటనట్లు... వెలిగించి, కాస్త చోటుకోసం పక్కవాడితో బాతాఖానీ మొదలుపెట్టాను...

"ఈ ఏడు పంటలు సరిగాలేవన్నాడు పక్కవాడు" 'రోజులు ముమ్మరంగా ఉన్నయిలే' అని కొంచెం సావకాశంగా కూచున్నాను...

"ఏవండోయ్ జగ్గరాజుగారూ ఇక్కడున్నారేంటీ" అమాంతం వచ్చి నా భుజం లంకించుకుని ఇహిహీ అని నవ్వాడు. ఓరి నీ తస్సదియ్య అనుకుని "ఏవిటీ పంతులు విశేషం... కులాసా..." కుశల ప్రశ్నలు వేసిన తరువాత... నాకు నాల్గునెల్ల క్రితమే ట్రాన్సఫరు అయిందని శ్రీకాకుళంలో ఉంటున్నానని చెప్పేను. దేగల్లె అంతెత్తు ఎగిరి.. 'మాతో ఆ మాత్రం... చెప్పకూడదటండీ...' మళ్ళీ ఇహిహీ అని పిచ్చి నవ్వునవ్వాడు.

'సిగరెట్టు ముట్టించవోయ్" పెట్టె ముందర ఉంచాను.

'వద్దండీ జగ్గరాజుగారూ...'

కాల్చుమని కసిరేటప్పటికి నవ్వులో ఒకటి ముట్టించి పొగవదల్తూ...

"జగ్గరాజుగారూ దాన్ని తీసుకురాను వెళ్తున్నాను. ఉత్తరం రాసింది... వాళ్ళ నాన్నకు జబ్బు ఉందని... ఒంటరిగా రాలేనని".

"... అమ్మాయి కులాసా..."

"కులాసాగానే వుంది... పాపం ఈ మధ్య వాళ్ళ తమ్ముడికి జబ్బుగా ఉందంటే వెళ్ళి నెలైంది. తనే వుత్తరం రాసింది రమ్మనమని" ఇదిగో ఈ కమలాఫలం వలుస్తాను... ఒకటి నోట్లోవేసుకో... పులుపు లేదులే... అని అందించి ఇహ కానీయ్... అన్నాను.

"జగ్గరాజుగార్లూ... మీరు మా ఇంటికి రావాలి శలవులకు... అప్పటికి అది వస్తుంది రెండుపూటలుండి పోవాలి..."

"దానికేం లేవోయ్... ఈ పేపరు చూశావ్ గాంధీగారికి కొంచెం అస్వస్థతగా ఉందట..."

చదువుతున్న పేపరు అతని మొగానికి అడ్డుపెట్టి... మరో సిగరెట్టు వెలిగించాను.

"ఏవిటో చెప్తాననిగాదు తప్పక రావాలి... నాకు పిలవడం అంతకన్న చేతగాదు లెండి..." నా భుజం కదిపి 'ఏవండీ' అని పేపరు మళ్ళీ నాకిచ్చేశాడు.

"నీకేమన్నా ప్రమోషను వచ్చిందా రామలింగం" అంటే... 'నా జీవితంలో ప్రమోషను వచ్చింది' అన్నాడు తమాషాగా...

నా చిరునామా అడిగితే... జాగ్రఫీ మాష్టరు, శ్రీకాకుళం అంటే వస్తుందన్నాను...

రైలు ఆగింది. తను ఆ స్టేషనులోదిగి ప్లాటుఫారంమీద రైలు పోయేదాకా ఉండి డిశంబరు శలవులకు ఉత్తరం వేస్తానని చెప్పి... వస్తానండీ జగ్గరాజుగారూ... రైలు కదిలింది... ప్లాటు ఫారం వెనక్కి పోతున్నది...

నా పక్కనున్నవాడు "వేరుశనగ ధర వడిపోయిందండీ" అన్నాడు.

# 39

# చితికిన గుండెలు

సుబ్బారావు చదువుకున్న వాడన్నమాటే గాని ఇంత అనాగరీకుడని నేననుకోలేదు. శలవుపెట్టమని ఎంత పోరినా ఏమీ మాట్లాడడు. అసలు ఆ కాస్త ప్రాణం పోతే ఏం చేస్తావని అడిగితే పోయే ప్రాణాన్ని పట్టుకుంటే ఆగుతుందా అంటాడు. ఇతడి వైఖరి చూసి నాకాశ్చర్యం వేస్తున్నది.

సుబ్బారావు భార్య కమలమ్మకు టైఫాయిడ్ జ్వరం వచ్చి గిలగిల కొట్టుకుంటున్నది. ఇంటి దగ్గర విచారించే దిక్కులేదు. సుబ్బారావు ఆఫీసుకు వెళ్తే బావురుమంటూ ఒక్కతే దిగులుపడి కూర్చోవాలి. సుబ్బారావుకు ఏ మాత్రం ఆదుర్దాలేదు. అతడికి లేకపోతే పరాయివాళ్ళ కెందుకుంటుందీ? సుబ్బారావూ నేనూ బాల్య స్నేహితులం కాబట్టి ఆ అమ్మాయికి ఉన్నట్టుండి టైఫాయిడ్ వస్తే నా మనస్సు చివుక్కుమన్నది.

"ఏం రా సుబ్బారావూ డాక్టరేమన్నాడు?" అన్నాను.

"ఏమీ అన్లేదు" అన్నాడు.

అసలు సుబ్బారావు వాలకం చూస్తే డాక్టరు దగ్గరికి వెళ్ళాడా లేదా అని నా అనుమానం. వారం రోజులపాటు శలవుపెట్టి ఇంటి దగ్గర కూర్చోమని నే చెప్పిన సలహాను పెడచెవిని పెట్టాడు. మామూలుగా ఆఫీసుకు పోతూ వస్తూనే ఉన్నాడు.

నాకు విపరీతమైన కోపం వచ్చింది.

ఇంత అశ్రద్ధగా ఉంటావేం రా మూర్ఖుడా అన్నాను సుబ్బారావు నోరు పెగల్చలేదు.

ఒకనాడు సుబ్బారావు ఇంటికి వెళ్ళాను. కమలమ్మ ముసుగు పెట్టుకుని పడుకుంది. మంచంమీద. దగ్గరకు వెళ్ళి కమలమ్మా అన్నాను. నాకు మూలుగు మాత్రం వినిపించింది.

"డాక్టర్ ఏమన్నాడు?" అన్నాను.

డాక్టర్ ఇంతవరకు రాలేదన్నది.

మరి మందులేదన్నమాట అన్నాను.

ఉహూ అన్నది. టైఫాయిడ్ జ్వరం వస్తే మందు కూడా ఇప్పించకుండా బాధ పెడుతున్నాడు దౌర్భాగ్యుడు అనుకున్నాను. చిక్కిశల్యమైపోయింది. ఆ రేగిన జుత్తూ లోతుకుపోయిన కళ్ళూ పాలిపోయిన ముఖమూ చూస్తే నాకు భయమేసింది. కమలమ్మ చిన్నప్పుడు ఎంత అందంగా ఉండేది? మంచానికి అతుక్కుపోయిన కమలమ్మ మందుల్లేకుండా ఇంకా ఉంటే చచ్చిపోతుంది. నాకేమీ తోచలేదు.

సరాసరి సుబ్బారావు ఆఫీసుకు వెళ్ళాను. సుబ్బారావు తలవంచుకుని ఆఫీసులో పనిచేస్తున్నాడు. గబగబా అతడి "సీటు" దగ్గరకు వెళ్ళి ఏం కమలమ్మను చంపదల్చుకున్నావా ఏమిటి? అన్నాను. నన్ను చూసి సుబ్బారావు వణికిపోయినాడు. "ఏం మాట్లాడవేం" గట్టిగా దబాయించాను. తను రాస్తున్న కలం పాళీవైపు తప్ప అతని దృష్టి మరోచోట లేదు.

సుబ్బారావును చూస్తే నాకసహ్యం వేసింది. సరాసరి పోస్టాఫీసుకు వచ్చి కమలమ్మ నాన్నగారికి టెలిగ్రాం ఇచ్చాను.

  

ఆఫీసు ఎదురుగా ఉన్న హోటలులో సుబ్బారావు కాఫీ తాగుతున్నాడు. కమలమ్మ వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చుని "నన్ను చూస్తే ఎందుకూ మీ కంత అసహ్యం? నేను చచ్చిపోతున్నాను లెండి. మీ కోరిక నెరవేరుతుంది" అని అంటున్నది. కమలమ్మ ఈపాటికి చచ్చిపోయే ఉంటుందనుకున్నాడు సుబ్బారావు. ఆ రోజు సాయంత్రం సుబ్బారావుకు ఇంటికి పోను బుద్ధిపుట్టలేదు. సినిమా హాలులో వెళ్ళి కూర్చున్నాడు. సినిమాలో తెరమీద బొమ్మలు గజిబిజిగా ఉన్నయ్. తన పక్కనే కుర్చీలో కమలమ్మ వచ్చి కూర్చుంది. "ఏమండీ? ఇటు చూడండి... నన్ను ప్రతిరోజు హింసపెట్టే వాళ్ళు

గదా.మీరు కొట్టే దెబ్బలకు ఓర్చుకోలేక కుయ్యో మొర్రో అంటుంటే హాయిగా ఉంటుందా మీకు... చచ్చిపోతే మరీ సంతోషిస్తారనుకుంటా... మీరు చాలా గొప్పవారు.ఒకరు బాధపడుతుంటే చూసి ఆనందిస్తారు మీరు.పలుకరేం?" సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. పక్కనున్న కుర్చీవైపు చూశాడు. శానిటరీ ఇన్స్పెక్టర్ సిగరెట్టు కాలుస్తూ సినిమా చూస్తున్నాడు.

సినిమాలో మధ్యలేచివెళ్లాడు సుబ్బారావు. రోడ్డుమీద వెలుగుతున్న లైట్లను చూస్తూ నడుస్తున్నాడు. సుబ్బారావు వెనకాలే కమలమ్మ వస్తున్నది. వడి వడిగా వస్తున్నాడు సుబ్బారావు. 'ఏమండీ? ఎట్లాగో చచ్చిపోతాననే ధైర్యంతో ఉన్నారు. పాపం ఆ అమ్మవారి దయవల్ల ఈ టైఫాయిడ్ నయమై బతుకుతాననుకోండి... మీ పనేమవుతుంది? మళ్ళీ జ్వరం వస్తే బావుండునని కోరుకుంటారా...'

సుబ్బారావుకంటె, అతని మనసు వడి వడిగా పరుగులెత్తుతున్నది. సుబ్బారావు వెనకాలే కమలమ్మ మాట్లాడుతూ వస్తున్నది. "నేను చచ్చిపోయినాననే అనుకోండి. జరగబోయేదేముంది? మీరు మరో లలితమ్మకు మంగళసూత్రం కడతారు. ఆ లలితమ్మ చదువుకున్నదైనా మూర్ఖురాలు కావచ్చు. పల్లెటూరి అమ్మాయి ఐనా ఎంతో తెలివి తేటలుగలదై చురుకుగా ఉండవచ్చును. ఏదైనా మీ చేతుల్లో ఏమీలేదు. ఆ లలితమ్మకు నా అంత సహనం లేకపోవచ్చు. మీరు కొట్టే దెబ్బలకు ఓర్చుకోలేక ఆత్మహత్య చేసుకుంటే?

"ఎంత అమాయకులండీ మీరు డాక్టర్ని పిలుచుకువస్తే ఆ మందు తాగి జబ్బు ఎక్కడ నయమవుతుందోనని డాక్టరు దగ్గరకు పోవడమే మానేశారు... ఆయుర్దాయం ఉండి నా జీవితకాలం మరికొంచెం ముందుకు పోయిందనుకోండి.... మరీ బాధపడతారేమో అప్పుడు?

"నేను పుస్తకాలూ అవీ చదివి తగినంత జ్ఞానం సంపాయించలేదనీ, కేవలం శారీరక వాంఛ తప్ప నాకు మరోటి లేదని మీ అభిప్రాయం. అదే మనసులో పెట్టుకుని నన్ను "కాముకి" అన్నారు. మీరు ఎన్నో తిట్టారు. చాలా సంకుచితమైన మనసు మీది. నెహ్రూ, మార్క్సు, బెర్నార్డ్ షా పుస్తకాలు మీరు చదువుతారు. నాకు మానాన్న అమ్మా ఇంగ్లీషు చెప్పలేదు. అందుచేత అవి చదవలేను. భాగవతమూ, రామాయణము వల్లించుకున్నాను. అవంటే మీకు తలనొప్పి అసహ్యము కూడా.

"మొదట్నుండీ నేనంటే, అజ్ఞానిననీ, అనాగరికురాలననీ, కాముకిననీ, అనేక అభిప్రాయాలు కలుగచేసుకున్నారు. మిమ్మల్ని నే నర్థం చేసుకోలేకపోలేదు. వీటితోపాటు నేను బీదదాన్ని కావడంకూడా వచ్చింది. నేను బీద కుటుంబంలోంచి వచ్చానన్నంత మాత్రాన మీరు అసహ్యించుకోవాలనని లేదు. ఎన్నో సార్లు ఆక్షేపించారు మా నాన్న వంటచేసి డబ్బు సంపాయించాడని అది నీచమని. దొరల దగ్గర మీరు చేసే చాకిరీ బావుంది మీకు. మీ దృష్టిలో అది నీచం కాదేమో!

"నాకు చదువు నేర్పుతారనీ, జ్ఞానభిక్ష పెడతారనీ ఆశించాను. నా ముఖం చూస్తేనే అసహ్యించుకునేవాళ్ళు. సహించి ఊరుకోవడం నాకు పరిపాటి అయిపోయింది. ఏనాటికైనా మనసు కరుగుతుందనీ, అభిప్రాయాలు మార్చుకుంటారనీ ఆ అమ్మవారికి మొక్కుకున్నాను. నానాటికీ మీలోని కర్కశత్వము గట్టివడ్డది కాని, ఏ విధమైన మార్పూ లేదు. పైగా నేను చచ్చిపోతేనే బావుంటుందని మీ ప్రవర్తనవల్ల సూచించారు.

"నా కింకా భగవంతుడు మేలుచేస్తాడనే నా ఆరాటం. మంచిరోజులు వస్తయి అనీ. మీరు మీ మనసు మార్చుకుంటారనీ నాకింకా ఆశ ఉంది. మరి మీరో!

సుబ్బారావు ఇంకా వడి వడిగా నడుస్తున్నాడు. ఎంత సేపటికీ తన ఇల్లు రాదు. అతనికంటే అతని మనసు గుర్రంలా పరుగెట్టుకుపోతున్నది. ఒక్కసారి వెనక్కు తిరిగి చూశాడు. కమలమ్మ తనవెంట రావడంలేదు. కమలమ్మ నులకమంచంమీద టైఫాయిడ్‌తో మూలుగుతున్నది. సుబ్బారావు ఇల్లు చేరుకున్నాడు. ఇంట్లో మినుకు మినుకుమంటున్న దీపం ఆరిపోతాననంటూ వెలుగుతున్నది.

ఇంట్లోకి అడుగు పెట్టగానే, మనసు పరుగెత్తటం మానేసింది. ఎవరో ఒక వ్యక్తి కమలమ్మ దగ్గరే కూర్చున్నాడు. సుబ్బారావుని చూడగానే నాయినా సుబ్బారావూ వచ్చేవా అన్నాడాయన. మామగారికి నమస్కారాలు అన్నాడు సుబ్బారావు.
నుండి కమలమ్మకు ఆయాసం ఎక్కువైపోయింది. నా చేతుల్లో నిలవలేకపోయింది. నీవు వచ్చేముందే కళ్ళుమూసింది నాయన అని బావురుమన్నాడు మామగారు.

కమలా... ఎంత అఘాయిత్యం చేశావు. అంత పనీ చేసేవు... భూకంపం వచ్చినట్లయింది. కాళ్ళు నిలవలేదు. ఏడుస్తూ కమలమ్మ శవంమీద కొరిగాడు. కమలమ్మ్మ శవం కదిలింది! అమ్మవారి దయవల్ల కమలమ్మ బతక్కూడదూ?

# 40

# దొరల సెమిటరీ

దాని పేరు సెమిటరీ. ఎంతో ముద్దుగా ఉంది. మనమూ మృదువుగా శ్మశానం అంటాం కాని పూడ్చిపెట్టే చోటు అని అనం ఎంచేతో. వాళ్ళు సెమిటరీని అందంగా నాజూకుగా నిర్మించుకుంటారు.

చుట్టూ ప్రహారీగోడ అట్టే ఎత్తులేకపోయినా రోడ్డు మీద నడుస్తుంటే చిన్న చిన్న గోపురాలు, క్రాసులు అన్నీ కనపడ్తాయి. అన్ని క్రాసులూ ఒకేవిధంగా లేవు. కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి... కొంతమంది బాగా డబ్బున్నవాళ్ళేమో క్రాసులమీద 'జెహోవా' విగ్రహాన్ని చెక్కించారు. క్రాసుచుట్టూ చిన్న ప్రహారీగోడ గొలుసు... అందంగా అమర్చబడి ఉన్నది. దాని దగ్గరే చిన్న చిన్న చెట్లు. అంత్యక్రియలు పరిశుభ్రంగా చేసుకుని క్రాసులు అందంగా కట్టుకుంటారు. శవాన్ని దహనం చెయ్యటానికి వాళ్ళ అంతరాత్మ ఒప్పుకోలేదేమో!

పాపం ఎక్కువగా దుఃఖం... చేతనేమో... మొగం కూడా పాలిపోయింది. పక్కనే ఇద్దరు ముగ్గురు పట్టుకుని ఉన్నా తూలిపోతున్నది. స్పృహ తప్పి పడిపోతే, ఆ చిన్న కుర్రాడూ వాళ్ళూ అందరూ ముఖాన చల్లటి నీళ్ళు చల్లారు. 'ఎండిపోయిన దండవలె మరీ వంగిపోతున్నది. ఆమె కళ్ళల్లో ప్రాణం ఉంటుందో ఉండదో అని పక్కనున్న దొరసానులకు ఆదుర్దా ఎక్కువైంది. తమ్ముడు వేడి 'టీ' తీసుకువచ్చి ఇచ్చాడు... మొగుడు ఒకవైపున చచ్చి... ఏడుస్తుంటే... టీ తాగడమేమిటన్నా అనుకోరు వాళ్ళు. టీ అందిస్తే గుటకలు వేయలేక వేస్తూ నీరసంగా మింగుతున్నది. చెమటపోస్తే చేతిలో ఉన్న సంచీలోని చేరుమాలుతో అద్దటం అరంభించారు.

'జానీ! ఇహ ఈమెను అవతలకు తీసుకవెళ్దాం. సాహు ఇంకొంచెం 'టీ' తెస్తాడు. ఈవిడ ఇక్కడ ఉంటే మరీ క్రుంగిపోతున్నది' దొరసానులు వాళ్ళు అనుకుంటున్నారు.

రెండు గజాల లోతున గుంటను తవ్వారు. దొరలు కొంతమంది శవపేటికను పూలతో అలంకరించారు. శవపేటికను భూగర్భంలో ఉంచిన తరువాత దొరలందరు శాస్త్రార్థం కొంచెం మట్టిని తమతమ చేతుల్తో దానిమీద వేశారు. అందరూ తలలువంచి కొంచెం వెనక్కు వచ్చి నిల్చున్నారు.

"ఆమె చేతిమీదుగా కొంచెం మట్టిని వేయించాలి... తరువాత తీసుకపోదాం... అవతలకు" అనుకున్నారు వాళ్ళల్లో వాళ్ళు మళ్ళీ.

ఆమె నడవలేక నడవలేక పడబోతూ అటువైపైనా చూడకుండా... వేపచెట్టు వైపు చూస్తూ మట్టిని చిటికెడు తీసివేసింది. గుబురు గుబురుగా మామిడిపళ్ళు కాడలతో వంగి శవపేటికను చూస్తున్నాయి. చీమ చిటుక్కుమన్నా వినపడుతున్నది సెమిటరీలో.

అన్ని క్రాసులకన్నా అందమైనది పెద్దది కట్టించారు క్రాసు. దానిమీద, ఆ క్రాసు రెండుచేతులుంచి రండి! రండి!! అని ఆహ్వానిస్తున్నట్లున్నది... మెట్లు వరుసగా కట్టారు. అన్నిటికన్నా పై మెట్లుమీద క్రాసు... దానిచుట్టూ చిన్న ప్రహరీగోడ... గొలుసు... చాలా అందంగా అమర్చారు... మెట్లమీద బాగా కనపడేట్లుగా ఏదో చెక్కించారు.

ఆ తరువాత ఆమె (దొరసాని) రోజూ వచ్చి క్రాసు దగ్గర కొంచెం సేపు కూచుని... మెట్లమీద చెక్కించిన అక్షరాలు చదువుకుని మరల ఏడుస్తుంది... ఏవిటో తనలో తాను మాట్లాడుకుంటున్నది... ఒకరోజున ఏడ్చి ఏడ్చి అక్కడనే పడుకుంది...

మరోరోజు గేటుదగ్గర ఉండే 'హెన్' ఆమెను లోపలకు పోనివ్వలేదు. నిన్ను చూస్తే జాలివేస్తుంది... దుఃఖంతో చాలా క్రుంగిపోయినావ్ నీవు... ఆరోగ్యం పాడుచేసుకోకు. చచ్చిపోయినవాడు ఎట్లాగు రాడు ఇహ... దుఃఖం దిగమింగుకో అని చెప్పాడు. అక్కడికి వెళ్ళి ఊరికే చూసుకుని వస్తానన్నది... ఆకాశంవంక చూస్తూ దీనంగా...

సెప్టెంబరు, 1945

"అతన్ని చంపేశాం...!" నాలుగు సార్లు అనుకున్నారు నలుగురూ. భయంతోనే ఒక విధమైన సంతోషం.

"మనల్నెవరేం చేస్తారు... భయందేనికి" అన్నాడు వాళ్ళల్లో ఒకతను.

"ఆమె ఎంతగా దుఃఖపడుతున్నదో పాపం..."

"భూమి గిరగిరా తిరిగిపోతున్నట్లు... ఆ క్రాసు మనల్ని రమ్మనమని పిలుస్తున్నట్లుగా ఉంది".

"నాకు రోడ్డంతా నీలంగా కనపడుతున్నది..."

"అయినా ఒకసారి సెమిటరీలోకి వెళ్ళి చూసి వద్దాం... చంపటం న్యాయమంటావా?"

"అది చంపబోయేముందు ఆలోచించవలసిన మాట".

సెమిటరీ గేటుదాటి లోపలికి వెళ్ళి క్రాసుదగ్గర నిల్చున్నారు భయపడుతూ. ఒకరి మొగం ఒకరు చూసుకున్నారు. మెట్లమీద చెక్కి ఉన్న అక్షరాలు పదే పదే చదువుకున్నారు. ఫలానా తారీఖున.. అర్ధరాత్రి... 'దొర' హత్య గావింపబడ్డాడు. దారుణంగా... అని హత్య చేసినవారి పేర్లూ... మెట్లమీద చెక్కి ఉన్నయి.

"పశ్చాత్తాపం అక్కరలేదు..."

"పాపం ఆ దొరసానిని చూస్తే బావుండును. ఎంతగా కుమిలిపోతున్నదో..."

"అయినా మనకు మాత్రం మరణ దండన తప్పుతుందనీ నమ్మకం ఏమిటి?"

"ఆయన మనకు చేసిన హాని?"

"మనందరం కుట్రపన్ని చంపాం... మనలో భేదాభిప్రాయాలెందుకు?" వాళ్ళల్లో వాళ్ళు ఆ విధంగా తర్కించుకున్నారు.

"అధికారిని చంపితే అధికారం వస్తుందా...?" క్రాసు వాళ్ళని ఆ విధంగా అడుగుతున్నట్లనిపించింది...

వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకున్నారు. వెనక్కు తిరిగి సెమిటరీ దాటి తలలు వంచుకుని వెళ్తున్నారు.

ఆ క్రాసు... రండి... రండి... రండి... అని చేతులు చాపుతూ పిలుస్తున్నది వాళ్ళని!! (ఒక పట్టణంలో చూసిన మనసులో ఉంచుకొని).

# 41

# జీవాత్మా... పరమాత్మా...!

రైలు ప్రయాణాలు తగ్గించండి... అది అవసరమని అనుకుంటేనే ప్రయాణం చెయ్యండి... అంత అవసరమా అది...? ఈ మాటలు నన్నెవరో అడుగుతున్నట్లని పించింది.

బాగా ఆలోచించుకున్నాను. నే చేసే ప్రయాణం అవసరమైనదే... వాళ్లు చెప్పినట్లు (తేలిగ్గా ప్రయాణం చెయ్యమని) సామాను కూడా ఎక్కువ లేదు. ఒక్క హోల్డాల్ తప్ప... అది కూడా మరీ తేలిగ్గా వుంది...

రైలుపెట్టె తలుపు తీసుకుని లోపలికి పొయ్యేటప్పటికి... ఎవరో ఒకాయన ఉండి ఏమయ్యోయ్... మానెత్తిన కూచుంటావా... పద... పద.. ఇంకో పెట్లోకి... అనేటప్పటికి బాబుజీ అన్ని పెట్టెలూ అలాగే ఉన్నాయండి. నన్ను కాస్త నిల్చోనిస్తే అదే పదివేలు అన్నాను. రైలు పెట్టెలోకి చొచ్చుకుపోవడమే ప్రధానం తప్ప... లోపలికి వచ్చి ఎక్కడ కూచుందాం అన్న ఆలోచనలేదు ఎక్కే జనానికి. ఫరవాలేదు ఫుట్‌బోర్డు మీదనైనా నుంచుంటాం... అనేవాళ్ళు.. వీళ్ళు చేసే ఈ ప్రయాణాలు అవసరమా... అనవసరమా... అనిపించింది నాకు. బాబూ, కొంచెం సర్దుకుంటే ఒక్కడికి కూచోటానికి

స్థలం ఉంటుందనేటప్పటికి... ఆయన గుజరాతీలో తల్లక్రిందులు చేసేటట్లు మాట్లాడాడు. ఈ విషయాల్లో లేని కోపాలు తెప్పించుకుంటారు వ్యక్తులు... ఏమీ తోచక కొంచెంసేపు నిల్చుండేటప్పటికి నాదృష్టి పైబెర్తుమీద పడుకున్న మిలిటరీ వానిమీదికి పోయింది. అత్తవారింట్లో అల్లుడు పడుకున్నట్లు పడుకున్నాడు. ఏం నాయనా కొంచెం లేవకూడదూ... మేం కూడా కూచుంటాంగా అనేటప్పటికి.. కొట్టవచ్చినట్లు మాట్లాడాడు... ఇహ ఏమిటి చెయ్యడం... నేను ఢిల్లీ నుండి వస్తున్నాను నిద్ర లేదు...

అసలు అయినా మమ్మల్ని లేపటానికి నీకు హక్కులేదన్నాడు రైలు,తనదే అయినట్టు. దాందుంపతెగ... ఒక్కడు... ఒక్కడన్నా ఇక్కడ కూచో స్వామీ అన్న పాపాన పోలేదు కదా... రైల్లో ఎక్కేటప్పటికి ప్రతివాడికీ నాయకత్వం వస్తుంది. చివరకు ఏదో విధంగా ఒక మూల సర్దుకు కూచున్నాను. నాతో ఎక్కిన మిగతా నలుగురూ నిల్చుని ఉన్నారు.

రైలు కదిలింది ఎంతో హాయి... అనిపించింది. ఆ నలుగుర్లో కొంచెం వయసు మళ్ళిన ముసలాయన ఒకడున్నాడు. కేవలం బలహీనుడిగా కనిపిస్తూ... నిల్చోటానికి కూడా శక్తిలేకుండా ఆ ముగ్గుర్నీ ఊతం చేసుకుని నిల్చున్నాడు. రైల్లో అనేకులు అనేక విధాలుగా ముచ్చట్లు పెట్టుకుంటున్నారు. ఆయన్నెవరూ కూచోనివ్వలేదు... న-న్ను-కా-స్త-కూ-చో-ని-ద్దు-రూ పుణ్యం ఉం-టుం-ది. నా... యినా అన్నాడు గద్గద కంఠంతో. ఆంధ్రరాష్ట్రమో... అని గోలపెడితే.. ఒకప్పటికి కాకపోతే ఒకప్పుడైనా కొద్ది సంవత్సరాలకైనా... ఏమిటీ అసలు సంగతి? అని తెలుసుకుందామని కొంచెం చెవులు ఇటుమైపు పెట్టింది ప్రభుత్వం... ముసలాయన మొరను ఎవ్వరూ వినిపించుకునే వాళ్ళు లేరు.

చాలా ప్రశాంతంగా ఒడుదుడుకులు లేకుండా పోతున్నది రైలు. పెట్టెలో కొంతమంది నిద్రలో మునిగి తేలుతున్నారు. అంతా నిశ్శబ్దంగా ఉంది. నా పక్కన కూచున్న వ్యక్తి నా మీద కోపంగా ఉన్నట్టు గ్రహించాను. కారణం ఏవిటీ అంటే అతను కూర్చున్న స్థలం నేను కొంత ఆక్రమించాను. అతనివైపు చూడనన్నా లేదు... ఎదురుగ్గా ఉన్న మరాఠీ మనిషి ఉమర్ ఖయ్యామ్... పుస్తకం చదువుతూ.. నిన్న గతించిపోయింది. రేపు రాబోతున్నది. రెంటిని గురించి ఆలోచించ వద్దన్నాడు. దాంట్లో పద్యాలు చాలా మాధుర్యంగా ఉన్నాయి అన్నాడు.

ఇంతలో స్టేషను వచ్చింది. మరీ చిన్న స్టేషనవడంచేత రైలు ఆగింది కదిలింది. రైలు కదిలేటప్పటికి నిద్రపోతున్న వాళ్లల్లో ఒకరిద్దరు మేల్కొన్నారు కూడా.

నాకు కొంచెం కునుకుపట్టింది.

ఎమర్రోయ్ ముసలాయనపడ్డాడు... అన్నారెవరో. నాకు చాలా గాబరా వేసింది. రైలులోంచి కిందపడలేదు కదా అనుకున్నాను. తలుపుకూడ తెరిచి ఉంది. గొలుసు లాగుదామా అని లేచి నిల్చున్నాను. కిందపడ్డ ముసలాయన్ని పక్కనున్న ఇద్దరూ

లేవతీశారు. ఎవరూ పలుకరించినా ఏమీ మాట్లాట్టం లేదు... మూర్ఛ... పాపం నీళ్లు కొట్టండి అన్నారు కొంతమంది. పెట్టెలో నిద్రపోతున్న వారందరూ లేచారు.

ముసిలివాడాయెను... మతిపోయి... ఊగుతున్నాడన్నారు. నాకు నిజానికి జాలివేసింది. ఆయన పడబోతుంటే మనుషులెవరో పట్టుకున్నారు కాని కాస్త ఇవతలపడితే ప్రాణాలే పోయిఉండును. ఇందరూ ఇన్ని మాటలు అన్నారుగాని ఆయన ఏమీ మాట్లాడలేదు. పోనీ ఇతర్లు అంటున్న మాటలు ఆయనకు వినపడుతున్నవా అని సందేహం కలిగింది. ఇద్దరు ఘనాపాటీలు పట్టుకుని ఉన్నారు. ఇంకో మనిషి తూల్తూనే ఉన్నాడు. కాసిన్ని నీళ్ళు ముఖాన చల్లుదామంటే నీళ్ళన్నా లేవు పెట్టెలో. ఎక్కడా ఏం చెయ్యాలో ఎవ్వరికీ తోచలేదు. పోనీ పక్క స్టేషన్లో దింపేద్దామా... తనది ఏ ఊరో ఎక్కడి నుండి వస్తున్నాడో... ఎక్కడికి వెళ్తున్నాడో ఏమీ చెప్పడు.

మరో కొంతమంది నిశ్చయానికి వచ్చారు. వచ్చే స్టేషన్లో స్టేషనుమాష్టరుతో చెప్పి దింపివేద్దామని... లేకపోతే ఇక్కడే చచ్చిపోతాడు... కళ్లు తేలవేస్తున్నాడు. నిమిష నిమిషానికి భయం వేస్తున్నది. మనుషుల మీదికి తూల్తున్నాడు. అనుకుంటుండగానే స్టేషను వచ్చింది. అర్ధరాత్రప్పుడు ఇక్కడ దింపివేస్తే ఏమైపోతాడు ముసలాడు పాపం అనుకున్నారు. పార్లమెంటులో చర్చలాగ అయిపోయింది. చివరకు-

రైలు కదిలింది. ప్రతివాడికీ ముసలాయన్ను గురించిన ఆదుర్దా ఎక్కువైంది. ఒకవేళ రైలులోనే ప్రాణం పోతుందేమో అని భయపడటం మొదలు పెట్టారు కొంతమంది.

మా బెంచీమీద కూచున్నవాళ్లం నలుగురం లేచాం. చాలా ఖాళీ వచ్చింది. బాగా గాలివచ్చేటట్టు ఆ కిటికీ తెరిచి ఉంచాం... ఆ మాత్తరం ఒకరికి ఒకరం సహాయం చేసుకోకపోతే ఎట్లా! ముసలివాడి ప్రాణం కాపాడితే పుణ్యం ఉంటుంది. ఐకమత్యం ఉండక్కర్లే మనలో మనకు... మా స్వరాజ్యం సంగతి కొంచెం ఆలోచించరా బాబూ... అంటే ఆ అమెరీని అదుగో ఐక్యమత్యంలేదు అని వేలుపెట్టి చూపిస్తున్నాడు... సమయం చూసి... ఉపన్యాసధోరణిలో మాట్లాడుతున్నాడు ఒక మహానుభావుడు. ఎక్కడలేని వేదాంతాలూ వచ్చినయి... ప్రతివాడు చోటు ఇస్తానన్నవాడే...

ఇప్పటికీ ముసలాయన మాట్లాట్టం లేదు. బతుకుతాడా అన్న సంశయం కలిగింది మాకు.

కొంచెం దూరం పోయేటప్పటికి కళ్ళు తెరిచాడు.... 'ఏ-వి-టీ-నా-యు-నా....' అని ఆ వణుకుతున్న కంఠంతో ఆ మాత్రం అనగలిగాడు.

ఆ మాట వినేటప్పటికి మాకు చాలా సంతోషమేసింది. ఏమీ లేదు... మీరున్నట్టుండి పడిపోయినారు మేం లేవతీసి కూచోపెట్టాం. ఎన్నిసార్లు పిలిచినా పలుకలేదు... అని చెప్పేడొకాయన జరిగిన సంగతంతా.

ప్రతివాడూ ఆయనమీద ప్రశ్నల వర్షం కురిపించటమే.

'తాతగారూ ఎంత దాకా పోవాలి మీరు...?'

'కాస్త మంచితీర్థం ఇప్పిస్తురూ... పుణ్యం ఉంటుంది' అన్నాడాయన.

అంతకుముందు స్టేషన్లో పట్టిననీళ్ళు కొంచెం .

లేవకండి... తాతగారూ కొంచెం పరుండండి... అన్నారు.

రై-లు-చా-లా-వే-గం-గా-పో-తు-న్న-దే-నా-యి-నా- అన్నాడు ముసలాయన.

'మీరు కిందపడ్డప్పుడు మీ ప్రాణం పోతుందో ఏమో అని భయపడ్డాం అందరం కూడా' అన్నాడొకాయన.

'అందరూ కలసి చందా అన్నా వేసుకొని... అంత్యక్రియలు జరిపితే ఆ పుణ్యం మీకేఉండేదిగా' జవాబు చెప్పాడు చమత్కారంగా...

ఆత్మ-దాని లక్షణాలు.. మానవునిలో అంతర్దశలు.. గీతాసారం.. వీటిని గురించి విస్తృతవన్యాసం చెప్తున్నాడు.

ఈయన చాలా భక్తిపరాయణుడు అని అందరూ ఆయన చెప్పిందే వింటున్నారు. ఆయన ఏదో చెప్తున్నాడు. స్టేషన్లు ఒకదాని వెంట ఒకటి వస్తున్నాయి.

జీవాత్మ... పరమాత్మ... వీటిని గురించి మాట్లాడుతున్నాడు.

ఈయన ఎంత గొప్ప వేదాంతి అని ఒకరు... బాగా చదువుకున్నవాడని ఒకరు... చాలా భక్తిపరాయణుడని ఒకరూ... ఎవ్వరిష్టం వచ్చినట్లు వారు చెప్తున్నారు.

ఒక స్టేషను వచ్చింది...

ఆ తరువాత వచ్చేస్టేషనే మా ఊరు అన్నాడు ముసలాయన. దిగిపోతూ పోతూ... "నేను మొదట్లో కూచోటానికి అడిగితే కూచోనిచ్చారో... ఇట్లా పడటం మూలంగానేగా... మీరు నన్ను పడుకోనిచ్చింది... నాకు మతిభ్రమించలేదు... మూర్ఛలు అసలే లేవు" అన్నాడు...

అరె!... నేనన్నా పడకపోతినే అనిపించింది. ముసలాడు ఎంతమందిని మాయ చేశాడు... పైగా పడుకుని జీవాత్మ పరమాత్మ అని ఉపన్యాసాలు ఇస్తున్నాడు... ఒకసారి పడపోయినాడు. రెండోసారి పడ్డాడు. ప్రాణం పోతుందేమో అని భయపడి నలుగురూ లేచి చోటునిచ్చారు. మొత్తానికి అందరికీ టోకరు తినిపించాడు.

'మాయదారి ముసలాడు' అన్నారందరూ.

ఉమర్ ఖయ్యాం చదువుతున్న మరాఠీ మిత్రుడు విస్తుపోయి చూస్తున్నాడు!

# 42

# పుష్కరిణి

గోవింద బాబాయ్ చెప్తున్నాడు.

విశాలక్ష్మి వింటున్నది...

లక్ష్మి పోదామా? అన్నాడు గోవింద బాబాయ్.

తప్పకుండా పోవాలి బాబాయ్ అన్నది లక్ష్మి.

'చాలా కష్టం... టిక్కట్లు దొరికే విషయం అట్లా ఉంచి అసలు పోతే చాలా బాధలు పడాలి, అమ్మాయీ అయినా ప్రయత్నం చేద్దాం' అన్నాడు గోవిందరామశాస్త్రి.

పుష్కరానికి వెళ్తే జన్మ తరిస్తుంది బాబాయ్ అంది లక్ష్మి. తప్పకుండా వెళ్లాలి. ఈ యేడు కృష్ణమ్మతల్లి బాగా వచ్చింది అన్నది.

గోవిందరామశాస్త్రి కొంచెం సేపు నిశ్శబ్దంగా కూచున్నాడు. అయిదు నిమిషాలు ఏమీ మాట్లాడలేదు.

లక్ష్మికి కొంచెం భయంవేసింది. బాబాయ్ కొంచెంసేపు మాట్లాడకుండా ఉన్నాడంటే ఏదో విశేషం ఉంటుంది. జీవితంలో అడుగు పెట్టినప్పటి నుండీ బాబాయ్ ప్రవర్తన చూస్తూనే ఉంది.

గోవిందరామ్ బాబాయ్‌ని అడిగేంత ధైర్యం లేకపోయింది లక్ష్మికి.

విశేషం ఏమయి ఉంటుంది అని అనుకున్నది. తను మాట్లాడిన మాటలు బాబాయ్‌కి ఏమన్నా కష్టం కలిగించాయేమో అని కొంచెం కించపడ్డది లక్ష్మి.

ఏం చేద్దాం బాబాయ్... పుష్కరం విషయం. నీవు చెప్పినట్లు చేస్తాను అన్నది లక్ష్మి అమాయకంగా దీనత్వం ఉట్టిపడేటట్లు. ఈ మాటకు బాబాయ్ ఏమంటాడో అని.

గోవిందరామశాస్త్రి సన్నగా చీది... మొగం అటువైపు తిప్పి బరువుగా నిశ్వాస... చేశాడు.

లక్ష్మికి విపరీతమైన భయంపుట్టింది. గజగజ వణికిపోయింది. బాబాయ్ ఈ విధంగా ఎందుకు ఉన్నాడో గ్రహించుకోలేకపోయింది. గోవిందరామ్ బాబాయ్ ఎప్పుడు ఈ విధంగా ఉండలేదు. లక్ష్మికి ఆశ్చర్యం వేసింది. ఏ విధంగానూ నిర్ధారణకు రాలేక మెదలకుండా వెళ్ళి వంట ఇంట్లో కూచుంది. అప్పుడే బజారునుండి తెచ్చిన వంకాయలు తరగటం మొదలెట్టింది. మనసంతా బాబాయ్‌మీద ఉంది. బాబాయ్‌కి న్నట్టుండి మనసుకు కష్టం వేసింది. కారణం ఏమైవుండాలి?

ఏమీ తోచలేదు. బాబాయ్‌కి చాలా ఇష్టమైన పదార్థం... దోసకాయ ముక్కలు తరిగి పులుసు పెట్టింది. చిన్న చిన్న విషయాలకు కూడా ఖేదపడటం లక్ష్మికి అలవాటు.

గోవిందరామ్ బాబాయ్ భోజనం చేశాడు. చేసేటప్పుడు ఏమీ మాట్లాడలేదు. గోవిందరామ్ బాబాయ్ విషయం పదిహేనేళ్ళ అమాయకపు లక్ష్మి గ్రహించుకోలేక పోయింది. కనీసం ఏమయి ఉంటుందని ఊహించుకోలేకపోయింది. తనకూ తల్లీ, తండ్రీ సర్వస్వమూ బాబాయేనని మాత్రం తెలుసు. బాబాయ్‌ని చూస్తే అమిత అపేక్షగా ఉంటుంది.

చిన్నప్పుడు నాన్నా నాన్నా అని దగ్గరకు వచ్చేది. దగ్గరకు తీసుకుని కౌగిలించుకునేవాడు. అమ్మాయీ నేను కాదు మీనాన్నను, నేను బాబాయ్‌ని, అనేవాడు.

నాన్నయేడి బాబాయ్ అంటే కళ్ళనీళ్ళు పెట్టుకుని నీకు తెలియదమ్మా అనేవాడు. లక్ష్మి వూరికే ఏడవటం మొదలు పెట్టేది.

చిన్నప్పుడు బాబాయ్‌గా జ్ఞాపకం ఉన్న విషయాలన్నీ నెమరువేస్తున్నది. తనని చిన్నప్పటినుండీ అరచేతుల్లో పెట్టిపెంచాడు. గోవిందరామ్‌బాబాయ్ అటువంటి బాబాయ్ మనసుకు కష్టం కలిగింది. నేను పుష్కరానికి వెళ్దాం రమ్మంటున్నానని ఏమన్నా కష్టం కలిగిందేమో అని అనుకుంది.

వసారాలో మంచంవేసుకుని పడుకున్నాడు గోవిందరామశాస్త్రి, దగ్గరకు వచ్చి లక్ష్మి కూచుంది.

'ఏం బాబాయ్ అట్లా ఉన్నావు ఇవ్వాళ చెప్పవూ?' అంది లక్ష్మి. గోవిందబాబాయ్‌కి దగ్గు తెరవ ంది.

'మీ అమ్మ సంగతి జ్ఞాపకం వచ్చింది లక్ష్మీ' అన్నాడు.

లక్ష్మికి ఆదుర్దా ఎక్కువైంది. తన నోటి మీదుగా తల్లిని గురించిన వివరాలు అడగటానికి వెనకంజవేసేది లక్ష్మి. అడగాలని కుతూహల పడేది ఒక్కొక్కప్పుడు. చెప్తే తన నోటిమీదుగానే విందామని లక్ష్మి అనుకున్నది.

అమ్మ మాత్రం చచ్చిపోలేదనే విషయం లక్ష్మికి తెలుసు. ఆ తరువాత వివరాలేమీ తెలియవు. అమ్మ తనకగపడక దాదాపు పన్నెండేళ్లు దాటిపోయినయి.

'అమ్మ ఎక్కడుందో నాకు చెప్పవేం బాబాయ్, ఏదో ఊరు వెళ్ళిందన్నావ్, ఆ సంగతి చెప్పవూ... ఇవ్వాళ.'

'మీ అన్నయ్యకు క్షయ జబ్బు వచ్చి పోయినాడప్పుడు నీకు తెలుసుగా' అన్నాడు బాబాయ్ రుద్ధకంఠంతో.

'తెలీకేం బాబాయ్ మొన్న పండక్కి అన్నయ్యను గురించి చెప్పావుగా జ్ఞాపకం వుంది' అన్నది లక్ష్మి.

'ఆ తరువాత అమ్మకు కష్టాలు విపరీతంగా వచ్చినయి. మీ నాన్న పోయినప్పటినుండే మరీ క్రుంగి కృశించిపోయేది. మరి రెండేళ్ళకు ఆ కాస్త చెట్టూ విరిగి బావురుమని ఏడవటం మొదలు పెట్టాడు బాబాయ్.

లక్ష్మి దగ్గరగా దిగి కూర్చున్నది.

కొంచెం సేపు ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు.

మళ్ళీ మొదలుపెట్టాడు–

'అన్నం నీళ్లూ లేక ఉపోష్యాలు చేసేది అమ్మ. అమ్మను చూస్తుంటే నా కూరికే జాలివేసేది. నెత్తిన పిడుగు పడ్డట్టయింది పాపం...'

లక్ష్మి కంటతడిపెడుతోంది.

'అమ్మా ఏడవకు... మీ అమ్మ ఎంత మంచిదనుకున్నావ్...' అంటూ తన దోవతితో ఆమె కంటి నీరు తుడుస్తున్నాడు.

'ఆ తరువాత ఆవిడకి ఈ బతుకుమీదే విరక్తి కలిగింది. జపాలూ తపాలు.. కృష్ణా రామా అనుకుంటూ ఏకాకిగా ఎవ్వరితోనూ మాట్లాడకుండా కూచుండేది.

కొన్నాళ్లకు అవిధంగా మనసు మారింది. భారత భాగవతాలు చదివింది. ఎప్పుడు చూసినా దిగులుగా ఉండేది. నేను పిలిచి చెప్పేవాణ్ణి రామలక్ష్మమ్మా... అయిందేదో అయిపోయింది, ఎన్నాళ్ళు దిగులుపడి కృశింపచేసుకుంటావ్ శరీరాన్ని అని. నీకు తెలియదు గోవిందూ... ఈ కష్టాలు ఆజన్మాంతమూ ఉండేవే మనకు, అనేది.

కొన్నాళ్ళు పురాణాలు వినేది.

భగవద్గీత పారాయణం చేసింది.

మీ అమ్మను చూచినప్పుడల్లా నాకు జాలి వేసేది. పాపం... చాలా రోజులు ఏకాంతంగా కూచుండేది.

ఉన్నట్టుండి ఒకరోజున తెల్లవారి చూస్తే రామలక్ష్మమ్మ కనపడలేదు. ఆ రోజునుంచి ఈ రోజువరకూ ఆమె కనపడితే ఒట్టు... అని చెప్తున్నాడు.

'ఎక్కడికి వెళ్ళింది బాబాయ్' అంటూ కుతూహలంగా అడగటం మొదలు పెట్టింది. దిగులు చెందిన మనస్సుతో.

'నాలుగు రోజులవరకూ ఏమీ తెలిసింది కాదు.'

ఊళ్ళో ఎవరో అనుకుంటున్నారు ఆ ఊరు ఎవరో సాధువు (స్వాములవారు) వచ్చాడని, ఆయన వెళ్తో వెళ్తో ఎవరికో కొంతమందికి ఉపదేశం చేసాడనీ, తను తిరిగి వెళ్ళేటప్పుడు ఇద్దరి ముగ్గురిని తనతో తీసుకు వెళ్ళాడని చెప్పుకున్నారు. బహుశా ఏదన్నా యాత్రలకు వెళ్ళారేమో...' అని ముగించాడు.

తన అమ్మ ఇటువంటి పని ఎందుకు చేసిందా అని అనేక విధాలుగా అనుకున్నది లక్ష్మి.

'ఇంకా ఎట్లా కన్పడుతుంది మనకు, బాబాయ్ ఇప్పటికప్పుడే పన్నెండేళ్ళయిం దంటున్నావ్' పసిపిల్లలు అడిగినట్లు అడిగింది లక్ష్మి.

గోవిందరామ్ బాబాయ్ ఏమీ మాట్లాడలేదు.

లక్ష్మి తరువాత ప్రశ్నలేమీ అడగలేదు. గోవింద బాబాయ్ పడుకుంటే విసురుతూ కూచుంది లక్ష్మి.

తెల్లవారింది. తన ఇంటికి చుట్టుపక్కనున్నవాళ్ళందరూ పుష్కరానికి వెళ్ళారని తెలిసింది. తనూ వెళ్లి ఆ సంబరం చూద్దామనుకుంది. చాలా దూరభారం నుండి

కూడా వస్తారుట అది చూడటానికి అని ఎవరో చెప్పారు. అంతకుముందర రోజు సంఘటన గురించి ఆలోచించింది. ఆ విషయమై బాబాయ్‌ని అడగకూడదనుకుంది.

బాబాయ్ మామూలుగా భోజనానికి వచ్చాడు. భోజనం చేస్తుంటే లక్ష్మి ఆ విషయం అసలే హెచ్చరించలేదు.

గోవింద బాబాయ్ మజ్జిగ పోసుకుని భోజనం అంతా అయిన తరువాత లక్ష్మి అని పిలిచాడు.

వక్కపొడి తెస్తున్నాను బాబాయ్ అని ఆకులూ, సున్నం తెచ్చిపెట్టింది పళ్లెంలో.

తమలపాకులు వేసుకుంటూ-

'లక్ష్మి పుష్కరంమాట ఏం చేశావ్' అన్నాడు.

'చేసేదేముందీ వెళ్దామంటే వెళ్దాం నీ ఇష్టం'

'అమ్మాయి ఎప్పుడు పోదాం' అన్నాడు.

'నీ ఇష్టం అంది' లక్ష్మి.

గోవింద బాబాయ్ చిరునవ్వు నవ్వాడు.

గోవింద బాబాయ్ మనస్తత్వం చాలా విచిత్రంగా ఉంటుంది. ఒకప్పుడు ఒక విధంగా ఉంటాడు. ఒకప్పుడు ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతాడు. నిన్న లక్ష్మికి తల్లి విషయం జ్ఞాపకానికి వచ్చి ఆ విధంగా ఉన్నాడు. తన అమ్మను గురించి పూర్తి వివరం తెలుసుకున్నప్పటినుండీ లక్ష్మికి కష్టంగానే ఉంది. తను అన్నం తింటున్నప్పుడు అమ్మ గురించి ఆలోచించింది. అమ్మా అనిపిలిస్తే ఏం బావుంటుంది అనుకుంది అంట్లు తోముకుంటూ-

  

చాలా కష్టంమీద టిక్కట్లు సంపాయించాడు గోవిందరామశాస్త్రి. రైళ్ళు పట్టకుండా ఉన్నారు. విపరీతమైన ప్రజ. అద్యంతాలు లేకుండా ఉంది. ఈ వచ్చే జనం, ఎక్కడెక్కడ నుండి వస్తున్నారో!

ఊళ్ళో దిగిన తరువాత అన్ని వింతలూ చూపించాడు లక్ష్మికి. ఎగ్జిబిషన్‌లో స్వస్తిక్ గాజులు కొనుక్కుంది లక్ష్మి. బాబాయ్ చిరునవ్వు నవ్వి ఇంకో జత తీసుకో

తల్లీ అన్నాడు. ఎగ్జిబిషన్‌లో ఇంకా వింతవింత వస్తువుల్ని చూసింది. గోవింద బాబాయ్ నాలుగు గజాల ఖద్దరు గుడ్డ కొన్నాడు. లక్ష్మికి దాన్ని చూపిస్తూ, అమ్మాయీ చూడు, ఈ గుడ్డ ఎంత సన్నగా నేశారో. చాలా నగిషీగా ఉంది అన్నాడు బలే బావుంది బాబాయ్ అన్నది లక్ష్మి.

ఊళ్ళో అటు తిరిగి ఇటు తిరిగి రెండు గంటల తరువాత నదీ ప్రాంతంలోకి చేరుకున్నారు. జనం ఇసుకవేస్తే రాలకుండా ఉన్నారు. వస్తున్నారు, పోతున్నారు. ఉప్పొంగుతూ వస్తున్న కృష్ణ రండి రండి అని ఆహ్వానిస్తున్నది. స్నానాలు చేస్తున్నా ఇవన్నీ చూసి లక్ష్మి ఇక్కడ ఎంతో బావుంది బాబాయ్ అన్నది. లక్ష్మి కొంచెం సేపుండి స్నానం చేద్దాం అన్నాడు గోవింద బాబాయ్. కొందరు సతీసమేతంగా కొంగులు ముడివేసుకుని వచ్చి కృష్ణలో మునుగుతున్నారు. కిలకిలా నవ్వింది లక్ష్మి.

ఎవరో పుష్కరమహాత్యాన్ని గురించి మాట్లాడుతున్నారు. పుష్కరానికి గంగలో ఒకసారి స్నానం చేస్తే పుణ్యం వస్తుంది, నర్మదను చూస్తే వస్తుంది. కృష్ణను తలుచుకుంటేనే పుణ్యం వస్తుంది. అది 'కృష్ణ' మహత్యం అని ఎవరో అంటున్నారు.

హాహారవాలు ఎక్కువయినాయి. అంతా గోలగా ఉంది. కొంతమంది బ్రాహ్మణులు మంత్రాలు చదువుతున్నారు.

గోవిందరామశాస్త్రి కృష్ణలో స్నానం చేశాడు చాలాసేపు. లక్ష్మి ఒకటి రెండుసార్లు మునిగి తరువాత స్నానం చేసింది. తనకేదో పుణ్యం వచ్చినట్లు చాలా హాయిగా ఉన్నట్లు భావించుకున్నది లక్ష్మి.

ఇంక అటువైపుకి పోదాం రా లక్ష్మీ అని వెనుకకి వెళ్ళాడు. స్నానం చేసి అదంతా ఒకసారి తిరిగి వచ్చారు. ఇసుకలో నడుస్తుంటే చాలా బావుంది ఇద్దరికీ.

ఊళ్ళో కలరా ఉందని పుకారుగా ఉంది. జాగ్రత్తగా ఉండండి, చిరుతిండి ఏమీ తినబోకండీ అని ఎవరో చెప్తున్నారు. ఎవరికో? లక్ష్మికి కలరా అనేమాట వినేటప్పటికే భయం వేసింది. త్వరగా ఇంటిపోదాం బాబాయ్ అంది. అట్లాగేనమ్మా అన్నాడు.

ఇంకొంచెం దూరం వచ్చారు.

ఎవరో గుంపులు కూడి ఉన్నారు.

మధ్యలో ఒకాయన ఏదో చెప్తున్నాడు.

ఆయన కాశీనుండి వచ్చారట. మహానుభావులు... ఆయన చూడండీ ఉపదేశాలు చేస్తున్నాడు వినండీ... వినండీ... అని అన్నారెవరో గోవింద రామశాస్త్రితో.

దగ్గరకు వెళ్ళి వింటున్నాడు.

గీతలో ఆ కృష్ణపరమాత్మ ఏమన్నాడంటే... అని ఏవో కర్మను గురించి, కర్మ పరిపక్వమనీ, ఆత్మపరిశోధన అనీ చెప్తున్నాడు ఆ సాధువు. శ్రద్ధగా వింటున్నాడు గోవిందరామశాస్త్రి, పక్కనే లక్ష్మి ఉంది.

సాధువు పక్కనే ఎవరో ఇద్దరు పూర్వ సువాసినులు గీతాపారాయణం చేసుకుంటున్నారు. కళ్ళుమూస్తూ తెరుస్తూ జపమాలను తిప్పుతున్నారు.

ఒకావిడవైపు ఇంకోసారి చూశాడు గోవిందరామశాస్త్రి.

ఇంకోసారి చూశాడు!

ఇంకోసారి చూశాడు!!

లక్ష్మీ అని పిల్చాడు. ఆవిడవైపు చూడు, ఒక్కసారి చూసింది.

లక్ష్మికి ఏమీ అర్థం కాలేదు.

గోవింద బాబాయ్ ఆ మనుష్యుల్లోకి తోసుకుంటూ వచ్చి ఆవిడ దగ్గరకు... రామలక్ష్మమ్మా... అని పెద్దగా కేకపెట్టి యెన్నాళ్ళకు కనపడ్డావమ్మా నీ ఇల్లు బంగారంగానూ అన్నాడు. అందరూ విస్తుపోయి చూస్తున్నారు.

'కాశీలో వుంటున్నాను. వుమ్మరానికని బయలుదేరి వచ్చాం'.. అన్నది ముక్తసరిగా రామలక్ష్మమ్మ.

లక్ష్మి అమ్మని కౌగిలించుకుని ఏడుస్తున్నది.

# 43

# హల్లో డార్లింగ్ హల్లో!

నేననుకున్నట్లే అయింది ఉద్యోగం.

ఆ టెలిఫోన్ ముట్టుకోవడం అంటేనే నాకు కొత్తగా ఉంది. ఈ రెండు నెలలూ ట్రైనింగ్ అయిన తరువాత నా అంతట నేను టెలిఫోన్ ఆపరేటర్‌గా ఉండాలిట.

ఆ టెలిఫోన్ రిసీవరు చెవిలో పెట్టుకుంటే మహా చికాకుగా ఉంది. ప్రతివాడూ దబాయించేవాడే ఏయ్... పెషావరు ఇవ్వమంటుంటే ఎంతసేపటికీ ఇవ్వవేం. అని ఒకరు. అట్లా అరుస్తున్నప్పుడు 'ఎంగేజ్ సర్' అని అనాలట అదీ అలవాటు చేసుకున్నాను.

ఒకరోజున నాకు ట్రైనింగ్ ఇచ్చే ఆయన కాఫీ తాగను బయటకు వెళ్ళినన్నుండమన్నాడు అక్కడ. రిసీవరు చెవిదగ్గర ఉంచాను. నైజాం నుండి ఎవరో ఒకాయన ఊరికే గోలపెడుతున్నాడు ఉర్దూలో. బెంగుళూరులో ఉన్న తన జుబేదా బేగమ్‌కు కనెక్షన్ ఇవ్వమని. ఫోను నెం. 5932 అన్నాడు. అది మాత్రం గట్టిగా రెండుసార్లు చెప్పాడు. ఆ లైన్లో అంతకుముందే ఎవరో మాట్లాడుకుంటున్నారు. మా గురువు చెప్పినట్లు లైన్ ఎంగేజ్డ్ అన్నాను. మళ్ళీ అరుస్తూనే ఉన్నాడు. ఇంకో చోటునుండి మిలిటరీ ఆఫీసర్లు టోసినోళ్ళతో అరుస్తున్నారు. త్రిమల్‌ఘెరీ ఎక్స్చేంజి ఇవ్వమని. మహారాజు ఇంకోడు మాట్లాడుతున్నాడు. 'ప్రయారిటీ' ప్రకారం మిలటరీవాళ్ళకు కాల్ ముందర బుక్ చెయ్యాలి. ఆయన కాఫీకి వెళ్ళివచ్చే లోపల ఇంత గగ్గోలు జరిగింది. ఆయన రాగానే చెప్పాను చాలా హడావిడిగా ఉందండీ అని. నైజాం నుండి జుబేదా కోసం ఎవరైనా కాల్ చేశారా? అన్నాడు. అవునండీ ఎవరో పాపం ఇందాకటినుండీ మొత్తుకుంటున్నాడు. ఆయన ఇప్పటి నుండీ కాదు

సంవత్సరంబట్టీ రోజూ కాల్‌బుక్ చేస్తాడు. మాట్లాడుతాడు. మహా తమాషాగా ఉంటుంది సంభాషణ అన్నాడు.

ఒకరోజున ఇద్దరం కలిసి సంభాషణ విన్నాం. నాకు పొట్టచెక్కలయ్యేట్టు నవ్వు వచ్చింది.

ఇంకో రోజు నేనుండగానే ఎవరో 'జెర్సుగూడా'కు అడిగారు. అది ఎక్కడ ఉంటుందో ముందర తెలుసుకోటానికి కలకత్తానడిగితే కాదు ఢిల్లీ నడగమంది. ఢిల్లీ నడిగితే నేను చాలా బిజీగా ఉన్నాను పెషావరు నడగమంది. పెషావరు దాకా పోనే లేదు. అటువంటిదాన్ని ఆయన పెండింగ్‌లో ఉంచమన్నాడు.

ఒక్క నెల రోజుల్లో పని సుమారుగా తెలుసుకున్నాను.

రెండో నెలలో మొదటివారం గడవగానే నా ఆధారం చూసుకుని ఆయన సెలవు పెట్టాడు.

నేనొక్కణ్ణి స్వంతంగా నెట్టుకు పోవల్సిన రోజులు వచ్చినయి.

ఏమీ ఫర్వాలేదు మిలటరీ వాళ్ళ విషయంలో మాత్రం కొంచెం జాగ్రత్తగా ఉండాలి అని చెప్పాడు.

ఈ పనిలో నే నేర్చుకోదగ్గ ముఖ్యమైన విషయాలు ఇంకా కొన్ని చెప్పాడు.

జుబేదా సంభాషణ వింటూండు ఉషార్‌గా ఉంటుంది అన్నాడు పోతూ పోతూ.

నైట్ డ్యూటీలో ఉండమన్నారు నన్ను. చాలా ప్రశాంతంగా ఉంది అక్కడ. నిద్దరవస్తున్నది గదా అని కాస్త ఆ పెట్టెమీద నడుం వాలిస్తే ఇంతలో గంట గణ గణ మ్రోగింది. కళ్ళునులుముకుంటూ లేచి వాళ్ళడిగిందేదో తగిలించి వచ్చి కూచుండేవాణ్ణి. నిద్రాదేవత... రా... మా నాయనవుగా నన్ను ఒక్కసారి కావలించుకోవూ అన్నట్లుగా ఉండేది.... కళ్ళు మూస్తూ తెరుస్తూ వచ్చి టెలిఫోన్ కనెక్షన్స్ పెట్టేవాణ్ణి. ఇంకొక్క అరగంటలో ఆ వచ్చిన నిద్రకూడా మాయమైపోయేది. ఆ తరువాత మళ్ళీ ప్రశాంతంగా ఉండేది. రాత్రి ఒంటిగంటా రెండు గంటల మధ్య ఎవరూ పిలవరు ఫరవాలే దనుకున్నాను.

నాకు నిద్ర ఏ విధంగానూ పట్టటం లేదు, ఆ టెలిఫోన్‌ను పట్టుకుని అట్లాగే కూర్చున్నాను. దయ్యం మాదిరి అక్కడున్న మూగ జీవాలే మన స్నేహితులు అనుకోవాలి.

అటువంటి పరిస్థితుల్లో ఏం చేయాలో తోచలేదు. కంట్లో వత్తులు వేసుకుని అట్లాగే కూర్చున్నాను.

ఆరుగంటలు కొట్టారంటే నన్ను రిలీస్ చేయటానికి మరో రంగేలీ జవాన్ వస్తాడు. ఇద్దెన్నులతిని బయట పడవచ్చు. రిలీవరు వచ్చే వరకూ ఆరాటంగానే ఉంది. కూచునే కునికిపాట్లు తీయటం మొదలు పెట్టాను.

రిలీవరు వచ్చాడు. నన్ను రిలీవ్ చేశాడు. హాయిగా వుంది.

మర్రోజూ ఇదే తద్దినం–

నాకో ఉపాయం తట్టింది. మనకు దాపులో ఉన్న (అంటే వందమైళ్ళ సమీపంలో ఉన్న) ఊళ్ళల్లో టెలిఫోన్ ఆపరేటర్‌తో పరిచయం చేసుకుంటే రాత్రివూట ఏమీ తోచనప్పుడు బాతాఖానీ వేసుకు కూచోవచ్చునని.

రాత్రి వొంటి గంటకాగానే ఆ స్టేషను పిలిచాను.

"హల్లో... ఆపరేటర్ మీ పేరేమిటండీ..." అన్నాను.

నా పేరు మిస్ మణి అంటారని రిసీవర్‌లో విన్నాను.

నాకాశ్చర్యం వేసిది. ఆడవాళ్లున్నారే టెలిఫోన్ ఆపరేటర్లుగా అని.

"మీకు బాగా బుకింగ్ ఉండే సమయమా ఇది–" అని అడిగాను.

"ఏమీ పనిలేకుండా తోచక నిద్రపట్టక, ఊరికే కుర్చీలో కూర్చున్నాను. తమదేవూరు...?"

నా పేరుమార్చి... నా పేరు రామానందరావు అని చెప్పాను.

"ఏవైనా మీ వూరి విశేషాలుంటే చెప్తూండండీ నాకూ ఏమీ తోచటం లేదు ఇక్కడ. ఈ రెండుగంటల్లో కాల్సు బొత్తిగా రావు. కాలక్షేపం కోసం అంతే... " అన్నాను.

థ్యాంక్స్... అన్న మాటలు రిసీవరులోగుండా వినపడ్డాయి.

మరి కొంచెం సేపుండి పిలిచింది.

మీరూ నాకేదైనా కొత్త సంగతులు చెప్తూండాలి ఏవిధంగానూ పొద్దు పోవటం లేదు. కొంచెంసేపు మాట్లాడుకుందాం రోజూ... గుడ్‌నైట్ మిస్టర్ రావ్...

గుడ్‌నైట్ మిస్ మణీ అన్నాను.

నిజంగా మిస్ మణి నా దగ్గర నిల్చుని మాట్లాడుతున్నట్లే అనిపించింది. ఇంత సానుకూలంగా మాట్లాడుతుందని నేను అనుకోలేదు. ఎంతో పరిచయ మున్నట్లుగా స్నేహం ఉన్నట్లుగా మాట్లాడింది.

కాలేజీలో చదివేటప్పుడు ఎక్కడన్నా లేడీ స్టూడెంట్లు కన్పడితే మాట్లాడ్డానికి బిడియపడే వాణ్ణి. వాళ్ళను చూసి దూర దూరంగా పోయేవాణ్ణి. అసలు వాళ్ళమాట ఎత్తితే కడుపుమండి పోయేది. విపరీతమైన అసహ్యం వేసేది. ఒకవేళ వాళ్ళే వచ్చి ఏ విషయమైనా అడిగితే చాలా కరుకుగా సమాధానం చెప్పేవాణ్ణి. చదువుకుంటున్నప్పుడు ఆ టిమ్మార్‌మన్‌ని, ఆ మార్గరెట్‌ని, ఆ నల్లమసి బొగ్గులా ఉండే మేరీని, సుందర మాణిక్యాన్ని, శ్యామలనీ... వీళ్ళందర్నీ ఊరికే అసహ్యించుకుండే వాణ్ణి. వాళ్ళు చేసిన నేరం లేదు. నేను నాటకాల్లో బాగా ఆక్టు చేశానని (కాలేజీలో వేసినవి) నాకు కాంప్లిమెంట్సు ఇవ్వడానికి వచ్చేవాళ్ళు. ముక్తసరిగా సమాధానం చెప్పి మీ కాంప్లిమెంట్సు అందుకున్నాను చాలు. ఇహ వెళ్ళండి, అనే వాణ్ణి. వాళ్ళయందు జనించిన ఈ విధమైన ఏహ్య భావానికి కారణం ఏమీలేదు. అప్పుడూ వాళ్ళతో కులాసాగా మాట్లాడితే అందరూ స్నేహితులై పోదురు. ఈపాటికి చక్కగా ఆడవాళ్ళందరూ స్నేహంగా ఉంటే ఎంతో బావుండేది. వాళ్ళందరితో మాట్లాడుతూ ఉంటే ఎంతో కులాసాగా వెళ్ళిపోయేవి రోజులు. కొంచెంగా పరిచయం ఉన్న సుశీల ఇప్పటికీ ఉత్తరాలు రాస్తూనే ఉంది. ఆవిడకీ సమాధానం ఎప్పుడో ఒక్కసారి ఇస్తుంటాను. వాళ్ళతో పరిచయం చేసుకోపోవటంలో తప్పు నాదే.

మిస్ మణి ఎంత చనువుగా ఎంత పరిచయం ఉన్న వాళ్ళ మాదిరి మాట్లాడుతున్నదీ! నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

రాత్రి ఒంటిగంటకు మళ్ళీ రింగు చేసింది.

"మిస్ మణీ... కులాసా" అన్నాను.

గంట మ్రోగించినట్లు కబుర్లు చెప్పటం మొదలు పెట్టింది...

"సుశీలారాణి... ద్రౌపదిలో చాలా ఛండాలంగా ఉందండీ...... మాఊరు వచ్చింది... సినిమా ప్రతివాళ్ళూ తిట్టే వాళ్ళే... ఆ బాబురావు పటేల్ అటువంటి సినిమా ఎందుకండీ తీయటం" అంది.

'అంత ఛండాలంగా ఉందా?' అన్నాను.

పూర్తిగా అన్నమాట రిసీవరులోంచి వినవడ్డది.

జుబేదా బేగమ్ సంభాషణ తనూ వింటూన్నదట రోజా. అది చెప్పి కిల కిలా నవ్వటం మొదలు పెట్టింది.

మాటల సందర్భంలో—

లైను ఇన్స్పెక్టరు నారాయణరావు పరాచకాలాడబోతే కొట్టానని చెప్పింది.

హిప్ హిప్ హుర్రే అన్నాను.

మళ్ళీ ఫోను చేతపుచ్చుకుని సిమ్లా కాన్ఫరెన్సు బిట్టర్‌గా ఫెయిల్ అయిపోయింది అన్నాను.

'దానికి కారకుడు మిస్టర్ జిన్నా – వాటి విషయం అట్లా వుంచండి కానీ... మీ వూరి విషయాలూ ఏవీ చెప్పరేం?'

"ఈ వూళ్ళో కలరా విపరీతంగా ఉంది. చాలామంది చచ్చిపోతున్నారు. నేను కూడా ఇనాకులేషన్ చేయించుకున్నాను. చెయ్యి చాలా బాధగా ఉంది. కాపుకాచినా తగ్గలేదు. కాంగ్రెసుకు మౌలానా ఆజాద్ ప్రెసిడెంటుగా ఉండటం మనం అందరం గర్వించదగ్గ విషయం" అన్నాను.

"ఇక్కడ వానలు చాలా విపరీతంగా కురుస్తున్నాయి మిస్టర్ రావ్... ఏం... మాట్లాడ్డం మానేశారు... నిద్రవస్తోందా... ఒక సిగరెట్టు వెలిగించండి" అన్నది.

మొదటి రెండు రోజుల్లో జరిగిన సంభాషణ మాలో స్నేహభావాన్ని కలుగజేసింది. తోచనప్పుడల్లా మిస్ మణికి రింగ్ చేసేవాణ్ణి.

ఒకరోజు ఫోన్‌లో అరగంట సేపు కబుర్లు చెప్పింది. తన తండ్రి 'డెహరాడూన్'లో మిలటరీ ఆఫీసరుగా ఉన్నాడని, తనిక్కడ రెండేళ్ల బట్టి ఉద్యోగం చేస్తూన్నాననీ, ఏవేవో చెప్పింది.

పలుకరిస్తేనే చాలు. చలాకీగా అరగంటసేపు కబుర్లు చెప్తుంది.

నేను చెప్పాను—

"నేనూ కొత్త ఈ ఊరికి. స్నేహితులెవ్వరూ లేరని బెంగగా ఉంది. ఆ బెంగను నీవు తీర్చగలిగావు. నేను చాలా అదృష్టవంతుణ్ణి" అని.

ఆప్సో అని మూటిసిపోయింది మిస్ మణి.

సోమవారం నాడు మిస్ మణి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. ఆ రాత్రే ఒంటిగంటకు ఫోన్లో చెప్పాను. "నీవు రాసిన ఆరు పేజీల ఉత్తరం చేరింది. నన్ను ఒకసారి చూడాలని ఉందని రాశావు. చాలా సంతోషం.నేనే శలవుపెట్టి త్వరలోనే నీ దగ్గరకు రావటానికి ప్రయత్నం చేస్తాను. కబుర్లు చెప్పటం మానేశావేం ఈ మధ్య" అని.

'కబుర్లకేం మొదలుపెడితే అంతం ఉండదు' అన్నది.

మిస్ మణిని ఒక రోజు సూర్యకుమారి పాటలను గురించి అడిగాను.

'సూర్యకుమారి ఏం పాట పాడుతుంది? ఆవిడకంటె నేను బాగా పాడతాను వింటారా..' టెలిఫోన్‌లోనే రాగాలు తీయటం మొదలుపెట్టింది. రిసీవరు చెవులో వుంచి అంట్లాగే వింటున్నాను. చాలా బాగుంది. అమితానంద పడ్డాను.

మిస్ మణి మీద ఒకందుకు కోపం వచ్చింది. ఇంత సంగీతం వచ్చి, ఇంత చదువూ చదువుకుని ఈ టెలిఫోన్ ఆపరేటర్‌గా ఎందుకు వచ్చిందని. ఆ విషయమే అడిగాను. బియ్యే ప్యాసయి మీరెందుకు చేరారు దీంట్లో అని అడిగింది. నేను నోరెత్తలేక పోయినాను.

సరిగ్గా నేను నైట్ డ్యూటీలో ఉన్నప్పుడే ఆవిడా ఉండేది. అర్నెల్లుగా ఒకరి కొకరం మాట్లాడుకున్నాం. మిస్ మణి నాతో మాట్లాడకుండా ఉన్న విషయం లేదు. ఒకరికొకరం అంతర్యం అన్నట్లు, తన 'పర్సనల్' విషయాలు కూడా నాతో చెప్పేది. ప్రతి విషయంలోనూ నన్ను సలహా అడిగేది.

ఒకరోజు నే రాసిన ప్రకారం రిజిస్టరులో తన ఫోటో పంపించింది; నాది స్వీకరించిన తరువాత. మిస్ మణి ఫోటో చూసిన తరువాత నేను అసూయపడ్డాను. ఆ కళ కళలాడుతూ ప్రతివాణ్ణీ ఆకర్షించే ముఖం, కమ్మటి సంగీతం ఏ సినిమాలో చేరినా ఆవిడకి వేలు సంపాయించి పెట్టేవి. ఆ భవిష్యత్తంతా పాడుచేసుకుని... గొంతు చంపుకుపోతూ వెధవ టెలిఫోన్ ఆపరేటరుగా వచ్చింది.

మిస్ మణి ఫోటో నా రూమ్‌లో, నా మేనకోడలు రాజ్యలక్ష్మి ఫోటో పక్కనే ఉంచాను. ఇద్దరూ నా వైపు చూసి నవ్వుతూన్నట్లు... బియ్యే ప్యాసయి ఈ ఉద్యోగానికి

ఎందుకు వచ్చానని ఆమె అడుగుతున్నట్టు... 'ఫీ'లయినాను. ఏడుపు వచ్చింది నాకు ఆ పరిస్థితుల్లో ఏం చేయాలి?

ఈ విషయం అంతా మిస్ మణికి ఫోన్‌లో చెప్పాను. దిగులుపడటం ధీరుల లక్షణం కాదన్నది.

మిస్ మణి విషయం తలుచుకున్నప్పుడల్లా నాకు జాలి వేసేది. తల్లిదండ్రులనీ వదిలిపెట్టి ఒకర్తే వచ్చి ఎట్లా ఉంటున్నదా అని. ఆవిడ విషయం తలుచుకున్నప్పుడు నా పక్కనే కూర్చుని మాట్లాడుతున్నట్టుండేది.

బుధవారం రాత్రి బండికి సరాసరి ఆఫీసుకు వచ్చింది. నే నెవర్తికో ఫతేపూర్ కనెక్షన్ ఇస్తున్నాను. వస్తూనే హాల్లో మిస్టర్ రావ్ అన్నది. టాంగా మాట్లాడి అక్కడ ఉండే సర్వెంటుకు రూము తాళంచేతులు ఇచ్చి మిస్ మణికి రూము చూపించమని చెప్పాను. నేను మిస్ మణితో మాట్లాడేందుకు వ్యవధిలేదు. ఆరుగంటలయిన తరువాత మాట్లాడాల్సిందే. గడియారంవైపే చూస్తూ కూచున్నాను. కొంచెంసేపు నిద్రపోయినాను. ఎప్పుడెప్పుడు ఆరవుతుందా... ఎప్పుడు మిస్ మణితో మాట్లాడదామా అని ఉంది.

నే చేసిన భగవన్నామస్మరణకు దేవతలు మెచ్చి ఆరు గంటలు కొట్టించారు. రిలీవరురాగానే గబగబా రూము వైపు బయలుదేరాను.

మిస్ మణి గుర్రుపెట్టి నిద్రపోతున్నది.

దగ్గరకు వెళ్ళి కూర్చున్నాను. అమాయకంగా కళ్ళు మూసుకుని నిద్రపోతున్నది. ఆ మసక వెలుతురులో ఆవిడ కనురెప్పలు మాత్రం కనిపిస్తున్నయి. ఆవిడ్ని మాత్రం నిద్ర లేపలేదు.

నేను చడీచప్పుడు కాకుండా స్నానం చేసి హోటలు వెళ్ళి ఇడ్లీలు, ఫ్లాస్కులో కాఫీ పోయించి తీసుకవచ్చి ఎదురుగా పెట్టాను.

పక్కనే కూజా, గాజుగ్లాసు... మైసూర్ శాండల్ సోపు కేసులో, ంది. ఎదురుగా స్టాండుకున్న టర్కిష్ టవలు కూడా పెట్టాను.

బాగా ఏడుగంటలయిపోయింది. నాకు మిస్ మణిని లేపను బుద్ధి పుట్టటం లేదు.

అట్లా అని ఊరుకుంటే ఇంకా నిద్రపోతున్నది తెచ్చిన ఇడ్లీలు చల్లారి పోతున్నవి

'మిస్ మణీ!' అని ఒకసారి పెద్దగా పిల్చాను.

'హల్లో మిస్టర్ రావ్! అంటూ లేచి కూచుంది.

'ఇక్కడ కూడా టెలిఫోన్ భాషా!' అన్నాను. కిలకిలా నవ్వింది.

ఎదురుగా అమర్చినవన్నీ చూసి...

'మీకు చాలా శ్రమ ఇచ్చా'నంది సిగ్గుపడుతూ.

మొగం కడుక్కుని ఫలహారానికి ఇడ్లీ ముందు కూర్చుంది. నాలుగు ఇడ్లీలు కాజేసిన తరువాత కాఫీ తాగింది.

మీ ఊళ్ళో కాఫీ చాలా బావుంటుందని కాంప్లిమెంటు ఇచ్చింది.

మీ రూమ్ చాలా ముచ్చటగా ఉన్నదన్నది.

ఆ రోజు హోటల్నించి క్యారియరు తెప్పించి ఇద్దరమూ కలిసి రూములోనే భోజనం చేశాం.

నా దగ్గర ఏవేం పుస్తకాలున్నాయని చూసింది.

తీయగానే నెహ్రూ ఆటోబయాగ్రఫీ కన్పడ్డది.

ఈ పుస్తకం అంటే నాకు చాలా ఇష్టం అంది.

ఆ మధ్యాహ్నం చాలా విషయాల్ని గురించి చర్చించాం.

ఏదో విషయం చెప్పాల్సని అరగంటనుండీ తికమక పడుతున్నది. చెప్పటానికి సందేహిస్తున్నది. రాయబారాల్ని తీసుకువచ్చి తీసుకవెళ్ళేందుకు హంసలు లేవు.

గోడకు తగిలించిన తన ఫోటో పక్క ఫోటోవైపు చూసింది. దగ్గరకు తీసింది. ఆవిడ నా మేనకోడలు పేరు రాజ్యలక్ష్మి అని చెప్పాను. మళ్ళీ ఆ ఫోటో గోడకు తగిలించింది.

ఆ సాయంత్రం బండికే మిస్ మణి ఊరికి వెళ్ళింది. ఊరికి వెళ్ళినంతసేపూ నన్ను గురించి మెచ్చుకుంటూనే ఉంది నే చేసిన మర్యాదకి.

టెలిఫోన్లో అంత ఎక్కువగా కబుర్లు చెప్పటం మానేసింది. రెండు రోజులయిన తరువాత ఒక ఉత్తరం వచ్చింది. నా దగ్గరకు వచ్చినప్పుడు ఏదో మాట్లాడాలని తికమక పడ్డ విషయం... ఉత్తరంలో స్వర్ణాక్షరాలతో నాముందరుంచింది. నన్ను

మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానని... తనని పెళ్ళి చేసుకోమని వినయవిధేయతలతో రాసింది. నేను ఉత్తరం చదువుతుంటే రాజ్యలక్ష్మి ఫోటోలోంచి తొంగి చూస్తున్నది. మామయ్యా... చిన్నప్పటి నుండీ (అంటే బొమ్మల పెళ్ళిళ్ళకే) నిన్ను నమ్ముకుని ఉన్నాను. నీవు వాగ్దానం కూడా చేశావ్... నన్ను మరచిపోతావా మావయ్యా... దీనంగా నావైపు చూస్తూ అడుగుతున్నట్లనిపించింది. మిస్ మణి ఉత్తరంమీద ఉత్తరం రాసి వేధించుకుతింటుంది. మిస్ మణిని నిరాకరిస్తే... చదువుకున్నది. నే నొక్క ఫూల్‌నని నిందిస్తుంది... ఆవిడ బాధకు తట్టుకోలేం? అయినా మిస్ మణి పక్కన ఉంటేనే చాలు పొద్దుబోతుంది. చాలా చలాకీ మనిషి.

ఈ పరిస్థితుల్లో ఏం చేయాలో మిస్ మణినే అడిగాను.

బహుభార్యత్వం తరుణోపాయం – వేదవాక్కులా నవ్వుతూ చెప్పింది.

ఇంత ఉన్నత భావాలు మిస్ మణికి ఉన్నాయని అనుకోనే లేదు.

హాట్స్ ఆఫ్... టెలిఫోన్ ఆపరేటర్ మిస్ మణి... మిస్ మణి ఉద్యోగం మానేసింది.

మిసెస్ రావ్ అయింది. నా మేనకోడలూ, నా రాజ్యలక్ష్మి... నా భార్య.

లోకం కళ్ళు మూసేస్తామా... అంది లక్ష్మి... కాదు కళ్ళు తెరుచుకుని చూస్తూ ఉంటారు అన్నది మణి.

# 44

# హిమగిరి

కంపౌండరు తులసీరామ్ మందుసీసా అందిస్తూ ఆవిడ ముఖంవైపు చూశాడు. తులసీరామ్‌కు ఏడుపు వచ్చింది. తలవంచుకుని హాలులోకి వచ్చి కుర్చీలో కూర్చుండి పోయినాడు. అమ్మాయి మందు సీసా తీసుకుని వెళ్ళిపోయింది. కాస్సేపు కుర్చీలో కూర్చుండి లేచి గుమ్మందగ్గరకు పోయి సుబ్బినీ చూస్తున్నాడు. ఆ అమ్మాయి మందుసీసా తీసుకుని నడచి పోతూ ఉంది. చూస్తూ నిలుచున్నాడు. ఆ వీధి మలుపు తిరిగి వెళ్ళిపోయింది ఆ అమ్మాయి.

తులసీరామ్ ప్రతిరోజూ తన చేతుల్తో ఎంతమందికో మందులిచ్చేవాడు. వ్యవధిగూడ ఉండేది కాదు. అట్లాగే గడచి పోతున్నాయి రోజులు. మందుసీసాలు తప్ప మనుమల్ని అసలే చూడని తుల్సీరామ్ ఆ అమ్మాయిని చూశాడు. "నే నెందుకు చూశాను?" అని తనని తాను ప్రశ్నించుకున్నాడు.

ఆ చిన్న గదిలో వుండే బల్ల, దానిమీద వరుసలలో అమర్చబడిన మందు సీసాలు. బల్లనిండా రంగురంగుల మందులు పడిన గుర్తులలో (రోగులతోపాటూ ఆ బల్లకూడా మందులు తాగింది) ఒకమూల నీళ్ళజాడీ, ఒకవైపు సగం అద్దాలు లేని చెక్క బీరువా, గోడకు ఒకవైపు తారీకులు చిరిగిపోయిన మందుల కంపెనీ క్యాలెండరు. ఇది అతని ఆస్పత్రి. ఎప్పుడూ ఒకవైపే చూస్తూ ఒక పెద్ద [illegible] నిల్చుని ఉంటుంది

తులసీరామ్ ఊగులాడుతున్న ముసలిప్రాణం. ముప్పై ఏ వత్సరాలు కంపౌండరుగా డాక్టర్ల దగ్గర పనిచేసి, చివరకు మానుకుని విడిగా తన ఇంట్లోనే ఆ గదిలో ఆ నాలుగు మందుసీసాలూ పెట్టుకొని వచ్చిన వాళ్ళకు మందులిస్తూ కాలక్షేపం చేస్తున్నాడు.

పెద్ద పెద్ద డిగ్రీలున్న డాక్టరు కాకపోయినా తులసీరామ్ తనకున్న వైద్యానుభవం చేత ఎవరు వచ్చినా ఏ వ్యాధి అయినా త్వరలో కనుక్కుని సరియైన మందు ఇవ్వటం అలవాటయిపోయింది. అతనిచేతి చలవన ప్రతివాళ్లకు నయమైపోతూనే ఉన్నై.

ఒక్క విషయంలో అతడు పిరికివాడు. అతడికి డబ్బు అడగడమంటే భయం. ఎంత తీవ్రమయిన వ్యాధి అయినా ఎవరు ఇంటికి వచ్చి పెళ్ళినా చూడటానికి ఎంత ఓపికతో బయలుదేరుతాడు. వ్యాధి నయం చేయటానికి శాయశక్తులా ప్రయత్నిస్తాడు. తన దగ్గర తనకు అందుబాటులో ఉన్న పుస్తకాలు చదువుతాడు. వాటిని గురించి పది పదకొండు సంవత్సరాలు వయసువున్న పిల్లలందరూ తులసీరామ్ దగ్గరకు వస్తారు. వాళ్లకు తియ్యటి మందు ఇచ్చి పంపిస్తాడు. తులసీరామ్ బలే మంచివాడు అని అంటుంటారు వాళ్ళు. వాళ్లను దగ్గరకు తీస్తాడు. తన మందువల్ల వ్యాధి కుదిరిన పిల్లలంటే అతనికి మరీ మక్కువ. నయమయిన తరువాత కూడా ప్రతిరోజూ వెళ్ళి చూస్తుండేవారు. తులసీరామ్ ఆపరేషన్ మాత్రం చేయనని అనుకున్నాడు, ఆ నిశ్చయాని కిదివరకే వచ్చాడు.

ఇప్పటికీ అతన్ని అందరూ కంపౌండరు తులసీరామ్ అనే అంటుంటారు. తను అడిగినా అడగకపోయినా తన కుటుంబానికి సరిపడే డబ్బువస్తూనే ఉంది. ఎవరో ఒకరు డబ్బు ఇచ్చిపోతూనే ఉంటారు. తుల్సీరామ్‌కు ఎక్కువ 'డబ్బు' వ్యామోహం లేకపోవటంవల్ల వచ్చిన దానితోనే తృప్తిపడి రోజులు గడుపుతున్నాడు. రోజులు గడుస్తున్న కొద్దీ తను ముసలివాడవుతున్నాడు. కాని అన్ని సంవత్సరాలనుండీ ఆ ఔన్సు గ్లాసు ఆ విధంగానే అతని కళ్లల్లోకి తొంగిచూస్తూ ఉంటుంది. ఆ ఔన్సు గ్లాసుతో ఎన్ని వందలమందికి మందులు పోశాడో! ఎన్ని వ్యాధులు నయం చేశాడో! ఆ గ్లాసు కూడా వయసువచ్చి దానిమీద గీసిన గీతల్ని జీర్ణం చేసుకుంది. గీతలు కన్పట్టం లేదు. అయినా తనకున్న గుర్తులతోటే మందు ఇస్తూ వుంటాడు.

తులసీరామ్ భార్య, అదర్శప్రాయమైనది తులసీరామ్ ఈ పరిస్థితికి రాగలిగాడంటే దానికంతటికీ తులసీరామ్ భార్యే బాధ్యురాలు అని అనక తప్పదు. ఆవిడకీ వైద్యంలో కొంత ప్రావీణ్యత అబ్బింది. ఎప్పుడన్నా తులసీరామ్ ఇంట్లో లేనప్పుడు మందుసీసాల్లో మందులు కలిపి ఇస్తుంది వచ్చినవాళ్ళకు. కడుపులో నొప్పి, తలకాయ నొప్పిలాంటి చిన్న చిన్న వాటికి మందు ఇవ్వటం బాగా తెలును. నిజానికి ఆవిడకి ఉన్న ఓర్పు తులసీరామ్ కూడా లేదనే చెప్పాలి. తులసీరామ్ భార్యకు మత గ్రంథాలంటే ఎక్కువ

ఇష్టం. ఎప్పుడూ అవి చదువుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతుంది. వేదాంతం భర్తకు బోధించదు కాని తను చదివి ఆనందిస్తుంది.

తులసీరామ్‌ను గురించే మనం ఆలోచిస్తే అతని భార్యకు అంత ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వలేం. అటువంటి మనస్తత్వంగల తు రామ్‌కు భగవంతుడు తగిన భార్యను ప్రసాదించాడు అని అనాలి.

తులసీరామ్‌కు బిడ్డలు కలుగకపోవడం భగవంతుడి క్రూరత్వాన్ని నిర్ణయిస్తుంది. కాని ఆ దంపతులెప్పుడూ ఆ విషయం ఆలోచించరు; అనుకోరు.

తనకున్న ఆ కాస్త విద్యతో ఎంతమందికో సహాయం చేయాలనీ, తన వల్ల మరొకరికి ఉపయోగం ఉందని నమ్మి తులసీరామ్ రోజులు గడిపేస్తున్నాడు. అందుకనే చావు అంటే అతనికి విపరీతమైన భయం. త్వరలో చావటం నాకిష్టం లేదంటాడు. నేనెంతమందికో వుపయోగపడాలి, అప్పుడే చచ్చిపోతే ఎలాగు అనుకుంటాడు.

ఈ పెద్దతనంలో ఆలోచనల్తో బుర్ర చెడగొట్టుకోకండి అని అంటూనే ఉంటుంది భార్య. కాని పోషణకు, నా మందులకే చాలేది కాదు. ఇక రచనా సామగ్రి ఎలా కొనగలను? తుదకు ఇది గ్రహించి తన పరికరాల్నే నా కిచ్చి నా చేత కొన్ని బొమ్మలు రాయించాడు. ఆ చిత్రాల్ని తన బొమ్మలతో పాటు ప్రదర్శనలకు పంపి కొంత డబ్బు చేకూర్చిపెట్టి, తన వద్దనే ఉంచుతుని, నాకు కావలసిన పరికరాల ఖర్చులకొరకు వెచ్చిస్తూ ఉండేవాడు. నిజంగా, ఏనాడో నా చేతినుండి జారిపోయిన కుంచెను తిరిగి నాకు ఇచ్చినాడు నా మిత్రుడు రామారావు.

చామకూర సత్యనారాయణగారు కూడా రామారావు దగ్గరకు విద్యాభ్యాసానికి వచ్చిన కొత్త రచనా పరికరాలకు తదితరములకు చాలా కటకటపడుతూండే వారు. ఈయనే చేతగూడా కొన్ని రాయించి తన మిత్రుడైన ఆర్ట్సు కాలేజ ప్రిన్సిపాలు దర్శనుగారిచేత కొనిపించి, కొంత డబ్బు చేకూర్చి పెట్టాడు. ఈయన చిత్రాల్ని గూడా ప్రదర్శనలకి పంపుతూ, విద్యావ్యాసంగానికి ఇతర ఖర్చులకు ఏ లోటూ లేకుండా చేసి, సత్యనారాయణగారు నేడీ స్థితికి రాగల అవకాశం కల్పించాడు.

ఒక యువకుడు, చిత్రకారుడైన తన అన్నను తనకు చిత్రరచన నేర్పమని కోరగా, చిత్రకళ అందరికీ లభ్యమయ్యే కళ కాదనీ మరింకో వృత్తి చూసుకోమనీ

తమ్ముణ్ణి నిరుత్సాహపరిచాడు. అతడు రామారావు పాలబడ్డాడు. రామారావు ఉదారహృదయంతో అతనికి ఆశ్రయమిచ్చి, కళను ప్రసాదించాడు. ఈలాగు తన్నాశ్రయించిన వారి కెందరికో ఎన్నో సహాయాలు చేసి, కళారాధనకు అవకాశమిచ్చాడు రామారావు.

కొందరు చిత్రకారులు తమతమ శిష్యులనుంచి వేతనములు గ్రహించడమే కాకుండా, ఎప్పుడైనా ఏ శిష్యునిదైనా ఒక చిత్రం అమ్ముడుపోతే అందులో సగము రుసుము తీసుకునేవారు.

రామారావు విశాల హృదయుడు. ఆంధ్ర కళాభ్యుదయానికి చాలా పాటుపడినాడు. పెక్కు ఆంధ్రయువకులలో కళాబీజాలు నాటినాడు. ఇట్టి ఉదార హృదయుణ్ణి కళాజీవిని పిన్నవయసుననే తన పొట్టన పెట్టుకున్నది కాలము! అయితే, అతని భౌతిక శరీరాన్నే తీసికొనిపోగలిగింది కాని, అతను ఆత్మను కళను ముట్ట సాహసించలేకపోయింది. ఎప్పుడు ఏదో ఆలోచిస్తున్నట్టు ఉంటాడు. ఆ ఆలోచన అంతులేనిది. ఆ భగవంతుడికే తెలియాలి.

మర్నాడు మళ్ళీ ఆ అమ్మాయి వచ్చింది మందుసీసా తీసుకొని.

మందుసీసా కంపౌండరు తులసీరామ్ చేతికి అందిచ్చింది. మందుసీసా తీసుకుంటూ అమ్మాయి కళ్లను పలుకరించాడు. "ఎలా ఉందమ్మా కడుపు నొప్పి ఇంకా వస్తూనే ఉందా మీ అన్నయ్యకు?" అన్నాడు.

"కొంచెం నింపాదిగా ఉన్నది"

పాపం... నీవే వస్తున్నావే ప్రతీరోజూ! మీ ఇంట్లో పిల్లలెవరూ లేరూ... నీవు రాకూడదమ్మా ఈడు వచ్చిన పిల్లవు" అన్నాడు తులసీరామ్.

ఆ అమ్మాయిని చూసినప్పుడల్లా... ఆ అమ్మాయితో మాట్లాడినప్పుడల్లా ఎవరో జ్ఞాపకానికి వచ్చి తన హృదయాన్ని కెలికినట్లుగా బాధపడతాడు.

"నీకు పెళ్ళి అయిందా అమ్మాయీ...?"

దానికావిడ జవాబు చెప్పలేదు.

"ఈడు వచ్చిన పిల్లవు రాకూడదమ్మా నీకింకా తెలియదు" అని మళ్ళీ అందుకున్నాడు.

తనను గురించి ఇంత ప్రత్యేకత తీసుకుని ఎందుకు మాట్లాడుతున్నాడో తెలియలేదు ఆ అమ్మాయికి. కంపౌండరు తులసీరామ్ గదిలోపలకు వచ్చి, మందుసీసా కడిగి, ఔన్సు గ్లాసులో పెద్దసీసాలోంచి మందు పోశాడు. అతనికి ముచ్చెమటలు పోసినయి, భయపడ్డట్టుగా ఉన్నాయి అతని ముఖకవళికలు. పెద్దసీసాలోంచి ఔన్సు గ్లాసులో మందు పోసేటప్పుడే అతని చేతులు వణికినై. వణుకుతూనే ఉన్నాయి. ఆ అమ్మాయి గుమ్మంలో నిల్చుని మందుసీసాలవైపు పరకాయించి చూస్తున్నది. ఔన్సు గ్లాసులోంచి మందుసీసాలో పోస్తూ ఆ అమ్మాయివైపు చూశాడు. అతని చేతులు మరీ వణికినై. ఔన్సు గ్లాసు కూడా అమ్మాయి వైపే చూస్తూ – చేతిలోంచి క్రిందికి వొరిగింది.

ఔన్సుగ్లాసు నా జీవితం ఇంతటితో సరి అన్నది. ఆ అమ్మాయి విస్తుపోయి చూస్తున్నది. ఔన్సుగ్లాసు పగిలింది. ముక్కలైంది.

కంపౌడరు తుల్సీరామ్ అక్కడ ఓ క్షణం నిలవలేకపోయినాడు. నిలవలేదు. గబగబా లోపలికివచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఔన్సుగ్లాసు పగిలిందమ్మా... ఈ వేళకు మందులేదు... వెళ్లమ్మా" అని అనగలిగాడు. ఈ విధంగా ఎందుకు మాట్లాడుతున్నాడో అమ్మాయికి ఏమీ అర్థం కాలేదు. తులసీరామ్ తన కన్నీటిని ఆపుకోలేకపోయినాడు. అమ్మాయి తనను ఎవరో హింసించినట్లుగా బాధపడ్డది. అడుగులు తడబడుతూ వెళ్తున్నది. ప్రతిరోజూ చేతిలో మందుసీసా తీసుకుని వెళ్లేది. ఈ రోజు వట్టిచేతుల్తో పోతున్నది.

దారిలో ఆ అమ్మాయి మనసు ఆలోచనల్లో పడింది. ఎందుకిలా చేశాడు కంపౌడరు తులసీరామ్ ఆయన తనను గురించి ప్రత్యేకంగా తనకు ఎందుకు చెప్పాడు. దీనికి కారణం ఏమయి ఉంటుంది. పూర్వసంఘటనలు ఏమన్నా జ్ఞాపకం వచ్చినయ్యేమో! అయినా అంతతీవ్రంగా ఆలోచించవలసిన విషయమేముంది – అమ్మాయి మనసు పరిపరివిధాల బోతున్నది, నడుస్తూనే ఉంది.

అప్రయత్నంగా అన్నది.

ఔన్సుగ్లాసు పగిలిపోయింది...

కాస్సేపువుండి ఇదేవిటి నాలో నేను మాట్లాడుకుంటున్నాను. అని గ్రహించుకుని... ఇంకొంచెం వడిగా వెళ్ళటం ప్రారంభించింది.

  

వివేకానందుని జీవిత చరిత్ర, ఉపన్యాసాలూ చదువుతున్న తులసీరామ్ భార్య పుస్తకం కట్టిపెట్టి తులసీరామ్ దగ్గరకు వచ్చి నిల్చున్నది.

'పేపరులో సంగతులు చూశావా ఈరోజు' అన్నాడు

'చూశాను మరేం విశేషాలు లేవు. శాస్త్రజ్ఞులు ఊపిరితిత్తులు తయారు చేయడం ఆరంభించారట'.

'ఏమో ఎవరు చెప్పగలరు. చచ్చినవాళ్ళను బతికించే ఔషధాలు కనిపెడతారేమో. డాక్టర్లు ఎంతకైనా సమర్థులు'.

'పోయే ప్రాణాన్ని పట్టుకోలేరు కదా ఎవరైనా? ప్రాణానికి బరువు కనుక్కుంటామని ప్రయత్నం చేసి, విఫలులు అయినట్లు వివేకానంద రాశాడు శాస్త్రజ్ఞులను గురించి" అంటూ వేదాంతంలోని కొంత భాగం చెప్పటం మొదలు పెట్టింది ఆవిడ.

'నిన్ను ఎందుకు పిల్చాను... మాట్లాడుదామనుకున్నాను దగ్గరకు వచ్చేటప్పటికి మరచిపోయినాను... వయసు వచ్చేకొద్దీ నాకు మతిపోతున్నది...'

నిన్న మందుకు వచ్చిన అమ్మాయి ఈరోజు రాలేదేమండీ అని అన్నది ఆవిడ.

'ఈడు వచ్చిన పిల్లవు రాకూడదమ్మా వంటరిగా బయటికి అని అన్నాను. పాపం అది మనసులో పెట్టుకుని రాలేదేమో, వాళ్ళ అన్నయ్యకు జ్వరం ఎట్లావుందో'.

ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధలేనట్లు మళ్లీ తన పుస్తకం చదువుకోడానికి ఆరంభించింది.

'గీతలు అరిగిన ఔన్సుగ్లాసు పగిలిపోయింది. చూశావా?' అన్నాడు తులసీరామ్

'దాన్ని గురించి అంత బాధపడ్తారెందుకూ... జరిగినవాటిని గురించి ఆలోచించకండి అని అన్నది ఆవిడ.'

'ఔన్సు గ్లాసులో మందుపోస్తూ ఆ అమ్మాయి వైపు చూడగానే ఏవో పూర్వపు సంఘటనలు జ్ఞాపకానికి వచ్చినయి. నా గుండె తరుక్కుపోయింది. నా చేతులు వణికినై– ఔన్సుగ్లాసు నా చేతిలో నిలవలేనంది...'

పొర్లి వస్తూన్న దుఃఖం ఆపుకోలేకపోయినాడు తులసీరామ్

  

"అన్నయ్యా... మందుకు పోలేనన్నయ్యా"

"ఏం... ఎందుకని...?"

'తులసీరామ్ చెప్పినప్పటినుండీ భయమేస్తున్నది. ఈడువచ్చిన పిల్లవు రాకూడదమ్మా అని అన్నాడు. నన్ను చూస్తూ చేతిలోంచి జొన్నుగ్లాసు కిందపడేసుకుని పగలగొట్టుకున్నాడు".

"నేనే పోదామంటే పూర్తిగా తగ్గలేదు. నడిచిపోయేంత ఓపిక రాలేదమ్మా... ఇవ్వాళ ఒక్కరోజు పోయిరా. పోయి రెండు రోజులకు సరిపడేమందు తీసుకురా, నేను చెప్పానని చెప్పు..."

"అయితే వెళ్ళిరమ్మంటావా అన్నయ్యా... తులసీరామ్‌ను చూస్తే జాలివేస్తుం దన్నయ్యా... ఉన్నట్టుండి ఒకరోజున డాక్టర్లు కొంతమంది మంచివారు కాదమ్మా అన్నాడు".

తుల్సీరామ్ ఎంతమంది డాక్టర్ల దగ్గరపనిచేశాడో, ఆయన అనుభవం ఉన్నవాడు. ఆయన చెప్పింది నిజమే కావచ్చు... అయితే ఆయన నాతో ఆ మాట చెప్పాల్సిన అవసరం నాకేం కన్పించలేదు... అన్నయ్యా... అమ్మ చచ్చిపోయింది ఏదో జబ్బు చేసి అని చెప్పుండేవాడివి చిన్నప్పుడు... చాలా జబ్బు చేసిందనే వాడివి... అప్పుడు ఉన్న డాక్టర్లందరూ ఎవ్వరూ మందులివ్వలేకపోయినారా అన్నయ్యా... నాన్న బాగా డబ్బున్నవాడేగా అప్పుడు".

'నీకు తెలి   దమ్మా భగవంతుడు నిర్ణయించిన దాన్ని ధిక్కరించే అధికారం డాక్టర్లకు లేదు. మృత్యువు నెట్టుకొచ్చింది. అంతే. అమ్మను గురించిన విషయాలు తీసుకు రాకమ్మా ఇప్పుడు. నీవు పుట్టిన ఇరవై రోజులకే అమ్మ చచ్చిపోయింది... ఇప్పటికి ఎన్నో సంవత్సరాల కిందటి మాట'.

'ఏడుస్తున్నావేం తల్లీ! దుఃఖించకు. ఆ విషయాన్ని మరచిపోవటానికి ప్రయత్నం చెయ్యి నా మాట విను'.

'మందుకు వెళ్ళివస్తానన్నయ్యా సీసా కడిగి తీసుకుపోతాను" పమిట కొంగుతో కన్నీటిని తుడుచుకొని బయలుదేరింది.

.........................

.........................

మందుసీసా బల్లమీదపెట్టి క్యాలండరువైపు చూస్తూ నిల్చున్నది. బల్లమీద ఔన్సుగ్లాసులేదు. తులసీరామ్ పక్కగదిలో కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

ఈ అమ్మాయి రాగానే కుర్చీలోంచి లేచి గదిలోకి వచ్చాడు.

'మీ అన్నయ్యకు జ్వరం తగ్గిందా?'

'పూర్తిగా తగ్గలేదు. రెండు రోజులకు సరిపోయే మందు ఇవ్వండి'

సరే అన్నాడు తులసీరామ్.

మామూలుగా అలవాటు ప్రకారం బల్లదగ్గరకు వెళ్ళి మందుసీసాలను కదుపుతూ, ఔన్సుగ్లాసు ఏర్పరచిన ఖాళీని చూసి, చేతిలో ఉన్న సీసాలను అక్కడే ఉంచాడు.

"ఔన్సుగ్లాసు కొత్తది కొనలేదా?" అన్నది అమ్మాయి.

"నిన్నటి నుండి ఇప్పటివరకూ ఎవ్వరికీ మందులివ్వలేదు. కొంతమందిని పంపించివేశాను".

"అయితే ఇవ్వాళ మా అన్నయ్యకు కూడా మందులేదా?" అని అడిగింది.

"ఇక ఎవ్వరికీ మందులివ్వతల్చుకోలేదు. నన్ను సుఖంగా ఉండనివ్వండి".

"ఔన్సుగ్లాసు నావల్లనేగా పగిలిపోయింది. బజారుకువెళ్ళి కొని తెస్తాను. పోనీ మందివ్వండి".

"లేదమ్మా లేదు. ఇక ఎవ్వరికీ మందులివ్వను. నన్ను బాధించకు నా మనసు బాగాలేదు. నా మెదడు చెడిపోయినట్లుగా బాధపడుతున్నాను. నా మాట విను. వెళ్ళిపో అమ్మాయి ఎక్కువ సేపు నా ఎదుట ఉండవోకు".

"ఇదంతా నా వల్లనే. నన్ను క్షమించండి. ఈడువచ్చిన పిల్లవు రాకూడదమ్మా అని అన్నప్పటినుండీ అనుకుంటూనే ఉన్నాను మిమ్మల్ని గురించి ఊరికే ఆలోచిస్తున్నాను".

'నీకూ నా పోలికే వచ్చిందమ్మా. ఎడతెగని ఆలోచన..." అని నాలిక కొరుక్కున్నాడు.

'ఔన్సుగ్లాసు పగిలిపోయినప్పటినుండీ నాకు ఎందువల్లనో భయంగానే ఉంది. మీ చేతులు వణకటం చూశాను. నేనేమీ అర్థం చేసుకోలేకపోతున్నాను. ఊహ తెలిసి ఈడు వచ్చిన పిల్లను ప్రపంచంలో విషయాలను తెలుసుకోవాల్సనే కుతూహలం ఉంటుంది...'

'నీవు వెళ్ళిపోవమ్మా. ఇక్కడ ఉండకు. నేననేది నీకు కఠినంగా ఉండొచ్చు. మీ అన్నయ్యతో చెప్పు తులసీరామ్ మందులు ఇక ఎవ్వరికీ ఇవ్వడట అని వెళ్లిపో... నా మాట విను...'

'అయితే మీరు డాక్టర్ వృత్తి మానుకున్నట్లేనా? చెప్పండి...'

"పెద్దవాణ్ణయినాను ఇక చేయలేనమ్మా. ఒక మందుకు ఒక మందు ఇస్తే ఫలితం అనుభవించేది రోగులే కదూ. నా వల్ల ఇతరులు అనవసరంగా బాధపడటం ఎందుకూ?"

"మీరు చెప్పేది నాకు నచ్చటం లేదు, మీరు అనుకోవడంలో మీరు చెప్పిన కారణం నిజమే కాని, అంత మాత్రంచేత కేవలం వృత్తి మానుకోవడం ఎందుకూ? ఎవరినైనా కుర్రవాళ్ళను దగ్గిర తీసి వాళ్ళకు నేర్పి... ఏదో విధంగా మందులు ఇవ్వచ్చుగా..." అని అన్నది.

"అమ్మాయీ నీ సలహా మంచిదే కాని నేనసలు ఈ ప్రపంచంతోనే సంబంధం వదలుకోబోతున్నాను. జీవించే ఆఖరి ఘడియల్లో భగవాన్ ధ్యానం చేసుకుంటాను. నన్ను ప్రశాంతంగా జీవించనీ నా తల్లీ వెళ్ళిపోతావు గదూ... మీ అన్నయ్యతో చెప్పు నన్ను క్షమించు తల్లీ" అంటూ దీనంగా కళ్ళల్లోకి చూస్తూ చేతులు పట్టుకున్నాడు తులసీరామ్

"మీరు పెద్దవారు అలా అనకూడదు. నేను వెళ్ళిపోతాను లెండి" అన్నది.

ఖాళీ మందుసీసాను తీసుకుని వెళ్లిపోయింది.

గుమ్మంలోకి వచ్చి పోతున్న అమ్మాయివైపు చూస్తూ నిల్చుండి పోయినాడు తులసీరామ్..

  

ఇప్పుడు తుల్సీరామ్ మందుసీసాలున్న గది తలుపులు వేసి ఉన్నాయి. ఎవ్వరికీ మందులివ్వటం లేదు.

రెండుపూటలూ భగవద్గీత, చదువుతాడు, భార్యతో కలిసి. వేదాంతం గ్రంథాలు చదివి వినిపిస్తుంటుంది భార్య. సుఖంగా రోజులు వెళ్ళిపోతున్నయ్, తను ఏదో పాపం చేసిన వాడల్లే బాధపడటం కూడా చూసింది ఆమె.

మాటల సందర్భంలో ఏవో పూర్వపు సంఘటనలన్నీ జ్ఞాపకానికి వచ్చినయి అనీ తులసీరామ్ చెప్పాడు. పూర్వపు సంఘటనలను గురించి ఒకటి రెండు సార్లు భార్య అడిగినా తులసీరామ్ చెప్పలేదు.

భగవద్గీత చదవడం మొదలుపెట్టిన తర్వాత కూడా ఈ విషయమే అడిగితే చెప్పలేకపోయినాడు తులసీరామ్.

తులసీరామ్‌కు భయం కలగడం మొదలుపెట్టింది. తను ఎక్కువ కాలం బతకనేమో అని. "మృత్యువును తప్పించుకోవడం ఎవరి సాధ్యం" అంటూండేది భార్య.

ఒకనాడు 'టీ' ఇస్తూ పక్కనే కూర్చుని...

"ఏవండీ... చిన్నప్పుడు ఏమో చేసి ఉండొచ్చు మీరు. దానికి పశ్చాత్తాప పడుతున్నట్లు మీ పరివర్తనే చెప్తున్నది. మనిద్దరికీ వృద్ధాప్యం వచ్చేసింది. మిమ్మల్ని బాధించిన ఆ పూర్వసంఘటనే తెలుసుకుందామని ఉంది... నాకు చెప్పటానికేం? మీరు చాలా సున్నిత హృదయులు. చెప్పటానికి సంశయిస్తున్నారు" అని అన్నది.

'నా హృదయం బరువుగా ఉన్నది. నన్ను కదిలించకు, నేను బాధపడుతున్నానని నీకు తెలుసు... ' అని అంటూ అక్కడ నుండి లేచిపోయినాడు తులసీరామ్.

ఇక, తులసీరామ్ ఒక్క క్షణం అక్కడ ఉండలేకపోయినాడు. భార్యముఖం చూడటానికే భయపడేవాడు.

ఇంత బలహీనుడేం ఇతను? అని అనుకునేది భార్య. మళ్ళీ ఆ విషయమై హెచ్చరించలేదు... (తులసీరామ్ తత్వం బాగా అర్థం చేసుకున్నది గనుక) ప్రపంచంలో తులసీరామ్ తత్వంగల సున్నితహృదయులు చాలా తక్కువమంది ఉంటారు. తను చేసినది తప్పు అని తెలుసుకునీ అది ఇతరులకు తెలిసిన తరువాత ఈ ప్రపంచంలో ఉండటమే అతనికి కష్టమేసింది...

  

తులసీరామ్ విషం తాగి ఈలోకాన్ని విడిచిపెట్టాడన్న విషయం ఆ పేటలో ఉన్న దాదాపు ప్రతి ఇంటిలోనూ అలజడిని కలుగజేసింది. చాలామంచివాడు పాపం అనేవాళ్ళే ప్రతివాళ్లు... విషం తాగి ఎందుకు పోయినాడో అని ప్రతివాళ్ళు ఆదుర్దాపడ్డారు. చాలా ఆశ్చర్యంగా ఉంది. చాలామంది ఆవిడను చూసి పోవటానికి వచ్చారు. ఒకటి రెండు రోజులు జనం వస్తూపోతూనే ఉన్నారు. మందుసీసాలన్నీ తులసీరామ్ కోసం ఎదురు చేస్తున్నట్లుగా ఉన్నయ్.

ఆ బల్లకూడా ముసలితనం వచ్చి ఊగులాడుతున్నది.

భగవద్గీత పుస్తకంలో ఉన్న కాగితం మర్నాడు చదువుతూ చూసుకుంది ఆవిడ. తులసీరామ్ స్వయంగా తన చేతులతో రాసిన ఉత్తరం...

ఆ ఉత్తరంలో ఇట్లా వుంది.

"నేను కొన్ని గంటలలో ఈ లోకం విడిచి వెళ్తున్నాను. ఈ పని నేను కోరుకుని నా అంతట నేను చేసుకున్నదే. ఎవరూ దీని విషయమై చింతించనవసరం లేదు. నాలో కలిగిన మార్పుకు బాధ్యులెవరూ కాదు. ఆ జొన్సుగ్లాను.

నేను ఫలాన అని తెలుసుకుంటే ఇప్పుడు ఆ అమ్మాయి (ఈ మధ్యన మందుకు వచ్చిన అమ్మాయి) ఏడ్చి చాలా బాధపడుతుంది. కొన్ని సంవత్సరాల కిందటిమాట. నేను చచ్చిపోబోతున్నా ఇంకా కళ్లకు కట్టినట్లుగా ఉంది.

నేను డాక్టరు దగ్గర కంపౌండరుగా చేరిన మొదటి రోజులవి. అందమైన అమ్మాయి నన్ను ఆకర్షించింది. మందుకు ఒకటి రెండుసార్లు వచ్చినప్పుడు చూస్తుండేవాణ్ణి. అంత అందమైన అమ్మాయిని కౌగిలించుకుంటే బాగుణ్ణు అని కలలు వచ్చినప్పుడల్లా చిరునవ్వుతో నన్ను సంతోషపరిచేది. అందర్ని సృష్టించేది సౌఖ్యం కోసమే కదా అని భగవంతుడికి నమస్కారం చేశాను. ఆస్పత్రిలో మా డాక్టరు లేనప్పుడు చాలా సేపు దగ్గర కూర్చుని కబుర్లు చెప్పేది. అప్పట్లో నా ఆనందం అంతా ఇంతా కాదు. ఆ సంఘటన నాకు బాగా జ్ఞాపకం ఉంది. ఒక రోజు మందుల బల్ల దగ్గరకు వచ్చి నిల్చున్నది. నీవు చాలా అందంగా ఉన్నావనీ కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాను. మేమిద్దరం కౌగిలిలో చాలా సేపు ఉండిపోయినాం... ఇక నే వెళ్ళిపోతానని వెళ్లిపోయింది. మా ఇద్దరి స్నేహం అప్పటినుండీ ఎక్కువైంది.

ప్రపంచంలో సుఖం అనేది ఎక్కడన్నా ఉంటే ఆ అమ్మాయి పెదవుల్లోనే ఉందనుకునే వాణ్ణి.

నాకు మాతృత్వం కలగబోతున్నదని అంటూ కిలకిలా నవ్వేది.

ఆ తర్వాత మళ్లీ కన్పించనేలేదు. ఎక్కడికి వెళ్లిందని విచారించలేదు. నేను కొన్ని చాలాసార్లు తల్చుకుని బాధపడ్డాను. ఎవరో ఆత్మహత్య చేసుకుందని (ప్రసవించిన తరువాత కొన్ని రోజులకు) ఆడపిల్లను ఈ ప్రపంచంలో వదిలేసి వెళ్ళిపోయిందనీ చెప్పారు. హత్య చేసుకోవడం అంతసులభం కాబోలు అని అనుకున్నాను.

మొట్టమొదటి సారిగా ఈ అమ్మాయి మందుకు నా దగ్గరకు వచ్చినప్పుడు నా పంచప్రాణాలూ లేచివచ్చినయి. సాక్షాత్తు అవిడే, చచ్చిపోయిన అవిడే లేచి వచ్చిందనుకున్నాను. కొన్ని సంవత్సరాల క్రితం ఆ అమ్మాయి నా దగ్గరకు మందుకు వచ్చిన రోజులు జ్ఞాపకానికి వచ్చినయి.

మా ఇద్దరి రక్తాలూ పంచుకుని భూమ్మీద పడి పెద్దదయిన ఈ అమ్మాయిని చూసి నా గుండె తరుక్కుపోయింది.

ఈ సంగతి తెలిస్తే నాన్న చచ్చిపోయినాడని నా కోసం వెదుక్కుంటూ నా చితి దగ్గరకు వచ్చి నా శవాన్ని చూసి భోరున ఏడుస్తుంది.ఎవ్వర్నీ మనం అపలేం.

కాని ఈ సంగతులన్నీ బతికి ఉండగా నీకు చెప్పటానికి మనస్కరించలేదు. దానికి ప్రత్యేకమైన కారణం ఏమీ లేకపోయినా.

ఈ ఉత్తరం చూసి నీవు బాధపడ్తావు. నాకు తెలుసు. కాని నన్ను మాత్రం క్షమిస్తావని నమ్ముతున్నాను. జీవించిన ప్రజలకు చేయగలిగినంత సేవ చేశాను. నీకు నేను ఇవ్వవలసిన సలహాలేమీ లేకపోయినా, బతికినంత కాలమూ భగవంతుని సేవలో నిమగ్నం కమ్మని అంటాను.

మందు సీసాలకు ఒకసారి నన్ను జ్ఞాపకం చెయ్యి.

ఇక శెలవు నీ

తులసీరామ్

తులసీరామ్ భార్యకు కళ్లు చెమ్మగిల్లినయ్. భగవద్గీత పుస్తకం మూసేసింది...

## 45

# కలకత్తా పిల్చింది!

16వ తారీఖు,

ఆ తరువాత ఏం జరిగింది చెప్పా... అన్నాడు ఎలీషా...

"నన్ను క్షమించాలి... ఏమీ చెప్పేందుకు తీరికలేదు. గొంతుమీద కత్తి... మనం మళ్ళీ కలుసుకుందాం..."

"ఉహూ... నీవు వణికిపోతున్నా వెందుకో నాకు అర్థం కావటం లేదు..."

"ఎలిషా... మైడియర్... నన్ను పలుకరించకు... అటు చూడు జనం తండోపతండాలుగా వస్తున్నారు. అసలు హాస్పిటల్‌లో ఖాళీ అన్నమాటే లేదు... అదుగో మరో లారీ వస్తున్నది... నీవు వెళ్ళు, మళ్ళీ కలుసుకుందాం..."

"నాకేమీ తోచటం లేదు... అర్థం కాని ఆదుర్దాపడుతున్నావ్" అన్నాడు ఎలిషా...

"నీకేం తెలుసు కిడ్డర్‌పూర్‌లో ఏం జరిగిందో... ఊరంతా అట్టుడికి పోతున్నది. ఊళ్ళో రోడ్లన్నీ నెత్తుటితో తడిసిపోయినై... నన్ను పోనీ... మెడికల్ ఆఫీసరు వస్తాడు".

ఆఖరుసారిగా ఆమెవైపు చూశాడు ఎలీషా.

"ఎలీషా మైడియర్!" అన్నది నర్సు... ఎలీషా మరికొంచెం దగ్గరగా వచ్చాడు. ఆమె దగ్గరకు వచ్చింది.

"మనం తరువాత మాట్లాడుకోవచ్చు. మన సంభాషణలకు సమయం తరువాత నేను లోపలికి వెళ్ళటం చాలా అవసరం. ఎంతమంది ప్రాణాలో కాపాడాల్సిన బాధ్యత ఉంది... మన ప్రేమ... మన తమాషాలూ... తరువాత... సాయంకాలం కలుసుకుందాం... నా మాట విను... ఎలీషా మైడియర్..." అతని క్రాపుని నిమురుతూ చెప్పిన మాటలివి.

"నిన్ను చూస్తుంటే అవన్నీ మర్చిపోతాను. ఊళ్లో జరిగే సంఘటనలు నన్నేమీ కదల్చలేకుండా ఉన్నయి. చలనం లేకుండా స్థాణంలా ఉండిపోయాను. నాకు తెలీని శక్తులు ఏవో నన్ను చుట్టిముట్టినయి... ప్రేమ గుడ్డిదన్నారు. అందుకనే నేమో... అయితే నన్ను వెళ్ళమంటావా..." అన్నాడు ఎలీషా.

శిలా ప్రతిమలా ఆమె-

"కన్నీరు మున్నీరుగా..."

'అయితే శలవ్ తీసుకుంటాను... వెళ్తాను.'

'సాయంకాలం కల్సుకుంటాను... ఏదీ ఒక ముద్దు...' అని ఆవిడ చేయి తీసుకుని ఒక ముద్దు పెట్టి వెళ్ళిపోయినాడు.

ఆమె గబగబ నడచి వెళ్ళిపోయింది వార్డులోకి...

ఆపరేషన్ థియేటరుకు అటువైపుగా ఉన్న గోడపక్కగా నిల్చుని వాళ్ళు మాట్లాడుకున్నారు. అది ఎవడు వచ్చిపోయే చోటు కాదు.

అతడు ఈపాటికి కాంపౌండు దాటి ఉంటాడు.

  

మరో లారీ హాస్పిటల్‌లో ప్రవేశించటం చూశాడు. డ్రైవర్ని అడిగితే అతడు చెప్పిన మాటలివి... "బాలిగంజిలోని ఇండియన్ మ్యూజియమ్ సమీపంలో తుపాకిగుండు దెబ్బలు తిన్నవాళ్ళు..."

జీనస్ చెప్పినమాటలు ఏవో గొణుక్కుంటూ ముందుకు వెళ్ళిపోయినాడు ఎలీషా... తుపాకిగుండు కన్నా కత్తిపోట్లతో చచ్చిపోయిన వారెందరో ఉన్నారు... అని అతని కెవరో చెపుతున్నట్లుగా ఉంది.

ఎలీషా కలకత్తాలోని ఒక చిన్న కంపెనీలో గుమాస్తాగా పనిచేస్తూ చదువుకున్నవాడు. ఆ రోజున జరుగుతున్న హర్తాళ్ మూలంగా అతని ఆఫీసు మూసివేయడం చేత ఆమెను చూసి ఆమెతో మాట్లాడి వెళ్లుదామని హాస్పిటల్‌కు వచ్చాడు. తను ఆఫీసులో చేరినప్పటినుండీ ఆమెకూ తనకూ కలిగిన పరిచయం ఇప్పటికి ఈ రూపం దాల్చింది. ఆమెను చూడందీ, ఆవిడతో మాట్లాడందీ ఒక్కరోజైనా

ఉండలేదు. ప్రతిరోజూ ఆఫీసు నుండి రాగానే సరాసరి హాస్పిటల్‌కు వెళ్ళేవాడు. ఎప్పుడూ అక్కడే ఆ ఆపరేషన్ థియేటరుకు అటుపక్కగా ఉన్న గోడవైపు నిల్చునే వాళ్ళిద్దరూ మాట్లాడుకునేవారు. సంభాషణలో ఆవిడ అప్పుడప్పుడు కిలకిలా నవ్వేది. ఎలీషా మైడియర్ అంటూ ఏవో కబుర్లు చెప్పేది. రోజూ అదే స్థలానికి వచ్చి మాట్లాడుకోవటం వారి కార్యక్రమం అయిపోయింది.

ఆమె

వార్డులలో కత్తిపోట్లతో కండలుపోయిన వారికి కట్లుకడుతున్నది. తోటినర్సులతోపాటు చలాకిగా అటూ ఇటూ పరుగెత్తుతూ పనిచేస్తున్నది.

అంతకంతకూ ఆస్పత్రిలో చేరే వారి సంఖ్య ఎక్కువైపోతున్నది. చేతులు పోయినవాళ్ళూ, తలలు పగిలినవాళ్ళూ, కాళ్ళు విరిగినవాళ్ళూ విపరీతంగా అడ్మిట్ అవుతున్నారు.

మెడికల్ ఆఫీసరు అంటున్నాడు వాళ్ళతో...

"ఇక ఆస్పత్రిలో వచ్చేవారికి చోటు కూడా లేదు. అయినా ఈ ఊళ్ళో ఇంత దౌర్జన్యం నాకు ఊహ తెలిసిన తరువాత ఎప్పుడూ జరగలేదు. అసలు గాయాలు తగిలిన వారే ఇంతమంది ఉంటే బలి అయిన వాళ్ళెందరున్నారో..." అని.

నర్సులందరూ విచార వదనాల్తో నిల్చుని ఉన్నారు. మెడికల్ ఆఫీసరు అక్కడనుండి మరోవార్డుకు ముందుకు సాగాడు.

  

ఆ రోజు గడిచిపోయింది. 17, 18 తారీఖులు... ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని తిరిగాడు ఎలీషా. అతనికి విపరీతమైన భయం వేసింది.

బజార్లో దుకాణాలు లూటీ చేస్తున్నారు.

ఎవరికి దొరికినవి వాళ్ళు పట్టుకుపోతున్నారు.

కొన్ని ఆఫీసులకు నిప్పు అంటించారు.

మంటలు మండుతున్నయి. కనపడిన వాళ్ళి కనపడ్డట్టుగా కత్తులతో పొడిచేస్తున్నారు.

ఎక్కడ చూసినా గుంపులు.

తనపని ఏమయ్యేట్టు అనుకున్నాడు ఎలీషా. మిలటరీ లారీలు వచ్చేవీ పొయ్యేవీ లెక్కలేదు. ఎక్కడికక్కడే పోలీసులు తుపాకులు పేలుస్తున్నారు.

ఈ ఊళ్ళో ఉండను. ఇది వదలి ఎక్కడికైనా వెళ్ళిపోతాను అని అనుకున్నాడు ఎలీషా. ఎక్కడికి వెళ్ళినా ఆమెను వదిలి వెళ్ళలేడు. ఊళ్ళో ఉన్న తీవ్రపరిస్థితిలో ఎక్కడికి వెళ్ళగలడు...

ఒక హోటలులోని మూడో అంతస్తు గదిలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. ఎలీషా కిటికీలోంచి తొంగిచూశాడు. అటువైపూ ఇటువైపూ.

ఇంత రక్తపాతం ఎక్కడా చూడలేదు, వినలేదు కూడా అనుకున్నాడు. తను చూస్తుండగానే ఎంతోమంది ప్రాణాలు వదిలారు. జరుగుతున్న సంఘటనలన్నీ తలుచుకుంటుంటే అతనికి ఆలోచనలు ఎక్కువైనయి.

మతం పేరిట జరిగే హత్యాకాండ ఇది... దీనికి బాధ్యులెవరు... అని అనుకున్నాడు. తనకు తెలిసినచోట ఊళ్లో (ఒక భాగంలో) కొద్దిమంది హిందువులు మహమ్మదీయులు కలిసి ఉంటున్నారు. వాళ్ళు ఎప్పుడూ కలహించుకోలేదు.ఈ పరిస్థితిలో కూడా వాళ్ళు ఒకరినొకరు రక్షించుకోటానికి తగు ప్రయత్నాలు చేసుకుంటున్నారు.

అప్పుడే హత్యలు చేసేవాళ్ళు ఏ వర్గానికి చెందేవాళ్ళు అని తనలో తాను తర్కించుకుంటున్నాడు ఎలీషా.

ఎలీషా మనసు పరివరివిధాల పోతున్నది. కొంచెంసేపు పడుకున్నాడు. కళ్ళు మూతలు పడలేదు. వసతి గృహంలో విద్యార్థులు చేసిన చిత్రవధ జ్ఞాపకానికి వచ్చింది. ఆరునెలల పసిపాప పీక నులిమివేస్తే తల్లీ తండ్రీ కెవ్వుమన్న కేక వినపడ్డది. ఈ రెండు సంఘటనలూ అతడు కళ్ళారా చూచాడు. చాలా బాధపడుతున్నాడు. ఏమీ ఎరుగని విద్యార్థులు చిత్రవధ చేశారు. వాళ్ళ తండ్రులూ తల్లులూ ఎంత అలమటించి పోతారో! తను ఊహించుకున్న దృశ్యాలన్నీ కంటి ఎదుట సినిమాలా ఉన్నయి. లేచి కూర్చుని తనడైరీ తీసి ఏవో రాసుకోవడం మొదలుపెట్టాడు.

ఆ చిన్న డైరీ మూసేసి పెన్ను జేబులో పెట్టి ఆలోచిస్తూ పడుకున్నాడు. రెండు రోజుల నుండి ఆస్పత్రివైపే పోలేదు. అక్కడ పరిస్థితి ఏవిధంగా ఉందో! ఆమె ఏం చేస్తున్నదో!

తనకోసం తనను కలుసుకోవలెనని ఆపరేషను థియేటరు దగ్గరకు వచ్చి వెళ్ళిందేమో! తనను గురించి ఏం బాధపడుతున్నదో ఆమె! ఆమెను గురించి చాలా ఆలోచించసాగాడు ఎలీషా. ఆ రోజు సాయంకాలమే వస్తానని చెప్పి వాగ్దానం చేశాడు ఆమెకు.

అన్ని మతాలలోకి క్రైస్తవ మతమే మంచిదని అనుకున్నాడు ఎలీషా! మేడమెట్లు దిగుతూ...

అవతల గదిలో ఇద్దరూ మాట్లాడుకుంటున్నారు. "అసలు మతకలహాలు జాతి ఔన్నత్యానికే తీరని కళంకం" అని.

  

*19వ తారీఖు*

ఆమెకు ఆరాటం ఎక్కువైంది. సాయంత్రం వస్తానన్న ఎలీషా ఇంతవరకూ రాలేదు. ఏం జరిగిందో అని వివిధ రకాలైనవాళ్ళూ హాస్పిటల్‌లో ఉన్నారు.

ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళున్నారు. వాళ్ళను చూడలేకపోయింది. ఒక స్త్రీ చాలా బాధపడుతున్నది. ఆమెపై అత్యాచారం జరిగినట్టుంది.
కొందరు బాలికలు కూడా ఉన్నారు. ఒక పన్నెండేళ్ళ బాలిక ప్రమాదస్థితిలో ఉంది.

ఆమెకు కన్ను అదిరింది. భయపడి... ఎలిషాకు ఏం ముప్పు వాటిల్లునో అనుకుంది.

మెడికల్ ఆఫీసరు మనసు ఏమీ బాగాలేదు. తలవంచుకుని కూర్చున్నాడు.

సాయంత్రం నాలుగయింది. పోలీసులూ, మిలిటరీవాళ్ళు గస్తీలు తిరుగుతూ అవసరము అయిన స్థలాల్లో కాల్పులు జరుపుతున్నారని వినికిడిగా ఉంది.

పత్రికాఫీసులో జరిగిన సంఘటనను గురించి మెడికలు ఆఫీసరు చెప్తున్నాడు, అందరూ వింటున్నారు. ఆమెకూడా ఒకవైపు నిల్చుని వింటూ ఉన్నది.

ఇంతలో లారీలో కొంతమందిని తీసుకు వచ్చారు వార్డులోకి. తీసుకురాబడిన వారికి స్పృహలేదు. మెడికలు ఆఫీసరు కూర్చున్న చోటునుండి లేచి అక్కడకు వచ్చి వారిని చూశాడు. మెడికలు ఆఫీసరువెంటే ఆమె.

తనను తాను నమ్మలేకపోయింది. వాళ్ళల్లో తన ఎలీషా ఉన్నాడు. తన ఎలీషా! కెవ్వుమన్నది. పక్కనున్న నర్సులూ వాళ్ళూ అడిగారు ఏమిటది అని. అతడు నావాడు అని జవాబు చెప్పింది. అందరూ ఆమె దగ్గర చేరారు.

అతడినాడి చాలా బలహీనంగా ఉంది. అతడు గుండెలో కత్తిపోటుతో బాధపడుతున్నాడు. అతను చొక్కా అంతా నెత్తురు ముద్ద.

పక్కనే కూర్చుని ఎలీషా మైడియర్... అన్నది ఆమె. అతడు కళ్ళు తెరిచాడు. ఆమె చేతులు రెండూ గట్టిగా పట్టుకున్నాడు.

అతనికి ఆయాసం వస్తున్నది... మ... త... క... ల... హో... లు... అన్నాడు. ఎలీషా. కళ్ళు మూశాడు. ఎలీషా శవాన్ని గట్టిగా కౌగిలించుకుంది ఆమె... ఎలీషాను కూడా కలకత్తా ఆహ్వానించింది అన్నది ఆమె.

కత్తిపోటు అతనిజేబులోని డైరీలో గుండా గుండెలోకి దూసుకుపోయింది. నెత్తురుతో తడిసిన జేబురుమాలు, అయిదురూపాయల నోటు... డైరీ... అక్కడ ఉన్నాయి... పక్కనున్న నర్సులు డైరీ తీసి పేజీలు తిప్పి ఆఖరు పేజీ చూశారు. దాంట్లో ఇలా ఉంది "రోడ్డు మీద అనేక శవాలు పెద్దవారివి, పిల్లలవి కూడా. రాబందులు, గద్దలు పీక్కుతింటున్నాయి. ఎముకల పంజరాలు గుట్టలుగా పడి ఉన్నాయి. బీదవాళ్ళందరూ కలకత్తా నివాస యోగ్యమైనది కాదు అని పట్టణం విడిచిపెట్టి పోతున్నారు.

ఈ కల్లోలాలలో బలిగొన్న శవాలు అనేకం రోడ్డుమీదపడి దుర్గంధాన్ని వెదజల్లుతున్నది. ఆహార పరిస్థితి పూర్తిగా విషమించి అనేక కుటుంబాలు నశ్తులుంటున్నాయి. ఈ మూడంతస్తుల మేడ గదిలో కూర్చుని విషాద సంఘటనలన్నీ తలుచుకుంటే నా కేడుపు వస్తున్నది.

ఈ వేల కొలది నిండుప్రాణాలు బలి కావడానికి ప్రభుత్వ అలక్ష్యమే కారణం. ఈ కల్లోలాలకు మంత్రివర్గమే బాధ్యత వహించాలి. పట్టణం శిథిలావస్థలో ఉంది... దేశమంతటా మతకలహాలు ఈ విధంగా ఉంటే దేశం ఏమయ్యేట్టు...!"

ఆపరేషన్ థియేటరు పక్కగా ఉన్న గోడ ఇప్పటికీ ఎలీషాకోసం ఎదురు చూస్తున్నది.

## 46

# చితికిన గుండెలు

సుబ్బారావు నా ప్రాణమిత్రులలో ఒకడు. రాత్రిపూట భోజనం చేయగానే కబుర్లకోసం అతనింటికి వెళ్ళటం పరిపాటి. ఆ రోజు మామూలుగా కాకుండా కొంచెం ఆలస్యంగా వెళ్ళాను. నేనెప్పుడు వెళ్ళినా వరండాలో కుర్చీలో కూర్చునే సుబ్బారావు కన్పించేవాడు. వెళ్ళగానే అతను కన్పించలేదు. సినిమాకు ఏమైనా వెళ్ళేడేమో అనుకున్నాను. ఒకవేళ సినిమాకు వెళ్ళినా నన్ను పిలవకుండా పోడు. కొంచెం లోపలకు వెళ్ళాను. ఇల్లంతా దేదీప్యమానంగా లైట్లు వెలుగుతున్నయి. పక్కనున్న బెడ్‌రూమ్ తలుపులు కూడా తీసే ఉన్నయి. సుబ్బారావు అతని భార్య సీతా ఒడలు మరచి ఒకరి కౌగిలిలో ఒకరు హత్తుకుని ఈ ప్రపంచంతో మాకు సంబంధం లేదన్నట్లుగా నిద్రిస్తున్నారు. నిజానికి ఆ పవిత్ర స్థలానికి నేను ఎందుకు వచ్చానా అనుకున్నాను. వాళ్ల పవిత్ర ప్రేమను, అమాయకత్వాన్ని తలుచుకుని వాళ్లకు నమస్కరిద్దామా అనిపించింది. గంధర్వగణం లోని వారివలె నారాయణ కథలు, గీతాలు, గానం చేసి అలసట చెందిన వారివలె వారు నాకు కన్పించారు.

సుబ్బారావు విష్ణుప్రియుడు

సీత కృష్ణప్రియత.

వారిద్దరూ గానం చేసి ఒక్కొక్కప్పుడు ఒడలు మైమరచడం నెరుగుదును. కాని ఈ వేళలో నాకు కన్పించి, నాతో మాట్లాడే సుబ్బారావు, నా చెప్పుల చప్పుడు విని అయినా లేవలేదు. తలుపులు కూడా పైగా తీసి ఉన్నయి. కొంచెంసేపు పరీక్షగా నిల్చున్నాను.

తమస్సువలె నిశ్శబ్దం నా శ్వాసతప్ప. నాకు ఆశ్చర్యం అనుమానం, భయం కూడా కలిగినయి. చప్పుడు అయ్యేట్లుగానే ముందుకు వెళ్లాను. ఉద్దంకమహర్షివలె పరమాత్మ విషయ నిర్వికల్ప సమాధిలో ఉన్నట్టుగా కన్పించాడు సుబ్బారావు. బెదరిపోయిన పక్షివలె ఎగిరిపోదామా అనిపించింది. నా కాళ్లక్రింద ఉన్న భూమి క్రుంగినట్టే అయింది. సీతవైపు చూశాను. పద్మినిలా శూన్యంలోకి చూస్తున్నది.

నేను వచ్చి దాదాపు అరగంటపైనే అయింది. సుబ్బారావూ అని కేక వేద్దామా అనిపించింది. ఉ... హుం... ఒక్క అడుగు వేశాను. వెనక్కు... ముందుకు పోదామా ంజాటన. శుద్ధమైన జ్ఞానస్వరూపివలే కన్పించాడు సుబ్బారావు. వారిద్దరిలోనూ నాకు దైవత్వం కన్పించింది.

నోటిదాకా వచ్చింది కేక వేద్దామని. సుబ్బారావుని నిద్రాభంగం చేసిన మహాపాపిని అవుతానేమో అనిపించింది. మెదడు ఊగిసలాడింది. అనుమానం, భయంచేత శరీరం ముందుకు లాగింది. దగ్గరగా వెళ్లాను. సుబ్బారావుని సీతను చూశాను. తాంబూలం వేసుకున్న వారివలె వారి పెదవులు నెత్తురు ముద్దలా ఎర్రగా లావుగా ఉన్నాయి. ముఖంలో చిరునవ్వు తాండవిస్తున్నా అదోలా ఉంది. సుబ్బారావూ! అన్నాను గట్టిగా. సుబ్బారావు తపోనిష్టలోంచి... రాలేదు. చేతితో కదిపిచూశాను... రెండు శవాలు...! నా కళ్ళను నేను నమ్మలేకపోయాను. హతవిధీ! ఈ దంపతుల్ని ఓర్వలేని దేవతలు గుంజుకుపోయినారా? దేవతలకు కూడా ఈర్ష్యేనా? పరమశివుడే ఈర్ష్యగలవాడు. ప్రపంచమే ఈర్ష్య. చిలకా గోరింకల్లాగా కాపురం చేస్తున్న సుబ్బారావూ, సీతా ఇప్పుడు ప్రాణం లేని రెండు మట్టి బొమ్మలు...!

## 47

# ఆడవాళ్లు ప్రేమిస్తారు!!!

చెక్కెర కేళీలు తెమ్మన్నది.

తెచ్చాడు.

పెసరట్టు తెమ్మన్నది.

తెచ్చాడు.

వక్కపొడి తెమ్మన్నది.

తెచ్చాడు.

ఒరే సంగీతం పెద్ద బజారుకు వెళ్ళి మంచి బంగినపల్లి మామిడి పండ్లు ఒక డజను తీసుకురా. బాగా బేరం ఆడాలి తెలుసా అని కసిరింది. సంగీతరావు కొంచెం సేపు ఆలోచించాడు.

ఏం? ఎందుకు తేవాలి? కాళ్లు బలపాలు కట్టుకుని ఇన్నిసార్లు నేనెందుకు తిరగాలి? అన్ని పనులూ ఒక్కసారి చెప్పకూడదూ? ఎండలో కాళ్ళు మాడుతూ తలమాడుతూ ఉండదూ- నానా అవస్థపడి నడుస్తుంటే చూసి సంతోషించాలని అమ్మగారి కోరిక. సంగీతరావుకు విపరీతమైన కోపం వచ్చింది... ఎవరిమీద? తన మీదే. తను వట్టి బలహీనుణ్ణి అనుకున్నాడు. ఎంత బానిస బతుకు బతికినా, ఆమె ఈ విధంగా చెప్పిన పనల్లా నేనెందుకు చెయ్యాలి. తను ఎదురు తిరిగి జవాబు చెప్పలేక పోతున్నాడు. ఆవిడ పని చెప్పినప్పుడల్లా తాత్కాలికంగా కోపం వచ్చేది సంగీతరావుకు, ఆవిడ ముఖంవైపు చూసి తలవంచుకునేవాడు. బజారుకు వెళ్ళి తిరిగి వచ్చేంత వరకూ ఆవిడను గురించే ఆలోచించేవాడు. ఇంటికి వచ్చిన తరువాత తెమ్మన్న వస్తువులు తెచ్చి వప్పచెప్పినా ఆ ఆలోచనలు పూర్తి అయ్యేవి కావు.

మరోసారి ఏ పనన్నా చెప్తే ఎదురు తిరుగుదామనుకున్నాడు. గట్టిగా మాట్లాడుదామనుకున్నాడు. ఆ సాయంత్రం అందరికీ ఇంట్లో పక్కలు వేసి అన్నం తిని రావటానికి ఇంటికి వెళ్ళాడు. అక్కడ బయలుదేరి ఇంటికి వెళ్లేంతవరకూ ఒకటే ఆలోచనల రంగుల రాట్నం ఎక్కినట్టుగా ఉంది సంగీతరావుకు. తన మెదడు పనిచేస్తున్నదో లేదో అని అనుమానం.ఇన్ని విధాల ఆలోచనలు తనకెందుకు కలగాలి. ఎప్పుడూ మనసు నిర్మలంగా ఎందుకు ఉండదూ – ఆ విధంగా సాధువు కాషాయి వస్త్రాలు కట్టుకునే యోగులకూ ఉంటుందేమో అనుకొన్నాడు. బాస్వేవు దేవుణ్ణి ప్రార్థిస్తే హాయిగా ఉంటుందేమో, ఏమిటో తనకు తెలీని వేదన పడుతున్నాడు.

ఇంటికి పోగానే అమ్మ ఎదురైంది. ఒరే సంగీతం అమ్మగారు, కూరనార– ఏవీ ఇవ్వలేదూ అని అడిగింది. ఊహుం అన్నాడు సంగీతరావు. రోజు ఉన్నంత ఉత్సాహంగా లేడు అనే విషయం తల్లికి బోధపడింది. అప్పుడే అడిగితే ఏమనుకుంటాడు అని నీళ్ళు పోసుకోమని చెప్పి,తను వండిన ఆ వంటశాలలోనే అన్నం పెట్టింది. ఒక్క నిముషంలో నీళ్ళు పోసుకువచ్చి భోజనం ముందర కూర్చున్నాడు. కుండలోంచి తీసుకువచ్చిన చల్లటి నీళ్లను తాగుతూ–

అబ్బ అమృతంలా ఉన్నాయే అమ్మా అన్నాడు. తల్లికి అమితానందం వచ్చింది.

మజ్జిగ పోస్తూ అడిగింది తల్లి.

ఏరా సంగీతం అట్లా ఉన్నావేం. ఇవ్వాళ అమ్మగారేమన్న అన్నారా? వారు చాలా గొప్పవారు ఏమన్నా అన్నా ఊరుకోవాలి. ఏదో కాస్త కోపం వచ్చినపుడు కస్సు బుస్సు లాడుతారు అంతే ఆ తరువాత మంచిగానే ఉంటారు. సూర్యనారాయణ పంతులుగారు ఎంత మంచివాడనుకొన్నావ్. నీకు తెలీదు. మీ నాన్న ఆయన దగ్గర పనిచేసినప్పుడు ఎంత చక్కగా చూసేవాడు. పండగకీ వాటికి కొత్త గుడ్డలు ఇచ్చేవాడు. పాపం మనం అంటే ఎంతో దయ ఆయనకు. సంగీతరావుకు ఈ విషయాలు ఏమీ వినబుద్ధి పుట్టలేదు.

ఆ సంగతులు నాకు తెలుసును లేవే అమ్మా నేనా విషయం గురించి ఆలోచించటం లేదు అసలు.

మరి జీతం ఎక్కువ చెయ్యమని అడుగుదామనా అని అన్నది తల్లి. ఏం మనకు వచ్చే జీతం సరిపోతున్నదిగా? సరిపోనప్పుడు అడగవచ్చు అన్నాడు.

తల్లి ఇంక మాట్లాడ తల్చుకోలేదు.

సంగీతరావుకు కోపం వచ్చే పరిస్థితి వచ్చిందని అనుకున్నది.

ఒరే సంగీతం రేపు, వండక్కి అయ్యగారింట్లో బజారు వస్తువులు తేవద్దూ? చెప్పారా ఏమేం తేవాలో?

రేపటి సంగతి ఇవ్వాళే ఎందుకు ఆలోచించటం అన్నాడు సంగీతరావు. నిద్రపోరా నాయనా పొద్దునే లేచి బజారుకు వెళ్లి అయ్యగారికి కావలసినవి తేవచ్చు.

నేను సినిమాకి వెళ్తాను అన్నాడు సంగీతరావు.

సరే వెళ్లమంది.

బయట పడ్డాడు. సినిమాకు వెళ్తాను అని అమ్మకు ఎందుకు చెప్పాడో తనకే తెలియదు. నిజంగా సినిమాకు వెళ్లాలనే ఉద్దేశ్యం మనసులో ఉందా. లేకుండా అడిగాను. అయితే ఎందుకు అడగాలి. తన మనసులోకి తోసుకుని వచ్చి తొంగి చూసే ఈ ఆలోచన్లేమిటి?

దోవలో కనపడ్డ వాళ్లని ఏం సినిమా ఆడుతోంది అని అడిగాడు సంగీతరావు.

ఏదో పేరు చెప్పారు వాళ్లు. ఏ పేరైతే ఏం అనుకొన్నాడు.

ఆ పేరు ఉచ్చరించలేక తికమక పడ్డాడు.

సినిమా చూస్తున్నాడు.

బొమ్మలు తిరిగి పోతున్నాయి.

కొన్ని బొమ్మలు పరిగెత్తినయి.

కొందరు దగ్గరకు వస్తున్నారు.

మగబ్బాయి, ఆడమ్మాయి చేతిలో చెయ్యి వేసుకుని సముద్రపు ఒడ్డున నడిచి వెళ్తున్నారు. ఒకరినొకరు చూసుకుంటున్నారు. ఆహా! ఆ అని ఎవరో పాట పాడుతున్నారు. సినిమాలో అందరూ చప్పట్లు కొట్టున్నారు. ఈలలు వేస్తున్నారు. వాళ్ళిద్దరు కలుసుకున్నారు. పాపం ఎన్ని కష్టాలు వచ్చాయి వాళ్లకు. నేలలో కూచున్న పక్కనున్న వాళ్లు అనుకుంటున్నారు.

ఉన్నట్టుండి లైట్లు వెలిగినై.

సినిమా అయిపోయింది–

మొదట్లో చిరునవ్వు నవ్వి తరువాత ఫక్కున నవ్వాడు.

ఎందుకబ్బాయి అట్లా నవ్వుకుంటావు నీలో నీవు అని అడిగాడు ఎవరో–

తలవంచుకుని ఇంటి దారి పట్టాడు.

అమ్మ తలుపు తీసింది.

నిద్ర పట్టింది ఒళ్ళు మైమరచి నిద్రపోతున్నాడు. సంగీతరావు ముఖంమీద చిరునవ్వు తాండవం ఆడటం చూసింది తల్లి. పెందలాడే లేపితే లేచి అయ్యగారింటికి వెళ్తాడనుకుంది తల్లి.

  

తెల్లవారింది, ఏడు గంటలు కొట్టారు. సూర్యనారాయణగారింట్లో కాఫీలు అవీ అయ్యేటప్పటికి ఎనిమిది అయింది. సూర్యనారాయణగారి కూతురు లలిత రేడియో తిప్పుతోంది. సూర్యకుమారి 'గోవర్ధన గిరిధారీ' అంటోంది. రేడియో పెడుతున్న లలిత ఆపేసి వంట ఇంటి గుమ్మంలోకి వచ్చి అమ్మా చూశావూ ఆ వెధవకు ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు. ఒరే సంగీతం రేపు పెందలాడే రావాలి. పండగ. కొస్త బజారు పని ఉంది అని చెప్పేను. ఇప్పటికే ఎనిమిది దాటింది. వాణ్ణి రానీ ఏం చేస్తానో అని కసిరింది.

పోనీలేవే వాణ్ణి అస్తమానం తిట్టి చంపుతావు నీవు. వాడి మనసుకు కష్టం కలగదూ? మన కింద ఉన్నాడు కదా అని అన్నిసార్లు తిప్పుతావు బజారుకు. వాడు మాత్రం మనవంటి వాడు కాదూ అంది తల్లి. ఊరికినే తిరుగుతున్నాడా నాన్నగారు నెలకు పదిహేను రూపాయలు ఇవ్వటంలే?

నాన్నగారెందుకు ఇస్తారు? నాన్నగారు పనిచేసే ఆఫీసులో గవర్నమెంటు ఇస్తోంది వాడికి. మనింట్లో ఆ పనీ ఈ పనీ చేస్తున్నాడని నాన్నగారు మరో అయిదు రూపాయలిస్తారు.

అయితే మాత్రం పండగకదా పెందలాడ రావాలి అని తెలియక్కర్లే?

తల్లి తన పని చేసుకుంటోంది.

సంగీతరావు వస్తున్నాడేమో అని వాకిట్లోకి వెళ్లి చూసింది లలిత. చూపుమేర దూరంలో ఎక్కడా కన్పించలేదు. మళ్ళీ వచ్చి రేడియో ముందర కూచుంది.

ఇంకో అరగంటకు సంగీతరావు వచ్చాడు.

వస్తూనే సూర్యనారాయణగారికి దణ్ణం పెట్టాడు.

కొంచెం సేపున్న తరువాత సూర్యనారాయణగారు సంగీతానికి పదిహేను రూపాయలిచ్చి ఒరే బజారుకు వెళ్లి ఈ కాగితం మీద రాసిన వస్తువులన్నీ తీసుకు రారా అన్నాడు.

సంగీతరావుకు సూర్యనారాయణ గారిని చూస్తే అమిత సంతోషం. అయ్యగారు చాలా మంచివారు. ఎప్పుడు మాట్లాడినా చిరునవ్వు నవ్వుతూ ఉంటారు. కోపమనేది అసలే ఎరుగరు.

పోతుంటే మళ్ళీ పిలిచి ఒరే సంగీతం ఇవ్వాళ ఇక్కడికే భోజనానికి

ఏవో అప్పచ్చులు తిందువుగాని అన్నాడు.

సంగీతరావుకి పట్టరానంత సంతోషం వచ్చింది. ఉప్పొంగి పోయినాడు.

పరుగెత్తుకుంటూ బజారుకు వెళ్లాడు.

గుమ్మంలోకి వెళ్లి పోతున్న సంగీతరావును చూసింది లలిత.

లోపలికి వచ్చి అమ్మా... ఇవ్వాళ జిలేబి చేసుకుందాం అన్నది లలిత.

సూర్యనారాయణగారు సంధ్యవార్చుకుంటున్నారు.

బజారునుండి సంగీతరావు చాలా త్వరగా వచ్చాడు.

రకరకాల కూరగాయలూ.. అన్నీ తెచ్చాడు.

అరె! అప్పుడే వచ్చేసేవే అన్నాడు సూర్యనారాయణగారు.

ఏమీ మాట్లాడలేక చిరునవ్వు మొగంతో నిల్చున్నాడు.

సంగీతరావును చూస్తున్నది లలిత.

తల్లి వంట ఇంట్లో ఉంది.

సంగీతం అని పిలిచింది లలిత.

దగ్గరకు వచ్చాడు. తల ఎత్తి లలితను చూసి...

ఒరే కొబ్బరికాయ తేవాలి బజారుకు వెళ్ళి-

సరే నన్నాడు.

చేతిని తాకిస్తూ మూడణాలు ఇచ్చింది సంగీతరావుకు.

గిర్రున బజారు వెళ్ళాడు సంగీతరావు.

ఇప్పుడు బజారు వెళ్లి వస్తుంటే మళ్లీ పంపిస్తావుటే వాణ్ణి. ఎన్నిసార్లని తిరుగుతాడు పాపం...

అది కాదే మనింట్లో అన్నం పెట్తామని నాన్నగారు చెప్పారు. అందుకని చాలా ఉషారుగా ఉన్నాడు అన్నది లలిత.

అందరి భోజనాలూ అయిన తరువాత సంగీతరావుకు సావిట్లో అన్నం పెట్టారు. సంగీతరావుకు అన్నం లలిత పెట్టింది. సంగీతరావు తృప్తిగా భోంచేస్తుంటే గుమ్మంలో నిల్చుని చూస్తున్నది.

జిలేబి ఎట్లా ఉంది సంగీతం? అన్నది.

బలే బాగుందండి... అని మరోటి వేయించుకున్నాడు. తల ఎత్తి చూడగల్గాడు.

భోజనం చేసిన తరువాత సూర్యనారాయణగారు దగ్గరకు వచ్చి ఒరే సంగీతం... ప్రొద్దున్నుంచీ తిరిగావ్ కాస్సేపు సావిట్లో పడుకుని తరువాత లేచి వెళ్లు అన్నాడు.

లలిత రెండు రూపాయల కాగితం తీసుకుని వచ్చి సంగీతరావు చేతిలో పెడుతూ... బజారుకు వెళ్లి స్వస్తిక్ గాజులు తీసుకురా. పెద్ద బజారులో రామనాథం కొట్లో ఉంటాయి తెచ్చిపెట్టు అన్నది.

సూర్యనారాయణగారు ఏమీ మాట్లాడలేదు. తల్లి కొంచెం కోపంగా చూసింది. పోనీలే... పండగనాడు కొత్తరకం గాజులు పెట్టుకోవాలి అని దానికి సరదా... పెట్టుకోనీ అన్నాడు భార్యతో.

తను సినిమాలో ఉన్నప్పుడు లలితకు ఎదురు తిరిగి జవాబు చెప్దామని అనుకున్నాడు. నిద్రపోబోయే ముందు అదే ఆలోచన. సూర్యనారాయణగారింటికి వచ్చేముందు అదే ఆలోచన. లలిత తన చేతిలో రెండురూపాయల కాగితం పెట్టేంతవరకు అదే ఉద్దేశ్యం... అన్నం తింటుంటే లలిత తన వైపు చూసింది. గాజులు కొనుక్కు రమ్మని డబ్బు చేతిలో పెడుతుంటే లలిత వైపు కూడా చూడగల్గాడు

సంగీతరావు. సంగీతరావుకు కలిగిన ఇన్ని రకాల ఆలోచనలూ ఒక్కసారి మాయమైనయి.

తను బజారుకు వెళ్తున్నప్పుడు లలితను గురించి ఆలోచించ గలిగాడు. ఇన్నిసార్లు తనను బజారు ఎందుకు పంపిస్తున్నది. లలిత తనవైపు చూడబట్టే తను లలిత వైపు చూడగల్గాడు. చూడటంలో మాత్రం కోపంగా లేదని గ్రహించాడు. లలిత కళ్లను మరోసారి చూస్తే ఎట్లా ఉంటుందో అనుకున్నాడు సంగీతరావు. లలిత ఎప్పుడు చూసినా కొరకొరలాడుతూ ఉంటుంది. రెండు రోజుల క్రితం బజారునుండి వచ్చానని చీవాట్లు పెట్టింది. నిన్నటి రోజున నాలుగుసార్లు బజారుకు పంపించింది. ప్రతిసారీ బజారుకు పంపించేటప్పుడు నన్ను చూస్తూనే ఉంది. ...... తనవైపు ఎందుకు చూడాలి? సూర్యనారాయణగారూ ఆయన భార్య ఎవరూ చూట్టం లేదే. నాలో ఏమన్నా ప్రత్యేకత ఉందా? నేను అందంగా ఉంటానా? లలితమ్మగారి ఉద్దేశ్యం ఏమయి ఉంటుంది?

సంగీతరావుకు ఆ కాస్సేపటిలో అన్ని ఆలోచనలు పోయినయి. తను లలితమ్మగారి వైపు చూడటానికి బాధ్యులు ఆమెగారి కళ్లేనని నిర్ధారణకు వచ్చాడు. ఆ సినిమా చూసినప్పటినుండి ఉద్దేశ్యాలు అదోరకంగా పోతున్నయి. తనను బజారు పంపించేటప్పుడు చేతులు తగిలించింది. సంగీతరావుకు వళ్లు జల్లుమన్నది. బజారుకు మెదలకుండా వెళ్లాడు, తిరిగి వచ్చాడు.

లలిత సంగీతరావును పిల్చింది.

ఒరే నిన్ను గాజులు తెమ్మన్నాను తెచ్చావు. నీకేం ఇవ్వమన్నావ్? అని అడిగింది లలిత.

నాకేమీ ఇవ్వద్దు, మీ కళ్ల చలువ ఉంటేనే చాలు అన్నాడు సంగీతరావ్.

ఏడిశావ్... అంది నవ్వుతూ.

సంగీతరావు ముఖం చిన్నపుచ్చుకున్నాడు. తనన్న మాటకు ఆవిడకు కోపం వచ్చిందేమో అనుకున్నాడు. అయినా తప్పేముంది దాంట్లో... ఆవిడ ఏదన్నా బహుమానం ఇస్తే తీసుకోనా... మాట్లాడితే ఎందుకూ ఆవిడకి అంత కోపం. సూర్యనారాయణగారు వినేటట్టుగా నానా తిట్లూ తిట్టింది. ఒక రోజున మళ్ళీ ఒక్కొక్కప్పుడు జాలిగా చూస్తుంది. క్షణం క్షణానికి భేదం కన్పిస్తుంది. లలితమ్మగారి

ప్రవర్తన సంగీతరావుకు ఏమీ బోధపడటం లేదు. ధైర్యం చేసి అడుగుదామనుకున్నాడు. నోటిదాక వచ్చింది. అమ్మ బాబోయ్... మనిషి వణికిపోయినాడు. ఇన్ని చీవాట్లు పెట్టినా, ఇన్ని అవస్థలు పెట్టినా ఒక్కొక్కప్పుడు కన్ను ఆర్పకుండా కూడా చూసేది. సంగీతరావు ఆమె కళ్ళల్లోకి చూస్తూ నిల్చుండి పోయేవాడు. ఎవరు గెలుస్తారు చూడటంలో అని ఒకర్నొకరు కళ్ళతో ప్రశ్నించుకుంటారు.

సూర్యనారాయణగారు వచ్చి ఒరే సంగీతరావు... నీకు జీతం మూడు రూపాయలు ఎక్కువ చేశారు మన ఆఫీసులో అని అన్నారు. సంగీతరావు ఏమీ మాట్లాడలేక రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టాడు. పోనీ... మంచిదే రానివ్వండి వాళ్ళమ్మ సంతోష పడుతుంది. ఏం సంపాయించినా ఏం పెట్టినా వాడేగా అంది సూర్యనారాయణగారి భార్య. అంతా మీ దయ అని కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు సంగీతరావు. ఎందుకురా ఏడుస్తావ్ పిచ్చివాడా అంది సూర్యనారాయణగారి భార్య. దగ్గర నిల్చున్న లలిత గుడ్లల్లో నీరు కుక్కుకుంది. తల్లీ తండ్రీ ఇద్దరు కూడా లలితను చూడలేదు. పాపం... మీ నాయన బతికివుంటే ఎంతో సంతోషపడేవాడు అన్నది సూర్యనారాయణ గారి భార్య. కళ్లు తుడుచుకుని లేచి నిల్చున్నాడు సంగీతరావు.

సంగీతరావు, ఇంటికి వెళ్ళి తల్లితో చెప్పాడు.

అంతా వారి దయలే నాయినా అంది. వాళ్ళింట్లో చేసిన పిండి వంటలూ, అవీ కొన్ని తల్లికిచ్చాడు. సూర్యనారాయణగారి మంచితనాన్ని అరగంట దాకా పొగుడుతూ మాట్లాడింది తల్లి.

సంగీతరావు సాయంత్రం ఊరంతా తిరిగి ఇంటికి వచ్చాడు. ఆ రాత్రికి నిద్ర పట్టలేదు. లలితమ్మగారు తనను గురించి ఏమనుకుంటున్నదో! తనంటే ఆవిడకి ఓ విధమైన సరదా అని గ్రహించగల్గాడు. ఆవిడను చూసినప్పుడల్లా ఒక విధమైన ఉత్సాహం కలుగుతున్నది. పరవశం అయిపోతున్నాడు. తనకు తెలియకుండానే ఘడియలు లెక్కపెడుతున్నాడు. తెల్లవారితే లలితమ్మగారిని చూద్దామని. లలితమ్మగారి చూపుల్లో ఏదో మహత్యం ఉంది అనుకున్నాడు కాని, పెద్ద సందేహం ఒకటి వచ్చింది. అప్పుడప్పుడు సూర్యనారాయణగారి ఎదుట, పెద్దమ్మగారి ఎదుట ఊరికే తిట్టిపోస్తుంది. చాలా అసహ్యంగా మాట్లాడుతున్నది. తనను, మంచివాడని ఒకవిధంగా సూర్యనారాయణగారు ప్రేమతో చూస్తున్నప్పుడు వాళ్ళ ఎదుటే తనని ఆ విధంగా

మాట్లాడేటప్పటికి తన గౌరవానికి ఏదో లోటువచ్చినట్టుగా అనుకున్నాడు. ఈ ఒక్క విషయమైనా ఆవిడ్ని అడుగుదామనుకుంటే ఏమనుకుంటుందో అని భయపడు తున్నాడు. అడగలేకపోతున్నాడు. ఏ విధంగా ఈ విషయం హెచ్చరిద్దామా అని తెల్లవారే వరకు ఆలోచించాడు.

తెల్లవారుతూనే సూర్యనారాయణగారింటికి బయలుదేరాడు.

ఆయన కనపడగానే దణ్ణం పెట్టి లోపలికి వెళ్ళాడు.

రేడియో పెడుతున్న లలితమ్మను చూస్తూ ఆవిడకీ దణ్ణం పెట్టాడు.

నాకు దణ్ణం పెట్టటం ఏమిటి అని తిట్టింది లలిత.

ఎందుకే అమ్మాయి అట్లా తిడుతావు వాణ్ణి... పాపం... దణ్ణం పెడుతుంటే అన్నాడు సూర్యనారాయణగారు.

సంగీతరావు ముఖం చిన్నబుచ్చుకొన్నాడు.

సూర్యనారాయణగారు లోపలికి వెళ్ళాడు. లలిత సంగీతరావువేపు జాలిగా చూస్తున్నది. సంగీతరావుకి విపరీతమైన కోపం వచ్చి అసలు చూడటం మానేశాడు ఆ రోజల్లా.

సాయంత్రం బజారు పనిమీద సూర్యనారాయణగారు వెళ్ళారు.

ఆయన భార్య వంట చేస్తున్నది.

సంగీతరావు లాంతర్లు తుడుస్తున్నాడు.

లలిత కుర్చీలో కూర్చుని సంగీతరావ్‌ని పిల్చింది. లాంతర్లు తుడుస్తున్న వాడల్లా తలవంచుకుని లేచి వచ్చి ఆమె దగ్గరగా నిల్చున్నాడు.

నా కాళ్ళు నొప్పులుగా ఉన్నయి అన్నది లలిత.

అయితే ఏం చెయ్యమంటారు అన్నాడు.

లలితమ్మకు కాళ్ళు పిసుకుతూ కూచున్నాడు. తలవంచుకుని.

అట్లు తలవంచి కూచుంటా వెందుకూ పెళ్ళికూతురువా అని హేళనగా మాట్లాడింది. సమయం దొరికింది అనుకున్నాడు సంగీతరావు.

మీరనే మాటలకు తల ఎత్తి తిరగమన్నారా? అని ఊరుకున్నాడు.

నీవు వట్టి అమాయకుడివి రా సంగీతం అన్నది.

దానికి సంగీతరావు ఏమీ మాట్లాట్టం లేదు.

నేనప్పుడప్పుడు తిడుతుంటాననే కదూ కోపం...! అన్నది.

నాకు కాదు కోపం మీకే అన్నాడు సంగీతరావు.

అది కోపం కాదు... చెయ్యాలని చేస్తున్నాను అట్లా... నీ మీద నాకేమాత్రం కోపం లేదన్నది.

సంగీతరావు లలితమ్మ కళ్ళల్లోకి చూస్తూ నవ్వగలిగాడు.

నీవు చాలా బాగుంటావు....

పెద్దమ్మగారు ఈ మాట ఒప్పుకోరు అన్నాడు.

ఒరే మేడమీదకు రా నీతో మాట్లాడాలని ఎన్నాళ్ల బట్టో ఉంది, అని కళ్లలోకి చూస్తూ అన్నది. తల్లి వంట చేసుకుంటున్నది.

మేడమీద–

లలిత ఏవేవో చాలా విషయాలు చెబుతున్నది.

సంగీతరావు అమాయకంగా వింటున్నాడు. అతని క్రాఫ్‌ను నిమురుతూ దగ్గరగా నిల్చొంది.

'నేనెక్కడ మీరెక్కడ' అన్నాడు సంగీతరావ్. "నేను వట్టి అమాయకుణ్ణి, వెధవని కదూ" అన్నాడు.

కిలకిలా నవ్వుతూ లలిత, సంగీతరావును అతి దగ్గరగా సమీపించింది.

# 48

మజిలీ తర్వాత మజిలీ గడుస్తూ వందల సంఖ్యలో జనం నడుస్తున్నారు. గమ్యం ఇంకా ఎంత దూరం ఉందో తెలియని కాందిశీకులు గుంపులు గుంపులుగా, భారంగా, దీనంగా కాళ్ళీడ్చుకుంటూ గుట్టలు, పుట్టలు, మైదానాలు దాటుతున్నారు. మా గుంపు మధ్యగా ఉంది. ముందు నడుస్తున్న గుంపులోంచి వెనక్కి పరుగెత్తుకొచ్చి ఆమె మా గుంపులో కలిసింది– ఆమెను అంతకు మునుపు నేను చూడలేదు. ఆమె ముఖంలో ఏదో కాంతి వెలిగింది. అయిన వాళ్ళను కలుసుకున్నారు అన్న సంతోషం, తృప్తి ఆమెలో ఉన్నాయని ఆమె ముఖ కవళికను బట్టి అనలేం. అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నది. మా బరువులన్నీ దింపుకొని ఆకసం వంక చూస్తూ చెట్టుకింద కూచున్నాం తాపీగా. పొరలు పొరలుగా విడిపోతున్నాయి మేఘాలు. 'బాబా' సంచీలోకి 'దాలి' వరగ పోస్తూ అన్నాడు. 'పోయి మూడు రాళ్ళు తీసుకుర'మ్మని. నాకు రాళ్ళు దొరకలేదు సరికదా భయం కూడా వేసింది అవతలకు వెళ్ళడానికి. ఇనప కమ్మీలవతల అంతా గాఢాంధకారంగా ఉంది.

"అక్కడ గుంటేఉందో మిట్టేఉందో ఎట్లా అక్కడికి వెళ్ళటం" అప్రయత్నంగానే అనేశా బయటకు. నాకెవరో తిరుగు జవాబిచ్చినట్లుగా ఉంది "మేం ఇప్పుడే చేలాంతరు వెలిగించి అక్కడకు వెళ్ళి చూసి వచ్చాం. దట్టంగా గుములుకొని చెట్లున్నాయి. అంతే. రాళ్ళుకూడా అక్కడక్కడ ఉన్నా"యని. మనిషి కనపడకపోయినా గొంతును పట్టి ఆ మాట్లాడింది ఎవరో స్త్రీయే అని అనుకున్నా. ఆ పళంగానే నాకు చాలా సిగ్గు వేసింది. నాకు మనసు నిలకడలేదు. తొందరపడి భయపడ్డానని నాలో నేను సమాధాన పరుచుకొన్నాను.

'బాబా' ఇంత అలస్యంగా వచ్చావేమని కోప్పడకపోయినా నిప్పుపుల్ల గీసిన వెలుతుర్లో ఆయన ముఖాన్ని చూస్తే నొచ్చుకొన్నాను. ఆయన రాళ్ళు అమరుస్తూ అన్నాడు: "వెధవ పుల్లలు దమ్ముక్కున్నాయి" అని.

పైప్ దగ్గరికి వెళ్ళి 'టిన్'లో నీళ్ళు పట్టుకువచ్చి నా పని నే చేశా కదా అని కూర్చున్నా పొయ్యి దగ్గర మంట వేపు చూస్తూ. కనురెప్పలు పెరపెర లాడినట్లుగా మండుతోంది పొయ్యి. మా 'బాబా' వంట చేస్తాడని నేనెప్పుడూ అనుకోలేదు. 'అమ్మీ' దిగుల్తోనే కూచున్నది చెట్టు నానుకుని. నిమిషంలో వంట చేశాడు. వండిన బియ్యం, దాల్ కలుపుకుని తిని 'పైప్' నీళ్ళు తాగి మా ఆకళ్ళు తీర్చుకొన్నాం అనిపిచ్చాం. ముందు ముందు ఇది గూడ దొరికి ఇట్లా తిండం గూడా అసంభవం అన్నాడు 'బాబా' నా తట్టు చూస్తూ. అలవాటు పడ్డవాడు కనుక 'తమాఖు' కోసం జేబుతడుపు కొన్నాడు. మళ్ళీ ఏమీ మాట్లాడకుండానే తనూ ఒకవైపు చెట్టుకు ఒరిగి కూచున్నాడు.

'నిద్రా నిప్పులూ లేవూ ఇహ' అందామనుకొన్నా, 'బాబా'ను చూసి మరింత భయపడ్డా! 'అమ్మీ'కి దిగులు పోయి మామూలు మనిషి అవుతుందని నమ్మకం నాకు లేదు. నేనట్లాగే 'ఖారా' నెమరేస్తూ చిన్న రాతి గట్టుమీద కూచున్నా. ఆ కాస్తలోనే వీలు చేసుకొని నిద్రపోయాడు 'బాబా'. 'అమ్మీ' మేలుకున్నా నిద్రపోయినట్టుగానే ఉంది. నేను ఇట్లాగె కూర్చుని తెల్లవార్చాల కామోల్సు అనుకున్నాను. నిద్రపోయినాడే అని 'బాబా' మీద నాకు ఇంత వరకు ఉంది. ఇహ నేనొక్కణ్ణి. భయం లేకపోయినా గుబులు గుబులుగా వుంది. 'ఖారా' మరింత వేగంగా నమలటం మొదలు పెట్టాను. అమ్మీకి కొంచెం దగ్గరగా కూర్చున్నా. 'అమ్మీ'ని పలుకరించటానికి మనస్కరించలేదు. కోడి కూతలూ అవీ ఏం లేవు గనక తెల్లవారిందనే భ్రమతో 'బాబా'ను లేపాను.

నా నోట్లో 'ఖారా'ను చూసి "నీవు రాత్రి నుంచి నిద్రపోలేదా" అన్నాడు 'బాబా'. నేనేమీ మాట్లాడలేదు.

తెల్లవారుతూనే రైలు వచ్చింది. నంచీ మళ్ళీ మామూలుగా వీపుకు కట్టుకొన్నాను. 'అమ్మీ' అతి కష్టంమీద రైలు ఎక్కింది. ఆమె దిగులు ఎప్పుడు తీరుతుందో తెలియదు. అందరూ ఎక్కేంతవరకు ఆగింది పాపం రైలు. టిక్కెట్టు 'బాబా'యే కొని తెచ్చాడు. ఇదివరకు ఉన్నంత నిశ్శబ్దంగా లేకపోయినా జనంలో గుసగుసలు

బయలుదేరుతున్నాయి. ఈ రైలు ఎక్కడకు తీసుకుపోతుందో అని భయపడుతూ చలికి వణుకుతున్నారు కొందరు. ఏదో ఒక స్టేషన్‌లో తప్పక ఆగుతుందని తెలుసును గనక ఈసారి అంత ఆదుర్దా పడలేదు. కొంచెం తొందరగానే పోవడం మొదలుపెట్టింది ఎందుకనో. దానికీ భయం తీరినట్లుగా ఉంది. మా కింకా ఆకలి బాగా కాలేదు. స్టేషన్ వచ్చింది. నేను మళ్ళీ పేరు చదివాను. టాం అని వుంది. ఇది మొదట చూసిన స్టేషన్ అంత పెద్దగా లేదు. ఇక్కడ దిగడం కొంచెం కష్టమనిపించింది. నేనూ, 'బాబా' పట్టి దింప వలసి వచ్చింది 'అమ్మీ'ని. దిగి అందరూ బారులు తీర్చి నిల్చున్నారు. పోయినసారి వచ్చిన అధికారిగాని, అటువంటివాడుగాని వచ్చి ఏమైనా చెప్తాడేమో అనుకున్నా. ఎవరొచ్చినా అటునుంచి ఇటు ఆయన మాదిరిగానే కనపడే వాడు.

"ఇక రెండు మైళ్ళు మాత్రం నడవాలి. ఆపైన మళ్ళీ ఫరవాలేదు" అన్నాడు ఆ ఊరి స్టేషన్ మాష్టరు. నడవటం మాట అనేటప్పటికి నా కెందుకో 'ఉషారు' వచ్చింది. వళ్ళు జలదరించి గుండె 'కీ' మంది.

"అమ్మీ చెయ్యి పట్టుకో ముందర" అని 'బాబా' కోప్పడ్డట్టుగా ఉంది. నేను వెనక్కు వెళ్ళి అట్లాగే చేసి నడవటం ఆరంభించాం.

ఆ రెండు మైళ్ళు ఎట్లాగో నడిచి వచ్చి కూచున్నాం. ఒక చిన్న నది వంకలు వంకలుగా తిరిగి ప్రవహిస్తూ పోతున్నది. 'అది దాటాలి. అవతలకు పోయిన తరువాత మళ్ళీ ప్రయాణం చేయాలన్నారు, నా గుండె ఎందుకో 'గతుక్కు'మని 'బాబా'తో అన్నాను - దీనిని దాటడమెలాగని. అందరూ ఎట్లాగో మనమూ అట్లాగే అని సమాధానం ఇచ్చాడు. నేననవసరంగా గాబరా పడటం చూసి అందరూ నవ్వుతారేమో అనిపించింది. కొంచెం సేపయిన తరువాత మూడు 'స్టీమ్ లాంచీలు' వచ్చాయి. ఆ మూడింట్లో పట్టినంత మంది ఎక్కాం. అది అటూ ఇటూ వరిగి పోతుంటే నాకు పరీక్ష తప్పినంత దిగులు పుట్టింది. అక్కడ కూడా 'అమ్మీ'ని చెరొక రెక్క పట్టుకొన్నాం. అవతల ఒడ్డుకు చేరిన తరువాత ఒక్కొక్కరికి పదణాలు అడిగాడు. ఈ కొద్ది దూరానికి పదణాలు అనవసరం అని నేను పోట్లాడినా లాభం లేకపోయింది. 'బాబా' జేబులోంచి డబ్బు తీసి ఇచ్చాడు.

మేం ఇవతలకు వచ్చాం. ఇవతలకు వచ్చిన తరువాత మేం తెలిసి చేయదగ్గ పని కనిపించలేదు. ఎదురుగ్గా రాక్షసులల్లే కనిపిస్తున్నాయి కొండలు. 'బాబా' వంట చేస్తానన్నాడు అక్కడే ఒక మూల. కాదని అనడానికి నోరు ఎవరికీ రాదు గనక (అప్పటికి నాకు ఆకలి బాగా అవుతున్నది) నేనూ ప్రశ్నార్థకంగా అమ్మీ వంక చూశాను. ఒకసారి వంట చేయటం అనుభవమే గనక ఈ సారి అంత కష్టమనిపించలేదు. ఇక్కడ పైపులేవీ కనపడకపోతే ఆ నదిలోవే నీళ్ళు 'టిన్'లోకి పట్టుకొన్నాం. కులాసాగానే ఆ పూట అక్కడ గడిపి ముందున్నయి గనక కష్టాలు ఏవో ఆలోచించుకుంటూ అక్కడే కూర్చున్నాం. నేను పట్టుదలగా అక్కడ పచ్చగడ్డిలో తెల్లటి గుడ్డ పరుచుకొని నిద్రపోయినా.

"అయిపోయింది. ఇంకేముంది. కొండలు వచ్చాయి. కొండ దాటితే కొత్త దేశానికి పోవచ్చు. ఆ తరువాత గమ్యస్థానం విషయం ఆలోచించవచ్చు" అని అన్నారు కొందరు. అప్పుడే కొండ ఎక్కి దిగినట్లుగా కొందరంటారు. "దిక్కూ దివాణం తెలియదు. ఎన్ని కొండలు దాటాలో, వాటికి దోవలు ఎక్కడున్నాయో అవన్నీ మనకేం తెలుసును? చెప్పేవారెవ్వరూ లేరు" అని. దాంతోటి ఇరుపక్షాల వారుగా తేలారు. బాబా మెదలకుండా కూర్చుని వింటున్నాడు. నాకీ గోడు ఏమీ అర్థంగాక ఎదటబడి తాగితే మరీ బాగుండదని అవతలకు వెళ్ళి సిగరెట్టు పీక వెలిగించాను. "ముష్టి కొండలు ఎన్ని రోజులు పట్టాయి. రెండు రోజుల్లో అవతలకి చేరుకోవచ్చు" అని ధైర్యం చేసి ముందంజ వేశారు. కొందరు వారితోబాటు మరి కొందరు. అట్లాగే అసలు మొట్టమొదట అక్కడనుంచి వచ్చిన వారిలో సగం పైగా బయలు దేరారు. 'బాబా' ఎందుకైనా మంచిదని కదల్లేదు. నా పని ముగించి బయటపడి 'బాబా' ముందు వచ్చి కూర్చున్నా. మీసాలు దువ్వుకుంటున్న బాబా లేచి "మనం ఈ పూట ఇక్కడ ఉందాం. ఎందుకైనా మంచిది. మర్నాడు బయల్దేరి పోవచ్చు" అన్నాడు. అయినా బాబా నా అభిప్రాయం అడగటమేమిటి?... ఎట్లాగో ఆ పూట అక్కడ వంట పెడతాడని నాకు తెలుసు. అదివరకు తెచ్చినవే ఆ పూటకు కూడా ఉన్నాయి 'దాల్'తో సహా.

భోజనాలు చేసిన తరువాత 'బాబా' నాకో సంగతి జ్ఞాపకం చేశాడు. "మనకు కావలసినంత ఆహారం లేదు ప్రయాణానికి. చాలా దూరం పోవలసి ఉంటుందేమో మనం కూడా తీసుకొనిపోతే మంచిదేమో!"అన్నాడు. మొదట్లో ఖాళీ చేసి వచ్చేటప్పుడు

'పర్సు' నా చేతికిచ్చి దాచిపెట్టమన్నాడు. ఉన్నదో లేదోనని లాగుజేబులోకి భయంతో చూసుకొన్నా. అంతకుముందే ఒక 'టిన్'లో కావలసిన 'దాల్' ఉంది. ఇంక కావలసింది బియ్యమే గనక ఊళ్ళోకి రెండు మైళ్ళు వెళ్ళి తెచ్చాడు. తెచ్చినప్పుడున్నంత 'ఉషారు' తీసుకు వెళ్ళటం విషయం ఆలోచించేటప్పటికి అది లేకపోంగా దిగులు కూడా పుడుతున్నది. నేనో మంచి ఉపాయం చెప్పాను. దానికి బదులు రెండు రోజులకు సరిపోయే రొట్టెలు ఇక్కడే చేసుకొని పోతే బియ్యం మనం ఇన్ని మొయ్యక్కర్లేదు అని. ఫరవాలేదు నాకే మంచి ఉపాయంగా తోచింది. మా 'బాబా' ఏమంటాడో అని ఆయన తట్టు చూశాను. మేం తెచ్చిన బియ్యంలో ఇంకొకరికి సహం ఇచ్చి మిగతావి మోసుకు పోవడానికి సిద్ధపడ్డాం.

కొండ ఎక్కడం మొదలుపెట్టాం. నాకు చాలా 'హాయి' అనిపించింది మొదట్లో. ఉన్న బరువులో సగం పైన నా దగ్గర ఉన్నా అన్నీ నా వీపుకు తగిలించిన సంచీలో న్నాయి. మెట్లు అంటూ అట్టే లేకపోయినా అంత కష్టమనిపించలేదు. కాని కొంత దూరం వచ్చి పక్కకు తొంగి చూశాను. ఇంకేముంది అయిపోయింది అనుకొన్నా. నేనెక్కడ ఉన్నానో నాకే తెలియలేదు ఆ కాసేపు. అంత అగాధమైన లోయ. ఎంత సేపటికి కళ్ళు ఆ వైపుకు పోకుండా ఉంటే బావుండురా అనిపించాయి. అట్లా అనుకున్నా నన్నమాటేగాని చూడకుండా ఉండబుద్ధి పుట్టేది కాదు.

అందరూ నడుస్తూంటే నే కాసేపు కూర్చునేటప్పటికి నన్నెవరో అడగనే అడిగారు చిరునవ్వు నవ్వుతూ – "ఏం ఆ కొండ లోయల్ని చూసి భయపడ్డట్టున్నార"ని. ఒకసారి విన్న గొంతుక కనుక ఇది సమాధానం సిగ్గుపడకుండానే చెప్పాననుకున్నా. "వంట్లో సరిగ్గా లేదు. పైత్యమే చేసిందో, పాదే చేసిందో అందుకని కళ్ళు తిరుగుతుంటే కాసేపు 'రెస్ట్' తీసుకొన్నట్టుగా ఉంటుందని కూచున్నా" అన్నా. ఆ అమ్మాయి అది వరకు నుంచి మా పక్కనే వస్తున్నది. అప్పటి నుంచి ఇప్పటివరకు ఏం మాట్లాడలేదు. అప్పుడప్పుడు 'తనలో తానే' చిరునవ్వు నవ్వుకోవటం మాత్రం చూశాను. మాట్లాడు దామని ఉంది కాని లోపల ఏమని పలుకరిస్తే బావుంటుంది అని ఇందాకటినుంచి ఆలోచిస్తూనే ఉన్నా. ఇట్లా ఉండగా ఈ పని జరిగింది. 'బాబా' పెద్దమనిషి తరహాగా అన్నాడు: "అమ్మాయి చూడు, మా వాడు వట్టి పిరికి వాడని చెప్పాలో ఏమని చెప్పాలో తెలియడం లేదు. అటువైపు చూడవద్దురా అంటే వినడు. ఇంకా చిన్నపిల్లల చేష్టలు

పోలేదు మా వాడికి" అని. అట్లా ఆయన అన్నప్పుడు నే నెవరితట్టూ చూడలేదు. నన్ను నేనే చూసుకున్నాను ఆ పరిస్థితుల్లో. ముసలివాళ్ళకు ప్రపంచ జ్ఞానం తక్కువ అని అనుకున్నా ఆ తల వంచుకున్నప్పుడే. ఎవ్వరం మాట్లాడకుండానే మా దోవన మేం సాగి పోతున్నాం. నేను 'బాబా' మీద కోపం వచ్చినట్లు మూతిని పెట్టి సాగిపోతున్నా (అది నటన అని చెప్పటానికి వీలులేదు. తాత్కాలికమేమో).

ఆ అమ్మాయి కొంచెం సేపయిన తరువాత "నాకు మంచినీళ్ళు కావాలి" అని అడిగింది. నేను 'బాబా'తో అన్నాను "బాబా, అమ్మాయి మంచి నీళ్ళు అడుగుతున్నది ఇవ్వనా" అని.

"నీ ముఖం! 'అమ్మాయి' ఏవిటి, 'ఆవిడ' అనలేవూ? నన్ను అడగాలా, ఇవ్వాల్సిందీ ఇవ్వక్కర్లేందీ నీకు తెలీదా" అన్నాడు. నన్ను మరింత ఇరుకున పెట్టిన వాడయ్యాడు బాబా. ఏం చేయటానికి తోచక అమ్మాయి తట్టు చూస్తే బావుండదేమోనని మెదలకుండా ఊరుకున్నా.

"అబ్బ! కాళ్ళు పీక్కుపోతున్నయి. దాహం వేస్తున్నది" మళ్ళీ వినవచ్చింది.

"ఏవిటీ, మనల్ని అడగటమేమిటి? ఎవరి నీళ్ళు వాళ్ళు తెచ్చుకోక్కర లేదూ ఈమె మనవెంట పడ్డదేం? వాళ్ళ వాళ్ళు ఎవరూ లేరా" అని ఆమె ఎదుటే అందామను కొన్నాను.

ఈ లోపల్నే 'బాబా' టిన్‌లోంచి 'లోటా' లోకి పోసి నా చేతికిచ్చాడివ్వమని.

అడుగడుక్కీ అనుమానమే. ఆమె చేతికివ్వాలా లేకపోతే ఆ కొండరాయి మీదనే పెట్టాలా?

ఆమె నా చేతిలోది బలాత్కారంగా తీసుకోకపోయినా అడిగి తీసుకొంది. తాగి, మళ్ళీ నా కివ్వబోతూ మూతి తుడుచుకుంటూ నా తట్టు చూసి నవ్వు మొగం పెట్టింది.

"మీరు చాలా శ్రమ పడ్డారు. డబ్బివ్వనా" అంది.

"అమ్మా! మంచి నీళ్ళివ్వటానికి శ్రమ ఏమిటి? పిచ్చి పిల్లలాగున్నావ్!" అన్నాడు బాబా.

"నన్నూ మొదట్లో కోప్పడ్డాడు. ఈమెను ఇప్పుడు అంటున్నాడు, సరిపోయిందిలే" అనుకొన్న.

"అమ్మా, నీ వెవరు? వంటరిగా వస్తున్నావ్, బంధువులు ఎవ్వరూ లేరూ?" అని అడిగాడు బాబా.

ఈ ప్రశ్నే మొదట్లో నేనడగాలనుకొన్నాను. కాని దాని సమాధానం తన నోటి మీదుగా ఏమని చెప్తుందో, ఎట్లా చెప్తుందో అని నాకు చాలా కుతూహలంగా ఉంది. వేగంగా నడుస్తున్న నడకను తగ్గించాం. ఆమె ఉండీ ఉండీ...' నన్ను మీ అబ్బాయిగారికి బాగా తెలుసు ఆయన్నే అడగండి అని సూక్ష్మంగా నవ్వుతూ అన్నది. "ఈమెకేమన్న పిచ్చెక్కిందా... ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతుంది. ఒకమాటకు ఒకమాటకు సంబంధం లేదు. అమ్మాయిని నాకు బాగా తెలియడం ఏమిటి" అన్నాను బాబాతో. అనేటప్పుడు కొన్త రోషంతోనే అన్నాను. ఆమెకు బాగా కోపం తెప్పిద్దామని దాని కెప్పుడూ కూడ వ్యతిరేకంగానే జరుగుతోంది. కోపం అణు మాత్రమైనా లేకుండా ఇప్పుడు కొంచెం బయటకు నవ్వుతూ ఉంది. ఆ మాటలన్నీ అబద్ధం అని నేను చెప్పగలను అని.

"అసలు నీవెవరో నాకు తెలియదు. నిన్నెప్పుడు చూడలేదు. వట్టి అబద్ధపు కూతలు కూస్తున్నావ్" అన్నాను.

"మీ మాటలు విన్నకొద్దీ నాకు నవ్వు ఎక్కువగా వస్తున్నది. క్షమించాలి" అన్నది.

ఇదంతా చూసి అమ్మ నామీద ఎంతగా కోప్పడుతుందోనని ఆమె తట్టు చూశాను. కొంచెం ఆమె దగ్గరకు కూడా వెళ్ళాను.

"చిన్నా!' అని పిలిచి చెప్పింది "అబ్బాయి! ఏవిలో తొక్కాను. వేలు కొంచెం నొప్పిగా ఉంది" అని.

"మేం ఏవీ తొక్కలేదే, నీవెట్లా తొక్కావూ? అయినా ఈ చుట్టు పక్కల్లో ఏవీ చూడలేదే" అన్నాను.

నా మాట విన్నదో లేదో కూడా నా చేతిలోకి వరిగిపోయింది. పెద్దగా కేకపెట్టి "బాబాను పిలిచాను. అసలు విషయం ఏమై ఉంటుందో కూడా ఊహించుకోలేక

పోయాను. ఆయన వచ్చి ముఖం మీద చల్లనీళ్ళు చల్లాడు గట్టిగా... 'అమ్మీ... అమ్మీ' అని రెండుసార్లు పిలిచాడు. చాలా సేపు పిలిచినా పలుకలేదు. ఆమె కూడా మా గుంపులోకి చొచ్చుకొని వచ్చింది సిగ్గూ, బిడియం ఏవీ లేకుండా. ఆమె చెయ్యి నా చెయ్యికి బాగా తగులుతున్నది. నే సిగ్గుపడి నా చెయ్యి వెనక్కు తీసుకున్నా ఆమె మరీ దగ్గరకు వచ్చి "ఏమన్నా పురుగు ముట్టిందేమో చూడండి... ఒక చిన్న గుడ్డపీలిక ఉంటే ఇవ్వండి సరిచేస్తాను" అటూ ఇటూ నాలుగు వైపులా చూసింది. నా భుజం మీద తువ్వాలు ఉంది. అది తీసి ముక్క చింపింది నే చూస్తూ ఉండగానే. నాకు చాలా కోపం వచ్చింది. ఏం చేయలేక ఊరుకొన్నాను. "నా దగ్గిర ఇంత స్వతంత్రంగా వ్యవహరిస్తున్నది. లేని స్వతంత్రం ఎక్కడనుంచి వచ్చింది ఈమెకు? ఈమె వ్యవహారం అంతు బట్టడం లేదు నాకు" అని పరిపరివిధాల ఆలోచించాను. ఆ చించిన గుడ్డ పీలికను కాలికి గట్టిగా బిగించింది. నేను మా అమ్మీ కళ్ళవైపు చూశాను. కళ్ళల్లో ప్రాణం ఉందని నాకు తెలీదు. ఎవ్వరి చేతుల్లోనూ నిలవక కిందికి వరిగి పోయింది. నేను ప్రాణం పోయిందనుకొని ఆ మాట బయటకు అనవచ్చునో, అనకూడదో అని తెలియకుండా (ఇవర్రై ఏళ్లైనా కూడా) "బాబా! అమ్మీ చచ్చిపోయింది" అన్నాను. మా 'బాబా' మా అమ్మను టూకీగానో, ఎం చేతనో 'అమ్మీ' అని పిలుస్తాడు. మా అమ్మ అసలు పేరు 'ఖుల్యుంబీ'. ఆ పేరు నాకిప్పటికీ జ్ఞాపకం వచ్చింది. పలుకరిస్తే మాట్లాడ లేదు. చచ్చిపోయిందనే అనుకొన్నాను. ఆమె కూడా బాబాతో తాత్సారంగా అంది. "ఇహ మా అమ్మ నాకు లేదన్న మాటే".

  

మా అమ్మ చచ్చిపోయి అప్పుడే రెండు రోజులైంది. ఎట్లా నడుస్తున్నామో మాకే తెలియడం లేదు... అప్పుడే మా అమ్మ విషయం మరచినట్లుగా ఉంది. ఆమె విషయం వచ్చి నన్ను మరిపింప చేసింది నిజంగా. చాలా దూరం వెనక్కు పోయి ఆలోచిస్తున్నాను. నా కేమీ తట్టడం లేదు. ఆమె ఎవరయిందీ జ్ఞాపకం రావడం లేదు. అబ్బ! ఏవిటో కీచుమని అరుస్తున్నాయి కూడా. మిట్టమధ్యాహ్నం మళ్లే ఉన్నాడు చంద్రుడు. చెట్టుకింద పచ్చిగడ్డిలో పడుకున్నానన్నమాటేగాని నిద్రపట్టడం లేదు. బాబా చక్కగా నిద్రపోతున్నాడు పచ్చగడ్డిలో. నా కెంత సేపటికి 'పురుగు ముట్టిన' విషయం జ్ఞాపకానికి వస్తున్నది. నా కళ్ళ ఎదుట అటూ ఇటూ మెదులుతూనే ఉన్నది.

ఈ రాత్రి ఎట్లాగో కన్నుమూస్తే రేపు పొద్దుటికి మళ్ళీ ప్రయాణం చెయ్యొచ్చు. ఆమె కొంచెం నా దగ్గరకు వచ్చి మోచేతి మీద పడుకొని "ఏం ఇంకా నిద్రపట్టలేదా" అంది.

"నిద్రపట్టింది కాని నీ పిలుపుకు లేచాను. అనవసరంగా నిద్రాభంగం చేశావ్" అన్నాను కసిరినట్టుగా.

"ఎట్లా నిద్రపడుతుందీ ఈ మహా భయంకరమైన కొండల్లో చెట్టుకింద... పురుగు పుట్ర..." అంది.

"మాలో వచ్చి పడుకొన్నావ్ భయమా నీకు కూడా?"

"నీవు అన్నయ్యవు గనక నీ దగ్గరకు వచ్చాను. నాకెవరూ లేరుగా మరి?"

"ఆ మాటే అనొద్దన్నాను... నీ వెవరో నే నెవరో? రెండు రోజుల క్రితం పాపం కదా అని మంచినీళ్ళు అడిగితే ఇచ్చాం..."

"నీ విట్లా కోపగించుకుంటావని నాకు ముందుగానే తెలుసు. ఇప్పుడు బాబాను లేపి చెప్పనా?"

"నేనేం చేశానిప్పుడు? అయన్ని లేపటం ఎందుకు? నన్ను కోప్పడుతాడు. మెదలకుండా ఊరుకో. నీవొక రాక్షసికి మల్లె భయపెడుతున్నావే. అన్నయ్యా అని నా వెంబడి పడుతుంటివి - నీ కిక ఎవరూ అబ్బా అమ్మా అన్నా లేరూ, నేనేనా దొరికింది?"

"నీ వొక్కడివే అన్నయ్యవు... ముద్దొస్తున్నావు గనక అన్నయ్య అని పిలవబుద్ధి అయింది. దానికి నీవు కోప్పడితే ఇంకో విధంగా పిలుస్తాను. అన్నయ్యవు గనుకనే ఇంత చనువుగా మాట్లాడుతున్నాను"

"..............."

"అన్నయ్యా, మనకు మంచినీళ్ళు అయిపోయినాయి గదా. రేపటికి ఎట్లాగూ?"

"ఆ సంగతి నీ కెందుకు? మా అవస్థ మేం పడతాం".

"చూశావే నిన్న మనం దారిలో వచ్చేటప్పుడు ఎంత మంది చచ్చిపడి ఉన్నారో... చాలా మందిని లెక్కపెడుతూ వచ్చాను కూడా".

"ఆ సంగతి ఎత్తొద్దు... నిన్న చీకట్లో నడుస్తూంటే కాలికి ఏవో మొద్దువలె తగిలింది. కిందకి చూస్తే శవం... నే కూడా శవాన్ని అయిపోతానేమో అనిపించింది..."

"ఆ శవం జుట్టు విరబోసుకొని ఉంది. మొహం కూడా పాలిపోయింది. నాలిక పీక్కుపోయింది. మనకన్నా ముందు వచ్చిన జట్టీల వాళ్ళు వీళ్ళు. ఆహారం సగం దూరం వచ్చేటప్పటికి అయిపోయింది. ముందుకు పోవాలన్నా వెనక్కు పోవాలన్న ముందు కడుపు నింపుకోవాలి... నీళ్లు ఎక్కడ ఉన్నదీ వాళ్ళకు తెలియదేమో! కొండల్లో నీళ్ళు ఎక్కడ ఉంటాయి?"

"మనకు మటుకు ఎక్కడినించి వస్తయి? మనం అందరం చచ్చిపోతాం..."

"అన్నయ్యా, మేం చచ్చిపోతే చచ్చిపోతాం గాని నీవు మటుకు..."

"నే బతికుంటే ఏం లాభం... నే నొక్కణ్ణి పోగలనూ?"

"నే నొక తమాషా చెయ్యనా ఇప్పుడు... అయ్యో అని పెద్దగా అరుస్తాను. బాబా లేస్తాడు. నిన్ను కోప్పడతాడు. అప్పుడు నీ పని ఏమవుతుంది. నేను అవీ ఇవీ కల్పించి చెప్తాను..."

"ఏం చేస్తాను? ఏడుపు వస్తే చస్తాను"

"చూశావా, మా అన్నయ్య ఎంత భయం మనిషో" అంటూ నా చేతిని ముద్దు పెట్టుకొంది.

నాకు ఉమ్మేద్దామా అనిపించింది. అసలు ఈ మనిషికి పిచ్చి ఎక్కింది. లేకపోతే ఈ చేష్టలు ఏమిటి... వదిలించుకొందామని చూస్తే వీలు కావటం లేదు.

"నిద్ర పోకుండా మేల్కొన్నావేం, రేపు ప్రొద్దున మళ్ళీ నడవద్దూ, ఆయాసం కదూ" అన్నాను.

నన్ను పట్టుదలగా నిద్రలేకుండా చేసింది. రాత్రిపూట కూడ ఘోషా ఎందుకో? ముఖానికి గుడ్డ కప్పుకుంది (తెర). అసలు దారి పొడుగునా అంతే. మా బాబాకు గూడా ముఖం చూపించలేదు.

తెల్లవారింది. బయలు దేరేముందు నీళ్ళ హెచ్చరిక చేశాను నేను. అదీ అప్పటికి సమస్యే అయింది. మేం అందరం ఆలోచిస్తూ ఉంటే ఆమె తన కక్కర్లేదన్నట్లుగా ఎటో చూస్తున్నది.

అప్పటికి ప్రజలలో చాలామంది గుంపులు గుంపులుగా ఒక మూలకు పరుగెత్తుతున్నారు. కొండకు ఎటువైపు వెళ్ళారో... 'ఊటనీరు, ఊటనీరు' అని చెప్పుకుంటున్నారు. బాబా 'టిన్' తీసుకొని నన్నుకూడా వెళ్ళమన్నాడు. ఆ గుంపుల్లో చాలామంది ఆడవాళ్ళు. ఒక్క రాయిమీద నుంచొని నీళ్ళు పట్టుకోవాలి. రాయి విరిగితే? ఎట్లాగైనా భయమే. అక్కడ జనం నెట్టుకుంటున్నారు. ఇంత మందికి కలిసి ఆ నీళ్ళే.

"ఆడవాళ్ళలోకి పోవడం అంత భయమైతే నే పట్టుకు వస్తాను నా కివ్వండి" అని ఆమె తీసుకొంది. "కూడా నీవు వెళ్ళమని నన్ను పంపించాడు బాబా".

అక్కడకి వెళ్ళి నీళ్ళు పట్టుకు వచ్చి "అన్నయ్యా, ఇదిగో తీసుకో. నా చెయ్యి చాలా బరువుగా ఉంది" అన్నది. నే తీసుకొన్నాను. ఆమె నా వెనకాలే వస్తున్నది. నీళ్ళు మేం అక్కడే తాగాం కూడా.

ఆమె అన్నది: "అన్నయ్యా, ఇప్పుడు బయలుదేరితే సరిగ్గా రెండు రోజులు అంటే కనీసం రేపు సంధ్యవేళకన్నా చేరుకోవచ్చు. ఎంత త్వరగా బయలుదేరితే అంత మంచిది" అని.

నా దగ్గర చాలా బరువులున్నాయి. వాటిలో సగమైనా తగ్గిపోతేగాని నడవలేం. అసలు అన్నిటికన్నా బరువు అయినవి పుస్తకాలున్నాయి. వస్తూ వస్తూ అన్నీ వదిలిపెట్టి రాగలిగాను గాని ఎందుకో అవి మాత్రం వదిలిరాబుద్ధి పుట్టలేదు. అన్నీ డబ్బుపెట్టి కొన్న పుస్తకాలని కాదుగాని ఎందుకనో పుస్తకాలను చూస్తే నాకంత ఇది. డడ్లీ స్టాంప్ భూగోళం, షేక్స్పియర్ నాటకం ఇంకా ఎన్నో పుస్తకాలున్నాయి. చాలా మందిని అడిగాను ఎవరన్నా ఒక్కొక్క పుస్తకం తెస్తారేమో. అడిగితే ప్రతివాడూ నిరాకరించాడు. అసలు కట్టుకున్న గుడ్డలే మోయడం కష్టంగా ఉంది. నల్లగా మురికి పట్టి చాలా బరువు ఎక్కినై. అయ్యో! ఇవన్నీ పారేసి పోవలసిందేనా అనుకొన్నా. ఆ చెట్టు దగ్గర పడేశా. తల్లీ నీవన్నా చదువుకో. అప్పుడు నాకు ఎంతో ఏడుపు వచ్చింది. ఆమె అన్నది... "బతికి బయటపడ్డాం. అంతే చాలు. ఆ పుస్తకాలు ఎప్పుడైనా కొనుక్కోవచ్చు నువ్వు త్వరగా నడు అన్నయ్యా!" అని.

పుస్తకాలే కాకుండా ఇంకా కూడా తెచ్చాను. సామానులో కొంత భాగం అక్కడే పారేసి బయలుదేరాం.

"మనం అందరం ఏదో మాట్లాడుతూ పోదాం. ప్రయాస అనిపించదు అప్పుడు. మొట్టమొదట ఏదన్నా మొదలుపెట్టి చెప్పు నీవు. ఆ తరువాత బాబా చెప్తాడు" అన్నాను నేను.

"నీవే ఏదన్నా మొదలు పెట్టు అన్నయ్యా! కాదంటే నే చెప్తాను".

"ఊ, మొదలుపెట్టు – ఇటువంటి సమయంలో సిగరెట్టు ఉంటే ఎంత బాగుండేదో కదా" అన్నాను.

ఆమె చెప్పటం మొదలు పెట్టింది.

"నాకు బాబా ఎదుట అన్ని మాటలు హృదయం విప్పి చెప్పడానికి సిగ్గుగా ఉంది. నేను మొదట్లో నిన్ను అన్నయ్యా అని పిల్చాను. దానికి నిజంగానే నీవు కోప్పడ్డావు. అది నే కాదనను. ఎవరైనా పరాయిస్త్రీ వచ్చి అట్లా చొరవ చేసుకొని మాట్లాడుతుంటే కోపం రాదనను. మేము మీరున్న ఊళ్ళోనే మీ ఇంటికి రెండు మైళ్ళ దూరంలో ఉండేవాళ్ళం. నేను హెడ్ మాష్టరు కూతుర్ని. మొదట్లో మా నాన్న వాళ్ళు మీ ఇంటి పక్కనే ఉండేవారు. ఆ రోజుల్లో మా అమ్మ నన్ను కన్నది. ఆమెకు కనంగానే గుర్రపు వాతం వచ్చి చనిపోయింది. నేను పుట్టడం మా అమ్మ పోవడం ఒక్కసారి జరిగినై. అప్పట్లో నా తండ్రి బాబాయే. బాబా, హెడ్‌మాష్టరుగారూ చాలా అన్యోన్యంగా ఉండేవారట. హెడ్ మాష్టరు చెప్పారట "మీ అమ్మాయిని మా ఇంట్లో ఉంచండి. నా భార్యే పెంచుతుంది" అంటే సరే అన్నాడు బాబా. వాళ్ళింట్లోనే రెండు మూడేళ్ళున్నానట. నేను చాలా అందంగా ఉండటం చేత హెడ్‌మాష్టర్‌గారు "మాకిచ్చేసెయ్యండి పిల్లను మేమే పెంచి చదువు చెప్పించి పెళ్ళి చేస్తాం" అన్నారట. ఆ తరువాత ఎందుకో అక్కడినించి ఖాళీ చేశారు ఇల్లు. ఇంకా కొన్నాళ్ళకు అక్కడి నుంచి బదిలీ అయింది నాన్నకు. పది పన్నెండేళ్ళ పిల్లనైనాను. మళ్ళీ ఈ ఊరే వచ్చాం. ఎక్కడో రెండు మైళ్ళ దూరాన ఉన్నాం. అట్లా రెండు మూడు సంవత్సరాలు గడిచినై. బాబా మళ్ళీ ఎవరో బర్మా యువతిని పెళ్ళి చేసుకొన్నాడు. నన్ను నాన్నకిచ్చిన నాలుగైదు నెలల్లో.. ఆమె ఖుల్యుంటీ. నీవు స్కూల్లో చదువుతూండేవాడివి. అప్పుడప్పుడు హెడ్‌మాష్టరుగారితో మాట్లాడ్డానికి గాని, పుస్తకాలకు గాని వచ్చేవాడివి. ఎంతో వినయ విధేయతల్తో భయంతో ఉండేవాడివి.

"ఒక రోజున అడిగాను నాన్నని. అబ్బాయి ఎవరని? నీ విషయం చెప్తూ నేను తల్లిలేని పిల్లనని, ఇంకా అన్ని విషయాలు చెప్తూ వచ్చాడు. నీ వెప్పుడు వచ్చినా నీ దగ్గరకు రావాలని కౌగలించుకొందామనీ అనుకొనేదాన్ని. నీవు పిలుస్తేనే సిగ్గుపడి వెళ్ళిపోయేవాడివి. నీ ముఖం వైపు కిటికీలోంచి బాగా చూసేదాన్ని.నీ ముఖం నాకు బాగా గుర్తు ఉంది. అది అప్పటి విషయం.

"మొన్న అందరూ రం– విడిచి వచ్చేటప్పుడు మేమూ వచ్చాం. కాదు నే నొక్కత్తినే. బాంబులు పడ్డప్పుడు నాన్న వాళ్ళు తప్పించుకోలేకపోయినారు. ఇల్లు కూలిపోయి భగవంతుడి దయ వల్ల ఎంచేతనో నేను బతికాను. నేను అందరితోపాటు వస్తున్నాను. నిన్ను రైల్లో చూశాను. ఆ తరువాత పో– స్టేషన్లో దిగినప్పుడు చూశాను. పలుకరిద్దామనుకొన్నాను కాని నా ముఖం మటుకు ఘోషా అయినందువల్ల చూపించలేక పోయాను".

ఇది వింటున్న బాబాకు అప్రయత్నంగా రెండు కన్నీటి బిందువులు రాలినాయి. నాకేమీ ఏడుపు రాలేదు. 'అమ్మదొంగా' అని ఫక్కున నవ్వుదామనుకొన్నాను.

"అన్నయ్యా! నా వంతైపోయింది. ఇహ బాబా నా భవిష్యత్తు తేలుస్తాడు. అయన నీకే కాదు, నాకూ తండ్రి కదా..." అంది.

బాబా కన్నీళ్ళు తుడుచుకున్నాడు. "అల్లా దయవల్ల నువు మాకు చేరువయ్యావు, బేటీ!" అని ఆమెను అక్కున చేర్చుకున్నాడు. నేను మా అక్కయ్య చేతిని ఆప్యాయంగా పట్టుకున్నాను. అప్పటి వరకు నా విపరీత ప్రవర్తనకు సిగ్గు అనిపించింది.

# దక్షిణాఫ్రికాలో "మాలపల్లి" చట్టం సత్యాగ్రహోద్యమము

దక్షిణాఫ్రికాలో 'మాలపల్లి' చట్టాన్ని ధిక్కరిస్తూ డాక్టర్ నాయికర్ నాయకత్వమున భారతీయ సత్యాగ్రహోద్యమాన్ని జూన్ ...... తేదీన ప్రారంభించాడు. మాలపల్లి చట్టము నీతికి దూరమైనది, అసమంజసమైనది. దీనిని ఎదుర్కొనడానికి అక్కడి భారతీయులు చట్టబద్ధ పద్ధతులన్నింటినీ ప్రయోగించి చివరకు విఫలులై ప్రస్తుతం సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించారు. మిగిలిన ఇలాంటి ప్రజలతో పాటు తెల్లవారి రూపంలో భారతీయులకు నివసించుట అర్హత లేకపోవడం ఆశ్చర్యకర విషయం. నిషిద్ధ ప్రదేశాలలో భారతీయులు శిబిరాలను ఏర్పరచుకుని సత్యాగ్రహం సాగిస్తున్నారు. ట్రాన్సువాల్‌లోని కొన్ని పట్టణాలలోను, ముఖ్యంగా డర్బన్‌లోను, మేరిట్జ్ బర్గ్‌లోనూ ప్రశాంతంగా హర్తాళ్‌లు జరిపేరు. 'మాలపల్లి' చట్టాన్ని ఖండిస్తూ సభలు జరిపారు. ఈ సత్యాగ్రహ సందర్భంలో జోహాన్స్ బర్గ్‌లో ఆసియా నివాసుల హక్కుల రక్షణ సంఘం ఏర్పడింది. సత్యాగ్రహం ప్రారంభించిన మూడు రోజుల వరకూ గవర్నమెంటు అధికారులుగాని, మున్సిపాలిటీగాని ఏ విధమైన చర్య తీసుకోలేదు. ఆ తరువాత డర్బన్‌లో సత్యాగ్రహులను పోలీసువారు అరెస్టు చేయడం మొదలుపెట్టారు. అరెస్టు కాబడిన వారిలో స్త్రీలు కూడా ఉన్నారు. భారతీయ సత్యాగ్రహులపట్ల ఆ తెల్లవారు అవలంబిస్తున్న వైఖరిని బట్టి చూస్తే అక్కడి పరిస్థితి సైనికశాసనం అమలులో ఉన్నదానికంటె ఘోరంగా ఉన్నదనుకోవచ్చు. శ్వేతజాతి దౌర్జన్యాన్ని విమర్శిస్తూ గాంధీజీ ఇలా అన్నారు:

"కొంతమంది తెల్లవారి దౌర్జన్యోద్ధతిని చూసి నేను సిగ్గుపడుతున్నాను. దక్షిణాఫ్రికా యూనియన్‌లోని శ్వేతజాతీయులందరూ ఈ దౌర్జన్యాన్ని ఆమోదిస్తున్నారనే అనుమానం కూడా నాకు ఉన్నది" అని.

ఆరోజుకారోజు పెచ్చుపెరిగిపోతున్న దౌర్జన్యాన్ని సహించి ప్రతీకారానికి పూనుకోకుండా బాధలనుభవించడంలో దక్షిణాఫ్రికా భారతీయులు ధైర్యాన్ని చూపుతూ 'మాలపల్లి' చట్టాన్ని ధిక్కరిస్తూ, జట్లుగా బయలుదేరి సత్యాగ్రహం చేస్తున్నారు.

సత్యాగ్రహ నాయకులైనటువంటి డా॥ నాయికర్, డోడూలను అరెస్టు చేశారు. అక్రమ సమావేశాల నిషేధ చట్టం ప్రకారం జారీచేయబడిన ఉత్తర్వులను ఉల్లంఘించి నందుకు వారికి శిక్షలు ఒసంగబడినాయి.

సత్యాగ్రహోద్యమం రోజురోజుకూ విజయవంతంగా నడుస్తున్నది. అయితే ప్రపంచంలో నాగరికులము, సంస్కృతి గలవారము అని చెప్పుకునే శ్వేతజాతి వారు; చేసే దౌర్జన్యాలు, అత్యాచారాలు, మనం పరిశీలించినట్లయితే వారిలో మానవత్వం అంటూ ఏ కోశానైనా ఉన్నదా అనిపిస్తుంది.

భారత సత్యాగ్రహులనే కాకుండా, దక్షిణాఫ్రికా భారతీయుల నందరినీ భయపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. శిబిరాలను చుట్టుముట్టడం, శిబిరంలోని వారిని ఎదుర్కోవడం, సత్యాగ్రహుల డేరాలను దగ్ధపరచడం ద్వారా యూరోపియనులు వారి పశుత్వాన్ని బయటపెట్టుకున్నారు. ఇదే కాకుండా ఉద్యమం ప్రారంభింపబడినప్పటి నుండీ వారి అక్రమచర్యలను కొద్దిగా పరిశీలిద్దాం.

యాభైమంది ఉన్నటువంటి శిబిరంలోకి వందమంది యూరోపియన్ రౌడీలు ఆక్రమించి, డేరాలను పీకి పారేశారు. కోసివేశారు, అక్కడ ఉన్నటువంటి స్ట్రెచర్లను బద్ధలుకొట్టారు. ఇద్దరు స్త్రీలను (సత్యాగ్రహులు) కొట్టారు. వారు గాయపడలేదు అదృష్టవశాత్తు. యూరోపియనులు సత్యాగ్రహులను ఎదుర్కొని వారిపై తిరగబడిన సందర్భంలో, వారి బారినుండి పోలీసులే సత్యాగ్రహులను రక్షించారు. యూరోపియనులలో రౌడీతనం హింస కూడా ప్రబలిపోయినయి. సత్యాగ్రహోద్యమ సందర్భంలో జోక్యం కలుగజేసుకోకూడదని తెల్లవారికి అధికారులు విజ్ఞప్తిచేశారు. యూరోపియనులు, దౌర్జన్యంగా ప్రవర్తించినా, లేక దౌర్జన్యాన్ని ప్రోత్సహించినా వారిపై

చర్య తీసుకోడానికి పోలీసులు ఏ మాత్రమూ సందేహించము అని కూడా ప్రకటన చేశారు.

దక్షిణాఫ్రికాలోని సత్యాగ్రహులను ప్రోత్సహించమని, అహింసాయుతంగా ఎదుర్కోవడానికి భగవంతుడు వారికి శక్తినిచ్చేట్టు మనం ఆ భగవంతుణ్ణి హృదయపూర్వకంగా ప్రార్థించాలనీ గాంధీజీ అన్నారు.

*అహంకారము* : తాము తెల్లవారము అను అహంకారమువలన భారతీయులపట్ల వారు చూపే ద్వేషభావము వింతవైఖరి మున్ముందు చాలా తీవ్రరూపం దాల్చవచ్చును. ఇది అసలు శ్వేతజాతి నశింపుకే సూచనకావచ్చును. మానవులందరు సమానులన్నమాట ఆ శ్వేతజాతి వారికి భారతజాతి నేర్పవలసిన రోజులు వచ్చినయి. మానవజాతి విధ్వంసానికి పుట్టిన ఆ తెల్లవారికి, భారతదేశంలో సామాన్య కూలివానికున్నటువంటి ఇంగిత జ్ఞానం, దైవభక్తి, తన తోటివారియందు చూపే ప్రేమభావము, అహింస మొదలైన వాటిలో అవగింజైనా లేదనే చెప్పాలి. మనదేశంలోని పురాణ, మత గ్రంథములు చదివి మనదేశాన్ని గురించి తెలుసుకుని, ఒక్కసారి వెనక్కి వెళ్లితే భారత జాతి సంస్కారం అంటే ఏమిటో తేట తెల్లమవుతుంది. హృదయము లేనివారు పశుతుల్యులు. దక్షిణాఫ్రికా శ్వేతజాతి ఆ వర్గపు వైఖరినే ప్రదర్శిస్తున్నది. అసలు మాంసాహారమునే భుజించు ఆ తెల్లవారికి జ్ఞానమున్నదని అనుకొనుటీమన పొరపాటు. మనజాతికి వాళ్ళజాతికి ఉన్న భేదం ఒకటి పరిశీలిద్దాం. భారతీయుల గ్రుడ్లు నల్లగాను, యూరోపియనులవి తెల్లగాను ఉండుటకు కారణమేమిటి యని వాళ్లు ప్రశ్నించుకుంటే, లండన్‌లోని ఒక శాస్త్రవేత్త చాలా చమత్కారంగా అన్నాడట... ఆయన మానవ పరిణామము (human evolution)ను గురించి రాస్తూ 'భారతజాతి అనాదినుండీ శాకాహారములతో జీవించుచూ వచ్చారు. దానిలోంచి ఉద్భవించిన వారగుటచే అహింసాయుతమైన జీవితం గడపడంచేతను వారి గ్రుడ్లు ఆవిధంగా ఉన్నాయి. తెల్లవారు... ఆదిలోనే మాంసాహార భక్షకులగుటవలన (Law of hunting and competition) యుగంలోని వారగుటచేత ఆ వివిధ రకములైన జంతువుల మాంసమును తినుటవలన; ఆ అడవి మృగముల కుండునటులే వారికిని కంటిపాపలు ఆ విధంగా ఏర్పడినవని, సిద్ధాంతీకరించాడు. ఇది వారికి అవమానకరముగా ఉండుటచే ఆ పుస్తకము కొన్నాళ్ళ వరకు ప్రచురించనివ్వలేదు. ఇప్పుడు ప్రచురితమైనది. ఇటువంటివారిలో హృదయము, అహింస భావము, ప్రేమ

మొదలైనవి మనము అసలు చూడలేము. అహంకారము పోయినపుడే వారిలో మానవత్వము సిద్ధికరిస్తుంది.

***మతము – ఏసుక్రీస్తు*** : నాగరికత ప్రబలిన కొలదీ వారు వారి మతమునే మరచిపోవుట శోచనీయము. ఆసియా ఖండానికే ఒక యుగపురుషుడుగా ఉండి అహింసా సమరాన్ని ప్రోత్సహించి ఏదైతే సత్యమని తను నమ్ముతాడో దాని కొరకే ఆ శిలువ మీద, ముళ్ళ కిరీటంలో అవమానింపబడి, ప్రాణాలు విడచిన ఆ ఏసుక్రీస్తునే తమ హృదయాల నుండి తొలగించుకున్నారన్నమాట... ఏసుక్రీస్తు బోధించిన అహింసాయుత మార్గాలనే ఎదిరిస్తూ ఈ సత్యాగ్రహం మీద విరగబడి, ఇటువంటి దౌర్జన్య చర్యలు జేయటం, ఏసుక్రీస్తునే ఎదిరించటం వంటిది. తెల్లవారికిది సిగ్గుచేటు... ఆసియా ఖండంలో పుట్టిన గొప్ప గొప్ప మత ప్రవక్తలందరూ, తెల్లవారు కారని, ఆసియా నివాసస్తులేనని మరచిపోయినట్టుగా ఉంది. ఈ ముందుకు వస్తున్న నవనాగరికతా ప్రపంచంలో ఇటువంటి బేధాభిప్రాయములు కలిగి ఉండుట క్షేమకరము కాదని తెల్లవారు గుర్తించాలి.

ఈ తెల్లవారి ప్రవర్తనవల్ల ప్రతివారికి రక్తం ఉడికిపోతున్నది. ఇహసహించలేని రోజులు వస్తున్నాయి.

ఇప్పటికైనను దక్షిణాఫ్రికాలోని యూరోపియనులు, గవర్నమెంటూ, మాలపల్లి చట్టాన్ని ఉపసంహరించుకుని, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని తెలుసుకుని, అందరికీ సమాన హక్కులుండేట్లు చేస్తుందని భావిస్తున్నాం.

గాంధీజీ అన్నట్లు దక్షిణాఫ్రికాలో దౌర్జన్యం నెరపుతున్న తెల్లవారి హృదయంలో పరివర్తనం కలిగించవలసినదిగా నిర్మాలాంత:కరణాలతో భగవంతుని ప్రార్థించుదాం.

"గుండాలు పిరికిపందలని ఎంత కాలంనుండో నాలో ఒక భావం ప్రబలివుంది. గుండాల తత్వంలో పశుత్వం ఉన్నది. మానవులు పశువుల్లా ప్రవర్తించరాదు. దక్షిణాఫ్రికాలోని తెల్లవారు గుండాలవలె ప్రవర్తిస్తున్నారు. నాకు వారంటే కోపం లేకపోయినా అలా అనక తప్పదు".

సత్యాగ్రహుల ధృఢ సంకల్ప బలాన్ని, నిష్కాపట్యాన్ని తెల్లవారు గ్రహించి వారిని గౌరవించి సానుభూతి చూపగలరని మనం ఆశించాలి.



The End